ఆంధ్రావలి సమాజము } శ్రీ { ప్రాక్పశ్చిమ వైద్యగ్రంథమాల
తెనుగు గుడి }

# ఆయుర్వేదము

## ఆధునిక శాస్త్రీయ వికాసము

**(Ayurveda - Modern Scientific interpretation & integration)**

1957-58 సం॥రమునకు మదరాసు తెలుగుభాషాసమితి
వారిచే పోటీ రచనలో నుత్తమ గ్రంథముగా
ప్రకటించబడి, బహూకరించ బడినది.

కర్త : ఆర్య సోమయాజుల సుబ్బారావు L. M. P
& రిజిష్టర్డు ఆయుర్వేదిస్టు, ఎలమంచిలి (విశాఖజిల్లా)

(1936 మొదలు 1948 వరకు ప్రాక్పశ్చిమ వైద్యకళాశాలాధ్యక్షులును
ప్రస్తుతము శ్రీరామమోహనాయుర్వేద కళాశాల, ఉపాధ్యక్షులు, గుంటూరు

All rights reserved } 1959 { వెల రు 5/-
పోస్టేజి గాక

శిల్పకళ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్ వారిచే ముద్రింప బడినది.

# శ్రీ దత్తాత్రేయాయనమః

శ్లో॥ జటాధరం పాండురాంగం। శూలహస్తం కృపానిధిం
సర్వరోగ హరం దేవం దత్తాత్రేయమహం భజే॥

శ్లో॥ జరామృత్యు వినాశాయ। దేహశుద్ధి కరాయచ।
వేదశాస్త్ర పరీతాయ। దత్తాత్రేయాయతే నమః॥

శ్లో॥ బాలార్క ప్రభసాంద్రరమ్య జటిలం
భస్మాంగ రాగోజ్వలం,
శాంతం నాద విలీన చిత్తపవనం
శార్దూల చర్మాంబరం,
బ్రహ్మాద్యై స్సనకాదిభిః పరివృతం
సిద్ధైర్మహా యోగిభిః,
దత్తాత్రేయ ముపాస్మహే
మమహృది ధ్యేయం సదా చిన్మయం॥

శ్లో॥ దత్తాత్రేయ నమోస్తుతే భగవతే పాపక్షయం కుర్వతే।
దారిద్ర్యం హరతే భయం శమయతే కారుణ్య మాతన్వతే
భక్తానుద్ధరతే శివం దదతే కీర్తిం మాతన్వతే।
భూతాన్ ప్రాసయతే యశః ప్రదదతే శ్రేయస్సదా కుర్వతే॥

శ్లో॥ దద్రు స్ఫోటక కుష్ఠాది మహామారి విషూచి కాస
నాశయస్వ [illegible] దత్తాత్రేయ నమోస్తుతే॥

TED TO TELUGU

# తొలిపలుకు.

"విజ్ఞానం బ్రహ్మేతివ్యజానాత్। విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। విజ్ఞానేన జాతాని జీవంతి। విజ్ఞానం ప్రయంతి అభిసంవిశంతి" అని చెప్పిన తైత్తరీయోపనిషద్వాక్యము నామనస్సును గట్టిగా హత్తుకొని యున్నందున సామాన్య లౌకికశాస్త్ర విజ్ఞానముద్వారా విజ్ఞానరూపక పరబ్రహ్మ జ్ఞానమును సాధించవచ్చునని నమ్మకముతో మొదట తెలుగుభాషయందలి ప్రేమచే నాంగ్లభాషలో నుండిన వివిధశాస్త్ర విషయములను మాతృభాషలోకి తర్జుమాచేయుచుంటిని. 1923 సం॥రమున ఎల్. ఎం. పి పట్టభద్రుడనై ప్రాక్టీసు చేయుచునే ఆధునిక వైద్యశాస్త్ర విషయములను క్రమముగా తెలుగులోకి భాషాంతరీకరణ మొనర్చి సాంకేతిక విద్యల విషయమున, భాషాక్లిష్టతను తొలగించి నచో మాతృభాషలోనే వాటిని సుఖకరముగా నవతికాలములో బోధించవచ్చునని నిశ్చయించితిని.

1930 నుంచి దేశీయమైన ఆయుర్వేద మెంతవరకు ఆధునిక శాస్త్రములతో నొప్పుచున్నదో, యందలి విశిష్టత యేమో తెలియగోరి యాశాస్త్ర గ్రంథములను ఆధునిక వైద్యవిజ్ఞాన చక్షువుతో చదువ నారంభించితిని. అందలి ప్రతివిషయ మాధునికశాస్త్ర విషయములతో సమన్వయ పరచుటకు వీలుగా నుండుటయేగాక నేటి పాశ్చాత్యశాస్త్ర విజ్ఞానముల కందరాని విషయములెన్నో గలవని తెలిసికొంటిని. మోడరన్ వైద్యావలంబకులు నేర్చుకోవలసిన విశేష విషయము లాయుర్వేదములో చాలయున్నవని గ్రహించితిని.

మరియొక విశేషమేమనిన చతుర్విధ పురుషార్థములను సాధించుట కుపకరించునది ఆయుర్వేద శాస్త్రమనియు, అన్యవైద్య శాస్త్రముల జదివినవారికి ఆత్మజ్ఞానము కలుగుట కవకాశము లేదనియు, ఆయుర్వేద శాస్త్రాభ్యాసమువలన ఆత్మానాత్మ వివేకము కలుగుచున్నదనియు తెలిసికొంటిని. ఒక్క వైద్య వృత్తి నవలంబించు వారికేగాక వేదాంతులకు, యోగాభ్యాస కులకుగూడ నీశాస్త్ర ముపకరించును. హైందవులదృష్టిలో పరమపదమునకు దారిచూపని ఏశాస్త్రమయినను వ్యర్థమను భావముకలదు. గనుక నాయుర్వేదమును ఆత్మానాత్మ విచారముతో నారంభించి, పంచభూతాత్మకమైన దేహము, మనస్సు యింద్రియములగురించి సాకల్యముగా చర్చించి, త్రిదోషవిజ్ఞానమను గట్టిపునాదుల నిర్మించి, మానసికరోగము లకు సత్త్వావజయ, దైవవ్యపాశ్రయ చికిత్సలు, శారీరిక రోగ ములకు యుక్తివ్యపాశ్రయ చికిత్సలు, ప్రారబ్ధకర్మజ వ్యాధు లకు కర్మ విమోచకములగు జప, తప, దాన, హోమాది క్రియలను బోధించిరి. అందువల్ల నాయుర్వేదశాస్త్రము సంపూర్ణవంతమును, శాస్త్రీయమును సర్వజనోప యుక్త మనుటకు సందేహములేదు.

నా ముప్పదిసంవత్సరముల యనుభవముతో నాయు ర్వేద విషయములను అన్యవైద్యములతోను, ఆధునిక శాస్త్ర విషయములతో సమన్వయ, సాదృశ్య, వైరుధ్య, విశిష్టతల నిరూపించుచు, నిట్టివిమర్శన గ్రంథము నొకదానిని వ్రాయ జిరకాలము క్రిందటనే సంకల్పించియుంటిని. ఇప్పుడు మద రాసు తెలుగుభాషా సమితివారు ఆంధ్రప్రభ దినపత్రిక తే 17-6-56 ప్రకటించిన దానిని చూడగానే నాయుత్సాహ

మినుమడించి యీ గ్రంథమును వ్రాసితిని. తెలుగుభాషా సమితివారు నాకిట్టి యవకాశమిచ్చినందులకు మిక్కిలి కృతజ్ఞుడను.

ఇట్టివిమర్శనా గ్రంథమును నాబోంటి యల్పజ్ఞుడు వ్రాయ సమకట్టుట సాహసమేయగును. అయినను నా యోపిక కొలది ప్రయత్నించితినిగాన యిందలి గుణాగుణముల విమర్శించుట పండితులవంతు. విజ్ఞులు తప్పులను మన్నించి, తడవకుండ విడిచిన విషయములింకను యుండవచ్చునుగాన యట్టి నా అవజ్ఞతను క్షమింతురని నమ్ముచున్నాను.

యత్ర ప్రదర్శ్యా విషయాః పురాతనా,
యత్ర ప్రకారోఽభినవః ప్రదర్శనే,
యత్ర ప్రమాణాః శ్రుతయః సయుక్తయః,
తద్బ్రహ్మవిజ్ఞాన మిదం విమృశ్యతామ్॥

గ్రంథకర్త.

## IIIవ (మూడవ) భాగము

## IV వ భాగము - నిదానము (146)

## VI భాగము. ఆయుర్వేద చికిత్సలు.

## Fundamentals of Ayurvedic treatmeent.

## VIII భాగము



## X భాగము

# ఆయుర్వేదము - ఆధునిక శాస్త్రీయ పద్ధతిని దాని వికాసము

## మొదటి భాగము

### 1వ అధ్యాయము - నిర్వచనము.

ఆయుః + వేదః = ఆయుర్వేదః, అనగా, ఆయువును గుఱించి బోధించు శాస్త్ర మాయుర్వేదము. 'దేహేంద్రియ సత్వాత్మ సంయోగో ఆయుః' అని ఆయుర్వేదాచార్యులు ఆయుశ్శబ్దమును నిర్వచించిరిగాన ఆయుర్వేదశాస్త్రమును 'ది సైన్సు ఆఫ్ లైఫ్' అని యింగ్లీషుభాషలో వ్యవహరించుట కలిగినది. దీర్ఘాయువు, సుఖజీవనము, ఆరోగ్యరక్షణము యీ శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశములు. కాన ప్రతివారు నత్యవసరముగా తెలియదగినశాస్త్రము. ఈ పై నిర్వచనము ననుసరించి ప్రపంచమందలి అన్ని వైద్యశాస్త్రములు నాయురక్షణోపాయమునకు నుపచరించునవిగాన వీనినిగూడ నాయుర్వేదములని చెప్పవచ్చును. నిజమును పరికించుచో భారతీయమగు నాయుర్వేదశాస్త్రము గంగా పవాహము వంటిది. అతి ప్రాచీనమయినది. మొదట వెలసినది. నదిలోకి యనేక యుపనదులు కలియుచుండును. నదిలోనుండి కొన్నిశాఖలు చీలి, స్వతంత్ర మార్గములబట్టి, తుదకు సముద్రములో కలి

---

N. B. విస్తారయతి లేశోక్తం, సంక్షిపత్యతి విస్తరం
సంస్కర్తాకురుతే తంత్రం పురాణంచ పునర్నవం॥
ఇదియే యీగ్రంథముయొక్క యుద్దేశము. (చరకసిద్ధిస్థానం)

యును. ఇట్లే ప్రాపంచిక వైద్యశాస్త్రము లన్నిటికి భారతీయులచే మొదట నిర్మించబడిన ఆయుర్వేదమే తల్లియని చరిత్రకారులు చెప్పుచున్నారు. స్వతంత్రముగా కనిపెట్టబడిన నూతన వైద్యశాస్త్రములన్నియు నాయుర్వేదములో నిముడ గలవు.

మోడరన్ మెడిసిన్ అను పేరుతో వ్యవహరింపబడు చున్న అల్లోపతి వైద్యశాస్త్రము పాశ్చాత్య దేశములలో పుట్టి ప్రస్తుతము ప్రపంచమందలి యన్ని దేశములలో వ్యాప్తి చెందియున్నది. క్రిమిసిద్ధాంతముపై నెక్కువగా నాధారపడినది. దీనిచరిత్రను పరికించినవారికి క్రిమిసిద్ధాంతము కనిపెట్టకముందు ఆయుర్వేదపద్ధతినే రోగనిదాన చికిత్సలు సాగుచుండెడివని తెలియగలదు. భారత వైద్యశాస్త్రమును మొదట గ్రీకు లభ్యసించిరి. రోగములకు, ఆరోగ్యమునకు ప్రధానములని చెప్పబడిన త్రిదోషములను సరిగా వారు గ్రహించజాలక వీనిని 'హ్యూమర్సు' అను పేరుతో వ్యవహరించిరి. గ్రీసుదేశమునుండి ఐరోపియనులు యీ వైద్యశాస్త్రము నభ్యసించునప్పుడు యీ హ్యూమరల్ సిద్ధాంతము మరింత అయోమయముగాతోచి, దీనిని విడనాడి, కేవలము ప్రత్యక్షానుభవములతో వారు ప్రకృత్యాధారకులై గాలి, నీరు, ఆహార విహారములందలి వ్యత్యాసములే రోగకారణము లని కొంతకాలమువరకు నమ్ముచువచ్చిరి. 17 వ శతాబ్దమున సూక్ష్మక్రిమి సిద్ధాంతము కనిపెట్టబడిన నాటినుండి క్రిమిసిద్ధాంతముపై నాధారపడి అల్లోపతి వైద్యశాస్త్రము వృద్ధియైనది. దృక్పథము మారినంతమాత్రమున నిది ఆయుర్వేదము కాకపోదు. ఏలయున దానిలక్ష్యముకూడ రోగనివార

ణము, రోగనిరోధము, ఆరోగ్యరక్షణము, ఆయుర్వృద్ధి యను టకు సందేహములేదు. ఆయుర్విజ్ఞాన ప్రవాహములోనుండి వేరుపడిన శాఖ పెడదారులత్రొక్కి తిరిగి యిప్పుడు మాతృ సంస్థను సమీపించుచున్నది. కొలదికాలములో ఆయుర్వేద ములో విలీనమగు శుభసూచకములు కన్పించుచున్నవి.

ఇక యూనానీ వైద్యశాస్త్రము నూటికి నూరుపాళ్లు ఆయుర్వేదమనియే చెప్పవచ్చును. ఏలయనగా నాయుర్వేద ములో జెప్పిన వాజీకరణ, రసాయన ఔషధ చికిత్సలనే యునానీవైద్యులు వాడుచున్నారుగాని అదియొక ప్రత్యేక ముగా శాస్త్రముకాదు. యూనాన్ దేశములో నాచరించ బడిన ఆయుర్వేదమే ఆదేశముపేరుతో యూనానీ అని వ్యవహరించబడినది.

హోమియో వైద్యశాస్త్ర సిద్ధాంతములను స్వతంత్ర ముగా డాక్టరు హానిమన్‌గారు సృష్టించిరని చెప్పినను యివి ఆయుర్వేదమునకు క్రొత్తగావు. సారూప్యౌషధ సూత్రము (సిమిలియా సిమిలిబస్ క్యూరేంటర్ = Similia similibus Curantor) ఆయుర్వేద చికిత్సాపద్ధతులలో వ్యాధి, హేతు, హేతువ్యాధి విపరీతార్థకారి చికిత్సలలో చేరుచున్నది.

ఇంకను మిగిలినచికిత్సా సూత్రములు అనగా రోగి యొక్క శారీర మానసిక పరిస్థితులను గుర్తించుట (individuality of each case), ఔషధములకు మర్దనాది సంస్కారములద్వారా రోగ హరశక్తి నభివృద్ధిచేయుట (dynamisation of medicine), ఏకవస్తు ప్రయోగము (Single drug application) ఆయుర్వేదములో నాచరించ బడుచున్నవే గనుక హోమియోవైద్య మాయుర్వేదమునకు

భిన్నముకాదు. ఆయుర్వేదములోనుండి చీలినశాఖయని చెప్పవచ్చును.

ఇక 'నేచురోపతి' అని వ్యవహరించుచున్న ప్రకృతి వైద్య మెన్నటికి నాయుర్వేదముకంటె భిన్నశాస్త్రముగా పరిగణించలేము. ఔషధములను తినిపించుట యముఖ్యముకా వచ్చునుగాని ప్రకృతివైద్యు లవలంభించుచున్న స్వస్థవృత్త పద్ధతులు, ఆహారపద్ధతులు, ఉపచారక్రియలు, లంఘన, స్వేద, జలచికిత్సలు, మట్టిపూతలు ఆయుర్వేదీయములే యగును.

మరియు మర్ధన నావన చికిత్సక్రియలు (Machano-therapy = మెకేనోథిరపి) నరముల నొత్తుట, లాగుట (స్పాండిలోథిరపి = Spondilo - therapy), వర్ణచికిత్సలు, (Colour treatment or chromo - therapy), కిరణప్రసారచికిత్సలు (light therapy), వ్యాయామ చికిత్సలు (Physical exercises), మొదలైన వివిధచికిత్సలు ఆయుర్వేదములో చెప్పబడినవే. పలువురు విదేశీయులచే స్వతంత్రముగా వృద్ధిచేయబడినంత మాత్రమున యివి ఆయుర్వేదీయ శాఖలుకాకపోవు. ఈచికిత్సలు సమగ్రములుకావు. సర్వులకు అన్నిరోగములను కుదర్చజాలవు. ఆయుర్వేద మట్లుకాదు. ఇది సర్వసంపూర్ణమయిన శాస్త్రము. సర్వుల కుపయుక్తముగానున్నది. సర్వచికిత్సా పూర్ణమయ్యును నూతనవిషయములను చేర్చుకొని విలీనము చేసికొనుట కవకాశముకలిగి యున్నది. చరకాచార్యుడు 'తదేవయుక్తం భైషజ్యంయదారోగ్యాయ కల్పతే' అని చెప్పియేయున్నాడు. చికిత్సాద్రవ్య జ్ఞానమును పామరులయ్యును కొండజాతివారు, పశుకాపరుల నుండికూడ గ్రహించదగునని చెప్పినాడు. కనుక అన్ని

వైద్యశాస్త్రములు గౌరవింపదగినవే. వాటిని నిష్పక్షపాత దృష్టితో పరిశీలించదగును. అన్యవైద్యముల నభ్యసించువారి నందఱిని సోదర వైద్యులుగా మన్నించవలెను. "స్వతంత్రః కుశలో వైద్యోఽన్య శాస్త్రేష్వ బహిష్కృతః" అని చరకుని ఆదేశము. అన్ని వైద్యశాస్త్రములు లోకహితార్థము వెలసినవేగనుక నన్నింటియందు సమబుద్ధియుంచు టవసరము.

ఆయుర్వేద శబ్దమును నిర్వచించుచూ, 1934 సం॥ రమున జరిగిన అఖిల కర్ణాట కాయుర్వేద మహాసభాధ్యక్షులు డాక్టరు ఎస్. ఆర్. గోరే L. M. S. గారు యీ క్రింది విధముగా చెప్పిరి.

1 "ప్రాచీన హైందవ ఋషులు చెప్పిన దొక్కటియే ఆయుర్వేదము కాదు. ఇందులో విదేశీయులు చెప్పిన విజ్ఞానము మానవు లారోగ్యస్థితులను చక్కదిద్ది, రోగుల సంఖ్యను తగ్గించి, రోగులకు స్వస్థతను చేకూర్చిన దంతయు చేరగలదు."

పైన వివరించిన విధముగా ఆయుర్వేదమున కింతటి విశాల వ్యాప్తి యున్నప్పటికిని వ్యవహారములో భారతదేశములో బుట్టి, భారతీయు లాదరాభిమానములఁ జూరగొనుచు, భారతదేశమం దాచరించఁ బడుచున్న అతి ప్రాచీన వైద్య శాస్త్రమునకే ఆయుర్వేద శబ్దము సార్థకముగా నున్నది.

---

1 "I would include in it not only what is given by the Seers of old ancient India, but all knowledge that is likely to help in improving health, lessening disease and giving comfort to suffering mankind."

Dr. S. R. Gore, L. M. S.

ప్రస్తుతకాలమున మన దేశములో నాచరించబడుచున్న నవీన వైద్యశాస్త్రముల నుంచి ప్రత్యేకించుటకుగాను దేశీయ వైద్యము, ఇండియన్ మెడిసిన్, ఇండిజినస్ మెడిసిన్, నేటివ్ మెడిసిన్ అని ఆధునికులు పిలుచుచున్నారు.

ఆయుర్వేదముయొక్క ప్రయోజనము స్వాస్థ్యరక్షణము రోగశమనముల ద్వారా దీర్ఘాయు సంప్రాప్తి యని తెలియు చున్నది. ప్రతి వారు సుఖప్రదమయిన దీర్ఘాయువును కోరు చుందురు. దీర్ఘాయువును కోరుట యెందులకనిన ధర్మార్థ కామ మోక్షములను సాధించుకొనుటకే యని హైందవుల యభిప్రాయము గాని ఆనందముగా సుఖ జీవనము సాగించుట కొఱకు కాదు. ఆరోగ్యముగా చిరకాలము జీవించియుండిన తపశ్చర్యాది ధర్మముల నాచరించ వచ్చును. కృషిచేసి ధనమును సంపాదించవచ్చును. యశస్సుకోరి పరుల కుపచ రించునటుల జీవించవచ్చును. ధర్మార్జిత విత్తముతో న్యాయ మార్గ ప్రవర్తియైన పరోపకార జీవితునకు మోక్షము తనంత నది చేకూరును. ఇతర వైద్యశాస్త్రము లారోగ్యరక్షణ, దీర్ఘాయువులను ప్రసాదించగలవు గాని మోక్షదాయకములు కావు. ఆయుర్వేద మొక్కటియే యిందుల కెక్కువగా తోడ్పడగలదు. అన్య వైద్యశాస్త్రములు కర్మజ వ్యాధు లను గుర్తించలేదు. ఆయుర్వేదము మానవ ధర్మశాస్త్ర మందలి కర్మ సిద్ధాంతము నంగీకరించి, (ప్రారబ్ధ) పూర్వజన్మ కృత కర్మలవలన వచ్చిన రోగముల నయముజేసికొనుటకును, ఆ కర్మల నశింపజేసికొనుటకు తప, జప దానాద్యుపాయముల బోధించును. ఆత్మానాత్మ వివేకమును కలిగించి జ్ఞాన వైరాగ్యములను పుట్టించును. వీని ద్వారా జీవునకు మోక్ష

ప్రాప్తి నిస్సందేహముగా కలుగుచున్నది. ఇదియే ఆయుర్వేదము యొక్క విశిష్టత.

## 2 వ అధ్యాయము

## ఆయుర్వేదముయొక్క ప్రాచీనత.

ప్రాచీనాయుర్వేద గ్రంథములలో - అనగా క్రీస్తుశకమునకు 4 వేల ఏండ్ల క్రిందట వ్రాసిన అగ్నివేశతంత్రమనెడు చరక సంహితలోను, క్రీస్తు పూర్వము సుమారు రెండు వేల సంవత్సరముల క్రిందట వ్రాయబడిన సుశ్రుత సంహితలోను, క్రీస్తు పుట్టిన తరువాత 14 వ శతాబ్దమున వ్రాయబడిన వాగ్భటకృత మయిన అష్టాంగ హృదయ గ్రంథములోను ఆయుర్వేదము యొక్క పుట్టుకను గురించి యించుమించుగా నొకే విధమయిన వింతగాథ చెప్పబడినది. అదేమనగా—తొలుతను బ్రహ్మ సృష్ట్యాదిని ఆయుర్వేదమును దక్షప్రజాపతికిని, దక్షప్రజాపతి దేవవైద్యులైన అశ్వినులకును, అశ్వినులు ఇంద్రునకు బోధించిరి. ఈ విషయమును తెలిసికొని భూలోకములో జరామరణ పీడితులగుచున్న మహర్షులు హిమవత్పర్వత ప్రాంతమున సభచేసి లోకహితార్థము ఇంద్రునివద్ద నీ విద్య నేర్చి రమ్మని భరద్వాజుని పంపిరి. భరద్వాజు డాయుర్వేదము నేర్చి భూలోకమునకు వచ్చి పలువురు శిష్యుల కుపదేశించెను. నాటినుండి పరంపరగా నీవిద్య వ్యాప్తినొందెను. ఈ ఋషుల పరంపరలో ముఖ్యుడు అత్రికుమారుడు, పునర్వసు ఆత్రేయుడు లేక కృష్ణ ఆత్రేయుడు. ఈతనియొద్ద అగ్నివేశుడు పలువురు సహాధ్యాయులతో కలిసి ఆయుర్వేదము నభ్యసించెను. అగ్నివేశుడు

వ్రాసిన గ్రంథమే యిప్పుడు చరకసంహిత యను పేరుతో వ్యవహరించబడుచున్నది. మిగిలిన శిష్యులు కూడను ఆయుర్వేద సంహితలను వ్రాసిరి గాని వాటిలో భేలసంహిత యొక్కటి మాత్రమే మనకిప్పుడు లభించినది. సుశ్రుత వచనానుసారము భరద్వాజ సాంప్రదాయమునకు భిన్నముగా కాశీ రాజగు దివోదాసు నామాంతరము గలిగిన ధన్వంతరి ఇంద్రునియొద్దనుండి ఆయుర్వేదమును గ్రహించి సుశ్రుతాది పలువుర శిష్యులకు బోధించెనని యున్నది. అష్టాంగ హృదయము (వాగ్భట గ్రంథము)లో భరద్వాజ పరంపరకు బదులు ఆత్రేయుడు మొదలైనవారు ఇంద్రుని శిష్యులే యని కన్పించును. అష్టాంగ సంగ్రహమను గ్రంథములో సుశ్రుతుడు అగ్నివేశుని సహాధ్యాయిగా చెప్పబడినది. భావప్రకాశమను వైద్యగ్రంథములో ఆత్రేయుని పిమ్మట భరద్వాజుని పేరు యున్నది.

దేవలోకమునుండి భరద్వాజునిచే నీవిద్య భూలోకమునకు తీసికొని రాబడుటయును, పరంపరావ్యాప్తిలో భేదములును చారిత్రకాంశములు కానందున విమర్శించి నిశ్చయించుటకు వీలుకాదు. బహుశా ఆయుర్వేద శాస్త్రముయొక్క అతిప్రాచీనతను నిరూపించుటకొఱకును, యీశాస్త్రమునకెక్కువ గౌరవ మాపాదించుటకును ఆయా సంహితా రచయితలు ఆయుర్వేదముయొక్క పుట్టుక బ్రహ్మ సృష్టితో నారంభించి ద్యులోకవాసులైన దక్ష, ఇంద్ర యశ్వినులతో సంబంధమును కల్పించియుందురు. భూలోకములో దాని పరంపరా వ్యాప్తి విషయము కూడ విమర్శించుటకు చారిత్రకాధారములు లేవు.

ప్రపంచ మందలి యితర వైద్యశాస్త్రముల పుట్టుక, యభివృద్ధులను చారిత్రక దృష్టితో పరిశీలించిన వారికి యివన్నియు క్రమ క్రమముగా మానవుల బుద్ధి వికాసము ననుసరించి వృద్ధియగుచూ వచ్చుచున్నవని తెలియగలదు. ఒక్క మనుష్యులలోనే గాక ప్రాణికోటు లన్నిటిలోను తమ యభివృద్ధికి అంతరాయము కలిగి నప్పుడు ప్రతీకారముగా నుపాయము లన్వేషించుచుండుటను మనము గమనించవచ్చును. ఇట్టి కోరిక ప్రకృతిసిద్ధము. నూతన విషయములను తడవుట యవసరమునుబట్టి కలుగుచుండును. (Necessity is mother of invention and discovery is the child of knowledge gained by abservation). సృష్టిలో నీ ప్రకృతి వైచిత్ర్యమును గమనించవచ్చును. సూర్యరశ్మి వైపునకే చెట్లు తమ యాకులను విప్పుకొని తిరుగుచుండుటయు, భూమిలో నీరుండిన దిక్కునకే వేళ్లు సాగుచుండుటయు, మరియు నీరు ఎద్దడి కలుగుచున్న ప్రదేశములలో చెట్లు పుష్కలముగా నీరు లభించిన రోజులలో తమకు కావలసిన దానికంటె నెక్కువగా గ్రహించి పత్రకాండములలో దాచుకొని నీటికి కరువు వచ్చిన దినములలో జీవించుచుండుటను చూచుచున్నాము. వేసవిలో తాము దాచుకొన్న నీరు చాల తక్కువగా నావిరియగుచుండుట కొఱకు వసంతకాలము లోనే ఆకుల నన్నిటిని రాల్చివేయును. పక్షులు, జంతువులు, మనుష్యులు ఎక్కువ చలిబాధ కలిగినప్పుడు వెచ్చదనమును కోరి యుపాయముల నన్వేషించుచుండుట సహజము. ఎండ తాపమును భరించలేక చల్లని వాతావరణములను నిర్మించుకొందురు. క్షుత్పిపాసలు సర్వప్రాణులకు సహజ వ్యాధులుగా

నున్నవి. వీని నివారణకు ఆహార పానీయము లవుసరమగు చున్నవి. అజీర్తి రోగమునకు లంఘనము పరమౌషధమని జంతు పక్షులకు సహితము తెలియును. అజీర్ణ పదార్థము బాధించుచున్నప్పుడ ద్దానిని వెడలించుటకు పిల్లి, కుక్క గడ్డి చివుళ్ళు కొఱికి వాంతి చేసికొనుచుండును. ఈ విధమయిన ఆపన్నివారణోపాయములు ప్రతిక్రియలుగా తోచుట ప్రకృతిలో సహజము. ఇట్టి సహజ జ్ఞానమునకు 'యిన్‌స్టింక్ట్సు' (Instincts) అని పేరు. ఉపాయాన్వేషణకు యిన్‌ట్యూషన్ (intusion) అందురు. ఈ రెండును కలిసిన సాధించరాని పని యేముండును. మనుష్యుల బుద్ధి పరిశీలనము అనుభవము లతో వికసించును.

పరిశీలనద్వారా విజ్ఞానము వృద్ధికాగా దీనికితోడుగా వారి అనుభవములనుకూడ చేర్చుకొనుచుండిన యీవిజ్ఞానానుభవ సముదాయమే యొకశాస్త్రముగా పరిణమించగలదు. ప్రపంచములో నన్నిరకముల శాస్త్రము లీవిధముగా పలువుర తీవ్రపరిశీలనానుభవములను పురస్కరించుకొని వెలసినవే. కనుక నాయుర్వేద శాస్త్రముకూడ నీవిధముగా వృద్ధియైనదని మనమూహించుట పొరబాటుకాదు.

ఆయుర్వేదము బ్రహ్మముఖమునుండి వెలువడిన వేదముల కుపవేదముగా భావింపబడుచున్నది అనగా నీవిజ్ఞానము వేదములలోనుంచి సంగ్రహింపబడినందున ఆయుర్వేదకర్త బ్రహ్మయనిచెప్పుట సమంజసమే యగును. ఋక్ యజుర్వేదాంతర్గతమైన విజ్ఞానము విస్తరించబడి అథర్వణవేదముగా వెలసినది. అథర్వణవేదములో నాయుర్వేద విషయములు చాలయున్నవి. ఈవిజ్ఞానమంతను క్రోడీకరించి విస్తరించి

ఆయుర్వేద గ్రంథకర్తలు సంహితలుగా వ్రాసిరి. మరియు వేదములు బ్రహ్మనిర్మితములని చాలమంది నమ్ముచుండగా నివి పౌరుషేయములను యొక వాదముకూడ బయలుదేరెను. నిజమును పరిశీలించగా నుభయవాదములు సరియైవేయుని తోచును అదెట్లనగా విద్ = తెలిసికొనుట అనుధాతువు నుండి వేత్తియితివేదః, విద్యతేయితివేదః, విందతి యితివేదః అని మూడువిధములయిన నిర్వచములు కనిపించును. సర్వ మానవులు తమ విజ్ఞానోపార్జనకొరకు వేదములను తెలియ దగినవిలేక పరిశీలించదగును అనెడి కారణమున ఋషులు వేదద్రష్టలైనారు. ఋషులు వేదములను చూచిరనుటలో నర్థమేమన ప్రాపంచిక సృష్టియంతయు బ్రహ్మనిర్మితము. ఈ సృష్టి పరిశీలనమే బుద్ధిమంతులగు ఋషులు గావించిరని భావము. ఇక వేదములు పౌరుషేయమనుటలో ఋషులు ప్రకృతిపరిశీలనా విషయములను స్మరించి వాఙ్మయముగా సృష్టించిరి. గనుక అసలువేదపదార్థము బ్రహ్మసృష్టితము వాఙ్మయరూపక వేదములు పౌరుషేయములని సమర్థించుకో వచ్చును. వేదములకు శ్రుతులని యింకొకపేరుగలదు. ఓంకారనాద ప్రణవమును ఋషులు వినినారని యర్థము. ఇందువలన వారికికలిగిన జ్ఞానము స్మృతిజ్ఞానము, పురాణము లను స్మృతులందురు.

మొదట ఋక్, యజుస్సామములనెడు త్రయీవేద ముతే వెలసినవి. ఈమూటియందలి లౌకిక విజ్ఞాన విషయము లను క్రోడీకరించి, విస్తరించి, అథర్వణవేదమును ఋషులు దరిమిలాను సృష్టించినారు. ఇందులో నాయుర్వేద విష యము లెన్ని యోగలవు. అనేకములైన ఓషధుల గుణములు,

రాజయక్ష్మ, కుష్ఠు, యక్ష్మ, తక్మజ్వరాదుల వివరములు, రోగహేతువులుగానున్న సూక్ష్మక్రిముల జాతులు, పేర్లు మొదలైన ఆయుర్వేద విషయములు అథర్వణవేదములో నుంచియే గ్రహింపబడినవి. ఈశాస్త్ర నిర్మాణమునకు పునాది యనదగిన త్రిదోష సిద్ధాంతమునకు *ప్రతిపాదికను ఋగ్వేదమునుండి గ్రహించియుండవచ్చును, ఇంకను యజ్ఞ పశువును ఛేదించునప్పుడు చెప్పిన శ్రౌతమంత్రములలో అస్థులపేర్లు అంగప్రత్యంగముల వివరములు కన్పించును. ఉపనిషత్తులలో గర్భోపనిషత్తు ప్రత్యేకముగా రచింపబడినది. ఈవిధముగా పలుసందర్భములలో వెదజల్లియున్న ఆయుర్విజ్ఞానమంతను క్రోడీకరించి ఆయుర్వేద తంత్రకర్తలు ఆయుర్వేద శాస్త్రమును నిర్మించిరి.

అగ్నివేశ తంత్రము (చరకసంహిత) నకు పూర్వ గ్రంథములున్నటుల కన్పించదు. ఇది క్రీస్తుశకమునకుముందు నాలుగువేల యేండ్లక్రిందట వ్రాయబడియుండ వచ్చునని

---

*"త్రిర్నో అశ్వినా ధవ్యాని భేషజా త్రిః పార్థవాని త్రియుదత్తమద్భ్యః ఓమానం శం యోర్మమకాయసూనవే త్రిధాతుశర్మ వహతం శుభస్పతీ."
ఋగ్వేదం 1-7-4-6 మంత్రం.

ఈమంత్రమునకు శాయనాచార్యులువారు—"త్రిధాతు వాతపిత్త శ్లేష్మధాతు త్రయోప సమానవిషయం సుఖ వహతం" అని వ్యాఖ్యానించినారు అనగా మనశరీరమందలి వాతపిత్త కఫములనెడు త్రిధాతువులు సౌమ్యముగా వ్యవహరించునంతవరకు సుఖముగా నుందుము. ఇవి వైషమ్యము పొందినప్పుడు రోగజనకము లగుచున్నవని భావము. ఈస్థితిలో త్రిదోషము లనబడును.

చరిత్రకారు లభిప్రాయ పడుచున్నారు. అనగా ద్వాపర యుగము చివరిభాగమున వ్రాయబడినదన్నమాట. (about 4000 B. C) అగ్నివేశ తంత్రము భారద్వాజ సాంప్రదాయము ననుసరించి కాయచికిత్సా ప్రధానముగా రచింపబడినది. పిమ్మట 2500 B. C కాలమున కాశీరాజగు దివోదాస నామాంకితుడయిన ధన్వంతరి శిష్యులలో ప్రథముడు సుశ్రుతుడు శల్యతంత్ర ప్రధానముగా సుశ్రుత సంహితను రచించెను. క్రీస్తుశకము 8 వ శతాబ్దమున వాగ్భటాచార్యుని అష్టాంగ హృదయమను ఆయుర్వేద గ్రంథము వ్రాయబడినది. ఇందులో కాయచికిత్స, శల్యచికిత్స, శాలాక్యవిషయములు, దంష్ట్రచికిత్సలు, కౌమార భృత్యము, భూతవిద్య, జరా, వృష్యములు అనెడు ఆయుర్వేదముయొక్క అష్టభాగములు క్రోడీకరించబడినవి. ఇంతకుముందు 7 వ శతాబ్దము A. D లో వృద్ధ వాగ్భటునిచే అష్టాంగ సంగ్రహమను గ్రంథము వ్రాయబడినది. ఈశతాబ్దములోనే మాధవనిదాన గ్రంథముకూడ వ్రాయబడినది. మాధవకరు డుదహరించిన పూర్వగ్రంథములు మనకు లభించలేదు. ఇటీవల భావప్రకాశము, శార్ఙ్గధరసంహిత, చక్రదత్తాది గ్రంథములలో విదేశములనుండి సంక్రమించుచున్న క్రొత్తరోగముల వివరములు, విదేశీయములయిన మందుదినుసులను చేర్చుకొనుటను గమనించవచ్చును.

పశు వైద్యశాస్త్రముకూడ నతి ప్రాచీనమైనది. మెగస్థనీసు మన దేశమునకు వచ్చినప్పుడు ఏనుగులకు, గుఱ్ఱములకు చికిత్సలు జరుగుచున్నవని వ్రాసెను. అశోకుని సామ్రాజ్య

ములో (B. C 3 వ శతాబ్దము) పశు చికిత్సాశాల లున్న టుల శిలా శాసనములు లభించినవి. B C 4 శతాబ్దమున సింహళ ప్రభువు బుద్ధదత్తుని కాలమున మనుష్యులకు పశువులకు చికిత్సించుటకు ఆస్పత్రులు నెలకొల్పెను. పశు వైద్య శాస్త్రము 1030 A D లో టిబెట్టు, అరబ్బీ భాషలలోకి అనువదింపబడెను. 14 వ శతాబ్దములో గుఱ్ఱముల చికిత్స పర్షియా భాషలోకిని, 17 శతాబ్దములో ఏనుగులకు చికిత్సా గ్రంథములను అనువదించిరి. వీనిని ఎర్లిన్ అను నతడు 1788 సం॥రంలో నాంగ్లమున కలకత్తాలో ప్రచురించెను. పశు చికిత్సా గ్రంథములలో నతి ప్రాచీనములు (1) పాలకాప్య సంహిత (ఏనుగులకు చికిత్స - అచ్చు పడినది. (2) జయదత్త విరచితమయిన అశ్వవైద్యక లేక శాలిహోత్రశాస్త్రము. (3) నకుల ప్రణీతమయిన అశ్వచికిత్సాశాస్త్రము. ఇంకను 14, 15 శతాబ్దములలో వ్రాయబడిన అశ్వచికిత్సా గ్రంథములు నేపాళభాషలో నముద్రితములై యున్నవి. వృక్షాయుర్వేదము కూడను అతి ప్రాచీన కాలము నుండి మన దేశమందాచరణలో నున్నది.

## 3 వ అధ్యాయము

## ఆయుర్వేద మందలి ప్రామాణిక గ్రంథములు.

1. ఆయుర్వేద శాస్త్రమును సంహితారూపముగా వ్రాసిన మొదటి ప్రామాణికగ్రంథము అగ్నివేశతంత్రము. క్రీస్తు సమకాలికుడని చెప్పదగిన చరకునిచే సంస్కరింపబడుట వలన చరకసంహిత యని వ్యవహరించబడుచున్నది. ఇది కాయచికిత్సా ప్రధానముగా నున్నది.

క్రీస్తుశకము 11 వ శతాబ్దములో చక్రదత్త లేక చక్రపాణిదత్తుడు చరకసంహితకు నిర్దుష్టమయిన వ్యాఖ్యానమును వ్రాసి దానికి ఆయుర్వేద దీపిక లేక చరకతత్పరియాతిక మని వ్యవహరించెను. ఇంతకు ముందు హారి చంద్రుని వ్యాఖ్యానగ్రంథ ముండెనని చక్రదత్తుడు వ్రాసెను గాని అది యిప్పుడు మనకు లభించలేదు. చరక సంస్కృత సంహిత చాలవరకు శిథిలము కాగా పంజాబీయు డయిన దృఢబాలుడను నతడు చివరి రెండు స్థానములను పూర్తిగాను, 5వ స్థానములో 41 అధ్యాయములును స్వతంత్రముగా వ్రాసి గ్రంథమును పూర్తి చేసెను.

చరక సంహితలో నీ దిగువ విషయములున్నవి:-

(1) సూత్రస్థానము:- ఇందులో ఔషధకల్పనలు, ఆహార విషయములు, రోగ వివరములు, చికిత్సా పద్ధతులు, సద్వైద్యకు వైద్యలక్షణములు, శారీర విజ్ఞానము, అధ్యాత్మికాది వివరములున్నవి.

(2) నిదానస్థానము:- ఎనిమిది ముఖ్యవ్యాధులు వివరింపబడినవి.

(3) విమానస్థానము:- షడ్రసములు, పౌష్టికాహార ద్రవ్యములు రోగనిదాన విషయములు, వైద్యునికి కావలసిన పరిజ్ఞాన మున్నది.

(4) శారీరస్థానము:- ఇందులో శారీర తత్త్వములు మానసికతత్త్వములు, ఆత్మలక్షణము, ఇంద్రియ వివరములు, గర్భ వివరము లున్నవి.

(5) ఇంద్రియస్థానము:- ఇందులో రోగ నిశ్చయ పద్ధతులు, రోగ సాధ్యాసాధ్యములు, అరిష్టలక్షణములు చెప్పఁబడినవి.

(6) చికిత్సాస్థానము:- శారీరిక మానసిక రోగములన్నిటికి నిదానలక్షణములు, చికిత్సలు చెప్పబడినవి.

(7) కల్పస్థానము:- చికిత్సా ద్రవ్యములను రోగానుకూలముగా తయారుచేసి ప్రయోగించు పద్ధతులున్నవి.

(8) సిద్ధిస్థానము:- పంచశోధన కర్మల ప్రయోగ వివరములు చెప్పబడెను.

2. సుశ్రుతసంహిత:- సుశ్రుతుడు ధన్వంతరీ యుపనామకుడైన కాశీరాజు దివోదాసుని శిష్యుడనని తన గ్రంథములో వ్రాసికొనెను. ఈతని కాలమును నిరూపించుటలో చాల చిక్కులున్నవి. విశ్వామిత్రుని కుమారుడని ప్రతీతి యున్నది. పురాణకాలపు విశ్వామిత్రుడో లేక విశ్వామిత్ర నాయకుడింకొక డుండెనో తెలియదు. మహాభారతములో సుశ్రుతుని పేరు కన్పించుచున్నది. సుశ్రుతుడు కాంభోజరాజు కాలమున (889-910 బి. సి) సుప్రసిద్ధ వైద్యుడుగా నుండినటుల ఆ రాజశాసనము వలన తెలియుచున్నది. 900 బి సి నాడు అరబ్బీదేశ వైద్యుడైన రాజీ (Razi) లేక రేజెస్ (Rhazes) అనునతడు అనువదించిన వైద్యగ్రంథములో సుశ్రుతుని ప్రశంస కన్పించుచున్నది. విష చికిత్సల గుఱించిన గ్రంథమును సిర్కా (circa) అనెడు పేరుతో బి. సి 910-20 ప్రాంతమున ననాక్ అను నతడు సుశ్రుతుని

ప్రమాణముగా నుదహరించెను. 805 B. C నాటి బౌద్ధమతావలంబకుడైన ఒకరాజు సుశ్రుత సంహిత ననువదించుటకు ప్రయత్నించెను. బి. సి 7 వ శతాబ్దమున సుశ్రుత సంహిత కనువాద గ్రంథమొకటి కన్పించినటుల చైనాదేశీయుడైన యాత్రికుడు వ్రాసినాడు. బవర్ గారి వ్రాతలలో సుశ్రుతుడు బి. సి 5 వ శతాబ్దవాడని యున్నది కాని పైనచెప్పిన విషయములనుబట్టి క్రీస్తుముందు 1000 సంవత్సరముల కింకను పూర్వముననే యుండవచ్చును. భారతగ్రంథ ప్రశంసనుబట్టి బి. సి 2500/- నాటివాడై యుండవచ్చుననికూడ తోచుచున్నది

సుశ్రుత సంహితకు వ్రాయబడిన వ్యాఖ్యాన గ్రంథములలో ముఖ్యములు (1) చక్రదత్తుని భానుమతి 11 ఎ. డి. (2) 12 ఎ డిలో డల్హణ ప్రణీతమయిన నిబంధ సంగ్రహము. చక్రదత్త డల్హణులకు పూర్వీకుడు జయ్యాతుడు. ఈతని వ్రాతలనుబట్టి చంద్రాతుడను నతడు సుశ్రుత సంహితను సంస్కరించినటుల కన్పించును. అనేకస్థలములందు క్రొత్త పాఠములను చేర్చెను. ఉత్తరస్థానము పూర్తిగా నీతని కల్పితమేయగును. అసలు సుశ్రుత ప్రతిలో పాదరసముయొక్క ప్రయోగములేదు. చంద్రాతుని ప్రతిలో పాదరస యోగములు చేర్చబడినవి.

సుశ్రుత సంహితశల్య తంత్ర శలాక్యతంత్ర ప్రధానముగా రచింపబడినది. నేటికాలమున చేయబడుచున్న పెద్ద ఆపరేషను లన్నియు సుశ్రుత సంహితలో వర్ణింపబడినవి. ఈ సంహితలో నీ దిగువచూపిన విషయములు కానవచ్చును.

(1) సూత్రస్థానము:- ఇందులో నాయుర్వేదావతరణము, వైద్యునకు గురువుయొద్ద శిక్షణపొందవలసిన యావశ్యకత, ఔషధద్రవ్య గుణములు, పథ్యాహారములు, ఆపరేషనులు చేయుటకు సామాన్య వివరములున్నవి.

(2) నిదానస్థానము:- రోగిని, రోగములను పరీక్షించవలసిన పద్ధతులు, ఆపరేషను చేయవలసిన రోగములయొక్క నిదాన లక్షణములున్నవి.

(3) శారీరస్థానము:- పంచభూతోత్పత్తి, దేహేంద్రియాదుల తత్త్వములు వివరించబడినవి.

(4) చికిత్సాస్థానము:- పలురకములగు వ్యాధులకు సామాన్యచికిత్సలు, ఆపరేషనులు విపులముగా చెప్పబడినవి.

(5) కల్పస్థానము:- ఇందు విషచికిత్సలు చెప్పబడెను.

(6) ఉత్తరస్థానము:- నేత్రరోగ చికిత్సలు, ఆరోగ్య సూత్రములు, కాయచికిత్సలు గలవు.

3. అష్టాంగ సంగ్రహము:- కర్త - సింహగుప్తుని కుమారుడైన వాగ్భటుడు. ఈతని తాతగారిపేరుకూడ వాగ్భటుడనియే పేర్కొనెను. 7 వ శతాబ్దమువాడని తెలియుచున్నది. ఈతనిని వృద్ధవాగ్భటుడని వ్యవహరింతుము. అష్టాంగ సంగ్రహకర్త బౌద్ధమతమునకు చెందిన గురువుయొద్ద విద్య నభ్యసించెనట. అందువలన గ్రంథాదిని బుద్ధభగవానునిగూర్చి మంగళాచరణ మొనర్చెను.

4. అష్టాంగహృదయము:- ఈగ్రంథకర్త పేరుకూడ వాగ్భటుడే. ఈగ్రంథరచనకు వృద్ధవాగ్భటుని అష్టాంగ సంగ్రహమే మూలమని గ్రంథకర్త వ్రాసికొనెను.

పూర్తిగా చరకము ననుసరించిది. అచ్చటచ్చట సుశ్రుత భేల, నిమి, కాశ్యప సంహితలగూడ నుదహరించెను. ధన్వంతరీయమను గ్రంథమునుకూడ పేర్కొనెను. ఈగ్రంథము 120 అధ్యాయములతోకూడి పూర్తియైన ఆయుర్వేద సంహితగా పరిగణింప బడుచున్నది.

టిబెట్టు దేశములో లభించిన సాక్ష్యములనుబట్టి హూత్ పండితుడు (Huth) అష్టాంగహృదయ రచనము క్రీస్తుశకము 8 వ శతాబ్దమునాటిదని నిర్ణయించెను. ఈకాలమునాటిదేయైన 'అష్టాంకార్' అనెడు అరబ్బీగ్రంథము అష్టాంగహృదయమునే యనుసరించినది. నల్లమందు వాడుక, పాదరసము, లోహముల యుపయోగము 9 వ శతాబ్దమువరకు వైద్య గ్రంథములలోనికి రాలేదు. ఇవి అష్టాంగ హృదయములో కన్పించవుకనుక 9 వ శతాబ్దమునకు పూర్వమే యీగ్రంథము రచింపబడినది. ఈ కర్తకూడ బౌధమతావలంబకుడని గ్రంథాదిని మంగళాచరణ వాక్యమువలన తెలియుచున్నది.

అష్టాంగ హృదయమునకు 13 వ శతాబ్దములో హేమాద్రిపండితుడు. ఆయుర్వేద రసాయనమును, 15 వ శతాబ్దములో అరుణదత్తుడు సర్వాంగసుందరమను వ్యాఖ్యాన గ్రంథములను వ్రాసిరి. సర్వాంగసుందరము సుప్రసిద్ధమైనది.

4. సిద్ధయోగములేక బృందమాధవము:- ఈ వైద్యగ్రంథము శ్రీ కంఠదత్తుని వ్యాఖ్యతో 1894 సం॥రమున పూనాలో ముద్రించబడినది. చక్రదత్తుని గ్రంథముకంటె కనీసమొక శతాబ్దమునకుముందు వ్రాయబడియుండవచ్చును. ఏలయనగా చక్రదత్తుడు, హేమాద్రి, శార్ఙ్గధరుడు బృందమాధవమును ఎక్కువ ప్రమాణ

గ్రంథముగా గైకొనుటవల్లనున్ను, శ్రీ కంఠదత్తుని వ్యాఖ్యానము 19 వ శతాబ్దమున వ్రాయబడినందునను బృందమాధవుడు వీరందఱికిని పూర్వీకుడని నమ్మవలసి యున్నది. వాగ్భటుని యుదహరించుటవలన బృంద మాధవుడు వాగ్భటునికి తరువాతవాడని స్పష్టమగు చున్నది. ఈగ్రంథములో పానకములు (Elixirs), వాజీకరణౌషధములు, బృంహణ, స్వేదన, విరేచనాది కర్మలు, అరిష్టలక్షణములు, స్వస్థానాధికరణ ప్రకరణ ములో నారోగ్యవిధులు, మిశ్రకాధికార ప్రకరణములో వైద్యులు, రోగులు, తూకములు, కొలతలు, మానములు మొదలైనవి వివరింపబడినవి. చక్రదత్తుడు పాదరస ముతో తయారగుచున్న యౌషధము లనేకములను వివరించగా బృందమాధవుడు తనగ్రంథములో పాదరస మును కొన్నిమూలికారసములతో కలిపి తలలోని పేళ్లు, యీనులను చంపునని ఒక్కవిషయమును మాత్రమే సూచించెను.

5. మాధవ నిదానగ్రంథము:- కర్త - ఇందు కరుని పుత్రు డైన మాధవకరుడు. ఇది ప్రత్యేకముగా నిదాన గ్రంథము. చాల సుప్రసిద్ధమైనది. బృందమాధవునకు వంగసేనునకు, భావప్రకాశునకు, నేటి వరకు సర్వులకు ప్రమాణగ్రంథముగా నున్నది. ఈ గ్రంథకర్త చరక, సుశ్రుత వాక్యములనే యథాతథముగా వాడుకొనెను. సుశ్రుతుడు మసూరికావ్యాధిని క్షుద్ర వ్యాధులలో సంగ్రహించి చెప్పగా మాధవకరుడు ప్రత్యేక మొక యధ్యాయముగా వివరించెను. మాధవకరుడు 7 వ

శతాబ్దము వాడని చెప్పుటకు ప్రబల సాక్ష్యము - అరబ్బీయు లీతని గ్రంథమును 'బదన్ యదస్' (నిదానము) అను పేరుతో నరబ్బీభాషలోనికి తర్జుమా చేసియుండిరి. సర్వులకు ప్రమాణముగానున్న యీ గ్రంథమును 8 వ శతాబ్దము వాడైన బాగ్భటుడేల యుదహరించలేదో తెలియకున్నది. ఈ సుప్రసిద్ధ నిదానగ్రంథమునకు విజయ రక్షితుడు మధుకోశ మను వ్యాఖ్యానమును, శ్రీకంఠదత్తుడు యింకొక వ్యాఖ్యానమును వ్రాసిరి. విజయ రక్షితుని మధుకోశ వ్యాఖ్య ప్రశస్తమైనది.

5. వంగసేన కృత చికిత్సా సార సంగ్రహము:- ఇది ప్రధానముగా చికిత్సలను బోధించుచున్నది. ఇంకను రోగ నిదాన లక్షణములు, పథ్యాపథ్యములు, ఔషధకల్పనలు, పంచకర్మలు, వివరింపబడినవి. అశ్మరీ నిదాన చికిత్సలు లోహాదుల భస్మీకరణ పద్ధతులు, త్రివిధ అయలోహములు రోమక సహితముగా (Romaka Steel) ఆరు రకముల ఉక్కులను వివరించెను. మరియు పాదరసమును శుద్ధిచేయుట, రసపర్పటి తయారుచేయుట, యింగిలీకముతోనుంచి పాదరసమును విడదీయుట వివరింపబడినవి. నాడీపరీక్ష, నల్లమందు ప్రయోజనములిందులో కన్పించవు. వంగసేనుని కాల నిర్ణయము కష్టముగానే యున్నది. అతి ప్రాచీన వ్రాత ప్రతి యొకటి ఎ. డి. 1276 సం॥ రములో వ్రాయబడినది, 1320 ఎ. డి లో వ్రాయబడిన మరియొక్క ప్రతి మాత్రము లభించుచున్నవి. వ్రాత ప్రతులనుబట్టి వంగసేనుడు గదాధర పుత్రుడనియు కాంజిక నివాసియనియు,

వంగ దేశీయుడనియు, సేనురాజ వంశీకుల వాడనియు తెలియుచున్నది. వంగసేనుని చికిత్సా సార సంగ్రహము వివిధ వైద్య గ్రంథములను క్రోడీకరించుకొని వ్రాసిన సారాంశ గ్రంథమేకాని స్వతంత్రరచన కాదు. అయిన నిది వైద్యులకు మిగుల యుపయుక్తముగా నున్నది.

7. చక్రదత్త వైద్యసారము:- చక్రదత్తుడు లేక చక్రపాణి దత్తుడు బంగాళ దేశీయుడు. నయపాల భూపాలుని కమాత్యుడుగాను, రసవత్యధికారిగాను నుండిన నారాయణునకు కనిష్ఠపుత్రుడు. ఈ నారాయణుడు 1060 ఎ. డి ప్రాంతమువాడు. ఈ గ్రంథమునకు మాతృక బృంద మాధవ రచిత సిద్ధయోగము. చక్రదత్త గ్రంథమునకు శివదాససేనుడు వ్యాఖ్యానము వ్రాసెను. చక్రపాణి దత్తుడు ద్రవ్యగుణ సంగ్రహము, సర్వసార సంగ్రహము, శబ్దచంద్రిక యను (Pharmacy and botanical & technical terms) గ్రంథముల వ్రాసెను. ఈరెండు నింకను యముద్రితములుగానే యున్నవి. శివదాససేను వ్యాఖ్యసహిత చక్రదత్తము ముద్రించబడినది.

చక్రపాణిదత్తుడు చరక సంహితకును, సుశ్రుత సంహితకును వ్యాఖ్యానములు వ్రాసెను.

8. శార్ఙ్గధర సంహిత:- ఇందులో నల్లమందు (Opium) ప్రయోగము, లోహ భస్మీకరణ పద్ధతులు వివరింపబడుటచేత నీ గ్రంథకర్త మహమ్మదీయకాలపు వాడని సి. దత్తుగారు నిర్ణయించిరి. గ్రంథ ప్రకాశకుడు శ్రీ

జీవన్ రాయ్ గారు శార్ఙ్గధరుని భావప్రకాశు డుదహరించుటచే 16 వ శతాబ్దమువాడని యూహించవచ్చును. ఈతడు బృందమాధవుని ప్రమాణముగా గైకొనుటవల్ల 10-16 శతాబ్దముల మధ్యకాలమున నుండెనని తెలియుచున్నది. గ్రియర్సన్ గారి యభిప్రాయము ప్రకారము 15 వ శతాబ్దమువాడని స్పష్టమగుచున్నది. కాని వోపదేవుడు శార్ఙ్గధర సంహితకు వ్యాఖ్యానము వ్రాసి యుండుటవలన 13 వ శతాబ్దమునకు పూర్వమందుండెననుట నిశ్చయము. ఈ సంహిత మూడు కాండలు, 32 అధ్యాయములుగా రచింపబడినది. వైద్యునకు కావలసిన సర్వ విషయము లిందు పొందుపరచబడియున్నవి. రసౌషధములను తయారుచేయుట వివరింపబడినది. పంచశోధన కర్మలు, నాడీపరీక్ష విపులముగా చర్చింపబడినవి. గ్రంథ రచనలో చరక, సుశ్రుత మాధవ నిదాన, బృందమాధవ, చక్రదత్తుల గ్రంథముల ననుసరించెను. కొన్ని సందర్భములను స్వతంత్రించి నూతన విషయముల బోధించెను. శార్ఙ్గధర సంహితా వ్యాఖ్యానకర్త వోపదేవుడు. వయ్యాకరణి. బీరారీ దేశములో మిగుల ఘనత వహించిన వైద్యశిఖామణి. కేశవ వైద్యుని పుత్రుడు. 1260 నుండి 1309 వరకు దేవగిరి ప్రభువునకు మంత్రిగా నుండిన హేమాద్రికి కేశవ వైద్యుడు సమకాలికుడుగా నుండెను. వైద్యశతశ్లోకి గ్రంథ మువోపదేవుడు రచించినదే. ఇంకను చాల వైద్య గ్రంథములను రచించినట్లు కనబడుచున్నది.

9. భావప్రకాశము:- కర్త - కాశీ నివాసియు సుప్రసిద్ధ

నైద్యుడునైన భావమిశ్రుడు. ఈ గ్రంథము సర్వులకు ప్రమాణగ్రంథముగా నున్నది. జీవానంద విద్యాసాగరులచే నతి ప్రాచీన టూబిన్‌జెన్ వ్రాత ప్రతిని సరి చూచి యీ గ్రంథము ప్రకటింపబడినది. టూబిన్‌జెన్ గారి వ్రాతప్రతి 1558 సం॥రములో వ్రాయబడినది కనుక భావప్రకాశ గ్రంథ మింతకు పూర్వమే వ్రాసినదై యుండవలెను. పోర్చుగీసువారిచే మనదేశమునకు సంక్రమించిన సిఫిలిస్ అనెడు ఫిరంగి రోగమునకు సుప్రసిద్ధౌషధము 'కొబాసిని' అనెడు ద్రవ్యమును భావమిశ్రు డుదహరించినాడు. ఈ ద్రవ్యము 1535 సం॥రములో మనదేశమునకు క్రొత్తగా దిగుమతి యైనదని చరిత్రలు చెప్పుచున్నవి. కనుక భావప్రకాశ గ్రంథ మింతకు పూర్వము రచించినదే యగును. ఇది వైద్యులకు విజ్ఞానకోశము. చరక, సుశ్రుతాది పూర్వగ్రంథ విషయములతో నూతన విషయము లిందు చేర్చబడి నందున ముగుల నుపయుక్తముగా నున్నది.

10. పదమూడు, పదునాల్గవ శతాబ్దములలో రసాయన శాస్త్రము మిక్కిలిగా వృద్ధిచెందినది. ఈరెండు శతాబ్దములలోను లోహాదుల భస్మమొనర్చి మందులుగా వాడుట, పాదరసయోగము నుపయోగించుట సంభవించినది. అనేకములైన రసతంత్ర గ్రంథములు వెలసినవి. అతి ప్రాచీన రస వైద్యగ్రంథములు.

(1) కంకాలయకృత రసాధ్యాయము. దీనికి 1386 లో మేరుతుంగ నామధేయుడైన జైనుడు వ్యాఖ్యానము వ్రాసెను.

(2) సర్వధర్మ సార సంగ్రహము 14 వ శతాబ్దము నాటిది.

ఇందులో రసార్ణవ, రసరహస్య, రసేశ్వర సిద్ధాంతములు ప్రతిపాదింపబడినవి. ఇంకను (3) రసప్రదీపము (4) రసామృతము (5) రసేంద్ర చింతామణి (6) రస చింతామణి (7) రస దర్పణము (8) రస రత్నప్రదీపము (9) రస రత్నావలి (10) రస రాజహంస (11) రససింధు (12) రసాలంకారము (13) రసావతారము మొదలైన రసశాస్త్ర గ్రంథములు 16 శతాబ్దము నాటికే సుప్రసిద్ధములై వెలసినవి.

(14) రసరత్న సముచ్చయ గ్రంథము పైన చెప్పిన వాని కన్నిటికంటె నతి ప్రాచీన మయినదని చెప్పుదురు.

11. ప్రత్యేక విషయ ప్రధానముగా వ్రాయబడిన వైద్య గ్రంథములు (monographs)

(1) జ్వరతిమిర భాస్కరము :- కర్త - కాయస్థచాముండ

(2) మోహనవిలాసము:- 1411 సం॥ 1459 సం॥ మధ్యను మహామ్మద్‌షా పాలనలో కాలీ [illegible] మోహనుచే వ్రాయబడినది. వాజీకరణౌషధములు, స్త్రీ [illegible] రోగములు వివరింపబడినవి. (3) [illegible] రత్నము:- 1400 సం॥లో పృథ్వీమల్లుచే రచింపబడినది.

12. అన్యశాస్త్ర సంబంధములైన వైద్య గ్రంథములు

(1) జ్ఞానభాస్కరము:- ఇది కర్మవిపాక సిద్ధాంతమును బోధించును. 1500 సం॥లో వ్రాయబడినది. (2) సార [illegible] కర్మవిపాకము:- 1384 లో రచింపబడినది. స్మృతిబద్ధమయిన



ధర్మశాస్త్రము. (3) వీరసింహావలోకము :- కర్తవీరసింహుడు. 1375 సం॥లో గ్వాలియర్ సంస్థానాధిపతిగా నుండెను. 1383 లో నీగ్రంథమును వ్రాసెను. ధర్మశాస్త్ర, జ్యోతిష, వైద్యవిషయములను మేళవించెను. (4) చికిత్సాకలిక:- కర్త. తిసతాచార్యులు 11 వ శతాబ్దమునకు పూర్వమే వ్రాయబడి యుండవచ్చును. తిసతాచార్యుని పుత్రుడు చంద్రాస్తుడు దీనికి వ్యాఖ్యానము వ్రాసెను.

13. పదహారు మొదలు 18 వ శతాబ్దము మధ్యలో వ్రాయ బడిన వైద్యగ్రంథములు:- (1) భావప్రకాశ గ్రంథము (2) భావమిశ్ర విరచిత గుణరత్నమాల (3) ఆయుర్వేద సాంఖ్యము:- ఇది తోడరానంద గ్రంథములో నొక భాగము. అక్బర్‌చక్రవర్తి మంత్రియైన తోడర్ మాల్‌ని ప్రోత్సాహముచే వ్రాయబడిన గ్రంథము. (4) యోగచింతామణి వైద్య సార సంగ్రహము:- వైద్యయోగముల సంపుటి. జైనమతస్థుడైన హర్షకీర్తి సూరిచే వ్రాయబడినది. 1668 లేక 1666 సం॥లో వ్రాయబడెను. ఇందులో ఫిరంగి రోగమునకు కొపాసిని, నల్లమందు, పాదరసయోగములు చెప్పబడినవి.

14. పదిహేడవ శతాబ్దములో సుమారు ఏడు సుప్రసిద్ధ వైద్య గ్రంథములు వెలసినవి.

(1) లోలంబ రాజీయము లేక వైద్యజీవనము:- తెలుగు పద్యకావ్యము. చికిత్సాప్రధానముగా 1633 లో వ్రాయబడి నది.

(2) యోగరత్నాకరము:- కర్త పేరు తెలియదు.

1611 నాటి నిర్ణయసింధు, భావప్రకాశలు నుదహరించుట చేతను దీని వ్రాతప్రతి 1776 సం॥రం నాటి దగుటచేతను యీ గ్రంథము 1646 ప్రాంతమున వ్రాసినదై యుండ వచ్చును.

(3) 1616 సం॥రంలో జగన్నాథ పండితునిచే యోగ సంగ్రహము వ్రాయబడెను.

(4) 1641 లో మణిరాం మిశ్రుడు 'వృత్తరత్నావళి' వ్రాసెను.

(5) 1661 లో చికిత్సా రత్నావలి గ్రంథమును కవి చంద్రుడను నతడు వ్రాసెను. ఇది మాధవ నిదానము ననుక రించుచు చికిత్సలతో విరాజిల్లుచున్నది.

(6) వైద్యరహస్యము:- కర్త విద్యావతి 1682 లేక 1692

(7) రఘునాథ పండితుని వైద్య విలాసము 1697

18 వ శతాబ్ది వైద్యగ్రంథములు:-

(1) 1702 లో వైద్యరాజా వ్రాసిన సుఖబోధ.

(2) వైద్యామృతము:- నారాయణ మొదలైనవారు

(3) ప్రయోగామృతము – కర్త – వైద్యచింతామణి.

(4) రాజ వల్లభీయ ద్రవ్యగుణము (1706)

(5) భైషజ్య రత్నావళి – కర్త – గోవిందదాస.

(6) యోగ తరంగిణి – కర్త – తిరుమర్లయాచార్య

(7) ఆయుర్వేదప్రకాశ – మాధవ ప్రణీతము 1713

(8) ఆతంక తిమిరభాస్కరము – కర్త కాశీ నివాసి

బలరాం పండితుడు. దీనిలో టీ యొక్క ప్రసంశ యున్నం దున 19 వ శతాబ్దముదే కావచ్చును.

19, 20 శతాబ్దములలో వ్రాయబడిన ఆయుర్వేదగ్రంథ ములు:-

(1) వినోదలాల్ సేన్ గారి ఆయుర్వేద విజ్ఞానము 1887

(2) వైద్యక శబ్దసింధు (1895) కర్త - ఉమేశ చంద్ర గుప్త

(3) ఆయుర్వేదీయ ద్రవ్యాభిధానము - కర్త కె బి. లాల్ సేనుగుప్త (1875)

(4) నిఘంటు రత్నాకరము - కర్త - కె. కె. ప్రసన్న విటూసర్కార్ అండ్ బోలోనాద్ శర్మ (1876)

(5) బృహన్నిఘంటు రత్నాకరము - కర్త దత్తారాం చాబీ (1891)

(6) ది మెటీరియా మెడికా ఆఫ్ ది హిందూస్ - శ్రీ ఉమేశచంద్రునిచే రచింపబడినది.

(7) ఎ షార్టు హిస్టరీ ఆఫ్ ఆర్యన్ మెడికల్ సైన్సు - కర్త - సర్ భగత్ సింహాజీ.

(8) అవినాశ చంద్ర కవిరత్నగారి చరక సంహితకు యింగ్లీషు తర్జుమా గ్రంథము (1896)

(9) కవిరాజ నగేంద్రనాద్ సేన్ గారి ఆయుర్వేదిక్ సిస్టమ్ ఆఫ్ మెడిసిన్ (యింగ్లీషు భాషలో) 3 వాల్యూములు

10. సప్లిమెంటు టు ది ఫార్మకోపియా ఆఫ్ ఇండియా- ది మెడ్రాస్ మెటీరియా మెడికా - ఈ రెండును 1886 లో డాక్టరు మొహియుద్దీన్ షెరిఫ్ ఖాన్ గారిచే వ్రాయబడినవి.

11. శ్రీ గణనాథసేన్‌గారి ప్రత్యక్ష శారీరము, ప్రత్యక్ష నిదాన గ్రంథములు, ఆంగ్లాయుర్వేద వైద్యముల సమీకరణములో సంస్కృతమున వ్రాయబడినవి.

ఇంకను పూర్వాయుర్వేద గ్రంథములు వివిధ దేశ భాషలలోని కనువదింపబడినవి లెక్కకు మించియున్నవి. అముద్రిత వ్రాత ప్రతు లెన్నియో మిగిలియున్నవి. వీని నచ్చొత్తించినచో నూతన విషయములు బయల్పడవచ్చును. తెలుగునాటను ముక్కోటి తెలుగువారి కుపయుక్తముగ ప్రాచీనాయుర్వేద గ్రంథముల ననుసరించి వ్రాయబడిన స్వతంత్ర వైద్యగ్రంథములు:-

1. వైద్యచింతామణి:- కర్త - ఇంద్రకంటి వల్లభాచార్యులు

2. బసవ రాజీయము:- కర్త - నీలకంఠం బసవరాజు.

పూర్వాయుర్వేద గ్రంథములను యథాతథముగా తెలుగు లిపిలోను వాటికి తెలుగు టీక వ్యాఖ్యానములతోను వ్రాసి యచ్చొత్తించిన వాటిలో ముఖ్యములు:-

1) చరక సంహితను శ్రీ కార్వేటివారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, వావిళ్ళవారు నచ్చొత్తించిరి.
2) సుశ్రుత సంహిత - సూత్రస్థానమును మాత్రము శ్రీ చేవలి రామమూర్తి శాస్త్రిగారు.
3) వావిళ్లవారు-చరక, సుశ్రుత సంహితను, చక్రదత్త, అష్టాంగ హృదయాది చాల వైద్యగ్రంథములను ప్రకటించిరి.
4) మాధవ నిదాన గ్రంథమును పండిత డి. గోపాలాచార్యులుగారు వ్యాఖ్యానముతో ప్రకటించిరి.

# రెండవ భాగము

## 1 వ అధ్యాయము

## ఆయుర్వేదగ్రంథములలో
## నేటి శాస్త్రీయపద్ధతు లెంతవరకు గలవు?

'ఆయుర్వేదగ్రంథములలో నేటి శాస్త్రీయపద్ధతులెంత వరకు గలవు?' అనెడు ప్రశ్న చాల విచిత్రముగా నున్నది. కొన్ని వేల సంవత్సరముల క్రిందట పుట్టి, నాటినుండి ఎదుగు పొదుగులు లేకుండ నేటివరకు నిలిచియున్న ఆయుర్వేదము నకును, మూడు లేక నాలుగు శతాబ్దముల క్రిందట పుట్టి, దిన దిన వర్ధమానము లగుచున్న నేటి పాశ్చాత్యుల వివిధ శాస్త్ర జ్ఞానములకును, ముఖ్యముగా అల్లోపతి యని చెప్ప బడు మోడరన్ వైద్యశాస్త్రమునకును సామ్య మెక్కడ. అయినను ఆయుర్వేద యల్లోపతి వైద్యశాస్త్రములు రెండును ప్రజారోగ్య రక్షణము నుద్దేశించిన శాస్త్రములే గనుక నుభ యములు సత్యబద్ధమయిన సిద్ధాంతములతో కూడినవి యని చెప్పక తప్పదు. అయితే యీరెండు శాస్త్రముల నిర్మించిన కర్తలయొక్క దృక్పథములు వేర్వేరుగా నుండినందున వారు నిర్మించుకొన్న సిద్ధాంతములు, ఆచరణ పద్ధతులు వేర్వేరుగా కన్పించును. కొన్ని విషయములందు సమానముగానుండును. కొన్ని సందర్భములు భిన్నములుగా కూడ తోచవచ్చును. ఈ సాదృశ్య వైదృశ్యములను చూపించుటయే పై ప్రశ్నకు సమాధానము కాగలదు. ఇంకను విరుద్ధములుగా కనిపించిన విషయములను సమన్వయపరచ గలిగిన-చో నొక క్రొత్త వెలుగు రెండు శాస్త్రములకు ప్రసరించినట్లగును. అప్పుడు

మోడరన్ వైద్యము, ఆయుర్వేదములు కలియుట కవకాశ మేర్పడి 'సమన్వీత వైద్యశాస్త్ర మొకటి (Synthetic medicine) నూతనముగా సృష్టింపబడగలదు. ఈ పై యుద్దేశములతో నీ గ్రంథమును వ్రాయబూనితిని.

నేడు మన భారతదేశములో మిగుల వ్యాప్తిచెంది ఆచరించబడుచున్న వైద్యశాస్త్రములలో ముఖ్యములు:-

1. ఆయుర్వేదము 2. అల్లోపతి లేక మోడరన్ వైద్యము 3. యూనానీ వైద్యము 4. హోమియోపతి వైద్యము. వీనిలో నాయుర్వేద యూనానీ వైద్యము లొకటే యని యిదివరలో చెప్పితిమి. హోమియోవైద్య సిద్ధాంతములుకూడ నాయుర్వేదములో గలవని చెప్పి యుంటిమి. ఈ వైద్యశాస్త్రమును సృష్టించిన హానిమన్ పండితుడు మొదటలో నల్లోపతి వైద్యశాస్త్రజ్ఞుడు. మోడ రన్ వైద్యమందలి ఫిజియాలజీ, సైకోలజీ, పేథాలజీ విజ్ఞాన ముల ననుసరించి అల్లోపతి వైద్యశాస్త్ర నిర్మాతలవలెనే డాక్టరు హానిమన్‌గారు ఔషధ ద్రవ్యములను జంతువులకు పక్షులకు, మనుష్యులకు చాల చిన్న మోతాదులలోను, విష మోతాదులలోను యిచ్చి అనేక పరిశోధనలుచేసి హోమియో సిద్ధాంతములను కనిపెట్టెను. అవి యవ్వి యనగా:-

1. Similia similiabus Curantor అనగానే ద్రవ్య మును పెద్దమోతాదులో నారోగ్యవంతునికి తినిపించిన నేలక్ష ణములు పుట్టునో రోగములలో నదేలక్షణములకు ఆద్రవ్య మును చిన్నమోతాదులలో తినిపించినచో నావ్యాధి నయము కాగలదు. ఈరకముచికిత్స ఆయుర్వేదములో హేతు,

వ్యాధి విపరీతార్థకారి చికిత్సలు కాగలదు.

2. Infinitsmal dose - సూక్ష్మమోతాదుల నిచ్చుటవసరము. ఆయుర్వేదములోను సూక్ష్మమోతాదు లిచ్చుచున్నారు.

3. Dynamization of the drug :- ద్రవ్యమునకు అణు విభజనద్వారా దాని రోగహరణశక్తిని వృద్ధిచేయుట. ఈవిషయమును ఆయుర్వేద మిదివరకే గుర్తించినది. ఇందులకే భావన, మర్ధన, పుటములబెట్టుట మొదలైన సంస్కారములు చేయుదురు.

4. Study of idividual Constitntions. రోగి యొక్క శారీర మానసిక ప్రకృతులను తెలిసి అనుకూలమయినమందు, దాని మోతాదు నిర్ణయించవలెను. ఈ సిద్ధాంతమునుకూడ నాయుర్వేదములో ననుసరించుచునే యున్నారు

గనుక హోమియోవైద్య మాయుర్వేదమునకు విరుద్ధమయినదికాదు. ఈసిద్ధాంతములన్నిటి నిదివరకే ఆయుర్వేద మిముడ్చుకొని యున్నది. ఈసిద్ధాంతములను విస్తరింపజేసి, ఆచరణలోకి దెచ్చిన హానిమన్ ప్రభృతులకృషి. మెచ్చదగిన విషయము.

ఇక మోడరన్ మెడిసిన్ అని వ్యవహరించబడుచున్న అల్లోపతి వైద్యశాస్త్రము నేడు సూక్ష్మక్రిమి సిద్ధాంతము ననుసరించుచుండినను దీని పూర్వచరిత్రను గమనించినప్పుడు హైందవులనుండి గ్రహించిన ఆయుర్వేదమునే గ్రీకులభ్యశించుచుండిరని తెలియగలదు. గ్రీకులకు పంచభూత సిద్ధాం

తము అర్థముకాక విడనాడిరి. త్రిదోషములను సరిగా గ్రహించ లేక వాటిని 'హ్యూమర్సు' అను పేరుతో వ్యవహరించిరి. ఈ మార్పులతో కూడిన గ్రీకువైద్యమును ఐరోపియనులు నేర్చుకొని హ్యూమర్సు బొత్తిగా నర్థముకాకపోవుటచేతను వాటిని దిగనాడి వారి యనుభవములో కన్పించుచున్న గాలి, నీరు, ఆహార విహారములే రోగహేతువులని నమ్ముచు ఓషధులనే చికిత్సాద్రవ్యములుగా వాడుకొనుచుండిరి. అనగా నాయుర్వేద మందలి మూలసిద్ధాంతములను విడిచిపెట్టి కేవలము చికిత్సల ననుభవించుచుండిరని తెలియుచున్నది. కాలక్రమమున అన్య శాస్త్ర పరిజ్ఞాన మభివృద్ధియైన కొలది పలువురు బుద్ధిమంతులు శారీర విచయ మొనర్చి (Dissection of the dead and living bodies) అంగ ప్రత్యంగముల స్వరూపములను వ్యాపారములను గ్రహించ మొదలిడిరి.

డాక్టరు హార్వేపండితుడు రక్తచంక్రమణమును ప్రదర్శించెను. 1675 సం॥రంలో మైక్రోస్కోపుయంత్రమును కనుగొనిరి. దీనిసాయమున పండితుడు దేహాణువుల స్వరూపము, వాటి వ్యాపారమును బోధించెను. రోగములలో నీ దేహాణువులందలి మార్పులను గుర్తించ మొదలిడిరి. ఈ దూష్య పరిజ్ఞానమునకు పేథాలజీఅనిపేరు. పిమ్మట రోగహేతువుల విషయమై పరిశోధకులు తమదృష్టిని మరల్చిరి. గ్రీకువైద్యమున చెప్పిన హ్యూమరల్ సిద్ధాంతమువారికి నచ్చలేదు. గాలి, నీరు, ఆహారాభ్యాసములు రోగహేతువులసిన సంతృప్తి కలుగలేదు. 1687 సం॥ రములో డాక్టరు పేస్ట్యూర్ అను ఫ్రెంచి వైజ్ఞానికుడు అప్పటికి లభించుచున్న సూక్ష్మదర్శిని యంత్రసాయమున పాలు, ద్రాక్షారసము పులియుటకు

'యీస్టు' అనే పేరుగల యొకవిధమైన సూక్ష్మక్రిమి (yeast fungus) కారణమని కనుగొనెను. పదార్థము కుళ్లి నప్పుడందులో నతిసూక్ష్మజీవ జంతువులు కనుపించినది. ఈతని కాలములోనే గొఱ్ఱెలమందలో ఏంత్రాక్సు అనెడు సాంక్రామిక రోగము ప్రవేశించి వేలాదిగా గొఱ్ఱెలు చనిపోవుచుండెను. డాక్టరు పేస్ట్యూర్ ఆలోచించి తెవులు తగిలిన వాటిని వేరుచేసి మిగతా వాటిని రక్షించెను. తెవులుతగిలిన జంతురక్తములను భూతయద్దముతో (మైక్రోస్కోపుతో) పరీక్షించి ఏంత్రాక్సురోగ క్రిమిని కనిపెట్టెను. ఈవిషయము లను వినిన డాక్టరు కాక్ (Koch) గారు బెర్లిన్ పట్టణ క్షయ రోగుల ఆస్పత్రిలో రోగుల కళ్లెలో క్షయక్రిములను చూడ గలిగెను. ఈ రోగక్రిములను వేరుచేసి, వృద్ధిచేసి అనేక జంతుపక్షులపై పరిశోధనలుజరిపి కొన్నిసిద్ధాంతములను చేసెను. కాక్సిద్ధాంతములు నేటికిని (Kocks Postulates) శాస్త్ర పరిశోధకులకు శిరోధార్యములుగా నున్నవి. అటుపిమ్మట వరుసగా ప్రతిరోగమునకు సూక్ష్మక్రిమి కారణమును వెదుక జొచ్చిరి. ఇప్పటికి చాలరోగములు సూక్ష్మక్రిముల కారణముగ సంభవించుచున్నవని నిశ్చయించడమయినది. ఈ సూక్ష్మక్రిమి సిద్ధాంతము అదివర కాచరణలోనున్న చికిత్సా శాస్త్రమునంతను తారుమారొనర్చినది. రోగహేతువు తెలియకుండ వ్యాధి నయముచేయుట కిచ్చిన చికిత్సకు (అనుభవ చికిత్సకు) ఎంపెరికల్ ట్రీట్‌మెంటు అందురు. ఇట్టిచికిత్సా ద్రవ్యముల నన్నిటిని యనుమానదృష్టితో చూచుచు వాటి యందలి క్రిమి సంహారణశక్తి పరిశోధన పూర్వకముగా ఋజువైనగాని రోగులకిచ్చుట అశాస్త్రీయముగా నెంచ

బడెను. క్రిమి సంహారకశక్తి నిరూపించబడిన ద్రవ్యములను ప్రయోగించుటకు రేషనల్ లేక సైన్‌టిఫిక్ ట్రీట్‌మెంటు (Rational or scientific treatment) శాస్త్రీయచికిత్స యందురు. రోగనిదానము, దూష్యజ్ఞానము, దోషహరణ చికిత్సలతో కూడిన నిశ్చితజ్ఞానముతో చేయబడునదిగాన అల్లోపతి వైద్యమును సైంటిఫిక్ మెడిసిన్ అనికూడా యందురు. సూక్ష్మక్రిమి సంహారణోపాయములను కనుగొన్న పిమ్మటనే 1687 సం॥లో లార్డులిస్టరు 'ది ఏంటిసెప్టిక్ సర్జరీ' విధానమును నిర్మించెను. క్రిమి నాశనోపాయములతో జరిగించిన కాన్పులలో బాలింతల మరణసంఖ్య అత్యద్భుతముగా తగ్గిపోయెను. ఒకటిన్నర శతాబ్దములు నిండని సూక్ష్మక్రిమి సిద్ధాంతముతో వృద్ధియైన అల్లోపతివైద్యమే యిప్పుడు ప్రపంచమందలి యన్ని దేశములవారిచే నాదరించబడు చున్నది.

అల్లోపతి వైద్యశాస్త్ర మభివృద్ధి జెందుట కన్య శాస్త్రము లెక్కువగా తోడ్పడినవి. అవి యవ్వి యనగా:- 1. భౌతికపదార్థ విజ్ఞానశాస్త్రము (Physics), రసాయన శాస్త్రము (Chemistry), జీవ విజ్ఞానశాస్త్రము (Biology & Biochemistry), శారీర విజ్ఞానశాస్త్రములు (Anatomy and Physiology), మానసికతత్వశాస్త్రము (Psychology) వృక్షశాస్త్రము (Botony) మొదలైనవి. వైద్య విద్యార్థులకు ముందుగా నీ శాస్త్రములందు పరిచయముండి తీరవలెను గనుక వీనికి పునాదిశాస్త్రము లనిపేరు. (Basic sciences for the student of medicine) ఈ శాస్త్రములలో నుత్తీర్ణులైన వారిని మాత్రమే వైద్య కళాశాలలో చేర్చ

కొందరు, ఇంకను మోడరన్ మెడిసిన్ వృద్ధిచెందుటను యీ శతాబ్దములో కనిపెట్టబడిన సూక్ష్మవస్తుదర్శిని, ఎక్సురే యంత్రములు, ఎలెక్ట్రిసిటి పరికరములు మొదలైనవి తోడ్పడి నవి. నేటి పాశ్చాత్యుల భౌతికశాస్త్రము లన్నియు వేగవేగ మున నూతనాంశములను చేర్చుకొనుచు ముందునకు సాగిపోవు చున్నవి. ఇవి ఎన్నటికి పూర్ణవంతము లగునో ఎవ్వరును చెప్పజాలరు. లోపవంతము లగుటనే సందేహ విషయముల నిశ్చయించుటకు పరిశోధనలు చేయుటయును, అంగీకృత విషయములను చేర్చుకొనుటయును నిరంతరముగా జరుగు చున్నవి. ఈ విధమగు కృషికి (Progress in Science) శాస్త్రాభివృద్ధి యందురు. నాలుగువేల యేండ్ల క్రిందట అగ్నివేశమహర్షి చేత నిర్మించబడిన ఆయుర్వేదశాస్త్రము నేటికిని యదే స్థితిలో నిలిచియున్నది. ఈలోపున బుద్ధిమంతు లెవ్వరును యందలి లోపములను గుర్తించి తొలగించుటకాని క్రొత్త సిద్ధాంతములను ప్రవేశపెట్టుటకాని సంభవించ లేదు. దీనికి కారణమేమి? దేశములో అగ్నివేశుని కాలమునుండి నేటివరకు నంతటి బుద్ధిమంతులు జనించలేదా? యనిన ఆయుర్వేదశాస్త్రము స్థిర పునాదులపై నిర్మించబడి సత్య సిద్ధాంతములతోకూడి సమగ్రమును, సర్వ సంపూర్ణమునై యున్నదని సమాధానము చెప్పగలము. సిద్ధాంతముల విష యమున నెవ్వరికిని సందేహము లేదు గాని వానిని సరిగా నర్థము చేసికొని గ్రహించవలసియున్నది. ఇందుల కన్య శాస్త్ర పరిజ్ఞానము (షడ్దర్శనజ్ఞాన) మవసరము. ఆయుర్వేద నిదానము ననుసరించి చేయవలసిన చికిత్సల గురించి సందే హించ నవసరములేదు. అయినను వాటి యనుష్ఠానమే ప్రాశ

స్థ్యమును ఋజువు చేయగలదు. కాన ఆయుర్వేదము యభివృద్ధి చెందకుండ పుట్టినది పుట్టినట్లుగా నిలిచిపోయినది, గాన నుపేక్షించదగినది యని చెప్పుట సాహసమే యగును. చికిత్సాద్రవ్యములలో కాలానుగుణముగా లభించిన క్రొత్త వాటిని చేర్చుకొనుచునే యున్నది. ఇట్లే అన్య వైద్య శాస్త్రములోని చికిత్సా ప్రక్రియలను, యంత్ర పరికరముల యుపయోగమును, చికిత్సాద్రవ్యములను వాడుకొనుటకును ఎట్టి యభ్యంతరము లేదు. కాని ఆ ప్రక్రియలు, చికిత్సాద్రవ్య గుణములు త్రిదోషాను బద్ధములుగా నుండునటుల చూచుకొని మరియు వాడవలెను.

నేటి పాశ్చాత్యుల భౌతిక విజ్ఞానశాస్త్రము లన్నియు నింకను అసంపూర్ణములుగా నున్నవని చెప్పిన పాశ్చాత్యుల వైద్యశాస్త్ర విషయము వేరుగా చెప్పవలెనా? ఇట్టి అసంపూర్ణ శాస్త్రములతో పూర్ణవంతమయిన యాయుర్వేదమునకు పొత్తుకలిపి (తారతమ్యములను) సాదృశ్య వైదృశ్యములను పరిశీలించుట హాస్యాస్పదమే యగును. అసంపూర్ణములయ్యును యిప్పటికున్న పాశ్చాత్యుల శాస్త్రవిజ్ఞాన విషయములతో నాయుర్వేద విషయములను సరిచూడమని యందురా, దానికెట్టి యభ్యంపరము లేదు. కాని రెండు వైద్యశాస్త్రములందును కనిపించిన సమాన విషయములను మాత్రము శాస్త్రీయములని పరిగ్రహించి, నేటి పాశ్చాత్య విజ్ఞాన విషయములకు కొంచెము విరుద్ధముగా కనిపించిన వాటిని, పాశ్చాత్యులకు అసలు తెలియని క్రొత్త విషయములను అశాస్త్రీయములని విడిచిపెట్టుట చాల పొరపాటు. పాశ్చాత్య విజ్ఞాతల కందరాని విషయములను ఆయుర్వేద

సాంప్రదాయాను సారముగా తెలిసికొనుటకు ప్రయత్నించవలెను. పరస్పర విరోధములుగా కన్పించిన వాటిని బుద్ధిమంతులు సమన్వయము చేయుటకు యత్నించవలెను.

శాస్త్ర నిర్మాణ పద్ధతులు (Scientific Methods) పాశ్చాత్యుల భౌతికశాస్త్రము లన్నియు పలువురు మేధావంతుల పరిశీలన (observation) పరిశోధనలతో (experiments) నిర్మింప బడినవి. ప్రకృతి కార్యములను పరిశీలించునప్పుడు కొన్ని సందేహములు పుట్టుచుండును. నూతనముగా వింత యాలోచనలు కలుగవచ్చును. తమకు పుట్టిన యాలోచనలు సందేహములు పరిశోధనలు చేయుటకు హేతువులుగనుండును. కొన్ని సందర్భములలో జన వాక్యములు (traditions ond beliefs) బుద్ధిమంతులచే పరిశోధనలు చేయించుటకు పురికొల్పుట కలదు. ఒకరు పరిశోధన పూర్వకముగా కనిపెట్టిన క్రొత్త విషయము నింకొక పరిశోధకుడు పునఃపరిశీలించుట కూడ గలదు. శాస్త్రకారుల సత్యాన్వేషణ బుద్ధియే (Spirit of discovery of truth) పాశ్చాత్యుల విజ్ఞాన శాస్త్రము లభివృద్ధి చెందుటకు కారణమయినది. సత్యవిషయములతో కూడినది శాస్త్రము. పాశ్చాత్య దేశస్థులు మొదట గ్రీకులనుండి వైద్యశాస్త్ర జ్ఞానమును సంపాదించినప్పుడు పునాదులుగా నుండిన సిద్ధాంత భాగములు లుప్తమయినవి. ఈ వైద్యజ్ఞానము ప్రజలలో వ్యాపించిన పిమ్మట నందులో వారి మత, యాచార, మూఢ నమ్మకములు ప్రవేశించ దొడగినవి. 16 వ శతాబ్దమున అన్య శాస్త్ర జ్ఞాన మభివృద్ధి చెందగానే శాస్త్రదృష్టిగల బుద్ధిమంతులు అప్పటికి వ్యాప్తిలో నుండిన వైద్యశాస్త్రమును

సంస్కరించుటకు మొదలిడిరి. పరిశోధనలకు నిలిచి సత్యవిష యములని ఋజువైన వాటిని మాత్రము గ్రహించుచు మతా వేశ, దుష్టాచార, మూఢ విషయములను శాస్త్రములో నుండి తొలగించిరి.

సత్యాన్వేషణకొఱకు పరిశీలన పరిశోధనక్రియ లాచ రించుచు ప్రత్యక్ష ప్రమాణముపై నాధారపడుచుండిరి. అను మాన ప్రమాణము, యుక్తి లేక తర్క (logic) ప్రమాణ మునుకూడ కొంతవర కంగీకరించిరి. ఆప్తవాక్యములను ప్రమాణముగా నంగీకరించ లేను. సత్యవిషయమును నిర్ధారణ చేయుటకు పాశ్చాత్య శాస్త్రజ్ఞులు మూడురకముల పద్ధతుల ననుసరింతురు.

(1) సాదృశ్యములను చర్చించుట = Analogical reaesoning అనగా సమానపోలికలను గుర్తించి నిర్ధారణ చేయుట

(2) వేర్వేరు విషయములందలి సామాన్యత్వమును నిరూపించుట. Induction reasoning.

(3) ఏకత్వములోనుండి భిన్నత్వమును నిరూపించుట Deduction reasoning (విశేషత్వము) చివరి రెండుపద్ధ తులు పరిశోధకులకు ముఖ్యములు

ఒకడు ఊహించిన విషయమందలి (hypothesis) సత్యమును నిరూపించుటకుగాను చేసిన పరిశోధనలో తాసను కొన్న ఫలితము సరిగావచ్చిన మొదట తనకుకలిగినయూ హాయే యిప్పుడు సిద్ధాంతముగా ప్రకటించబడుచున్నది. అది సత్యసిద్ధాంత మనుటకు వీలుకాదు. తాత్కాలిక సత్యముగా

నుండును. పలువురు పరిశోధకుల యనుభవము లొకేవిధ ముగా నుండినప్పుడే యది సత్యసిద్ధాంతము కాగలదు *నేటి పాశ్చాత్య శాస్త్రములన్నియు సత్యసిద్ధాంతములని చెప్పుటకు వీలు కాదు. అన్ని విషయములందును నూలంకష ముగా సిద్ధాంత మొనర్చి రనుటకు వీలుకాదు కాననీశాస్త్రముల సంపూర్ణములని చెప్పవలెను. అందుచేతనే నూతనవిష యములను పరిశోధనలుచేయుచు, సత్యములని నమ్మినవాటిని చేర్చుకొనుచునే యున్నారు.

హైందవ శాస్త్ర నిర్మాతలు సత్యజ్ఞానము సంపాదిం చుట కవలంభించిన పద్ధతులు:- (The Hindu Scieetific method to get a Correct Knowledgo of a thing.)

హైందవ ఋషులు విషయ నిర్ధారణ కొఱకు ఆరు రకముల ప్రమాణములను గైకొనిరి.

(1) ప్రత్యక్ష ప్రమాణము - Direct observation and Perception.

(2) అనుమాన ప్రమాణము - Logical inference by the methods of induction and deduction.

(3) శబ్ద ప్రమాణము - This is ఆప్తవాక్య ప్రమా ణము. from a reliable Source, be it from a man or ancient scriptures ie Vedas.

*"No one claims perfection for the Western science of Medicine. I can even concieve that it will never reach perfection. Of all the sciences, Medidine is the most defeetive".

*Dr. S. R. Gore*

(4) ఉపమాన ప్రమాణము- Analogical inference.
(5) అర్థాపత్తి- Perception.
(6) అభావము - Privation.

సాంఖ్యులకు మొదటి మూడును చాల ముఖ్యములు న్యాయశాస్త్రకారులు నాల్గవ ప్రమాణమును చేర్చిరి. చివరి రెండు ప్రమాణములును మీమాంస దర్శన శాస్త్రజ్ఞులు గ్రహించిరి. ఆయుర్వేద శాస్త్రజ్ఞులు సాంఖ్య న్యాయమతము లంగీకరించిరి గాన ప్రత్యక్షానుమాన శబ్ద ప్రమాణముల ననుసరించి విషయ నిర్ధారణము గావించుచు వచ్చిరి. వీనిలో పూర్వ పూర్వ ప్రమాణముల కంటె ఉత్తరోత్తరా ప్రమాణములు బలవత్తరములుగా నెన్నబడెను. కనుక శబ్ద ప్రమాణము హిందువులకు చాల ముఖ్యమైనది. ఇచ్చట శబ్దమనగా వేదములు. ఒక విషయము వేదములలో నున్నదనగానే దానిని ఆప్త వాక్యముగా పరిగణింతురు. ప్రత్యక్షము కాని విషయములను అనుమాన ప్రమాణము ద్వారా నిశ్చయింతురు. ఇట్టి విషయమును వేదములు కూడ నిరూపించినచో నది సందేహ రహిత మగును. ప్రత్యక్ష విషయములు సత్యములే కావచ్చును. *ఒకప్పుడు ప్రజ్ఞాలోపము వలన నీ విధముగా లభించిన జ్ఞానము సందేహాస్పదము కూడ కావచ్చును. ఏల యన ప్రజ్ఞకు మేర లేదు. కాన కేవలము ప్రజ్ఞ మీద నాధారపడిన ప్రత్యక్షానుభవ జ్ఞానము నిలుకడ గలిగిన సత్యమని చెప్పజాలము. 1 కనుక సత్య విషయములను

* "Logical inferincial reasoning in both its aspects (indentive aad deductive) can never get rid of doubt as to the absolute truth and soundnese of its conclusions" Lord Belfor's (Defence of philosophical doubt).

నిరూపించుటకై పాశ్చాత్త్యు లవలంభించిన మూడు రకముల పద్ధతులు లోప భూయిష్ఠము లగుట వలన తద్వారా నిశ్చయ మొనర్చిన విషయములు నిత్య సత్యములుగా పరిగణించ వీలులేదు సందేహములతో కూడినవిగనే యుండును. కను కనే పునః పునః పరిశీలన మవసరము లగుటయు వాటిని సరి దిద్దు కొనుటయు సంభవించుచున్నది.

ఆయుర్వేద తంత్ర కర్తలు పైన వివరించిన నాలుగు ప్రమాణముల ననుసరించి విషయ నిర్ధారణ గావించియుండిరి.

పాశ్చాత్యవైద్యవిద్యార్థులకు ప్రవేశార్హతగా పునాది శాస్త్రజ్ఞానము (బేసిక్ సైన్సు) మవసరమని చెప్పినట్లు ఆయుర్వేద విద్యార్థికి ప్రవేశార్హతగా షడ్దర్శనజ్ఞాన మత్యవ సరమని మనవారు విధించిరి. షడ్దర్శన శాస్త్రములు పదార్థ విజ్ఞానమును బోధించుచున్నవి. అవి యవ్వియనగా 1. న్యాయ శాస్త్రము. 2. వైశేషికశాస్త్రము 3. సాంఖ్యశాస్త్రము 4. తర్కశాస్త్రము 5. పూర్వమీమాంస 6. ఉత్తర మీమాంసశాస్త్రములు. ఆయుర్వేద విద్యార్థికి న్యాయ, సాంఖ్య, తర్కశాస్త్రములు ముఖ్యములు. మీమాంస శాస్త్రము వేదాంతుల కవసరమగును. వైశేషికశాస్త్రము న్యాయశాస్త్రమునకు విరుద్ధముకాదు. దానిని మరింత విస్త రించును. చరక సుశ్రుతులు న్యాయ, సాంఖ్యశాస్త్రములను, తర్కవాదము ననుసరించి విషయములను వ్రాసిరి. మరియు హిందు, జైన, బౌద్ధ, చార్వాక మతసాంప్రదాయము లనుకూడ గ్రహించిరి. వేదాంతమతమునకు భిన్నముగా జీవుడు అసర్వగతుడు, గుణుడు, కర్త, భోక్త, అని చెప్పి స్వతంత్ర విశిష్టమార్గమును బోధించిరి. 1. Though

perhaps in arts like singing and painting national taint may be excusceble, it cannot be maintained in Sciences which have a practical bearing"—*Dr. S. R. Gore* అని చెప్పిన గోరే గారి అభిప్రాయముతో నేకీభించజాలము. ఏలయనగా ఆయుర్వేదమును శాస్త్ర మనుటయే కాదు ఆర్టు (Art) కళ యని కూడ చెప్పవలెను. ఈ కళలో ప్రజాభిమతములు, అభిరుచులు కూడ ప్రవేశించినవి. ఇంకను జ్యోతిశ్శాస్త్ర విషయములు, మంత్రశాస్త్రము, యోగ వ్యాయామ శాస్త్రములతో సంబంధమును కలిగియున్నది.

ఇక నాయుర్వేద శాస్త్రములో ప్రతిపాదించబడి మనకు విమర్శనాంశములుగా నున్న విషయము లెవ్వి యన:

1. ఆయుర్వేద మూల సిద్ధాంతములు=fundamental Principles of Ayurvedic science.

2. శారీరవిజ్ఞానము=Anapomy, Physiology and embryology.

3. రోగనిదానము=etiology, Pathology, signs and symptoms and diagnosis.

4. చికిత్సా ద్రవ్య విజ్ఞానము=Materia Medica.

5. చికిత్సా పద్ధతులు=Principles and methods of treatment of diseases.

ఈ చెప్పిన విషయముల నొక్కొక్కటిగా విమర్శించి ఆధునిక శాస్త్రములతో నెంత వరకు నొప్పుచున్నవో తెలిసికొందము.

## 2. అధ్యాయము - పంచభూత సిద్ధాంతము.

పాశ్చాత్యుల భౌతికద్రవ్య విజ్ఞానము సృష్టిద్రవ్యములతో నారంభమయినది. సృష్టిపదార్థమును మేటర్ అందురు. కొన్నియణువుల సంధానముతో ద్రవ్య మేర్పడుచున్నది. ద్రవ్యాణువును ఎలిమెంటు (elimont) అని చెప్పుదురు. ప్రపంచములో కన్పించిన యన్నిరకముల యణువులను లెక్కించగా (on the basis of similarity) నేటికి 104 ఎలిమెంట్సు కన్పించుచున్నవి. 50 సం॥రముల క్రిందట సుమారు 80 ఎలిమెంట్సు మాత్రమున్నవని చెప్పిరి. క్రొత్త ఎలిమెంట్సును కనుగొనినప్పుడెల్ల సీజాబితాకు చేర్చుచునే యున్నారు. ఈ సంఖ్య యింకెంతవరకు పెరుగగలదో ఎవ్వరు చెప్పగలరు? ఈ 104 ఎలిమెంట్సులోను 1 ఆక్సిజన్ 2 హైడ్రోజన్ 3 నైట్రోజన్ 4 కార్బన్ 5 ఈథర్, యీ అయిదును జాంతనపదార్థముల సృష్టికి తోడ్పడుచున్నవి. వృక్ష మనుష్య దేహములలోకూడ నితర ఎలిమెంట్సుతో కలిసియున్నవి. గనుక నింతముఖ్యములైన అయిదు ఎలిమెంట్సును పంచభూతములని మనవారు కొందఱు తర్జుమాచేసియున్నారు. 1 ఈథర్‌ను ఆకాశభూతమనియు, 2 నైట్రోజన్‌ను వాయుభూతమనియు, 3 ఆక్సిజన్‌ను తేజోభూతము లేక యగ్నిభూతమనియు, 4 హైడ్రోజన్‌ను అప్‌భూతమనియు, 5 కార్బన్‌ను పృధీవీభూతమనియు తేలికగా చెప్పినారు. కాని యిది సరియగునాయని నాసందేహము

ఎలిమెంటును అణువుఅని చెప్పవచ్చును. అణుభాగము

నకు ఏటమ్‌యందురు. ఇదియే పరమాణువు. ద్రవ్యము మొదలుకొని, అణువు పరమాణువు వరకును పాంచభౌతిక ద్రవ్యమని చెప్పనోవచ్చును. పరమాణువును ఏటమ్‌అని వ్యవహారింతురు. ఏటంలోని భాగములనుకూడ కనిపెట్టి వాటి గుణధర్మములను నేటిశాస్త్ర పరిశోధకులు వర్ణించుచున్నారు. పంచభూతములు కంటిద్వారగాని మరే యింద్రియసాయమున గాని తెలియరాని స్థితిలో నున్నవి. అయిదు భూతములు కలిసికొనినప్పుడే పదార్థమేర్పడి ఆకారమునుకలిగి కనిపించు చున్నది. పంచభూతములు వేర్వేరుగా నున్నప్పుడవి మనకు గోచరములుకావు ఒకద్రవ్యములో చేరియుండిన పంచభూతములయొక్క గుణములను మన పంచజ్ఞానేంద్రియములు గ్రహించగలుగును. ఈగుణ పరిమితులనుబట్టి ద్రవ్యమందలి పంచభూత పరిమితులను నిశ్చయించి సృష్టిద్రవ్యములన్నియు పాంచభౌతికములని సిద్ధాంతమొనర్చబడినది. గనుక పాశ్చాత్యులు చెప్పిన ఎలిమెంట్సు ద్రవ్యాణువులు, పరమాణువులు (ఎటమ్సు), ఏటమ్‌లోని అంశలుగాని పంచభూతములనుటకు వీలుకాదు. ఇవి అన్నియు పాంచభౌతిక ద్రవ్యములే యగును. ఇక ఈథర్, ఆక్సిజన్, హైడ్రోజన్, నైట్రోజన్, కార్బను లను పాంచభౌతిక ద్రవ్యము లనవలెనేగాని యివే పంచభూతములనుటయు సరికాదు. సాంఖ్యశాస్త్రము అవ్యక్త స్థితిలో నుండిన మూల ప్రకృతిలోనుంచి పంచభూతములు పరిణమించిన విధమును బోధించుచున్నది. నేటి అణు నిర్మాణ పరిశోధకుల పరమలక్ష్యము అవ్యక్తస్థితిలోనుండిన పంచభూతములను గుర్తించుటయే యగును.

## ద్రవ్యము = Matter.

50 సం॥రముల క్రిందట ద్రవ్యమును నిర్వచించు నప్పుడు "రూపము, స్థలాక్రమణము, సాంద్రత, గురుత మొదలైన లక్షణములు గలది" ద్రవ్యమని అని చెప్పిరి. నేడు *" ఇంద్రియముల ద్వారా ననుభవించగల విషయ సంపత్తి గలిగిన ప్రతి పదార్థము ద్రవ్యమగును. పదార్థ విజ్ఞానము అనుకూల స్థితిలోనున్న ప్రతి వారికి అనగా విషయ గ్రహణ సామర్థ్యమున్న ప్రతివారికి కలుగుచున్నది" అని సర్ జేమ్సు జీన్సుగారు చెప్పినారు. ఈ ఆధునిక ద్రవ్య నిర్వచనము హైందవుల ద్రవ్య నిర్వచనమునకు సమీపముగా నున్నది. ద్రవ్యమున కిదివరలో ఘనత్వ, ద్రవత్వ, వాయు రూపక స్థితులు మూడింటిని మాత్రమే పేర్కొనిరి. ఇప్పుడు జీన్‌గారి ద్రవ్య నిర్వచనము ననుసరించి పంచేంద్రియములకు అనుకూలముగా పంచ స్థితు లున్నవని నిశ్చయించినారు. చేర్చి - ఘనత్వము, ద్రవత్వము, వాయుత్వ స్థితులకు మరి రెండు స్థితులు అనగా భాసత్వము (గేడియంటుస్టేట్) ఆకాశత్వము (ఈథరిక్ స్టేట్) అని పేర్కొంచిరి.

సృష్టిలో ద్రవ్యములు చాలవాటికి ఆకారములున్నవి. కొన్నిటికి రూపములేకుండ తమగుణధర్మములను ప్రకటించుట ద్వారా వాటియునికిని యొప్పుకొనుచున్నాము. ఏలెక్ట్రిసిటి

---

* Matter may be defired as that which is capable of originating objective sensations which can be percieved by any one who is suitably conditioned to receive them-as for instance by sending rays of light into our eyes".

(*Sir James Jean*)

(విద్యుత్) చుంబనశక్తి (grasirty & magnetism = ఆకర్షణములను ద్రవ్యములనియే చెప్పవలెనుగాని గుణములనుటకు వీలుకాదు. ఇట్లేవెలుతురు, కాలము, దిక్కులు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఆత్మ, పంచభూతములను ద్రవ్యములనియే చెప్పవలసియున్నదిగాన హైందవ శాస్త్రజ్ఞులు ప్రాపంచిక ద్రవ్యములన్నిటిని యిముడ్చుకొనునటుల ద్రవ్య శబ్దమును నిర్వచించి యున్నారు. అదేమనగా-*"యత్రాశ్రితాః కర్మగుణాఃకారణం సమవాయియత్ తద్ద్రవ్యం. (చరకసంహిత) ఈ నిర్వచనము ప్రకారము ప్రాపంచిక ద్రవ్యములన్నిటి సృష్టికి మూలద్రవ్యములు తొమ్మిదిమాత్రమేయని చెప్పిరి. అవేమనగా:-

"పృథివ్యాప్తస్తేజో వాయురాకాశః కాలోదిగాత్మా మనఇతి ద్రవ్యాణి" (వైశేషికదర్శనం 1 అధ్యా, 1 అహ్నిక 5 సూ.) 2 క్షిత్యప్ తేజో మరుత్ వ్యోమకాలదిగ్ దే హినో మనః, ద్రవ్యాణి" (కారికావళి)

3 "తత్రద్రవ్యాణి పృథివ్యప్ తేజో వాయ్వాకాశకాల దిగాత్మ మనాంసిననైవ" (తర్కసంగ్రహం) ఈ తొమ్మిది మూల ద్రవ్యములలో ఆత్మ, మనస్సు, దిక్కుకాలమునకు అణు విభాగములేదు. ఇవి భావనాద్రవ్యములు. మిగిలిన ప్రాపంచిక ద్రవ్యములన్నియు పాంచ భౌతి కాణువులయొక్క

* "A paramanu is a type of atoms coresponding to each Bhuta class, and includ one and the same kind of paramanu may comprehend atoms of different masses, if only they agrea in their structural type".

Seali Positive Sciences of the Hindus 1415 P. 40

సంధానమువలన నేర్పడినవి. గనుక పాశ్చాత్యులు గణించిన 104 ద్రవ్యాణువులు పరమాణువులు, వీటియంశలు యంత్ర సాయముతో చూడగలిగినంతవరకు పాంచభౌతిక ద్రవ్యములే యగును. పాశ్చాత్యులు గుణసారూప్యము ననుసరించియు (Basing on Dissimilarity) మనవారు గుణవిభిన్నత్వ పద్ధతిని, ద్రవ్యపరిగణనము చేసిరి.

---

# 3 వ అధ్యాయము

## త్రిదోష సిద్ధాంతము

1. సూ॥ దోషధాతుమలమూలమ్ హి శరీరమ్।

సుశ్రుత. సూత్ర 1 అధ్యా 13 సూ.

2. సూ॥ వాతపిత్త శ్లేష్మాణ ఏవదేహ సంభవహేతవః।
తైరేవ అవ్యాపన్నై రధోమధ్యోర్ధ్వ సన్నివిష్టైః
శరీరమిదం ధార్యతే ఆగారమివస్థూణాభి
స్తిసృభిర తశ్చత్రి స్థూణమాహు రేకే॥

సుశ్రుత. సూత్ర 1అ 3 సూ.

శ్లో॥ న ర్తే దేహః కఫాద స్తిన పిత్తాన్న చ మారుతాత్
శోణితాదపి వానిత్యం దేహతై ఏస్తుధార్యతే।

సుశ్రుత. సూత్ర 21అ. 4 శ్లో.

శ్లో॥ వాయుః పిత్తం కఫశ్చేతి త్రయోదోషా స్సమాసతః
వికృతాఽవికృతా దేహం ఘ్నంతి తేవర్త యంతిచ।
తేవ్యాపినోపి హృన్నాభ్యోరధోమధ్యోర్ధ్వ సంశ్రయః

అష్టాంగహృదయసూత్ర

శ్లో॥ వాయుఃపిత్తం కఫశ్చేతి త్రయోదోషా స్సమాసతః
పాదాది నాభిపర్యంతం వాయునాఽశ్రయతే సదా।
నాభ్యాది హృదయాంతంతు పిత్తస్థానం విశేషతః
హృదాది శిరసోంతంచ కఫస్థాన మిహోత్తరం।

ఆయుర్వేద శాస్త్రము వాతపిత్త కఫములనెడు మూడు ద్రవ్యముల నాధారముగా చేసికొని నిర్మింప బడినది. సర్వ ప్రాణుల దేహములను ధరించి శరీరపోషణము గావించుచున్న

వాతపిత్తకఫములు, రసరక్తమాంసమేదోఽస్థిమజ్జాశుక్రము లైన సప్తధాతువులతో కలసి దశధాతువు లగుచున్నవి. అన్నపచనము గావించి, యారసమునుండి రక్తాది ధాతువుల నిర్మించి, వాటిని పోషించుచు, దేహేంద్రియములయొక్క సర్వవ్యాపారములను సక్రమముగా జరిపించునవి వాతపిత్తకఫ ములు. ఈసామ్యావస్థలో వీనిని త్రి ధాతువులని యందురు. కొన్ని బాహ్యాభ్యంతర కారణములవల్ల నివి దూషితము లై తమ సౌజన్యమును కోల్పోయి రసరక్తాది ధాతువులను చెఱిచి బాధలను కలిగించుచున్నవి. ఈదూషితావస్థలో నాత్రిధాతు వులనే త్రిదోషములని వ్యవహరించు చున్నాము. కనుక నాయుర్వేద శాస్త్రములో వాతపిత్తకఫములు శరీరపోషణ కును వ్యాధులను పుట్టించుటకును కూడ చాల ప్రధానము లుగా నున్నవి. గ్రీకుదేశము నుండి గ్రహించిన ఐరోపియ నులు గ్రీకుల హ్యూమరల్ సిద్ధాంతమును గ్రహించలేక వీనిని విడిచి వాతాదులు దూషింపబడుటకు ప్రత్యక్షములుగా కన బడుచున్న బాహాభ్యంతర కారణములే రోగములు కలుగు టకు ప్రధాన హేతువులని నమ్ముచున్నారు. మరియు కొన్ని సాంక్రామిక వ్యాధుల విషయమున 1645 సం॥ రములో సూక్ష్మక్రిములను కనుగొన్న పిమ్మట 1687 లో క్రిమిసిద్ధాంత వాదము స్థిరపడినది. నేడు మనుష్యులకు లభించు రోగము లలో నూటికి 80 వంతు రోగములకు కొన్ని సూక్ష్మక్రిములే ప్రధాన కారణములుగా నెన్నబడు చున్నవి. రోగుల శరీర ములలో కొన్ని సూక్ష్మజీవులను హైందవులు కూడ కని పెట్టియే యున్నారు. ప్రేగులందలి స్థూల క్రిములనే గాక రక్తము, కళ్లె, మలమూత్రములు చెమటలో పుట్టుచున్న

సూక్ష్మక్రిములను కూడ ఆయుర్వేద కర్తలు వర్ణించి యున్నారు. ఇవి రోగుల శరీరములో పుట్టుచున్నవే గాని రోగములను పుట్టించుటకు ప్రధాన కారణములుకావు అని మనవారి నమ్మకము. అధర్వణవేదములో కుష్ఠు, క్షయ, తక్మజ్వరములకు సంబంధించిన సూక్ష్మక్రిములు, యింకను గాలి, నీరు మట్టిలో కనిపించు సూక్ష్మక్రిములను వివరించిరి. ఈసూక్ష్మక్రిముల విజ్ఞానము శౌచవిధి నాచరించుటకు తోడ్పడునేగాని ఆయుర్వేద చికిత్సావిధానమునకు పనికి రాదు. కనుక నీక్రిమి సిద్ధాంతమునకు ప్రాముఖ్య మియ్యక విడిచిపెట్టి, ఆయుర్వేద కర్తలు త్రిదోష విజ్ఞానానుసార ముగా రోగ నిదాన చికిత్సలు నిర్మించుకొనిరి. కనుక నాయుర్వేద వైద్యునకు త్రిదోషములు ప్రధానములైనవి.

మోడరన్ మెడిసిన్ చదివిన అల్లోపతి డాక్టర్లు వాత పిత్త కఫములు ద్రవ్యములా? శక్తులా? ద్రవ్యములైనయడల శవచ్ఛేదనలోగాని, జీవశరీరములను కోసినప్పుడుగాని కన్పిం చునా? వాటి భౌతిక రసాయన ధర్మములను గుర్తించ గలమా? అని ప్రశ్నలను వేయుచుందురు. పంచభూతముల జ్ఞానములేనివారు యివి పాంచ భౌతిక ద్రవ్యములని చెప్పిన గ్రహించుటెట్లు? సృష్టిలో ద్రవ్యములు స్థూలములు (యింద్రి యములకు గోచరించునవి) సూక్ష్మములు (యింద్రియముల కగోచరములు) ఉన్నవను విషయమును నమ్మరు రా? హైందవుల ద్రవ్యనిర్వచనము పాశ్చాత్యులు చేసినదానికి భిన్నముగా నున్నదని తెలిసికొని హైందవదృష్టితో వాతాదు లను విమర్శించునప్పుడుగదా వాటిని గురించిన జ్ఞానమును వారు గ్రహించగలుగుదురు.

ఆయుర్వేద గ్రంథములలో నొక్కచోట త్రిదోష విజ్ఞానము చర్చింపబడలేదు. ఈవిజ్ఞానము సందర్భానుసారముగా చర్చింపబడినది. దానినంతను క్రోడీకరించి సాకల్యముగా చర్చించుటవసరమే యగును. ఈవిధముగా కృషిచేసిన పాశ్చాత్య వైద్యప్రవీణులైన కవిరాజగణనాధసేను, డాక్టరు ధీరేంద్రనాద్ రె, డాక్టరు డి. ఎన్. బెనర్జీ పండితుల యభిప్రాయములు మనకు చాల ముఖ్యములు.

## త్రిదోషములు పాంచభౌతిక ద్రవ్యములు

శక్తి, గుణములు ద్రవ్యము నాశ్రయించుకొనియున్న ధర్మములు. ప్రత్యేకముగా వానికి యునికి లేదు. వాతపిత్తకఫములకు కొన్ని గుణలక్షణములు చెప్పబడుటచే నివి తప్పక పాంచభౌతిక ద్రవ్యములే యగును. ఆయుర్వేద వైద్యానికి యీవిషయమున సందేహములేదు. పాశ్చాత్య వైద్యము నవలంభించిన సోదరుల సందేహనివృత్తి కొఱకు యధాశక్తిగా ప్రయత్నించితము.

## 1. వాతము

కొన్నిరకముల నాడి తంతువులద్వారా సంచరించుచు కండలను చలింపజేయుచు సర్వకార్యములను చేయించుచున్న ఎలక్ట్రిసిటి వంటి ద్రవ్యమని స్థూలముగా చెప్పిన కొంతవరకు బోధపడగలదు. దీనిని నెర్వస్ ఫోర్సు లేక నెర్వస్ ఎనర్జీ యని చెప్పుదురు. కాని చరకుడు వాతమును అభ్యంతరవాయువని చెప్పెను. అనగా శరీరములోపల సంచరించుచున్న గాలి యని యర్థము. కాని బాహ్యవాయువు కంటెను భిన్నమయి

విశేష శక్తులతోకూడి గాలిని బోలిన ద్రవ్యమని చెప్ప వలెను. ఇది పాంచభౌతికము. పాంచభౌతిక శారీరధాతువు లన్నియు పాంచభౌతికాహారాంశల చేతను పోషింపబడు చున్నటుల శరీరగత వాయుధాతువుయొక్క నిర్మాణమునకు ఆహారమందలి పంచభూతములే తోడ్పడుచున్నవి. *అందును ముఖ్యముగా వాయ్వాకాశభూతాంశ లధికముగా చేరుటవలన సూక్ష్మద్రవ్యముగా నుండును. అనగా కంటికి కనిపించునది కాదు. గాలివలెనే తానుచలించుచు నితరవస్తువులను చలింప జేయు శక్తివంతమై దేహేంద్రియ వ్యాపారములను చేయించు చున్నది.

*వాతముయొక్క భౌతికలక్షణములను రూక్ష, లఘు విశద, శీత, ఖర, సూక్ష్మ, చల గుణములు అని చెప్పిరి. ఇది యోగవాహి- అనగా నుష్ణశీత గుణములను వహించు చుండును. వాయు భూతాంశలతోనే పుట్టి వాయురూపము గలది. అని వర్ణించిరి.

---

1. *వాయుః శరీరాంభకేషు పంచేషు భూతేషు యద్వితీయంభూతం, తత్ పరిణామ విశేషః సస్వాఏవ

(చరక. సూత్ర 1.1.35)

2. తత్రవాయురాత్మైవాత్మా। పిత్తమాగ్నేయం। శ్లేష్మాసౌమ్యఇతి।

(సుశృత. సూత్ర. 40)

3. వాయ్వాకాశ ధాతుభ్యాం వాయుః। ఆగ్నేయం పిత్తం। అంభ పృధివీభ్యాం శ్లేష్మా।

అష్టాంగసంగ్రహ. సూత్ర. 20 అధ్యాయం.

4. తత్ర 'వా' గతి గంధనయోరితి ధాతుః। 'తప' సంతాపే, 'శ్లిష' ఆలింగనే।

సుశృత. సూత్ర. 27 అధ్యాయం

ఆహారపదార్థములందలి కటుతిక్త కషాయరసములు జఠరాగ్నిసంయోగమున కటువిపాకమును చెందగా పెద్ద ప్రేగులలోకి వచ్చిన కటువిపాక ద్రవ్యములోనుంచి వాతము పుట్టుచున్నది. ఇచ్చటనుండి సర్వశరీరభాగములకు వ్యాపించి నియమితముగా ప్రత్యేక కార్యములను చేయుచున్నందున ఆయాప్రాంతములందలి వాతమునకు ప్రత్యేకనామము లియ్యబడినవి. ఒకేవ్యక్తి వివిధప్రాంతములలో వివిధ హోదాలతో పనులను నిర్వహించుచున్నపుడతనికి వివిధహోదాల పేర్లు కలిగినట్లే వాతమున కయిదు ప్రదేశములలో నది చేయుచున్న కృత్యములనుబట్టి అయిదు విధములగు పేర్లను కల్పించిరి. అవేమనగా—

1. ప్రాణవాతము:- హృదయస్థానమునుండి వక్షము శిరస్సులలోకి సంచరించుచు గుండె కొట్టుకొనుట, ఉచ్ఛ్వాస నిశ్వాసలు, ఉన్మేషనిమేషములు, ఆహారపానీయములను మ్రింగుట, ఇంద్రియములు, బుద్ధికి చురుకునిచ్చుట మొదలగు కార్యములను చేయించుచున్నది.

2. అపానవాతము:- ఇది పెద్దప్రేగులలో గుదము

---

1 కార్శ్యం లాఘవం వైశద్యం శీతం గతి రమూర్తత్వం చేతి వాయో రాత్మ రూపాణి భవంతి।

చరక. సూత్ర. 10 అధ్యా. 12 సూ.

2 తత్ర రూక్షో లఘుశ్శీతః ఖర సూక్ష్మశ్చలోనిలః।

దేహతత్వ విచారము.

3 యోగవాహః పరం వాయుః సంయోగా దుభయార్థకృత్। దాహకృత్తేజసా యుక్తః శీతకృత్ సోమ సంశ్రయాత్।

చరక-చికిత్స 3 అధ్యా. 38 సూత్రం

నాశ్రయించియుండి పురీషమూత్రములను, ప్రేగులలోచేరిన దుష్టవాయువును, శుక్రము, రజస్సును, వెడలించి గర్భిణీ స్త్రీలకు ప్రసవ సమయమున బిడ్డను బయటికి త్రోసివేయును.

3. వ్యానవాతము:- ఇది సర్వశరీరమందును సంచరించుచు రస, రక్తాది ధాతువులను సర్వశరీరభాగములకు ప్రవహింపజేయుచున్నది. స్పర్శజ్ఞానమును కలిగించుచున్నది. చమట బట్టించును.

4. ఉదానవాతము:- ఇది కంఠప్రదేశ మందుండి మాట్లాడుట, దగ్గు, తుమ్ము మొదలైన కార్యముల జేయుచున్నది.

5. సమానవాతము:- నాభి ప్రదేశమందుండి జఠరాగ్నికి తోడ్పడుచు ఆహారమును సారకిట్టములుగా విభజించుచున్నది.

N. B:- ఇచ్చట చెప్పిన ప్రాణవాతమును ఆక్సిజన్ అని తర్జుమా చేయకూడదు. ఆక్సిజన్ వాయువునకు ప్రాణవాతమునకున్న క్రియాశక్తులు లేవు. ఆక్సిజన్ వాయువు తేజోభూతప్రధానమయిన పాంచభౌతిక వాయువగుటవలన లోహాది కఠిన పదార్థములను భస్మీకరణ మొనర్చును.

ఇట్లు అపానవాయువు శుద్ధమయినది మనకుపయోగించునదిగా నున్నది అజీర్తి చేసినప్పుడు ప్రేగులలోపుట్టి గుదము ద్వారా వెడలుచున్న గాలినికూడ అపానవాయువని చెప్పుదుము.

---

1 హృది ప్రాణో గుదేఽపానః సమానో నాభి సంస్థితః ఉదానః కంఠదేశస్థో, వ్యానః సర్వశరీరగః॥

శార్ఙ్గధరసంహిత.

ఇది దుర్వాసనతో కూడిన దుష్టవాయువు. $CO_2$ + $SO_2$ + Indol మొదలైన వాయువులయొక్క మిశ్రమము. దీనిని గుదముద్వారా వెడలించు కృత్యము పంచవిధ వాయువులలో అపానవాతమునకు చెందినది.

పాశ్చాత్యుల శారీరశాస్త్రము (Anatomny and Physiology) లలో చెప్పిన నెర్వ్సు వాతమును వహించు నాడులుగా (Nervecs) నున్నవి. ఈనాడులలోపల ప్రవహించుచున్న నెర్వస్ ఎనర్జియే ఆయుర్వేదములో చెప్పిన వాతము. పెద్దనెర్వ్సును వాటి శాఖలను ప్రాంతీయ నామములతో వ్యవహరించుచున్నారు. వాటి వ్యాపార స్వభావముల ననుసరించి నెర్వ్స లన్నిటిని ఇచ్ఛాధీనములు (Voluntary nerves) స్వాతంత్ర్యములు (involuntary nerves) అని రెండు తెగలుగా విభజించవచ్చును. అటు పిమ్మట నవి చేయుచున్న పనినిబట్టి చలననాడులు (Motor nerves) జ్ఞానవహానాడులు (Sens ory nerves) అనియు, కండలను ముడుచుకొనునట్లు చేయునాడులను (flexor or Contrictor nerves), కండలను సాగుట కుపయోగించువాటిని (dilator nerves), ఒక క్రియ కనుగుణముగా ప్రతీకారక్రియలను సలుపువాటికి రిఫ్లెక్సార్ నెర్వ్స లేక సింపెతిటిక్ నెర్వ్సు అనియు విభజన మొనర్చిరి. ఇన్నిటిలో పరువెత్తుచున్న నెర్వ్స ఎనర్జి యొకటే అయినను దేశ మాత్రముగా వాటికి పేర్లు కల్పించ లేదు.

ఆయుర్వేదములో చెప్పిన పంచ వాతములును పాశ్చాత్య శారీరశాస్త్ర దృష్ట్యా ఏయే నెర్వ్సులలో ప్రవహించునో వివ

ర్శింతము. పంచవాయువులయొక్క సౌమ్యవ్యాపార లక్షణములును, దూషింపబడిన యవస్థలో వాటి లక్షణములను గణుతించగా మొత్తము 313 లక్షణములు కన్పించినవి. ఈ లక్షణములను 9 వర్గముల క్రింద విభజించవచ్చును.

1. మానసిక లక్షణములు (Mental symptoms)

2. జ్ఞానేంద్రియములకు సంబంధించినవి (symptoms) of special sensory organs)

3. రక్తచంక్రమణము, శ్వాసలు, మ్రింగుటకు సంబంధించిన లక్షణములు (Blood circulation, Respiration and act of deglutition)

4. మలబహిష్కరణమునకు సంబంధించినవి (excretory function.

5. అన్న జీర్ణమునకు సంబంధించినవి (Digestive function)

6. రక్తపోషణ కార్యమునకు సంబంధించినవి (Vasomotor function)

7. స్పర్శకు సంబంధించినవి (Cutaneous sensation)

8. చలన వ్యాపారములకు సంబంధించినవి (Motor functions)

9. మాట్లాడుటకు సంబంధించినవి (Speech functions)

ఇక నీ వర్గములకు చెందిన లక్షణములను పంచవిధ వాయువులకు నీదిగువ ప్రకారము పంచిపెట్టవలసియున్నది.

(1) ప్రాణవాయువునకు మొదటి మూడువర్గములకు చెందిన వ్యాపారములు అనగా మానసిక వ్యాపారములు, రక్తచంక్రమణము, శ్వాసనము, మ్రింగుట మొదలైనవి.

(2) అపానవాయువునకు 4వ వర్గమున చెందిన బహిష్కరణ వ్యాపారములు.

(3) వ్యానవాయువునకు 6, 7, 8 వర్గములకు చెందిన దేహపోషణ, స్పర్శేంద్రియ, చలనకార్యములు.

(4) సమానవాయుకృత్యము అనగా 5వ వర్ణమునకు చెందిన అన్నజీర్ణకార్యకలాపము.

(5) ఉదానవాయువుకృత్యము 9వ వర్ణమునకుచెందిన మాట్లాడుపని.

## 2. పి త్త ము

ఆయుర్వేద శాస్త్రములో చెప్పిన పిత్తము పాంచభౌతికద్రవ్యము 'ఆగ్నేయం పిత్తం' అని అష్టాంగసంగ్రహకర్తయున్ను, "ద్రవతేజస్సముదాయాత్మకస్యాపి పిత్తస్య తేజోభాగోఽగ్నిః" మధుకోశవ్యాఖ్య అగ్నిపిత్తములకు భేదమును నిరూపించియు రెండునొక ద్రవ్యరూపముగా కలసియున్నవని చెప్పెను. "పిత్తమాగ్నేయ"మని చరకసుశ్రుత వచనములు కనిపించును. దీని భౌతిక లక్షణములను వర్ణించునప్పుడు సుశ్రుతుడు —

"పిత్తం ద్రవం తీక్ష్ణం పూతినీలం పీతం తథైవచ।
ఉష్ణం కటురసంచైవ విదగ్ధంచామ్లమేవచ॥

అని చెప్పెను. దీనినిబట్టి పిత్తము తీక్ష్ణ, ఉష్ణగుణములుకలిగిన

ద్రవపదార్థమని తెలియుచున్నది. ఈరసము పీతవర్ణముగాను పూతినీలవర్ణముగా నుండును. కటురసప్రధానము. అపక్వస్థితిలో పుల్లగానుండును. ఈపిత్తరసము శరీరములో, నేభాగమందున్నది, జీవశరీరములోను, శవపరీక్షలోను చూచి బయటికి తీసి శోధించవచ్చునా? పాశ్చాత్య ఫిజియాలజీలోనే జీర్ణరసముగా పరిగణించవలసి యుండును? అను ప్రశ్నలకు నిదానముగా నాలోచించి సమాధాన మియ్యవలసి యున్నది. ఏయొక్క జీర్ణరసముతోను పోల్చుటకు వీలుకాదు.

చరకుడు "అమాశయములో పిత్తము పుట్టుచున్నదని చెప్పెను. సుశ్రుతుడు 'పక్వామాశయ మధ్యం పిత్తస్య' అని చెప్పి, "పిత్తధరాకలా గ్రహణీపరికీర్తితా," అనికూడ చెప్పెను. సుశ్రుతవచనాను సారముగా పక్వాశయము (ప్రేగులు) అమాశయము (Stomach) లమధ్య నున్న గ్రహణిభాగములో పిత్తము ఉండునని గ్రహించవలసియున్నది. ఈభాగమును యింగ్లీషులో డియోడినం (Deodenum) అందురు. ఇచ్చట అన్నిరకముల జీర్ణరసములు వచ్చి కలిసికొనును. ఈమిశ్రమద్రవము అన్ని యాహారాంశలను జీర్ణముచేయుటకు శక్తివంతమయినది. కనుక గ్రహణిభాగమే పిత్తమునకు స్థానమని యంగీకరించవచ్చును. చరకుడు ఆమాశయములో శ్లేష్మము, పిత్తముకూడ పుట్టుచున్నవనెనుగదా యిదెట్లు సంభవమగును? యనిన చక్రపాణిదత్తుడు 'నాభి స్తనాంతరం-జన్తోరామాశయ ఇతి స్మృతః' అనియున్న చరకవచనమును బట్టి నాభి స్తనముల మధ్య ప్రదేశమునంతను చరకుడు ఆమాశయముగా పరిగణించినాడు. కనుక నిచ్చటనే శ్లేష్మ పిత్తములు రెండు నున్నవని చెప్పినందున "పిత్తస్థానే ఆమాశయ

యితి ఆమాశయస్య అధో భాగః, శ్లేష్మస్థానే పక్వామాశయ ఆమాశయయోర్ధ్వభాగతః” అని యుపాయమును చెప్పినాడు. ఈతని వ్యాఖ్యానము ప్రకారము చరకుడనుకొన్న ఆమాశయ ప్రదేశమును రెండు భాగములుగా విభాగించుకొన్నచో నూర్ధ్వభాగము అనగా (ఆమాశయము=Stomach) లో శ్లేష్మము, దిగువభాగములో (గ్రహణి=deodemum) లో పిత్తము యున్నవని స్పష్టమగుచున్నది. అందువల్ల చరక సుశ్రుత వచనముల భావమొక్కటే యగును. గ్రహణిలో కన్పించుచున్న అన్నజీర్ణమున కుపయుక్తమయిన పాచకాంశలతో కూడిన పిత్తరసమునకు పాచకపిత్తమని యందురు. అన్నములోని ఆమ్లరస. లవణరసములందలి యగ్నిజలాంశలు ప్రధానములుగా కలిసికొని క్రొత్తగా పిత్తము పుట్టుచునే యున్నది. ఇందలి పాచకాంశలు, ఉష్ణాంశలు కలిసి రక్తముతో కలిసి సర్వశరీరభాగములందు సంచరించునప్పుడు పాచకాంశలు లాలాజలగ్రంథులు, జాఠరగ్రంథులు, యకృత్ పేంక్రియాస్ గ్రంథులలోకివచ్చి నిలిచియుండును. అన్నమును భుజించిన వెంటనే యీపాచకాంశలు లాలాజలము (Saliva) జఠరరసము (Gastric guice), పైత్యరసము (Bile from liver) పేంక్రియాటిక్ జ్యూస్‌లతో కలిసివచ్చి అన్నమును పచనము చేయుచున్నవి. ఈ పై రసములలో నుండిన పాచకాంశలు వరుసగా టయిలిన్ (Ptyalin) హైడ్రోక్లోరిక్ ఏసిడ్ అండు పెప్సిన్ (Hydrochloric acid and pepsin) బైల్‌సాల్ట్సు, ఎమైలేస్, ట్రిప్సిన్, లైపేజ్ (Amylase, trypsin and lypase) లన్నిటిని పాచకపిత్తములని చెప్పవలెను. వీనికి ఎంజైమ్సు, (Enzymes) అని

అందురు. ఇంకను ధాత్వణువు లన్నిటిలోను ఆహారాంశలను కాల్చివేసి యందలి యుష్ణశక్తులను బయలుదీయుటకు (Heat energy) సెల్ ఎంజైమ్సు (ధాత్వగ్ను లున్నవి). ఇవియు పాచకాగ్ని యంశలనియే చెప్పవలెను.

ఆయుర్వేదము పిత్తమునుకూడ పంచవిభాగ మొనర్చినది. 1. పాచకాగ్ని లేక పాచకపిత్తము 2. రంజికపిత్తము 3. సాధకపిత్తము 4. అలోచకపిత్తము 5. భ్రాజికపిత్తములని వ్యవహరించి వీనికి వేర్వేరు స్థానములను, కార్యములను నిరూపించుచున్నది.

(1) పాచకపిత్తము - స్థానము గ్రహణి, అన్నపచన కార్యము. (2) రంజికపిత్తము— యకృత్ లోనున్నది. రక్తమునకు ఎరుపురంగు నిచ్చును. (3) సాధకపిత్తము - హృదయమందున్నది. అతిసూక్ష్మమయినది; తమస్సు లేక జడత్వము (మాంద్యమును) తొలగించి బుద్ధి, యింద్రియములకు చురుకు పుట్టించును. (4) అలోచకపిత్తము — కనుగ్రుడ్డు లోపల నున్నది. మంచిదృష్టిని ప్రసాదించును. (5) భ్రాజికపిత్తము — ఇది సర్వశరీరగతము — చర్మమునకు ప్రకాశము, వర్ణముల నొసంగును. మర్దనచేసిన తైలలేపములను జీర్ణముగావించి శరీరములోకి ప్రవేశపెట్టును. వీనిలో ఒక్క పాచకపిత్తము వినా మిగిలినవన్నియు నతి సూక్ష్మములు. ఈసూక్ష్మపిత్తములను పాశ్చాత్యుల ఫిజియాలజీ ననుసరించి యేవిధముగా గుర్తించవలెను? ఇందుకు మొదట పిత్తప్రకోప లక్షణములన్నిటిని (సుమారు 40) చరక సూత్ర 20 అ. 16 సూ. తీసికొని 6 వర్గములుగా కూర్చుదము. అప్పుడు 1వ వర్గము—

తాపము, చమట, 2వ వర్గము — చీముపట్టు పరిస్థితి, వాపు, 3వ వర్గము — జీర్ణకోశలక్షణములు, 4వ వర్గము — రక్తస్రావములు, కామిర్లు, మచ్చలు, 5వ వర్గము — దృష్టికి సంబంధించిన లక్షణములు, 6వ వర్గము మానసిక లక్షణములు. వీనిని తిరిగి పంచపిత్తములకీ దిగువ చూపిన ప్రకారము పంచిపెట్టవచ్చును.

1. పాచకపిత్తమునకు - 3వ వర్గ వ్యాపారములు.

2. రంజికపిత్తమునకు - 4వర్గ లోని కార్యములు, రంగులు.

3. సాధకపిత్తము - 5వ వర్గలో చెప్పిన మానసిక కార్యములు.

4. ఆలోచకపిత్తము - 6వ వర్గము - దృష్టి ప్రసాద కార్యము.

5. భ్రాజికపిత్తము - 1, 2 వర్గములకు చెందిన తాపము చమట, చీముపట్టుట మొదలైనవి.

ఇటుపైని పంచపిత్తముల వ్యాపారములను పాశ్చాత్యుల ఫిజియాలజీ విషయములతో సంబంధించి చర్చింతము. 1వ వర్గలో చెప్పిన విషయములు రెండుమాత్రమే. (1) శరీరోష్ణము (2) చమటపట్టుట. ఈకార్యములు భ్రాజికపిత్త కార్యములుగా పేర్కొంటిమి. మన శరీరములో సంతతము వేడిపుట్టుచునే యుండును. వెనువెంటనే కొంత రోమకూపములద్వారా వెడలిపోవు చుండును. స్వస్థునకు కొంత వేడి ఎల్లవేళల నొకేపరిమితిలో (నార్మల్ టెంపరేచర్ 98.4°) నిలిచియున్నది. సర్వమానవుల శరీరమందు స్థిరముగా నిలిచి

యున్న యీయగ్నికి వైశ్వానరాగ్ని యనిపేరు (విశ్వ+నర+అగ్ని 1. శ్రీకృష్ణభగవానుడు అర్జునకుతానే వైశ్వానరాగ్ని రూపముతో దేహములందుండి చతుర్విధాన్నములను పచనము చేయుచున్నటుల చెప్పెను.

ఈయగ్ని మన శరీరములో నెట్లు పుట్టుచున్నది? ఏవిధముగా బయటికి పోవుచున్నది? జ్వరతాపము కలుగుటకు కారణమేమి? యని యాలోచించినప్పుడు పాశ్చాత్యుల ఫిజియాలజీ మనము భుజించిన యాహారము వివిధ జీర్ణరసములతో కలిసి సూక్ష్మాంశలుగా విడిన పిమ్మట రక్తముతో కలిసి యీ యాహారాంశలు ధాత్వణువులలోకి ప్రవేశించగా రక్తముతో కలిసి వచ్చిన ఆక్సిజన్ వాయువుకూడ ధాత్వణువులలో ప్రవేశించి ధాత్వగ్నికి సాయము చేయగా నాహారాంశలు దగ్ధమయిపోవుచున్నవి. ఆహారాంశలులోనుండి ఉష్ణము (body heat) శరీరశక్తి (body energy=సత్తువ) కలుగుచున్నవి. ఇట్లు పుట్టుచున్న వేడియంతయు శరీరములో నిలిచిపోవుచుండిన నాతాపమును భరించలేము. కనుక చమటపుట్టి అది ఆవిరియగుటకు కొంత వేడి ఖర్చుయగుచుండగా మరికొంతవేడి శ్వాసలతో బయటికి వెడలిపోవుచుండును. జ్వరము శరీరమం దధికవేడి పుట్టుచుండుటవల్లనే కలుగనవుసరము లేదు. చమటబట్టకుండుటయు, వేడి చర్మగత సూక్ష్మరంధ్రముల ద్వారా బయటికి పోవుట కభ్యంతరము కలుగుటవల్లను రావచ్చును.

---

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః।
ప్రాణాఽపాన సమాయుక్తం పచామ్యన్నం చతుర్విధం॥ భగవద్గీత. 1

పాశ్చాత్యుల ఆహార విజ్ఞానము ననుసరించి ఆహారాంశలు త్రివిధములు (1) స్టార్చి, పిండిపదార్థము (2) ప్రోటీన్సు (మాంసవర్ధకములు) (3) చమురు (fats and oils.)

ఇవి ధాత్వణువుల లోపలనున్న ధాత్వగ్ని ప్రాణవాయువు (oxygen) సహాయముచేత కాలిపోవు నప్పుడు వేడి, శక్తి కలిగి బొగ్గుపులుసుగాలి (కార్బన్ డై ఆక్సైడ్ గేస్) నీరు పుట్టుచున్నవి. ఒక గ్రాము యీపదార్థములలో నుంచి ఎంత పరిమితి వేడి, నీరు, అంగారవాయువులు పుట్టుచున్నవో యీక్రింది పట్టికవలన తెలియవచ్చును.

| ద్రవ్యము | శరీరవేడి కెలరీలు | అంగార వాయువు గ్రాములు | నీరు గ్రాములు |
|---|---|---|---|
| గ్లూకోజు (చక్కెర) | 4 1 | 1.467 | 0.600 |
| ప్రోటీను దిలుసులు | 4.1 | 1.522 | 0.395 |
| చమురులు | 9.3 | 2.805 | 1.071 |

స్వస్థునకు విశ్రాంతి సమయమున 24 గంటలకు 1600-1700 కెలరీలు వేడి కావలసియున్నది. పనిపాటులు చేయువారికి మరింత ఎక్కువ కావలెను. సగటున ప్రతివారికి గంటకు 100 కేలరీలు వేడి, పాటుపడువారికి గంట 1కి 300 కెలరీలు, మరీ కష్టజీవులకు గంట 1కి 600 కెలరీలు వేడి కావలసివచ్చును. శరీరోష్ణమును పుట్టించే కార్యము పిత్తమునకు చెందినదని తెలిసికొంటిమి. ఇక చమటబట్టుట, తాపగుణములు పిత్తకార్యములే యగుచున్నవి. కోపము వచ్చినప్పుడు ముఖము ఎర్రబారి తల వేడియెక్కుట, కాళ్లుచేతులు మంటలు ప్రకోపపిత్తకార్యములే యగును. ఇక రెండవ

వర్గమునకు చెందిన చీముపట్టు వ్యాపారము పిత్తబలముపై నాధారపడినది. చర్మపు పొరలలో సెబేషస్ గ్రాంథులున్నవి. ఇవి స్నేహన గ్రంధులు. వీనిలోనుంచి యూరుచున్న సీబమ్ అనెడు స్నిగ్ధద్రవము పిత్తముయొక్క ఒకరూపము. ఇది సక్రమముగా నున్నంతకాలము నాస్థలమున చీము చేరుకొనుటకు వీలుకాదు. ఈస్నిగ్ధపిత్త ద్రవమువల్ల చర్మమునకు మృదుత్వము, కాంతి కలుగుచున్నవి.

3వ వర్గములో చేర్చిన అన్నజీర్ణకార్యకలాపమంతయు పాచకపిత్తము వలన నిర్వహించ బడుచున్నవి. వివిధ జీర్ణ రసములందలి ఎంజైమ్సు, సెల్ ఎంజైము కలిసి (పాచకాంశలు) పాచకపిత్తములని నిర్ణయించ వచ్చును.

4వ వర్గమునకు చెందిన రక్తస్రావములు, రక్తపిత్త లక్షణములు ప్రకుపిత రంజికపిత్తమునకు చెందినవి. రంజిక పిత్తము సౌమ్యముగా వ్యవహరించినప్పుడు రక్తమునకు ఎరుపు రంగు నిచ్చుచున్నది. దీనికి స్థానము యకృత్ ప్లీహములని ఆయుర్వేదము చెప్పుచున్నది పాశ్చాత్య ఫిజియాలజీ శాస్త్రముకూడ రక్తమునకు ఎరుపురంగు ఎఱ్ఱకణములందలి హిమోగ్లోబిన్ పదార్థమువల్ల కలుగుచున్నదనియు, నీపదార్థము యకృత్‌లో తయారగుచున్నదనియు, దీనిని తయారుచేయు శక్తిద్రవ్యము యకృత్ అణువులలో నున్నదనియు చెప్పును. యీద్రవ్యమునకు హిమోపయటిక్ ఎంజైము అని పేరుంచిరి. ఇదియే రంజికపిత్తము. దీని వికారఫలితమే పాండు, కామిర్లు, రక్తస్రావములు, పొడలు మొదలైనవి. పైత్యరసము (Bile) రంజికపిత్తముతో కలిసి రక్తములోనుంచి పుట్టిన మలము.

ఇక 5వ వర్గులో, చెప్పిన మానసిక వ్యాపారములు మన శరీరమందలి కొన్ని అంతర్వాహినీ రసగ్రంథులతో (Ductless glands or glands of internal secretions) నెక్కువ సంబంధమును కలిగియున్నవని అధునిక పాశ్చాత్య శారీరవేత్త లభిప్రాయపడుచున్నారు. ఎడ్రినల్ గ్రంథిలో నూరుచున్నరసము, గ్రంథీ యంచులదరిని యున్నది క్రోధము నకును, మధ్యభాగమునయున్న రసము భయమునకును కారణములుగా నున్నవి. ప్రజననేంద్రియ గ్రంథులు (గోనాడ్ గ్రూప్ ఆఫ్ గ్లేండ్సు) అనగా పిట్యూటరీ, ఎడ్రినల్, టెస్టికల్సు (వృషణగ్రంథులు) ఓవరీస్ (స్త్రీలలో అండాశయ గ్రంథులు) ధైర్య, స్థైర్యములకు, కామేచ్ఛకు హేతువులుగా నున్నవి. వృషణ గ్రంథులను తీసి వేయబడినవారు పిరికివారగుచున్నారు. కాన యీపైన వివరించిన ఆంగీరస గ్రంథుల సారమే (gland hormones) సాధకపిత్తమని మనమూహించవచ్చును.

6వ వర్గమునకు చెందిన దృష్టిప్రసాదము అలోచక పిత్తమునకు చెందుచున్నది. కనుగ్రుడ్లు లోపల వెనుకభాగమున నేత్రేంద్రియములతో సంబంధించిన నాడికి చుట్టును కన్పించుచు, దృష్టిప్రసాదకముగానున్న రోడాప్సిన్ అను పదార్థము రెటీనా యనెడు పొరనంటుకొని యున్నది. దీనికి విషుయల్ పర్పుల్ Purple Visual అని పేరు. ఇది ఆలోచన పిత్తము కావచ్చును. లేదా నేత్రేంద్రియనాడి (optic nerve) కనుగ్రుడ్డుతో సతుకుకొనిన స్థలమునకు కొంచెము ప్రక్కగా దృష్టి కేంద్రీకరణ స్థానము పసుపుపచ్చగా కన్పించును. (yellow spot) వస్తువుయొక్క ఆకారము సరిగా

నీస్థలమున పడినప్పుడు వస్తుగోచరము సంభవించుచున్నది కనుక నీ పచ్ఛన్నిస్థలమును అలోచకపిత్తమని కూడ తలంచ వలసి యుండును. కన్నీటిగ్రంధులును (Lacrymal glands) దృష్టి నిచ్చుటకు తోడ్పడుచున్నవి. గనుక రెటీనాపొర, కన్నీటిగ్రంధులు అలోచకపిత్తమునకు స్థానములని చెప్పా దము.

## 3. కఫము

కఫము ద్రవమని ఆయుర్వేదము స్పష్టముగా చెప్పినది. కంటికి కన్పించును. జల, పృధివ్యాంశల కూడికతో నేర్పడిన పాంచభౌతికద్రవ్యము. చరక. సూ. 12 అ. 12-16 సూ, సుశ్రుత సూ. 15 అ. 4-15, 2 అధ్యా. 12-14 సూత్రములలో కఫమును గురించిన పూర్తి వివరములు కన్పించును. కఫము లేక శ్లేష్మము శరీరమును ధరించి, పోషించుచు నుపకారిగానున్న స్నిగ్ధద్రవముగాని దగ్గినప్పుడు ఉమియుబడిన జిగురుపదార్థము (క్లై=Bronchial and throat secretion that is expectorated or expelled out) కాదు. మనము భుజించిన యాహారపదార్థములందలి జల పృధివ్యాంశలు శరీరములో కఫధాతువుగా నిర్మింపబడుచున్నవి. కఫముయొక్క భౌతికలక్షణము లెవ్వి యనగా— తెల్లనిజిడ్డు, జిగురుద్రవము, బరువుగానుండును. చల్లదనము నిచ్చును. అపక్వమయిన కఫము ఉప్పగాను, పక్వస్థితిలో తియ్యగాను కన్పించును. ఇది అమాశయము (Stomach) లో పుట్టుచున్నదని చరక సుశ్రుతులు ఏకాభిప్రాయమును వెల్లడించిరి. ఇచ్చటనుండి ఉరస్సు (Heart and lungs), శిరస్సు,

సంధులు (joints) అమాశయము, మెదస్సులలోకి చేరుకొని అచ్చట నియమిత కార్యములను చేయుచుండును. తన యందలి ద్రవ, శీతగుణముల చేత శరీరధాతువులను పోషించి, బలము నిచ్చును. అగ్ని తాపమునుండి కాపాడుచున్నది. వాయువుయొక్క రూక్షగుణము నడచి పట్టి కీళ్ళను రక్షించు చున్నది. దేహ విభాగములను సంధానపరచుచున్నది. ఆయుర్వేదశాస్త్రము కఫమును కూడ పంచవిధములుగా భాగించి వాటికి స్థానములను కార్యములను వివరించినది. చ. సూ. 20/18 సూత్రములో కఫ ప్రకోపలక్షణములు యిరువది వివరింపబడినవి. చరక సూ. 12/16 లో చెప్పినట్లు యీ లక్షణములన్నిటిని 6 వర్గములుగా విభజించవచ్చును. ఎట్లనగా:-

(1) స్థౌల్యం కార్శ్యం=General or local edematous Condition of the body or the reverse) అందులోకి 4, 5, 14 మొదలు 16, 18 మొదలు 20 లక్షణములు చేరును.

(2) ఉత్సాహ, ఆలస్య, కృశతా, క్లీబతా, జ్ఞాన, అజ్ఞాన, వృద్ధి, మేహ (Physical and mentatl fitness or the reverse) ఇందులో 2, 3, 6, 11 లక్షణములు చేరును,

(3) క్లేదన =(Lubrication). ఇందులో 1, 9, 10, 12, 13, 17 లక్షణములు చేరుచున్నవి.

---

1 శ్లేష్మా శ్వేతో గురుః స్నిగ్ధ పిచ్ఛిలః శీత ఏవచ. మధురస్త్వ విదగ్ధః స్యాద్విదగ్ధో లవణ స్మృతః॥

(సుశ్రుత. సు త్ర. 1 అధ్యా. 21-2 సూత్రం)

(4) రసమ్ లేక బోధకమ్= quality of ascertaining taste. ఇందులోకి 7, 8, లక్షణములు కలియును.

(5) దార్ఢ్య లేక శిథిల= uniting or discomecting the different elements of the body giving it the firmness or relaxation.

(6) స్నేహాన లేక తపన = cooling qualities.

ఈపైన చెప్పిన వర్గములలో మొదటి రెండింటినొకే వర్గములోకి పరిగణించగా మిగిలిన అయిదు వర్గములకు చెందిన కృత్యములు పంచవిధకఫములకు చెందుచున్నవి. అవి యవ్వి యనగా:—

(1) అవలంబక కఫము: అవలంబనం=Supporting. This regulates general or local edematous condition of the body or the reverse. ఒంటికి మృదుత్వము, నిగారింపు నిచ్చును. మానసికోత్సాహము, శక్తి నిచ్చును.

(2) క్లేదకకఫము - కీళ్లు అరిగిపోకుండ కాపాడును.

(3) రసక లేక బోధకకఫము = రుచులనుబోధించును.

(4) శ్లేషకకఫము — దేహాణువులను సంధానము చేయును.

(5) తర్పకకఫము- దేహమును పుష్టివంతముగా చేయును.

ఈపంచవిధ కఫములను, వాటి సామ్యవ్యాపారములను నేటి పాశ్చాత్యుల ఫిజియాలజీ విషయములతో సమన్వయ పరచెదముగాక.

1. అవలంబకకఫము :- ఇది మన దేహములోనున్న జలరూపక ద్రవ్యము. సర్వశరీరవ్యాప్తమై ప్రతిదేహాణువు లోపలను వెలుపలనుకూడ నున్నది. మనుష్యుని తూకములో నూటికి 70 వంతులు కఫద్రవముయొక్క బరువే. రక్తములో నూటికి 5 పాళ్లు, దేహ అణువులలోపల 50 పాళ్లు, దేహాణువుల మధ్యనున్న ద్రవము (interstitial fluid) 45 పాళ్లుగా నున్నవి. మన దేహములోకి నీరు మూడు విధములుగా చేరుచున్నది. (1) త్రాగిననీరు (2) ఆహార పదార్థములలోనుండిన నీరు (3) ఆహారాంశలు ధాత్వణువులలోపల కాలిపోయినప్పు డేర్పడిన నీరు. ఈనీటి యంశ శరీరములో నిలిచిపోయినప్పుడు ఒళ్లు నీరుపట్టును. నిరుత్సాహము, ఒళ్లు బరువు, అధిక నిద్ర కలుగును.

2. క్లేదకకఫము :- ఇది చమురువంటి జిడ్డుద్రవము. దీనిలో మ్యూకస్ అను జిగురుపదార్థము కలిసియుండును గనుక శ్వాసనాళముల లోపలనుండి, శ్వసనకార్యమునకు తోడ్పడుచున్నది. అన్నకోశములో(stomach) అన్నమును మెత్తబరచి జీర్ణమగుటకొరకు పాచకాగ్నికందించుచున్నది. మలాశయములోనున్న కఫము మలమును జార్చుచున్నది.

3. రసక లేక బోధకకఫము :- జింహ్వాయందుండి వివిధ రుచులను బోధించును.

4. శ్లేషక కఫము:- అస్థిసంధుల లోపలనుండి, కీళ్ళు అరిగిపోకుండ కాపాడును. ఇది సైనోవియల్ ఫ్లూయిడ్ అని స్పష్టమగుచున్నది. (Synovial fluid) కండలు, స్నాయువులు ఎముకలతో సంధానించు స్థలములందును, చర్మము

క్రిందను (Sebaceous fluid) కూడ కల్పించుచున్నది.

5. తర్పక కఫము:- మెదడుపైన పొరలమధ్యను, మెదడు మధ్యభాగమునుండి వెన్నునాళములోకిని వ్యాపించి యున్న సెరిబ్రోస్పైనల్ ఫ్లూయిడ్ (Cerebro-spinal fluid) కాగలదు. ఇంకను కనుగ్రుడ్డులోపలి (Humerous fluid) ద్రవమును, హృత్కోశ పరివేష్టిత (Pericardial fluid) ద్రవమును, ఫుప్ఫుసపరివేష్టిత ద్రవమున్ను (Plueral fluid) ఆయాభాగములను సంతతము తడుపుచు పోషించుచున్నవి.

## అధ్యాయోప సంహారము.

మనశరీరము నొక మోటార్ కార్‌తో పోల్చవచ్చును. వాత పిత్త కఫములు శరీరయంత్రమును సరియైన మార్గమున నడిపించు సాధనములు. వీనిలో వాతమును "తంత్రతంత్ర యంత్రధారి" అని చరకుడు చెప్పినదానికి చక్రపాణివాక్యము ననుసరించి 'తంత్రం శరీరం తదేవ యంత్రం' అనినట్లు* మన శరీర యంత్రమును నడిపించుచున్నది. కాన వాతము మోటారు డ్రైవరని చెప్పవచ్చును. మరియు శార్ఙ్గధరుడు పిత్తకఫములను, రస, రక్తములను, మలములను, అన్నజీర్ణ రసములను, మల, స్వేద మూత్రములను స్థలాంతరములకు కదలించి సర్వకార్యములను చేయించునది వాతము అని చెప్పెను. వాతమును ప్రాణమనికూడ చెప్పెదను. ఈడ్రైవరు చేసేపనులు ముఖ్యముగా అయిదు విధములుగ నున్నవి.

---

*శ్లో|| పిత్తం పంగు కఫః పంగుః పంగవో మల ధాతవః। వాయునా యత్ర నీయంతే తత్ర గచ్ఛంతి మేఘవత్|| (శార్ఙ్గధరసంహిత)

(1) మొదట బేటరీ లేక మేగ్నొటోనును కదలించవలెను. ఇది ప్రాణవాత కృత్యము. అనగా నాహారము గ్రహించుట.

(2) పెట్రోలు కాలినప్పుడు వచ్చిన శక్తిని సక్రమముగా నడపించుట. మన దేహయంత్రమునకు ఆహారము పెట్రోలు వంటిది.

(3) ఆహారపదార్థములను జీర్ణముగావించి కాల్చునది పిత్తము. ఈవిధముగా లభించిన వేడిని, శక్తిని సక్రమముగా నుపయోగించుకొనునది వ్యానవాతము.

(4) డ్రైవరు Exhaust pipe, silencer ద్వారా పొగను గాలిని విడిచిపెట్టుచుండవలెను. ఇదే కార్యములను మనదేహములో అపానవాతము చేయుచున్నది.

(5) దారికడ్డము లేకుండ ప్రజలను హెచ్చరించుటకు డ్రైవరు హారన్ను యూదించును. మన శరీరములోని ఉదానవాతము మాట్లాడించుచున్నది. డ్రైవరు కారు వేగమును తన యధీనములో నుంచుకొనును. ఈపని వ్యానవాతము కృత్యముగానున్నది. ఇక వాతమును డ్రైవరుగాను, ఆహారమును శక్తిగా మార్చుగల పిత్తమును పెట్రోల్ గాను, యింజను, యిరుసులు వేడిఎక్కకుండ బండి (కారు) చక్కగా నడచుటకు సాయపడు చున్న మోబిల్ఆయిల్, నీరు కఫముగాను పోల్చి శరీరమును యంత్రమను చున్నాను.

కారు సరిగా నడవకుండుటకు ముఖ్యముగా మూడు కారణములుండును. (1) తెలివితక్కువ డ్రైవరు (2) పెట్రోలు దోషము (3) మోబిల్ అయిల్, నీరులోపము. మన దేహ

యంత్రముకూడ వాతపిత్తకఫములు దూష్యమైయుండినప్పుడే చెడిపోయి రోగములు సంభవించును.

శరీరమునంతనుగాని వానిభాగములను, దేహాణువులను చలింపజేసి వివిధ కార్యాచరణములకు కారణమయినది వాతము (Nerovus energy). మెదడు, సుషుమ్నానాడీ తంతువులు, మరియు స్వతంత్రనాడీ మండలములు (Sympathetic ganglia) వాతము నిలిచియుండే స్థానములు. నెర్వ్సు వాతసంచార మార్గములు.

వివిధరసోత్పత్తి గ్రంథులు పంచవిధ పిత్తములకు స్థానములుగా నున్నవి. వీటికార్యములు:-శరీరోష్ణమును అనుకూల స్థితిలో నుంచుట, అన్నపచనము, ధాతుపోషణములు, కఫము:-శరీరమందలి జలభాగము. దేహాణువులను, శరీరభాగములను సంధానపరచి, వాతపిత్తములు క్రూరతజెందకుండ వాటిని అదుపులోనుంచి సుఖమునిచ్చుట. ఈవిధముగా మన దేహాయంత్ర పాలనము వాతపిత్తకఫముల సమిష్టి సహకారముల యధీనములో నున్నది.

## 4. షడ్రస సిద్ధాంతము.

### త్రిదోషములతో వీనిసంబంధము

ఔషధాహారపదార్థములన్నియు పాంచభౌతిక ద్రవ్యములు. వీని నాశ్రయించుకొని మధుర, అమ్ల, లవణ, కటు, తిక్త, కషాయములనెడు ఆరు రుచులున్నవి. ప్రతిపదార్థమందు 6 రసములులున్నప్పటికి యధికాంశరసము లేక రసములను మాత్రము నాలుక గ్రహించును. స్వల్పరసములను

గ్రహించలేదు. షడ్రసములు పదార్థముయొక్క గుణములని వ్యవహరించుచుండినను. ఆయుర్వేదశాస్త్రము వీటిని ద్రవ్యములుగా నిశ్చయించి యందలి పంచభూత విభాగములను కూడ వివరించినది. అదెట్లనగా:—

(1) మధురరసము (Sweetness) = పృథ్వి + జల
(2) ఆమ్లరసము = (acidity) = అగ్ని + భూమి
(3) లవణరసము = (Saltishness) = అగ్ని + జల
(4) కటురసము = (Pungent) = వాయు + అగ్ని
(5) తిక్తరసము = (Bitterness) = వాయు + ఆకాశ
(6) కషాయరసము astringent) = వాయు + పృథ్వి

షడ్రసయుక్త ఆహారపదార్థములను భుజించినప్పుడు ఆహారపదార్థములు పాచకాగ్నిచేతను పచనమై పంచభూతాంశలుగా విడిపోయి, వీనితో రసాది సప్తధాతువులను నిర్మించుచున్నవి.

ఇక షడ్రసములుగల యాహారపదార్థములు జఠరాగ్ని సంయోగమున త్రివిధ విపాకములనొంది, ఆవిపాకద్రవ్య భూతాంశలతో వాతము, పిత్తము, కఫములు పుట్టుచున్నవి. అదెట్లనగా:— మధురరసము మధురవిపాకమునే నొందును. ఆమ్లరస మామ్లవిపాకము పొందుచున్నది. లవణరస మామ్లముతో కలిసి ఆమ్లమునే వృద్ధిచేయును. మధురామ్లలవణ సంయోగములో మధురవిపాకము సంభవించును కటురసము అగ్నియంశలు ప్రధానమగుటవలన పిత్తమును వృద్ధిపరచును. తిక్తరసము పిత్తహరముగా నుండును. కషాయరసము వాతమును వృద్ధిచేయును. కటుతిక్త కషాయరసములు కలిసి కటు

విపాకము చెంది వాతమును వృద్ధిపరచుచున్నవి. ఈకార్యము లెట్లు జరుగుచున్నవో విమర్శించవలసియున్నది. *సమాన భూతాంశలుగల రెండు ద్రవ్యములు కలిసినప్పుడు ద్రవ్యము వృద్ధియగుచున్నది. విరుద్ధగుణ భూతాంశలుగల ద్రవ్యములు కలిసికొన్నప్పుడు, ఆద్రవ్యము తగ్గిపోవుచున్నదని ప్రకృతి సూత్రమున్నది. దీని ప్రకారము వాతాదులు వృద్ధిచెందుటకు సమానగుణ భూతాంశలుగల రసము లేవి? విరోధగుణ భూతాంశలు గలిగిన రసములేవి? వాతాదులందలి భూతాంశ లేవి? యను విషయమును తెలిసికోవలసి యుండును. వాతము=వాయు+ఆకాశ, పిత్తము=జల+అగ్ని, కఫము=జల+పృథ్వి. ఇక వాతమునకు రూక్ష, లఘు గుణములు ప్రధానములుగా నున్నవి. పిత్తమునకు ఉష్ణగుణము ప్రధానము, కఫము శీత, స్నిగ్ధగుణములు కలది. ఇట్లే పంచభూత గుణములను తెలిసికొని వాటిలో పరస్పర మిత్రత్వ శత్రుత్వ ములను గ్రహింతము.

1. ఆకాశభూతము శబ్దగుణముకలది. సత్వగుణప్రధానము- సూక్ష్మ, విశద, లఘు గుణములు గలది. వీటికివిరుద్ధ మునైన స్థూల, పిచ్ఛిల, గురు గుణములతో విరోధించును.

---

*1 సర్వదా సర్వభావానాం సామాన్యం వృద్ధి కారణం, హ్రాసహేతు ర్విశేషశ్చ ప్రవృత్తి రుభయస్యతు।

(చరక సంహిత)

2 "వృద్ధి స్సమానైః సర్వేషాం విపరీతైర్విపర్యయః"

3 రస దోష సన్నిపాతేతు యేరసా ర్యైర్ద్[illegible] సమాన గుణభూయిష్ఠా వా భవంతి ఏతా న్నభివర్ధయంతి।

(చరక విమానస్థానం I-7)

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయము

2. వాయుభూతము- రజోగుణప్రధానమై రూక్ష, లఘు గుణములను కలిగినందున వీటికి విరుద్ధములైన స్నిగ్ధ, గురు గుణములు కలిగిన జల భూతగుణములతో విరోధించును.

3. అగ్నిభూతము కేవలము ఉష్ణగుణ ప్రధానముగుట వలన దీనికి విరుద్ధమయిన శీతగుణముగల జలభూతముతో విరోధమేర్పడుచున్నది. వాయుభూత మగ్నికి తోడ్పడి మరింత ప్రజ్వలింపజేసి అగ్నియొక్క యుష్ణగుణమును వహించుట కలదు.

4. అప్ భూతము- తనయందలి స్నిగ్ధ, శీత గుణముల చేతను వాయ్వగ్నులతో విరోధించును.

5. పృథ్వీభూతముయొక్క గురు, స్థిర, కఠిన గుణములు వాయువు, ఆకాశ, అప్ భూతగుణములతో వ్యతిరేకించును.

ఈవరుసను రసములు దోషములు కలిసికొన్నప్పుడు, రెండిటియందలి భూతగుణాంశలు సమానముగా నుండినచో నాదోషమునకు వృద్ధికలుగుచున్నది. నాటియందలి గుణాంశలు విరోధించునవిగా నుండిన యాదోషము హరించగలదు. ఉదాహరణమునకు మధురపదార్థములను తినినప్పుడు కఫ వృద్ధి యగుచున్నది. ఏలయన రెండిటియందలి భూతాంశలు వాటిగుణములు సమానముగా నున్నవి. ఇట్లే అమ్లలవణ రసమును పిత్తము వృద్ధిపరచును. కటుతిక్తకషాయ రసములు మూడింటిలోను వాయుభూతాంశలే యధికముగా నున్నందున తప్పక వాతము వృద్ధియగుచుండును.

* ఇక మూడేసిరసముల నొక్కసారిగా కలిపి భుజించి నప్పుడు వేర్వేరు విపాకముల జెందుచుండుటవలన నీమిశ్రమ ద్రవ్యముల కార్యములుకూడ వేరుగనే యుండునని ఆయుర్వేద శాస్త్రము చెప్పుచున్నది. ఎట్లనగా:—

1. మధురామ్ల లవణములు కఫమును వృద్ధిచేయును. మధురవిపాకము చెందును.

2. కట్వమ్లలవణసంయోగము ఆమ్లవిపాకమునుపొంది పిత్తమును వృద్ధిపరచుచున్నది.

3. కటుతిక్త కషాయరసములు మూడును కటువిపాకమును పొంది వాతమును వృద్ధిచేయుచున్నవి.

ఈపైన చెప్పిన విషయములు యదార్థములని అనుభవముచేతను గ్రహించగలము. కాని శాస్త్రరీత్యా నాకార్యమెట్లు సంభవమగుచున్నదో తెలిసికొనుటకూడ అవసరమగును.

1. మధుర+ఆమ్ల+లవణ = ఏదోషవృద్ధి, ఏదోషము శమించును? = (జ+పృ) + (భూ+అగ్ని) + (జ+అగ్ని) = 2 జ+2పృథ్వి+2అగ్ని

ఇక ద్రవ్యనిర్ధారణకు జలాంశలు ప్రధానములు. ఈ కూటములో అన్నియంశలు సమానములుగనే యున్నవి. పృథివ్యగ్నులు వాటి యందలి గుణవైషమ్యముచేతను జల భూతాంశలకు విరోధులుగానే యున్నవి. అయినను కార్య సాధనకు జలాంశలు తక్కువ విరోధముగల పృథివ్యాంశల

---

* శ్లో॥ స్వాదమ్లలవణంకఫం । కట్వమ్ల లవణంపిత్తం।
కటుతిక్తకషాయంచ కోపయంతి సమీరణం॥

తోనే కలిసి, (జ+పృ), కఫమేర్పడి, కఫవృద్ధి జరుగు చున్నది. కఫబల మధికమగుటవలన యందలి శీతగుణము అగ్నిని చల్లార్చివేయును. కఫవృద్ధివల్ల అగ్నిమాంద్యము. ఒడలు బరువు, చల్లదనము కలుగుచున్నవి. కఫవృద్ధి జరిగి నప్పుడు తనయందలి స్నిగ్ధ, గురుగుణముల చేతను, విరుద్ధ గుణములుగల, రూక్ష, లఘు గుణములుగల వాతము యొక్క బలమును అణచిపెట్టును. ఇట్లే వాతబలము హెచ్చినచో కఫము నార్చివేయగలదు. ఈకార్యమునుకూడ నీదిగువ లెక్కమాదిరిగా చూపడమయినది.

$$\frac{\text{కఫవృద్ధి}}{\text{వాతము}} = \frac{\text{జ+పృ}}{\text{వా+ఆకాశ}} = \frac{\text{స్నిగ్ధ+గురు}}{\text{రూక్ష+లఘు}} = \text{వాతహరము}$$

ఇచ్చట కఫముయొక్క బలవత్తర గుణమ్మునైన స్నిగ్ధ గుణముచేత వాతమందలి అల్పరూక్షగుణమును, గురుత్వముచేత లఘుత్వము నశించుచున్నవి. కాన వాత బలము తగ్గినదని చెప్పుదుము. ఇదే విధముగా మిగిలిన రస సంయోగముల ఫలితములను నిశ్చయించవచ్చును.

ఈప్రకారము ఒక్క ద్రవ్యరసముతోనే ద్రవ్యగుణ నిశ్చయమగుచున్నదికదా. దీనికితోడు అనుభవముకూడ నుండిన ద్రవ్యగుణ విషయమున సందేహముండదు. ద్రవ్య గుణమును నిశ్చయించుటకు యింత చక్కని సులువైన యుపాయము పాశ్చాత్యులకున్నదా? పదార్థములందలి వివిధ రుచులనుబోధించుటకు జిహ్వేంద్రియము వినా రసాయన పరి కరములుగాని యంత్రములుగాని తోడ్పడగలవా? అసలు రుచులను ద్రవ్యముల నాశ్రయించుకొనియున్న గుణములు

(qualities) అని చెప్పుదురుగాని అవి ద్రవ్యములని యంగీక రించరు. నూతన ద్రవ్యముల గుణములను నిశ్చయించుటకు పరిశోధకుడు స్వయముగా నద్దానిని తిని దాని ఫలము లనుభ వించి చాటవలెను. ఇంకొకరి యభిప్రాయముల నంగీకరించరు గదా. ఒకడు ఎన్ని ద్రవములను తిని వాటి గుణముల నిశ్చ యించగలడు. కొన్ని తీవ్రవిషయముల సందర్భము తన ప్రాణములనే పోగొట్టుకొనవలసివచ్చును. జంతు పరిశోధన లలో ద్రవ్యకార్యము ప్రస్ఫుటమగుచున్నదేకాని అందలి రుచిని తెలిసికొనుటెట్లు? జంతువులలో కన్పించిన కార్యము మనుష్యులలో ముఖ్యముగా రోగావస్థలో నదేవిధముగా నుండుననుటకు వీలుకాదు. ఏలయన నాడీయంత్ర నిర్మాణము (Nervous machanism) వేర్వేరుగా నున్నది. ఇంతవరకు పాశ్చాత్యులకు తెలిసిన దొక్క తిక్తరసము మాత్రమే. అను భవము ద్వారా నిది ఆకలి పుట్టించును. ఆహార జీర్ణమునకు తోడ్పడుచున్నది. జ్వరతాపము తగ్గించగలదని చెప్పినారే గాని యీ కార్యము లెట్లు సంభవమగుచున్నవో వివరించ లేకున్నారు. హోమియోపతి వైద్యశాస్త్ర నిర్మాతలు కొన్ని వందల ద్రవ్య గుణములను అనుభవ పూర్వకముగానే కని పెట్టినారు. ఆయుర్వేదజ్ఞులు పంచభూత, త్రిదోష, షడ్రస సిద్ధాంతముల ననుసరించి జిహ్వేంద్రియ సాయముతోనే యపరిచిత ద్రవ్య గుణమును యవలీలగా చెప్పగలరు.

మరియు ద్రవ్యకార్యము పదార్థములయొక్క రస, గుణ, వీర్య, విపాక, ప్రభావము లనెడు అయిదు విషయము లను పురస్కరించుకొని జరుగుచుండును. రసము (రుచి) ను గురించి త్రిదోషముల సంబంధమును విపులముగా చర్చించి

తిమి. ఇక మిగిలిన వాటికి త్రిదోషములకు సంబంధమును తెలిసికొందము.

*గుణము:- ప్రతి ద్రవ్యమును సత్వ, రజ, తమో గుణము లాశ్రయించుకొనియున్నవి. ప్రకృతికి సంబంధించిన నీ గుణములు ప్రకృతి పరిణామములైన పంచభూతముల ననుసరించి ద్రవ్యములో ప్రవేశించుచున్నవి.

ఈవరుసను మనకు త్రివిధ ఆహారపదార్థములు లభించుచున్నవి. నిత్యముగా సాత్వికాహారములు భుజించుచుండిన సత్త్వగుణము, రాజసాహారమును తినుచుండిన రాజసగుణము, తామసాహార భుక్కులకు తమోగుణములు వృద్ధిచెందుచుండుట విశేషమని చెప్పవలెను. ఈవిజ్ఞానము పాశ్చాత్యుల పథ్యశాస్త్రములో (dietology) లేదు. ఆహారము శరీరమునే గాక మనస్సునుగూడ పోషించుచున్నదను విషయము పరిచితముగానే యున్నది. ఈ త్రిగుణములకు త్రిదోషములకు సంబంధ మెట్టిదనిన సాత్వికాహారము త్రిదోషములను సమస్థితిలో నుంచును. రాజసాహారము వాతపిత్త వృద్ధిచేయును. తామసాహారము కఫమును వృద్ధిచేయుచున్నది.

వీర్యము:- ఆహారపదార్థములలో కొన్ని ఉష్ణవీర్య ప్రధానములుగాను, మరికొన్ని శీతవీర్య ప్రధానములుగా నున్నవి. వీర్యనిశ్చయము అనుభవముద్వారా తెలియవలసి

* శ్లో|| తత్ర సత్వ బహుళ మాకాశం। రజో బహుళో వాయుః। సత్వ రజో గుణ బహుళోऽగ్నిః। సత్వతమోగుణ బహుళా అపః। తమో బహుళా పృథివీతి|| (సుశ్రుత. శారీర 1అ. 110శ్లో)

యున్నది. ఉష్ణవీర్య ద్రవ్యములు పిత్తమును, శీతవీర్య ద్రవ్యములు కఫమును వృద్ధిపరచును.

విపాకము:- విపాకమనగా మధురాదిరస ద్రవ్యములు జఠరాగ్నిచేతను పక్వముకాగా నాపదార్థములకు క్రొత్త రుచులు పుట్టును. ఈమార్పునకు విపాకమని పేరు. ఈవిధముగా షడ్రసయుక్తద్రవ్యములు మూడువిధములైన విపాకముల జెందుచున్నవి (1) మధురవిపాకము ఆమాశయములో జరుగును. ఇందులోనుంచి కఫము పుట్టుచున్నది. (2) ఆమ్ల విపాకము గ్రహిణిలో జరుగుచున్నది. ఈద్రవ్యములోనుంచి పిత్తముపుట్టును. (3) కటువిపాకము సన్నప్రేగులలో జరుగుచున్నది. ఇది పెద్దప్రేగులలోకి చేరగా నందుండి వాతము పుట్టుచున్నవి.

ప్రభావము:- ద్రవ్యప్రభావము వర్ణనాతీతము, దీనిని గ్రహించుట కేయుపాయములు లేవు. అనుభవము చేతనే కొన్ని ద్రవ్యముల ప్రభావములు నిశ్చయింపబడినవి. ద్రవ్యమందలి రస, గుణ, వీర్య, విపాకముల ననుసరించిమాత్రమే కాక ద్రవ్యములోనుండిన యద్భుతప్రభావముచేతను ప్రకోపించిన దోషములుశమించి స్వస్థత చేకూర్చునట్టి ద్రవ్యకార్యమును ప్రభావమందుము.

పాశ్చాత్యుల ఔషధద్రవ్య నిఘంటువులలో (మెటీరియామెడికా) శరీరములోకి అవి ప్రవేశించినపిదప వివిధ శరీరాంగములమీద వాటి ప్రభావ మెవ్విధముగా ప్రసరించి వాటి కార్యములందెట్టి మార్పులను కలిగించుచున్నవో వివరింతురు. జంతుపరిశోధనలు వారికి ముఖ్యాధారములు.

పిమ్మట అనుభవజ్ఞానముకూడ తోడ్పడును. నిశ్చితజ్ఞానముతో చేసిన చికిత్సాప్రయోగమునకు రేషనల్ లేక సైంటిఫిక్ ట్రీట్‌మెంటు అందురు ఇట్టి కార్యవిజ్ఞానములేకుండ అనుభవముద్వారా రోగము శమించుటకిచ్చిన చికిత్సకు ఎంపిరికల్ ట్రీట్‌మెంటు అని పేరు. ఇట్టిమందుల నింకను వారు వాడుచునే యున్నారు.

## 3వ భాగము

## 1వ అధ్యాయము - ఆయుర్వేదాంతర్గత శారీర విజ్ఞానము.

ఆయుర్వేదములో శారీరవిజ్ఞానమంతయు నొక్కచోట కనిపించదు. సందర్భానుసారముగా నీశాస్త్రవిషయములు చర్చించబడినవి. శారీరస్థానమను పేరుతో సుశ్రుత చరక సంహితలలో వివరించిన విషయములు చాల స్వల్పముగాను సంగ్రహముగా నున్నవి. పాశ్చాత్యులమోడరన్ వైద్యశాస్త్రములో (1) ఎనాటమి (Anatomy) శరీర రచనాపద్ధతి (2) ఫిజియాలజీ (Physiology) =శారీర యంత్ర వ్యాపారము (3) ఎంబ్రియాలజీ (Embryology) గర్భోత్పత్తి, గర్భవృద్ధిని వివరించుభాగము (4) హిస్టాలజీ (Histology) అనుదర్శిని యంత్రసాయముతో ధాత్వణువులను, కోష్టాంగములకు సంబంధించిన యణువులను వర్ణించిన శాస్త్రభాగము (5) పేథాలజీ (Pathology) అనగా రోగఫలితముగా దేహభాగములందు కలిగిన మార్పులను వివరించు శాస్త్రము. ఇవి వేర్వేరుగా నొక్కొక్క గ్రంథరూపముగా వెలువడినవి. ఈ

చివరి రెండుభాగములకు చెందిన విజ్ఞానమాయుర్వేద శాస్త్రములో లేదు. ప్రకోపించిన త్రిదోషములు ఒక్కొక్కవిధమయిన శరీరధాతువులను చెఱచి వ్యాధులను కలిగించుచున్నవని సూచించినారుగాని యీసంగ్రహవిషయములకు పాశ్చాత్యుల పెథాలజీ శాస్త్రము వ్యాఖ్యానము కాగలదు. కనుక నీవిజ్ఞాన విషయములను ఆయుర్వేద వైద్యులు నేర్చుకొన్నచో వారివిజ్ఞానము మరింత వికసించగలదు.

సుశ్రుత శారీరస్థానములోని విషయములు మిగుల శ్రేష్ఠములుగా నున్నవి. ఇందులో పేర్కొనిన శరీరాంగ ప్రత్యంగ విభాగములను పాశ్చాత్యుల ఎనాటమీలోని పేర్లతో సమన్వయించుకొని చదువుట మంచిపద్ధతి. ఆయుర్వేద తంత్రకర్తలు శారీరశాస్త్రములో ప్రత్యక్షవిషయములను (Physical and metaphysical) చేర్చి వివరించిరి. ఫిజియాలజీ విషయములు శారీరస్థానములో సంగ్రహముగాను రోగనిదాన, చికిత్సాస్థానములలో వాటిసందర్భములు వచ్చినప్పుడు విస్తరించి వ్రాసియున్నారు. వాటి రచనాపద్ధతి ఆయుర్వేద సాంప్రదాయానుబద్ధమై త్రిదోషముల సామ్యవ్యాపారములుగా కనిపించును. ఆవివరములను నేటి మోడరన్ ఫిజియాలజీ విషయములతో సమన్వయపరచుటవసరమగును. గర్భశాస్త్రవివరములను పరికించిన వారికి పాశ్చాత్యులు వర్ణించినంతగా లేకపోయినప్పటికిని, యున్నసంగ్రహవిషయములలో కొన్ని పాశ్చాత్య పండితులను ముగ్ధులనుగా జేయుచున్నది.

సుశ్రుతుడు శవపరీక్షచేసియే ప్రత్యక్షవిషయములను

అంగప్రత్యంగములను పేర్కొనెను. శవపరీక్షావిధానమింకను చెప్పబడినది. వేదవాదుల యభిప్రాయములను సంగ్రహించి సాంఖ్యన్యాయాది దర్శన శాస్త్రములననుసరించెను. యోగ శాస్త్రము నిముడ్చుకొని యుపనిషదభిప్రాయముల గ్రహించెను. ఒక్కహిందూమతమునేగాక జైన బౌద్ధ చార్వాక మతములకు చెందిన యభిప్రాయములనుకూడ పొందుపఱచెను కనుక నొక్కొక్క విషయమును చర్చింతము.

1. శరీరశబ్దనిర్వచనము : పాశ్చాత్యులు శరీరము లేక దేహమును మాత్రమే గ్రహించి ప్రత్యక్షవిషయములను మాత్రమే యతి విపులముగా వర్ణించిరి. ఆయుర్వేదశాస్త్రములో శరీరమనగా జీవశరీరముకాదు. కళేబరములేకశవము మాత్రమే కాదు. ఆత్మేంద్రియములతోకూడిన పాంచభౌతిక దేహమును శరీరమని నిర్వచించినారు. ఆత్మ వినా మిగిలిన యింద్రియ సహితదేహము ప్రకృతిజన్యము. "శీర్య"యితి శరీరః అని శబ్దోత్పత్తి. అనగా క్షణక్షణమునను నాశనమగుచున్నదిదేహము. అనగా నాశనము ప్రకృతిసంబంధమయిన దేహమునకే గాని యాత్మకుకాదు. దీనివలన దేహాణువులలో నిత్యము మార్పులు జరుగుచుండుననిభావము.

---

P. 86 "The correllation between matter, senses and mind, is however, not developed in Modern sciences to the extent and in the manner developed in the wisdom of ancient seers of India where it serves to bring the knowledge of the physical, physiological and psychological sciences into close relationship with one another as parts of one integrated whole - that fundamental onness where there is unity of all knowledge". (The New Back-ground of Science, 1943, page 13)

2. ఆత్మవిజ్ఞానము: అద్వైతమత సిద్ధాంతము. పరమాత్మయొక్క ప్రతిబింబము లనేకములుగా కన్పించుచున్న జీవాత్మలని ఆయుర్వేదతంత్రకర్తల యభిప్రాయము. జీవాత్మను పురుషవాచ్యముగా నుదహరించిరి. జీవుడు యింద్రియములకు గోచరించక ప్రకృతి సంబంధమయిన దేహము యింద్రియములతో సంబంధమును కలిగి వాటిని చేతనావంతములుగా చేయుచున్నాడని చెప్పిరి. వేదాంతుల మతమునకు భిన్నముగా జీవాత్మ అస్వతంత్రగతుడనియు, కర్తయు, భోక్తయు, సాక్షియు తానే యగుటవలన నీకర్మపురుషుడు చికిత్సలను పొందుట కర్హుడని చెప్పిరి.

3. శరీరతత్వములు (constituents of the body-elemets) 1. ఆత్మపదార్థము 2. అనాత్మపదార్థము. అనాత్మపదార్థమును ప్రకృతియందురు. ఈ ఆత్మానాత్మవివేకము ఒక్క వైద్యునకేగాక యోగాభ్యాసకులకును, వేదాంతులకు కూడ నవసరమై యున్నది. ప్రపంచమందలి సృష్టిపదార్థములన్నియు పాంచభౌతికములు గనుక అవ్యక్తమని చెప్పబడుచున్న మూలప్రకృతి, సత్వరజస్తమో గుణములతో కూడినదై పురుషసంబంధముచేతను చైతన్యవంతమై ఏకాదశేంద్రియములుగాను, పంచభూతములుగాను పరిణమించినది. కనుక వైద్యునికి పంచభూతోత్పత్తిక్రమము, వానిలక్షణములు,

P. 86 "The scope of science is to assertain truth in every possible branch of knowledge; there is no sphere of inquiry which lie outside the legitimate field of science. To draw a distinction between science and philosophy is obscurantum". (Grammer of science, third edition, Vol 1 page 37)

యింద్రియముల లక్షణములను తెలియవలసి యున్నది. ఇందు వలన భౌతిక, శారీరక, మానసిక శాస్త్రములు పరస్పర మాలింగన మొనర్చుకొని యివన్నియు నొకే మూలాధారము నుండి పుట్టిన శాఖలా యనిపించును. కనుక హైందవుల యొక్క ఏయొక్క శాస్త్రము నందుకొన్నను అది మూలాధార స్థానమునకు గొనిపోవును. ద్రవ్యము, యింద్రియములు, మనస్సులయొక్క సంబంధము ఆధునిక శాస్త్రములలో ప్రాచీన హైందవవిజ్ఞాతల బుద్ధిమేరకు యింకను వృద్ధికాలేదు. అన్యశాస్త్రవిషయముల నాయుర్వేదములో నిజికించుట తంత్ర మర్యాద కాదనువారికి *కార్లుపియర్సన్ గారి ప్రవచనములు — మానవవిజ్ఞానమునకు తోడ్పడును. సత్యవిషయములను నిరూపించుటయే శాస్త్రముయొక్క ప్రయోజనము. శాస్త్ర చర్చలోకి రాకుండ యేయొక్క విషయము మిగిలియుండదు. కనుక శాస్త్రమునకు వేదాంతము, మతవిషయములను విభేద ములు కల్పించుట తెలివితక్కువ - అని చెప్పిన దానిని గమ నించమని కోరుచున్నాము.

---

*"Modern science has made some of its leading lights to recognise that it is not possible to keep physics, metaphysics and philosophy in water-tight compartments as they did before and to intersperse or conclude their contributions and books on the physical and Biological sciences with open and direct references to metaphysical, philosophical and religious topics."

అవ్యక్తం లేక త్రిగుణాత్మక

మూలప్రకృతి+పురుష

|

మహత్ (బుద్ధితత్వం)

|

అహంకారం

|

స్వాతికాహంకారం   రాజసాహంకారం   తామసాహంకారం

ఏకాదశేంద్రియములు.

5 జ్ఞానేంద్రియములు
5 కర్మేంద్రియములు
1 మనస్సు
11

| శబ్ద. | స్పర్శ | రూప | రస | గంధ | తన్మాత్రలు (గుణములు) |
|---|---|---|---|---|---|
| ఆకాశ | వాయు | తేజ | అప్ | పృధివి | భూతములు |

మనశరీరము, ఆత్మను మినహాయించగా, 24 తత్త్వములతో కూడినది. అవి ఎవ్వి యనగా:— 11 ఇంద్రియములు

పంచభూతములు, అవ్యక్తం, మహత్, అహంకారం, పంచ తన్మాత్రలు. ఈ చివరిఎనిమిదిన్ని అష్టప్రకృతులనబడును. పంచభూతములు, ఏకాదశేంద్రియములు కలిసి షోడశవికార ములనబడును. మొత్తము 24 తత్త్వములు. ఆత్మతో కలిసి 25 తత్త్వము లగుచున్నవి. కొంతమంది ప్రకృతి సంబంధమయిన త్రిగుణములను చేర్చి 28 తత్త్వములనుచున్నారు. ఆత్మను మినహాయించి మిగిలిన 27 తత్త్వములను ఆయుర్వేద తంత్ర కారులు పౌరాణిక గాధలలో దక్షప్రజాపతి కూతుళ్లనుగా చిత్రించి, చంద్రునికివివాహమొనర్చెనని చెప్పిన విషయమును కూడ క్షయరోగ సంప్రాప్తి సందర్భమున నుదహరించినారు. ఈకథను శారీరదృష్టితో మన మన్వయించుకొన్నప్పుడు, మన శరీరమును దక్షునిగాను, 27తత్త్వములను దక్షునికూతుళ్లుగాను, యీతత్త్వములన్నిటిని సమముగా పోషించుచున్న సోమగుణ ప్రధానమయిన ఓజస్సును చంద్రునిగాను భావించవలసి యున్నది. అహంకారతత్త్వమును రోహిణికన్యగా భావించు కొనినచో దీనితో అనగా అహంకారజన్యములైన రాగాదులు వల్ల దుష్టమైన వేడిపుట్టి, సోమగుణముకలిగిన ఓజస్సు క్షీణిం చగా శరీరధాతువులు క్షీణించును. ఇదియే క్షయరోగకారణ మని చెప్పిరి. ఈవిధముగా పౌరాణికగాధను తత్త్వపరంగాను, ఆయుర్వేదశాస్త్ర పరంగాను అన్వయించవచ్చును. అప్పుడీ మూడింటికి పరస్పర సంబంధము కలిగి సత్యవిషయము నిర్ధా రణ చేయబడును. ఇదే విధముగా జ్వరసంప్రాప్తి విషయ మున చెప్పిన రుద్రకోపము జ్వరమగుటనుకూడ బోధించ వచ్చును. ఇట్లే నేటి అణుపరిశోధకులు చెప్పుచున్న న్యూక్లి యర్ ఏటమ్ నందలి నెగెటివ్ ఎలెక్ట్రానులు కేంద్రమందున్న

పోజిటివ్ ఎలెక్ట్రానుల చుట్టును పరిభ్రమించు దృశ్యమును మన పూర్వులేనాడో తెలిసికొని పామర రంజకముగా నుండు నటుల రాసక్రీడలను సృష్టించియుందురు. అహల్యగాథను వ్యవసాయాత్మక దృష్టితో కొందఱును, అధ్యాత్మపరముగా మఱికొంతమంది బుద్ధిమంతులును అన్వయించుచుందురు.

4. శరీరప్రకృతులు : మనశరీరములోకి వాతపిత్తకఫములు రెండు విధములుగా చేరుచున్నవి. 1. గర్భోత్పత్తికాలమున తల్లిదండ్రుల వాతపిత్తకఫాంశలు రజోబీజములతో కలిసివచ్చి గర్భములో ప్రవేశించును. 2. ఆహారపదార్థములలోనుంచి క్రొత్తగా ఎప్పటికప్పుడు వాతాదులు పుట్టుచు, క్షీణించుచు, మళ్లీయన్నము భుజించి నప్పుడు పుట్టుచునేయుండును. మొదటివిధముగా చేరిన వాతాదులు సుస్థిరములు. ఎక్కువతక్కువలుగా నుండినను శరీరమునుబాధించవు ఆహారజనితదోషములే సమముగా వ్యవహరించినంతకాలమారోగ్యముగా నుందుము. మిథ్యాహారవిహారముల చేతను దూష్యమందినప్పు డివి రోగహేతువులగును. సుస్థిరములుగా నుండి పైతృకసంబంధమైన వాతాదులనే ప్రకృతులందుము. వాటిలో నంశభేదములనుసరించి సప్తవిధప్రకృతులకు చెందినవారున్నారు. (1) వాతాధికప్రకృతి (2) పిత్తప్రకృతి (3) కఫప్రకృతి (4) వాతపిత్త (5) వాతకఫ (6) పిత్తకఫ (7) మూడును సమముగా నుండినచో సన్నిపాత ప్రకృతి యందుము. రోగనిదాన చికిత్సలకు వైద్యునకు రోగియొక్క ప్రకృతి నిర్ణయ మవసరమగుచున్నది. రోగియొక్క శారీర మానసికలక్షణములనుబట్టి రోగి ఏప్రకృతికి చెందినవాడో తెలిసికోవచ్చును.

ఇంకను మనశరీరములోకి ఆహార పానీయములద్వారా ప్రవేశించుచున్న పంచభూతములయొక్క పరిమితులలోని తారతమ్యమువలనకూడ పంచవిధ ప్రకృతు లేర్పడుచున్నవి. (1) నాభసప్రకృతి (2) వాయుభూతప్రకృతి (3) తేజోభూత ప్రకృతి (4) అప్ భూత ప్రకృతి (5) పార్థివప్రకృతులను వారి శరీరాకార చేష్టలనుబట్టి గ్రహించవచ్చును.

మరియు సత్త్వరజస్తమోగుణాంశ భేదముల చేతను 7గురు సాత్త్విక ప్రకృతులు, 6గురు రాజసప్రకృతులు 3గ్గురు తామసప్రకృతులు గలవారుగా జనించుచున్నారు. ప్రపంచములోని మనుష్యులందఱిని యీ 16 ప్రకృతులు గలవారిగా గుర్తించుచు వచ్చిరి. ఈ 16 ప్రకృతుల మనుష్యులకు సాదృశ్యము ననుసరించి ప్రత్యేక నామము లియ్యబడినవి ఆపేరుల తోనే వారి గుణములను గ్రహించగలము.

శరీరమానసిక ప్రకృతుల గ్రహించుటకు ది స్టడీ ఆఫ్ కాన్‌స్టిట్యూషన్స్ (study of constitutions) అని పేరు. మోడరన్ వైద్యశాస్త్రములోకంటె హోమియోవైద్యులు రోగులయొక్క ప్రకృతిని కనిపెట్టుటకు ఎక్కువ శ్రద్ధ చూపుచున్నారు. దీనికి వారు ఇండివిడ్యులైజేషన్ ఆఫ్ పేషెంటు (individulisation of patient) అందురు. పాశ్చాత్య వైద్యులు (Modern Medicine Practioner) ఇప్పుడిప్పుడే రోగచికిత్సకొఱకు రోగియొక్క ప్రకృతిని నిశ్చయించుటవసర మని గుర్తించుచున్నారు. అంతర్వాహినీగ్రంధులలో నూరుచున్న వివిధరసములు (Hormone secretions from ductless glands) శారీర, మానసిక, జీవకార్యములకు

చాల ప్రధానములుగా నున్నటుల చెప్పుచున్నారు. రక్తపు పోలికల ననుసరించిన వర్గీకరణము రక్తములో కనుపించిన కొన్ని హార్మోన్ ద్రవములను బట్టి నిర్ధారణ గావించు చున్నారు. ఈమధ్యను క్రొత్తగా కనిపెట్టబడిన ఆర్ హెచ్ ఫేక్టరు (Rh factor) లా ఆఫ్ జెనిటిక్సు ప్రకారము పైతృకలక్షణముగా భావించు చున్నారు. పుట్టుకతోనే కొందఱికి హార్మోన్ గ్రంథులు విపరీతమయిన చురుకుతో పని చేయుచుండును. ఇట్టివారికి ఆయాగ్రంథులకు చెందిన ప్రకృతి గలవారందుము. ఈవరుసను (1) పిట్యూటరీ గ్రంథిప్రకృతి (2) థైరాయిడ్ గ్రంథిప్రకృతి (3) ఎడ్రినల్ గ్రంథిప్రకృతి (4) మిశ్రమ గ్రంథుల ప్రకృతి అని అయిదు రకముల ప్రకృతులను గుర్తించినారు. ఇట్టివారి మానసిక ప్రవృత్తులనుబట్టి మూడురకముల టెంపరమెంట్సు (Temperaments) గల వారిగా విభజించిరి. వారిని (1) నెర్వస్ టెంపరమెంటు(వాత ప్రకృతి) (2) బిలియస్ టెంపరమెంటు (పిత్తప్రకృతి) (3) ఫ్లెగ్మేటిక్ టెంపరమెంటు (శ్లేష్మప్రకృతి వారుగా మనము పోల్చవచ్చును.

## 5. ఇంద్రియములు

ఇంద్రియముల సంఖ్య పదకొండు. 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 1 మనస్సు. త్వక్చక్షుశ్శ్రోత జిహ్వా ఘ్రాణములు పంచజ్ఞానేంద్రియములు. వాక్పాదపాణి పాయు పస్థలు పంచకర్మేంద్రియములునై యున్నవి. శబ్దస్పర్శ రూప రసగంధములు జ్ఞానేంద్రియములకు విషయములు. వచనా దానగమన విసర్గానందములు కర్మేంద్రియ క్రియలునై

యున్నవి. మనస్సంబంధము లేకుండ యింద్రియములు స్వతంత్రముగా పనులు చేయజాలవు. కనుక మనస్సును ఉభయేంద్రియ మని చెప్పుదుము. మనస్సు ఒకసారి యొకే యింద్రియముతో సంయోగించి కార్యముల జేయించును. ఏకకాలములో బహుయింద్రియములతో నేకీభవించజాలదు. మనస్సు జ్ఞానేంద్రియములద్వారా విషయముల ననుభవించి యాత్మకు నివేదించగా నావిషయము లాత్మానుభవమునకు వచ్చును. ఆత్మ ప్రబోధితములను మనస్సు గ్రహించి కర్మేంద్రియముల కాజ్ఞాపించగా కార్యాచరణమగుచుండును. మనస్సుయొక్క ప్రధానకార్యము సంకల్పము. సంకల్పిత విషయములయొక్క మంచిచెడ్డలను బుద్ధి నిశ్చయించును. బుద్ధి మనస్సుల నొకే ద్రవ్యముగా పరిగణించుటకలదు. ప్రత్యేక విశిష్ట కార్యశక్తులననుసరించి యొకే దానికి రెండుపేర్లు వాడబడుచున్నవని కొందఱి యభిప్రాయము. సాంఖ్యమతస్థులు బుద్ధి మనస్సులను వేర్వేరు ద్రవ్యములుగా పరిగణించిరి. ఇందుకు వారు అయిదు కారణములను చెప్పుచున్నారు.

| మనస్సు | బుద్ధి |
|---|---|
| 1. మనస్సు యింద్రియములకు పంచభూతసంబంధమున్నది. | 1. బుద్ధికి యాత్మసంబంధ మున్నది. |
| 2. మనస్సునకధిష్ఠాత–చంద్రుడు | 2. బ్రహ్మయధిష్ఠానదేవత. |
| 3. సాత్వికాహంకారమునుండి మనస్సు యింద్రియములు పుట్టినవి. | 3. మహత్తత్త్వ రూపమే బుద్ధి యనబడుచున్నది. సత్వగుణముకలది. |

4. మనస్సు కార్యములు-సంకల్పము, ప్రయత్నము, కోరికలు. | 4. బుద్ధి కార్యము-విషయ వివేచనము.

5. ధారణాదిశక్తులు లేవు. విషయములను గ్రహించుట మాత్రమే. | 5. విషయములను గ్రహించి ధరించుకొనును. సమయానుకూలముగా స్మృతికి దెచ్చును.

## ఆత్మ, బుద్ధి, మనస్సుల స్థానములు.

ఈమూడు ద్రవ్యము లతిసూక్ష్మద్రవ్యములు. మన యింద్రియములకు గోచరించునవిగావు. గాని మనస్సుచేతనే గ్రహించవలసియుండును. కనుక మనస్సును దివ్యచక్షువని యందురు. ఆత్మయొక్క స్థానం హృదయమని సామాన్యులు తమ చేతిని రొమ్ముపైనుంచి 'యిది నాయాత్మప్రబోధము' నాయాత్మ సాక్షిగా, అని ప్రదర్శింతురు. ఇచ్చటనున్న యాత్మను సంవిత్ హృదయమని కొందఱు చెప్పుదురు. సుశ్రుతుడు హృదయము (Heart) చేతనాస్థానమని చెప్పెను. జీవాత్మ లేక ప్రత్యగాత్మ, పరమాత్మ లొక్కటేయని చెప్పినను జీవాత్మకు ప్రకృతితో సంబంధమున్నది. పరమాత్మకు లేదు. పరమాత్మ చేతనారూపము. నిర్గుణుడు. జీవాత్మ చేతనాయుతుడయ్యును త్రిగుణములతో కలిసియుండును. చేతనాపదార్థము యింద్రియముల కగోచరము. దాని కార్యములను యింద్రియములు గ్రహించును. "పద్మకోశ ప్రతీకాశగ్ం" హృదయం చాప్యధోముఖం......" అని చెప్పిన శ్రుతిపాఠములో హృదయకోశము చివరభాగమందున్న సన్న

రంధ్రములో "నీవారశూక" ప్రమాణమున పీతాభమయిన జ్యోతిమధ్యను నీలవర్ణముతో ప్రకాశించునది యాత్మయని దివ్యచక్షువుతో చూచి చెప్పిన విషయము. ఆత్మబుద్ధి మన స్సంధానములో బుద్ధి మనస్సులు నశించినను ఆహారము ద్వారా శరీరమును పోషించుచుండిన జీవించవచ్చును. దేహమునుండి జీవాత్మయొక్క వియోగమే మరణము. ఇది దేహములోకి శుక్రబీజముతో కలిసి ప్రవేశించును. నాల్గవ మాసమున ఆత్మ మనఃకార్యములు ప్రస్ఫుటమగుచుండుట వలన గర్భమునందు నాల్గవమాసమున ప్రవేశించునని తలం చుట కలదు.

ఆధునిక శాస్త్రజ్ఞులు ఆత్మబుద్ధిమనస్సులు ప్రతి యొక్క దేహాణువులోనున్నవని పరిశోధనల పూర్వకముగా ఋజువుచేసినారు. గనుక ఆత్మ సర్వాంతర్యామి యున బడును. వీరి ఫిజియాలజీ గ్రంథములలో శిరస్సులోపల మెదడు పార్శ్వములందు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ కేంద్రము లున్నవని నిరూపించిరి. (Motor and sensory centres)

## 2 వ అధ్యాయము

## దేహవిచయ జ్ఞానము (ఎనాటమి Anatomy)

1. సప్తత్వక్కులు:-(Layers of the skin) చర్మము కొన్నిపొరలతో నిర్మింపబడినదని నాలుగువేల యేండ్లక్రిందట సుశ్రుతుడు వానిపేర్లను, ఒక్కొక్కదాని దళసరియున్న, యేపొరలోనుంచి యేయేరోగములు పుట్టుచున్నవో వివరించి నాడు. ఈవిజ్ఞానము ఆధునికులను చకితులనుగా చేయక

మానదు. ఏలయనగా పాశ్చాత్యదేశములలో శారీరపరిశోధ కులకు అణుదర్శినియంత్ర (మైక్రోస్కోపు) సాయము లభిం చిన పిమ్మట చర్మపు పొరల గురించిన జ్ఞానము లభించినది.

2. సప్తకలలు:-కలాశబ్దమునకు సన్నని పొరలని యర్థము. ఇవి శరీరములోపల ధాత్వాశయములమధ్య కన్పిం చును. ఈపొరలు లెక్కకుమించి కన్పించుచున్నను, వాని నన్నిటిని ఏడు వర్గములుగా విభజించుట సుశ్రుత శారీర ములో చూడవచ్చును.

ఈసప్తకలలను గుర్తించి ఆధునికుల శారీరగ్రంథస్థ విషయములతో సరిచూచుట విద్యార్థుల కవసరమగును.

(1) మాంసధరాకల:— మాంసకండరములకు వెలుప లను, దానిలోపల మాంసరేసుల చుట్టును కన్పించుచున్న సన్నని పొరలు. దీనిని మస్క్యులర్ ఎపానిరోసిన్ (Muscular aponirosis) అని వ్యవహరింతురు.

(2) రక్తధరాకల:-రక్తపు గొట్టములకు వెలుపల, లోపల భాగముల, సన్నపొరలు కనిపించును. ఈరెండు పొర గొట్టముల మధ్యను మాంసపుపొర యుంగరములుగా నిమిడి యున్నది. వెలుపలి పొరగొట్టమునకు ట్యూనికా ఎక్స్టర్నా (Tunica externa) అనియు, లోపలిపొర గొట్టమునకు ట్యూనికా ఇంటర్నా (Tunica interna) అనియు నందురు. ఈలోపలిపొర గొట్టమునే రక్తధరాకల యని చెప్పవలెను. దీని ననుసరించి రక్తము ప్రవహించుచున్నది. ఈపొర తెగిన గాని రక్తము బయటికి స్రవించదు.

(3) శ్లేష్మధరాకల:-ఈసన్నపొరలు అస్థిసంధులచుట్టు నావరణగానున్నవి. వీనిలోనుంచి చమురువంటి ద్రవమూరుచు ఎముకలు అరిగిపోకుండ కాపాడుచున్నది. ఈసంధిపొరలకు సైనోవియల్ మెంబ్రేన్సు యందురు. ఆద్రవము సైనోవియల్ ఫ్లూయిడ్, ఇంకను మాంసకండలు ఎముకల నతుకుకొనుచున్న స్థలములందు నిట్టిద్రవము కన్పించును. సదా చలించుచుండు భాగములందిట్టి పొరలున్నవి. ఆభాగములు సుళువుగా చలించుటకుగాను నీపొరలలోనుండి జిగురు ద్రవము లూరుచుండును. ఈవిధముగా ప్రాంతీయ నామములతో వ్యవహరించబడిన పొరలన్నిటిని శ్లేష్మధరాకలలుగా భావించవచ్చును. అందులో ముఖ్యమైనవి:- మస్తిష్క పొరలు (Cerebral meningeal menbranes), ఊపిరితిత్తుల చుట్టునున్నపొరలు (ప్లూరా Plura) హృదయకోశము చుట్టునున్న పొరసంచి (పెరికార్డియం), ఉదరములోపల నంతటను ఆవరణపొరగానున్న పెద్దపొర దీనికి పెరిటోనియం (Peritoniam) అనిపేరు. యకృత్ప్లీహములు, ఆమాశయము, ప్రేగులు యీపొరయొక్క యావరణలోనున్నవి. మూత్రపిండములు, మూత్రసంచి గర్భాశయ యంత్రభాగములు యీపొరకు వెలుపలనున్నవి.

(4) పురీషధరాకల :- ఇది పెద్దప్రేగులలోపలి భాగమందున్న సన్నపొర, అన్నమలము ద్రవరూపముగా నిచ్చటకు వచ్చినపిమ్మట యిందలిపొర, నీటినంతను పీల్చుకొని మలమును గట్టిపరచుచున్నది.

(5) పిత్తధరాకల :- పిత్తస్థానము గ్రహణీభాగము

(Duodenum) ఇచ్చట లోపలిపొరలలో నుంచి ఎంటిరోకి నేస్ (enterokinase) అనెడు ద్రవముపుట్టి దూతకార్యము సల్పుచు పేంక్రియాస్ గ్రంధిలోనుంచి అన్నజీర్ణరసమును తీసికొని వచ్చును. పాచకపిత్తాంశలను గొనివచ్చుటకు సాధనముగానున్న యీపొరయే పిత్తధరాకల కాగలదు.

(6) మేదోధరాకల:- మేదస్సు అనగా క్రొవ్వు, చముఋలు. జీర్ణాంతమున క్రొవ్వుగా తయారై శరీరములో కొన్ని పొరల నాశ్రయించి గ్రంధిరూపములుగా నిలవయుండును. లంఘన సమయమున నిది కాలిపోయి శరీరమునకు వలయు వేడిని శక్తిని యిచ్చుచుండును. చర్మముక్రిందను, మాంసము లోపలను, పెద్దఎముకల లోపలను కూడ నిలవయుండును. ఉదరము లోపలప్రేగులను కప్పి వ్రేలాడుచు క్రొవ్వుపొర కన్పించును. దీనికి జల్లిపొర లేక ఝిల్లిపొర యందురు. యింగ్లీషున ఒమెంటమ్ (greater and lesser omentum) అనిపేరు.

(7) శుక్రధరాకల:- శుక్రము (ధాతువు) రక్తముతో కలిసి సర్వశరీర భాగములందును పిల్లలకు పెద్దలకు స్త్రీలకు కూడా సంచరించుచుండును. కాన నీశుక్రధరాకలను వివరించుట కష్టము. సూక్ష్మరూపముగా సంచరించుచున్న శుక్రధాతువులోనుంచి పురుషులలో యుక్తవయస్సు వచ్చిన పిమ్మట వృషణగ్రంధులలోపల స్థూలశుక్రద్రవ మూరుచున్నది. కనుక నీ బీజముల లోపలి సన్నపొరలను శుక్రధరాకలయని చెప్పవచ్చును. పురుషులలో శుక్రప్రవర్తకనాడుల వర్ణనము ప్రత్యక్ష శారీర విషయమునకు సరిపోవుచున్నది.

3. కోష్ఠాంగములు (Visceral or gans):- (సుశ్రుత శారీరము).

(1) యకృత్ప్లీహములు (Liver and Spleen) యకృత్ కుడిడొక్క ప్రదేశములో (Right hypochondriac region) ఊపిరితిత్తులకు దిగువను దిగువ 6 ప్రక్క ఎముకలు (Ribs) చాటున యున్నది. ప్లీహము ఎడమవైపున కొంచెము వెనుకతట్టున 9,10,11,12 ప్రక్కఎముకలచే కప్ప బడి యున్నది. ఈ రెండును రక్తాశయములని ఆయుర్వేదము పేర్కొనినది. వీనిలో రంజికపిత్తమున్నదని చెప్పినారు. నిజమే. పాశ్చాత్య శారీరశాస్త్రముకూడ రక్తకణములు యకృత్ప్లీహములలో పుట్టుచున్నవనియు, యకృత్ రక్తము నకు ఎరుపురంగు నిచ్చుచున్న హిమోగ్లోబిన్ పదార్థమును తయారుచేయుచున్నదనియే చెప్పిరి. ఇంకను యకృతునకు సుమారు 20 పనులున్నటుల ఆధునికశాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు. వాటిలో ముఖ్యమైనవి:-

(ఎ) పిత్తరసమూరుట (Bile secretion).

(బి) గ్లైకోజనిక్ ఫన్క్షన్ (Glycogenic function) అనగా నాహారమందలి స్టార్చి యంశలు ప్రేగులలో జీర్ణరస ములతో కలిసి గ్లూకోజుగా తయారై యకృత్ లోనికి పోయి నప్పుడు దానిని యకృత్ గ్లైకోజన్‌గా మార్చి నిలవ యుంచును. తిరిగి దానిని కావలసినప్పుడు కొంచెము కొంచె ముగా గ్లూకోజుగా మార్చి ధాత్వణువుల కందించును.

(సి) చమురుపదార్థములను క్రొవ్వుగా మార్చివేయుట.

(డి) ప్రొటీను సంబంధమయిన కిట్టపదార్థములను

బహిష్కరించుటకు వాటిని మూత్రీకాలవణములుగా మార్చుట.

(ఇ) విషపదార్థములను నిర్విషములుగా మార్చి వేయుట.

ఈవిషయము లన్నిటి నాయుర్వేదవిద్యార్థి తెలియవలసి యున్నది.

(2) పుప్ఫుసములు:- (Lungs) వీని నిర్మాణ వివరము లను పాశ్చాత్య శారీర గ్రంథముల నుండి తెలిసి, శ్వసనకార్య ప్రయోజనమును విద్యార్థులు గ్రహించుటవసరమగును. ఈవివరము లాయుర్వేద గ్రంథములలో కన్పించవు.

(3) ఉందుకము:- ఉదరములో నాభికి దిగువను కుడి పాత్తికడుపులో సన్నప్రేగుతో పెద్దప్రేగు కలియుచున్న సంధిస్థలమున కన్పించుచున్న స్థూలాంత్రారంభమునకు సీకమ్ (Ccacum) అనిపేరు. ఇదియే ఉందుకము కావచ్చును. దీనిని గుర్తించవలసిన యవసర మేమనిన ఉందుకము చివ రను 3 అంగుళముల పొడవున మొండిగొట్టము (appendix) వ్రేలాడుచున్నది. ఇది ఎప్పుడైన వాచి ప్రాణాపాయము కలి గించగలదు. దీని వాపునకు ఎపెండిసైటిస్ (appendicitis) అనిపేరు.

(4) ఆంత్రములనగా ప్రేగులు (intestines)

(5) గుదము=రెక్టమ్ (Rectum)

(6) వస్తి=మూత్రసంచి యని (Urinary bladder) వ్యవహరింతురు. కాని చరకుడు వస్తిశబ్దముచేతను, మూత్ర

పిండములు సహితముగా వాని ననుసరించిన గొట్టములను, మూత్రపుసంచినికూడ కలిపి వాడినట్లు కన్పించును. మూత్ర పిండముల (kidneys) యొక్క ప్రసక్తి ఆయుర్వేదగ్రంథము లలో నెచ్చటను కన్పించదు. మనవారు కిడ్నీసుని (మూత్ర పిండములను) వృక్కలుగా నర్థముచేసికొనుట పొరబాటు. (చూడు యీపుస్తకములో వృక్కవిచారణము).

(7) జిహ్వా=నాలుక (Tongue).

(8) మాంసకండరములు (big musles) పేశీలు (ligaments) స్నాయువులు (Small and long muscles) స్నాయురజ్జులు (musle tendons)

(9) వృక్కలు అనగా ఎడ్రినల్ గ్రంథులు (Adrenal glands) ఇవి మేదోధాతువుతో సంబంధించినవి. 'వృక్కౌ మేదశ్చ' అని చెప్పిన వేదపాఠమును సుశ్రుతుడు గ్రహించి వృక్కమర్మాభిఘాతలక్షణములను వివరించునప్పుడును, వృక్కవిద్రధి లక్షణముల బేరొక్కనినప్పుడును స్థౌల్యాదిలక్ష ణములను చెప్పి, మూత్రవికారముండునని చెప్పలేదు. ఆధు నిక పరిశోధకులు జంతుదేహములలో గురదాలు (kidny) పైనున్న చిన్నగ్రంధులను (adrenalin glands) కొన్నిటి కిని, గురదాలను మరికొన్ని జంతువులకును తీసి చూడగా గురదాలు తొలగించబడిన జంతువులు 24 గంటలలో మూత్రికావ్యాధి లక్షణములతో (Urinary Coma and Convnlsions) చచ్చిపోయినవి. వృక్కలు తీసివేయబడిన జంతువులు చనిపోలేదు. మరింత స్థూలముగా బలిసినవి. ఎడ్రినల్ గ్రంధుల వ్యాపారమునకు చురుకు హెచ్చినచో

(hyper activity of adrenals) చిక్కిపోవుదురు. గనుక మేదోధాతు పరిణామముతో సంబంధమును కలిగిన ఎడ్రినల్ గ్రంథులనే వృక్కలనవలెను. గురదాలను చరకుడు వస్తి శిరస్సులని వ్యవహరించెను. ఇవియే కిడ్నీసు యనబడు మూత్రకారి గ్రంథులు.

(9) వృషణములు:- (టెస్టికిల్సు Testicles) పురుషులలో శుక్రోత్పత్తిచేయు గ్రంథులు. ఇంకొకరకము హార్మోనుద్రవ్యముకూడా పుట్టుచున్నదని ఆధునిక ఫిజియాలజిశాస్త్రము చెప్పుచున్నది. దీనికి స్పెర్మిన్ అనిపేరు. దీని వలన దేహమునకు పుష్టి, మనస్సునకు ప్రశాంతత, ధైర్యము ఓరిమి, నిదానములు కలుగుచున్నవి.

(10) క్లోమము:- ఈశబ్ద మాయుర్వేదములోను వేద వాక్యములలోను తఱచుగా కన్పించును. జలాశ్రయభాగము పిపాసకు స్థానమని చెప్పుటతప్ప మిగిలిన స్వరూపస్థానవివరములు చెప్పియుండకపోవుటచేతను మన శరీరములో నేభాగముగా గుర్తించవచ్చునా? యని ఆధునికాయుర్వేద పండితులు, పాశ్చాత్యశారీర పరిజ్ఞాతలు కూడ వివాదపడుచునే యున్నారు. ఎవరు వాదించుటకైనను సుశ్రుతవాక్యములే ప్రమాణములుగా నున్నవి. అదేమన:- "ఉదకవహేద్వే, తయోర్మూలం తాలు క్లోమచ" అని స్రోతో వివరణ వాక్యమున్ను, స్థల నిర్దేశమును వివరించుటలో తత్ర విద్ధస్యపిపాసా శ్వాసస్యతా సద్యోమరణం", "తస్యాధో వామతః ప్లీహా పుప్పుసశ్చ దక్షిణతో యకృత్క్లోమచ" (సు.శా.4అ). నేటి పండితులకు వాదములనువిడిచి సమరసభావముతో సుశ్రు

తాభిప్రాయమును గ్రహించితిమేని 'హృదయమునకు కుడి ప్రక్కను యూపిరితిత్తికి దిగువను యకృత్తున్ను, క్లోమము లున్నవి' యని తెలియగలదు. అనగా యకృత్ దిగువను ఆమాశయముచేతను కప్పబడిన పేంక్రియాస్ గ్రంధి కన్పించును. పాశ్చాత్య ఫిజియాలజీ పేంక్రియాస్ గ్రంధిలోనుంచి అన్నజీర్ణ కార్యమున కుపకరించు రసమొక్కటియేగాక నిందులో "ఇన్సూ్యలిన్" అనెడు హార్మోనుద్రవముకూడ పుట్టుచున్నదని చెప్పుచున్నది. ఇది పుట్టిన వెంటనే రక్తముతో కలిసి ధాత్వగ్నులకు సాయపడుచున్నది. గ్లూకోజు అంశలను కాల్చివేయు ఫలితముగా నా కార్బోహైడ్రేటు అణువులందలి ఉదజని, ప్రాణవాయువులు (Hydrogen and axpgen) కలిసికొని నీరు ($H_2o$) ఏర్పడుచున్నది. మన రక్తములో నెప్పుడు కొంత పరిమితి నీరుండును. ఏకారణముచేనైన యీనీటి పరిమితి తగ్గినప్పుడు దప్పిక (thirst) పుట్టుచున్నది. ఇది స్వాభావికము. నీరు త్రాగిన వెంటనే తృష్ణ తీరుచున్నది. నిరంతరమయిన పిపాసవ్యాధి డయాబిటీసు మెలిటస్ (మధుమేహము)లో కలుగును. ఈరోగులకు ఏకారణముచేతనో పేంక్రియాస్ గ్రంధిలోని ఇన్సూ్యలిన్ హార్మోనుద్రవమును పుట్టించుచున్న అణువుల సముదాయము (Islands of langerhan) శుష్కించి యీద్రవ్యమును పుట్టించలేకున్నవని శాస్త్రపరిశోధకులు కనిపెట్టినారు. నాటి నుండి జంతుశరీరములలోనుంచి ఇన్సూ్యలిన్ ద్రవమును మధుమేహరోగులకు తాత్కాలికముగా తుష్టిపుష్టి నిచ్చుకొరకు వాడుచున్నారు: కనుక పిపాసా నివారకమయిన ఇన్సూ్యలిన్ పుట్టుటకు స్థానముగా నుండిన పేంక్రియాస్

గ్రంథియే శ్లోమమని చెప్పుట సమంజసము.

## 12. హృదయము (Heart)

ఆయుర్వేదతంత్రకర్తలు దేహము, మనస్సు, ఆత్మ యీ మూడింటిని చేర్చి శరీరమని వ్యవహరించుచు వాటి స్వరూప వ్యాపారములను వేర్వేరుగాను పరస్పర సంబంధములతోను చర్చించినారు. పాశ్చాత్య శారీరశాస్త్రములు అతిముఖ్యమైన ఆత్మ మనస్సులను విడిచిపెట్టి, మాంసాస్థి జాలముతోకూడిన భౌతికదేహమును మాత్రము అతి సూక్ష్మాంశలతోకూడ వివరించినారు. ఇందులో వైద్యున కుపయుక్తవిషయములు చాలతక్కువ. ఆత్మ మనస్సులకు సంబంధించిన విజ్ఞానము వేదాంత మానసికశాస్త్రములకు సంబంధించినదని తలంచి దానిని శారీరశాస్త్రముతో సమ యన్వయించకుండ దూరముగా వెలిబెట్టుట తమ యవజ్ఞతను చాటుచున్నది. ఈమధ్యను పాశ్చాత్యులు శారీరవిజ్ఞానముతో పాటు ఆత్మమనోవిజ్ఞానముల పరస్పర సంబంధములను గుర్తించుచుండుట ముదావహము.

నేడు ఆయుర్వేదపాఠశాలలో చదువుచున్న వైద్య విద్యార్థి ఒక్క సుశ్రుత శారీరగ్రంథమును చదివి మనవారికి హృదయమును గురించిన్ని, రక్తభ్రమణమును గురించిన జ్ఞానము లేదని తలంచుచున్నాడు. కనుక హృదయకోశ మును వర్ణించిన భాగములను కొన్నిటి నిచ్చుట గ్రోడీకరించడ మయినది.

### I హృదయాకారము.

1. "పద్మకోశ సంకాశం సుషిర మధోముఖమ్" (అష్టాంగసంగ్ర)

2. శ్రుతిః- పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యా ముపరితిష్ఠతి।
*హృదయం తద్విజానీయాత్ విశ్వస్యాయతనం మహత్
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ః

3. శ్లో॥ కఫరక్త ప్రసాదాత్ స్యాద్ధృదయం స్థానమోజసః
చేతనానుగ భావానాం పరమం చింతి తస్యచ। మాంస
పేశీచయోరక్త పద్మాకార మధోముఖమ్:—
(అరుణదత్త సర్వాంగసుందరం శా. 3 అ. 12 సూ.)

## II హృదయస్థానము

1. కోష్ఠ వక్షసోః స్తనయోశ్చ మధ్యే
సత్వరజస్తమోధిష్ఠాన మామాశయ ద్వారం హృదయం।
(అష్టాంగ సంగ్రహ శా. 7 అ.)

2. ...ద్వారమామాశయస్యచ। సత్వాది ధామ హృదయం
స్తనోరః కోష్ఠమధ్యగమ్। (అష్టాంగహృదయం శా. [illegible] అ. 13 సూ.)

3. స్తనయోర్మధ్యమధిష్ఠా యోరస్యామాశయ ద్వారం సత్వరజ
స్తమసా మధిష్ఠానం హృదయం నామ తత్ర సద్య ఏవమరణం॥
(సు. శా. మర్మస్థానం. 26 సూ.)

## III హృదయవ్యాపారములు

1. సూ॥ తస్యోప ఘాతాత్ మూర్ఛాయా। భేదా న్మరణ మృచ్ఛతి।
యద్ధితత్ స్పర్శ విజ్ఞానం ధారయ త్తత్ర సంశ్రితమ్ తత్
పరస్యౌజసః స్థానం తత్ర చైతన్యసంగ్రహః। హృదయం మహ
దర్థశ్చ తస్మాదుక్తం చికిత్సకైః॥ (చరక. సూత్ర 30 అ. 5-6 సూ.)

2. సూ॥ షడంగ మంగం విజ్ఞాన మింద్రియాణ్యర్థ పంచకమ్।
ఆత్మాచ సగుణశ్చేతః చింత్యం చహృది సంశ్రితమ్॥
(చరక. సూ. 30 అ. 4 సూ.)

---

* జ్వాల మాలాకులం భాతి (పాఠాంతరం)

## హృదయనాడులు

1. సూ|| తేనమూలేన మహతా మహామూలా మతాదశ
ఓజో వహాశ్శరీరేస్మిన్ విధమ్యంతే సమంతతః

(చరక. సూ. 30వ అ. 4 సూ.)

## IV హృదయకోశము-సిరావ్యాకరణం-రసభ్రమణము

(భేలసంహిత అష్టదశమూలీయాధ్యాయము 20 అధ్యాయం)

1. శ్లో|| అర్థ ఇత్యాః హృదయం తస్మిన్ ధమన్యోదశ। ఊర్ధ్వంచ
తస్రో ద్వేతిర్యక్ చతస్రశ్చాప్యధః క్రమాత్||

2. సూ|| తాభ్యో మూల సిరా స్తిర్య గ్విధ్యంతే నైకధాసిరః। తస్మా
త్తదర్థం విజ్ఞానం స్మృతియోగంచ మానసః||

3. శ్లో|| హృదోరసో నిస్సరతి తస్మాదేవం చ సర్వశః। సిరాభి
ర్హృదయం నేత్రి తస్మాత్తత్ ప్రభవా స్సిరాః||

4. హృది ప్రాణశ్చ చక్రస్థః విమానే కర్ణికా యథా। మర్మా
భిఘాతం తేనాత్ర సహతే హృదయేనతు||

5. పుండరీకస్య సంస్థానం *కుంభికాయాః ఫలస్యచ। ఏతయో
రేవ వర్ణంచ బిభర్తి హృదయం నృణాం||

6. యథా హి సంవృతం పద్మం రాత్రౌ చాహని పుష్యతి। హృత్తదా
సంవృతం స్వప్నే వివృతం జాగ్రతః స్మృతం||

Heart=హృదయము. హృదయమునకు అర్థ, మహత్ అను
నవి పర్యాయపదములుగానున్నవి. హృదయశబ్దమును అనేక
సందర్భములలో హస్తపరముగాను, వక్షమందలి ఊపిరితిత్తుల
నుద్దేశించియు, శిరస్సులోని మెదడును సూచించుటకును,
మనస్సు, బుద్ధి, జీవాత్మలకును వర్తించునటుల మనవారు
ప్రయోగించినారు. సందర్భములనుబట్టి ఆ యా భాగముల

* కుంభికాయాః ఫలం=రామాఫలం

నర్థముచేసికోవలసియున్నది. ఇట్లే 'సిరా' పదము రక్తనాళములకును, నెర్వ్సకును వర్తించును. సిరా, ధమనీస్రోతస్సులను ఈరెండింటికి పర్యాయపదములుగా వాడినట్లే కనిపించును. హృదయశబ్దమును గస రక్తభ్రమణ సందర్భమున హార్టు అనియును, నెర్వ్సలతో సంబంధించిన హృదయమును మెదడు (Brain) గాను, కఠినహృదయమని చెప్పినప్పుడు మనస్సు అనియును, వేదాంతగ్రంథములలో ఆత్మపరముగాను అర్థము చేసికోవలెను.

ఇక సుశ్రుతశారీర విషయము లెంతవరకు హృదయకోశమును గురించి బోధించునో తెలిసికొందము.

"తద్ధృదయం విశేషేణ చేతనాస్థాన మతస్త స్మింత మసావృతే సర్వే ప్రాణిన స్స్వపంతి" (సు. శా. 4 అ. 24సూ) అనగా హృదయము విశేషముగా చేతనాస్థానమని చెప్పినందున యిచ్చట హృదయమనగా మనస్సు అని గ్రహించవలెను. ఈ పై వాక్యమునకు దిగువనే హృదయకోశ వర్ణనము, దాని వ్యాపారము సంగ్రహముగా నీశ్లోకములో బోధించబడినవి. అదేమన:- "శ్లో॥ పుండరీకేన సదృశం హృదయం స్యాదధోముఖమ్॥ జాగ్రత స్త ద్వికసతి స్వపతశ్చ నిమీలతి। ఇచ్చట పుండరీక సదృశహృదయము హార్టు కాగలదు. 'కుంభికాయాః ఫలస్యచ', అని భేలసంహిత చెప్పును. దివ్యదృష్టి ప్రభాసంపన్నులైన ఋషులు సూక్ష్మహృదయమని చెప్పబడు మనస్సును కూడ పద్మముతోనే పోల్చిరి. గనుక—మనః పుండరీకమని చెప్పుదురు.

సుశ్రుత శ్లోకములోని రెండవపాదము హృదయము

తన జాగ్రదవస్థలో వికసించుచుండుననియు, దాని స్వపనా వస్థలో ముడుచుకొనుచుండుననియు చెప్పుచున్నది. ఇది హృదయవ్యాపార మగును, అయితే జాగ్రదవస్థ, స్వపనా వస్థలు మనస్సునకు చెందినవిగదా హార్టున కున్నటుల చెప్పి నేమి కారణమని సందేహము కలుగవచ్చును. మనస్సు హృదయము (Heart) లకవినాభావ సంబంధమున్నదని తంత్రకర్తల యభిప్రాయము. సత్వరజస్తమో గుణావృత కారణముగ మనస్సునకు జాగ్రదవస్థ స్వపనావస్థలు ఒకదాని వెనుక నొకటి నిరంతరము సంభవించుచుండును. సత్వరజో గుణముతో కూడినది చేతనము. తమస్సు నిశ్చేష్టితము. మనస్సుయొక్క యవస్థల ననుసరించుచు స్థూలహృదయమని చెప్పబడు మాంసపిండము (హార్టు) నకు వర్తించుచుండుట జేసి దీనికి నుభయావస్థలు కలుగుచున్నవి. పాశ్చాత్య ఫిజి యాలజీలోకూడ హార్టు మనస్సు ననుసరించి స్పందించుసని యొప్పుకొనిరి. హృత్పిండముకొరకు బండిల్ ఆఫ్ హిజ్ (Bundle of Heiss) అను పేరుతో నొక నాడులతోకూడిన గ్రంధి కన్పించును. ఇదియే 'తద్ధృదయం విశేషేణ చేతనా స్థానం' అని చెప్పిన భావార్థము. హృదయకోశముయొక్క సంకోచ వ్యాకోచములే (Contraction and relaxation) దానికి జాగ్రదవస్థ స్వపనావస్థలు. వీని కింగ్లీషున 'సిస్టలి, డయాస్టలీ' (Systole and diastole) అని తర్జుమా చేయ వచ్చును. హృత్కోశాంతర్భాగములను ఆయుర్వేదతంత్ర కర్తలు వర్ణించినటుల ఎచ్చటను కన్పించదు. కాని వావి శ్ఛవా రచ్చొత్తించిన సుశ్రుత శారీరగ్రంథములో పైన చెప్పిన శ్లోకమునకు వ్రాసిన టీకలో నీ దిగువ వాక్యములను

సంగ్రహించినటుల వ్రాసిరి. "చతుః ప్రకోష్ఠం హృదయం వామదక్షిణభాగతః, తేషాం ద్వౌ దక్షిణౌకోష్ఠౌ గృహీత్వా శుద్ధ శోణితమ్. మనాక్సం శోధ్య విసృజే త్సగయా పుప్ఫుసేఽనిశమ్, తత్ర శుద్ధం వ్రజేత్కోష్ఠౌ వామౌచతదనంతరమ్, తస్మాశ్చ్రుతం శరీరంచ జీవయే ద్బృంహ యేచ్చ్రతత్। అని చెప్పిన పాఠము ఆయుర్వేదగ్రంథములలోనిది కాదు. బహుశా శ్రీ గణనాథసేనుగారో, శ్రీ వినోదలాల్ సేను గుప్తగారో పాశ్చాత్య శారీర విషయమును సంస్కృత భాషలో వ్రాసియుందురు. ఇట్టి కృషివలన ఆయుర్వేదలోకమున కెంతయో మేలు కలుగును. రక్తచంక్రమణము:- (Blood circulation) 1647 సం॥రంలో డాక్టరు హార్వీపండితుడు రక్తభ్రమణ వృత్తాంతమును క్రొత్తగా కనుగొని పాశ్చాత్య దేశములలో ప్రకటించెను. కొన్నివేల సంవత్సరములకు పూర్వమే హైందువులకిట్టి విజ్ఞానమున్నదని చెప్పుటకు ఆయుర్వేదగ్రంథములే సాక్ష్యములు.

1. సూ॥ దశమూల సిరాః హృదయ ప్రతిబద్ధాః సర్వాంగ ప్రత్యంగానోజోనయంతి. తత్ ప్రతిబద్ధాహి శరీరచేష్టాః (అ. సంర)

2 దశమూల సిరా హృత్ స్థాస్తా స్సర్వం సర్వతోవపుః। రసాత్మకం వహంత్యోజ స్తన్నిబద్ధం హి చేష్టితం। (అ. హృ. శా. 13 అ. 18 సూ.)

3. "చతుర్వింశతి ధమన్యో నాభిప్రభవా అభిహితాః" మరియు "తస్మాత్తుఖలు నాభి ప్రభవాణాం ధమనీనాం ఊర్ధ్వగాదశ, దశచాధోగామిన్యః చతస్రస్త్రిర్యగ్గాః॥ (సు. శా. 8 అ.)

4. "సప్త సిరాశతాని భవంతి, యాభిరిదం శరీరమారామ ఇవజలహారిణీభిః కేదారఇవచ కుల్యాభిః॥"

(సుశుత. శారీర 7 అధ్యాయం)

N. B:- ఇచ్చట సిరాశబ్దమును రక్తవాహినులుగా (Blood vessels) గ్రహించిన సందర్భములో నాభిస్థనిబద్ధ అనుచోట నాభిశబ్దమునకు హార్టు అనియు గ్రహించవలెను. ధమనులను (నెర్వుగా) గ్రహించిన సందర్భముచెప్పిన 'నాభి ప్రభవా' యను దానికి నాభి యనగా మెదడు, సుషున్నలని గాని (Brain spinal cord) లేక ఉదరములోపల నాభికెదురుగా వెన్నునంటుకొనియున్న మణిపూరచక్రము(Semi-lunar ganglia) అనిగాని గ్రహించవలసియున్నది. రక్తము సర్వ శరీరభాగములకు భ్రమించుచున్నదనుటకు ప్రమాణవాక్యములను జూపి యింతటితో నీ విషయమునకు స్వస్తి చెప్పెదము.

1. "స్వాశిరాః సంచర ద్రక్తమ్" (సు. శా. 7-13 సూ.)

2. "ధాతూనాం పూరణం"

3. "సంధి బంధన కారిణ్య ద్దోషధాతువ హిస్సిరాః"

(శార్ఙ్గధర 5 అ. 39 సూ.)

4. శ్లో॥ నహివాతం సిరాకాశ్చిన్నపిత్తం కేవలంతథా।
శ్లేష్మాణం వావహాస్త్యేతా అతస్సర్వ వహాః స్మృతాః॥

(సు. శా. 7 అ. 14)

5. "సాత్మ్యాత్ సర్వగతాశ్చేతే దేహం గచ్ఛన్ సిరాయున్నైః (చరక సంహిత)

## 11 ఆశయవివరణములు.

పురుషులకు సప్తాశయములున్ను, స్త్రీలకు గర్భాశయముతో కలిపి ఎనిమిది ఆశయములున్నవని చెప్పిరి. వాటి వివరము లెవ్వియన:-

(1) వాతాశయము:- వాతము సర్వశరీరభాగముల కెల్లప్పుడు సంచరించుచుండినను, దాని జన్మస్థానమైన పురీషాధానమును అనగా పెద్దప్రేగులను (Large intestines) వాతాశయ మనవచ్చును.

(2) పిత్తాశయము:- అన్నసంచిలోనుంచి జారిన అన్నము దిగువప్రేగు భాగములోకి (Duodenum) రాగానే ఇచ్చట పిత్తరసము ప్రేంక్రియాటిక్ రసములతో కలిసి చతుర్విధాన్నములు పచనమగుచున్నవి. కనుక నీభాగమును పిత్తస్థాన మందుము. దీనికి గ్రహణి యని ఆయుర్వేదములో పేరున్నది.

(3) శ్లేష్మాశయము:- శ్లేష్మము ఆమాశయములో అన్నము ఉమ్మినీటితో కలిసి పక్వమగుచున్న సమయములో పుట్టుచున్నదిగాన ఆమాశయమే (Stomach) శ్లేష్మాశయము కాగలదు.

(4) రక్తాశయము:- యకృత్ల్పీహములు (liver and spleen) రక్తాశయములని ఆయుర్వేదములో చెప్పిరి. పాశ్చాత్యుల ఫిజియాలజీ కూడ నీ విషయ మంగీకరించును.

(5) ఆమాశయము:- సగమువరకు జీర్ణమయిన అన్నమును ఆమమందురు. అన్నసంచిలో (Stomach) లో

అన్నము సగమువరకే జీర్ణమగుచున్నది. గాన స్టమక్ (అన్నసంచిని ఆమాశయ మందుము.

(6) పక్వాశయము:- అనగా పూర్తిగా జీర్ణరసములతో కలిసి పాకము చెంది, అన్నరసమును కలిగిన సన్నప్రేగులు. దీనిలోనుండి అన్నమందలి సారభాగము (రసధాతువు) రక్తముతో కలియుచున్నది. గనుక పక్వాహారమును ధరించిన సన్నప్రేగులు పక్వాశయము (Small intestines) అనబడును.

(7) మూత్రాశయము:- అనగా మూత్రసంచి. దీనిని వస్తి యనికూడ నందురు. ఇంగ్లీషున (Urinary bladder) అనిపేరు.

(8) స్త్రీలకు గర్భాశయ మధికముగా నున్నది. స్త్రీల పొత్తికడుపులో దిగువ భాగమున మూత్రపు సంచికిని, మలముండు ప్రేగునకును (Rectum) మధ్యను పిడికిలి ప్రమాణమున దళసరికండలతో నిర్మింపబడిన గర్భసంచి యున్నది. దీనికి యూటిరస్ (uterus) అనిపేరు. సామాన్య యింగ్లీషు పదము వూంబ్ (womb), దీని ననుసరించి యిరుపార్శ్వములను రెండు అండవహస్రోతస్సులు, వీటి చివరను అండాశయము లనెడు గ్రంధులున్నవి. ఈగ్రంధులకు ఓవరీస్ అని పేరు. ఈగర్భయంత్రమున కంతకు గర్భాశయమని వ్యవహరించవచ్చును.

12 స్రోతోరంధ్రములు. (External openings)

(13) జాలములు (Plexeses of blood vessels and nerves and small muscles and small bones)

(14) పేశీలు:- అస్థిలకు అవయవభాగములను బంధించి యున్న త్రాళ్ళవంటి మాంసపుపొరలు. వీనికి (ligaments) గలి మెంట్సు అనిపేరు. సుమారు 500 ఉన్నవి.

(15) కూర్చలు (interosseous ligaments) 6 మాత్రమే యున్నవి. (2) భుజకీళ్ళలోపలను (2) మక్క-కీళ్లు (Hip Joints) లోపలను (1) మెడసంధిలోను, (1) శిశ్న మును ఎముకకు బంధించియున్నవి.

(16) సప్తసేవనులు:- అనగా నుభయపార్శ్వములు కలియుచున్న సంధిస్థలములు. 5 శిరస్సు లోపలనే యుండును. వీనిలో నొకటి మీది అంగుడున గీతవలె కన్పించును. యింకొకటి నాలుకచివర యడుగున నాలుకనెత్తిన పొరవలె కన్పడును. మరియొకటి శిశ్నము దిగువను గుదరంధ్రమువరకు వ్యాపించియున్నది. దీనికి మీడియన్ రేఫీ యందురు.

(17) అస్థిసంఘాతములు (Big goints) గుల్ఫ, జాను, వంక్షణ, మణిబంధ, కూర్పర, కక్షధరసంధులు రెండేసి చొప్పున 12న్నూ, గ్రీవ, త్రిక (Sacral Joints) సంధులు కలిసి 14. వీనికి చుట్టును ఆవరించిన శ్లేష్మపు పొరలకు సీమంతములు (Synovial membranes) అందురు.

## 18. అస్థులు (Bones)

అస్థులసంఖ్య 360 అని వేదములోను 300 అని శల్య తంత్రకారులును చెప్పిరి. పాశ్చాత్య శారీర తంత్రకారులలో కూడ నిట్టి మతభేదము కన్పించుచున్నది. దీనికి కారణ మేమనగా- కొందరు దంతములకూడ నస్థులుగా పరిగణింపరు.

చిన్నతనములో మెత్తగా నుండిన కొన్ని భాగములు వయసు ముదిరినకొలదిని క్రమముగా గట్టిపడుచుండును. అస్థి పూర్వ స్థితి భాగములకు కార్టిలేజి (cartilage) అని పేరు.

ఆకారములను బట్టి అస్థులను 5 వర్గములుగా విభజించిరి. (1) కపాలాస్థులు (flat bones) (2) రుచకాస్థులు (దంతములు Teeth) (3)తరుణాస్థులు (cartilages) (4)వలయాస్థులు (round and long bones) (5) నలకాస్థులు irregular bones)

## 19. అస్థిసంధులు- వర్గీకరణము, సంఖ్య.

మనశరీరములో చిన్న పెద్ద కీళ్లు అన్నియు కలసి 210 అని ఆయుర్వేదము చెప్పుచున్నది. ఇది పాశ్చాత్యుల లెక్కకు సరిపోవుచున్నది. వాటి చలనాది కృత్యము ననుసరించి 1. చేష్టావంతములు (movable joints) 2. స్థిర సంధులు (fixed joints) అని విభజించిరి.

ఆకారస్వభావములను బట్టి 8 రకములని చెప్పిరి.

1. కోరసంధులు (Hinge joints) = మడతబందు కీళ్ళు. ఒకేవైపునకు ముడుచుకొను వ్రేళ్ళ కీళ్ళు, మోకాలు, మోచెయ్యికీలు.

2. ఉదూఖల సంధులు (Ball and socket joints) అనగా బంతిగిన్నె కీళ్లు ఉదా:- భుజకీలు, మక్కకీలు.

3. సాముద్గములు (slightly movable joints)జారుడు కీళ్లు. ఉదా: అసంఫలకము (scapula), గుదము, భగము.

4. ప్రతగసంధులు (gliding joints) ముందుకు, వెనుకకు, ప్రక్కకు వంగు కీళ్లు, ఉదా : మెడ, వెన్నెముక సంధులు.

5. తున్నసేవనలు (fixed joints) కదలిక లేకుండా గట్టిగా బిగుసుకొన్న అస్థిసంధులు. ఇవి దంతములు, కపాల సంధులు.

6. వాయసతుండములు (crow-beak joits) కాకి ముక్కువలె క్రిందికి మీదికి యాడుచున్న దౌడ సంధులు.

7. మండలసంధులు = గుంతలో బంతి తిరుగుచున్న మాదిరిగా కనుగ్రుడ్డు కన్ను గుంతలో తిరుగుచుండును.

8. శంఖావర్తములు, చెవి సంధులు, శృంగాటక సంధులు.

## 20. మర్మస్థానములు (Vital centres)

ఆయుర్వేద శాస్త్రములో 107 మర్మస్థానములను వివరించిరి. ప్రాణములు సంచరించు స్థలములు గనుక నీస్థలములందు కోసినను లేక అభిఘాతము కలిగినను (దెబ్బలు, వ్రణములు, శల్యములు, గ్రుచ్చుకొనుట) ఎక్కువ బాధను కలిగించి, అంగవైకల్యమును, మూర్ఛ, మరణమునుకలిగించును. కనుక నీస్థలములకు ఘాతతగులకుండ రక్షించుకొవలెను. ఆపరేషను చేసేటప్పుడు యీస్థలములను జాగ్రత్తగా తప్పించవలెను లేదా ముందుగా తగిన శ్రద్ధలు తీసికోవలెను;

1. స్థలనిర్దేశము ననుసరించిన వర్గీకరణము, సంఖ్య

| | | |
|---|---|---|
| (1) | కాళ్ళలో | 22 |
| (2) | చేతులలో | 22 |
| (3) | ఉదరము, ఱొమ్ము | 12 |
| (4) | మెడమీఁదకు పై భాగమున | 37 |
| (5) | వీపుమీఁదను | 14 |
| | | 107 |

2. ధాతుస్వరూపము ననుసరించిన వర్గీకరణము

| | | | |
|---|---|---|---|
| (1) | మాంసమర్మములు | 11 | (Muscular structures) |
| (2) | సిరామర్మములు | 41 | (blood vessels, nerves, nerve plexesses) |
| (3) | స్నాయు మర్మలు | 27 | (Tendons) |
| (4) | అస్థిమర్మలు | 8 | (Bony joints) |
| (5) | సంధిమర్మలు | 20 | (muscular attachments to bones) |
| | | 107 | |

3. అభిఘాత ఫలితము ననుసరించి చేసిన విభాగము.

| | | | |
|---|---|---|---|
| (1) | సద్యః ప్రాణహరములు | 19 | (cause immediate death) |
| (2) | కాలాంతరప్రాణహరములు | 33 | (cause death in 15 to 30 days) |
| (3) | విశల్యఘ్నమర్మలు | 3 | (death follows removel of the foreign body or weapon |

(4) వైకల్యకరమర్మలు 44 (deformity results
(5) రుజాకరమర్మలు 8 (cause suffering for a long time)

107

ఈ 107 మర్మలకు పేర్లు, స్థాన నిరూపణము, అభిఘాత ఫలితములు సుశ్రుత శారీరము ఆరవ అధ్యాయములో విపులముగా వర్ణించబడినవి. కీర్తిశేషులు, డాక్టరు సి వి. కృష్ణారావు B. A; M. B. C. M. F. I. M., మదరాసు దేశీయ వైద్యశాల ప్రిన్సిపాల్ గారు యీ 107 మర్మలను చిత్రపటములతో సహా ఇంగ్లీషు పేర్లతో చికిత్సాసహితముగా వ్రాసి యున్నారు, (comparitive study of the Marmas in Ayurveda).

## 21. సిరా, ధమనీ, స్రోతో వ్యాకరణము

## (Blood vessels and nerves)

చరకసంహితలో నీ మూడు శబ్దములను సమాన వాచ్యములుగా రక్తనాళములకును (Blood vessels), వాతవహానాడులు (Nerves) కును, రసవహాస్రోతస్సులకును, మలములను బహిష్కరించుచున్న గొట్టములకు యథేచ్ఛగా వాడినట్లు గమనించ వచ్చును.

సుశ్రుతుడు 7వ అధ్యాయములో వివరించిన 700 సిరలు కంటికి కన్పించుచు, లెక్కింపదగిన రక్తగొట్టములు, వీనిశాఖలు, అని చెప్పనచ్చును, వీనికి మూలములు 40 అని చెప్పుచు నన్నిటిలోను వాత, పిత్త, కఫ, రక్తములు కలిసి సంచరించినను ద్రవ్యప్రధానముగా సౌకర్యము కొఱకు

ఒక్కొక్క రకమునకు పదేసి చొప్పున యున్నటుల చెప్పెను. అదే అధ్యాయములో సిరలకు సర్వమహాత్మ్యము చెప్పబడినది. వాత మధికముగా నుండిన రక్తగొట్టములు అరుణ వర్ణముగాను, పిత్తాధిక్య రక్తసిరలు నీలిరంగుతోను, కఫ మెక్కువగానుండిన గొట్టములు మందప్రవాహము గలవిగాను కన్పించును. ఇవి ఆర్టరీస్, వైన్సు, కెపిలరీసు (arteries, veins, and capillaries) కాగలవు. 'సిరాభిరావృతా నాభిశ్చక్ర నాభిరివారకైః' అనుటవలన బండి చక్రమునకు ఆకులు నలుదెశలనుండి నాభి అనగా కుండతో కలియుచున్న విధముగా సర్వ సిరలను కేంద్రస్థానమైన నాభితో (హార్టు) బంధింపబడినవని గ్రహించగలము. పాశ్చాత్యుల శారీర గ్రంథములలో హార్టులోనుంచి అయోర్టా యనెడు పెద్ద రక్తగొట్టము ఎడమ గదిలోనుంచి బయలుదేరి దాని శాఖోపశాఖలు ద్వారా సర్వశరీర భాగములకు రక్తమును గొంపోవును. ఏయొక్క చిన్నశాఖను పరిశీలించినను అది అనంతములైన శాఖోపశాఖలుగా చీలిపోయి ఆఖరున తలవెంట్రుకలంత చిన్న గొట్టములుగా తయారై ధాత్వణువులను పరివేష్టించి, తిరిగి యీ సూక్ష్మ నలికలన్నియు కలిసికొనుచు క్రమక్రమముగా పెద్ద, నీలి, సిరలుగా తయారై, సర్వ శరీరభాగములందలి పెద్ద సిరలన్నియు కలిసికొని చివరకు రెండు పెద్దసిరలుగావచ్చి హార్టుయొక్క కుడివైపు మీది గదిలోకి చేరుచున్నవి. ఈ ప్రకారము రక్తగతిని గమనించి పచో చక్రగతిని, బయలుదేరుచున్న కేంద్రస్థలము (హార్టు) నకే వచ్చి చేరుచుండుట గమనించగలము. సిరా భాగములను తెల్పుటకు (arteries) శుద్ధ సిరలనియును, వైన్సు (veins)

అనగా నీలి సిరలనియు విశేషములను చేర్చుకోవలెను.

గర్భమునకు బొడ్డుత్రాడు రక్తప్రసరణా కేంద్రముగా కన్పించినను, బిడ్డ పుట్టినపిమ్మట హృత్తు కేంద్రమగుచున్నది. కాని మరికొందఱు వ్యాఖ్యాతలు హృత్తునకుగాని, రక్తగొట్ట ములకుగాని స్వతంత్రముగా రక్తమును ప్రవహింపజేసే శక్తి లేదు. ఆ యాభాగములకు వ్యాపించియున్న వాతవహా నాడులు (sympathetic nervous system) ద్వారా కలుగుచున్నదిగాన నీనాడులకు పుట్టుక స్థానములుగా నున్న మెదడు (పాశ్చాత్య సిద్ధాంతము) నుగాని, హైందవవిజ్ఞాతులు చెప్పిన మణిపూరచక్రమును (solar plexus) నుగాని సర్వ సిరలకు నాభిగా భావించదగునని చెప్పుచున్నారు. నాభినిశ్చ యమును గురించి త్రివిధ మతములలో నేది సత్యమయినదో బుద్ధిమంతులు విమర్శింతురుగాక.

సిరా వేధనక్రియ :- సిరా వ్యాకరణ సందర్భములోనే సిరావేధన చికిత్సల యొక్క రూపము చెప్పబడినది. క్రియా భాగమును అనుభవపూర్వకముగా వైద్యుడు గ్రహించవలెను. ఆయుర్వేదములో సిరావేధన చికిత్స కర్హులు, అనర్హులు, యీక్రియ నాచరించుటకు నిషిద్ధకాలము, శిరోగత, పాద, హస్తగత సిరలను, ఉదర, శ్రోణి పార్శ్వసంధి, మేఢ్ర, జిహ్వాలందలి సిరలను వేధించు క్రమమును, యీచికిత్సలోని ప్రమాదములున్ను, యుచితకాలమును వివరింపబడినవి. పాద దాహ, పాదహర్ష, చిప్ప, విసర్పి, వాతశోణిత, వాతకంటక, విచర్చిక, పాదదారి, శ్లీపద, క్రోష్టుకశీర్ష, ఖంజ, పంగ్వాది రోగములలో సిరావేధన చికిత్స మేలుచేయునని యున్నది.

మరియు గృధ్రసీ, గలగండ రోగులకు శాస్త్రము విధించిన సిరలనే కోసి రక్తమును వెడలించవలెను. ప్లీహ వృద్ధికి ఎడమ కూర్పర సంధి మధ్య సిరనుగాని చిటికెనవ్రేలి మధ్యనున్న సిరనుగాని ఛేధించవలెను. యకృత్ వృద్ధిగల వానికి కుడిచేతి సిరను వేధించవలెను. అపస్మారరోగికి, జిహ్వా, తాలు, రోగములు గలవారికి, కర్ణశూల, నాసారోగ, తిమిర, అక్షిపాక రోగులకు, శిరోరోగము గలవారికిని, తృతీయక చాతుర్థిక జ్వరరోగులకును, ఆయాస్థానములందు చెప్పిన సిరలను వేధించుట వలన రోగములు త్వరలో శాంతి నొందగలవు. ఈ సిరావేధన చికిత్సను ఆయుర్వేద వైద్యులలో నాచరించువారు యిప్పుడులేరు. నేటి ఆధునిక శస్త్ర చికిత్సానిపుణులైనను, సకలసౌకర్య సంపత్తులలో కూడిన పెద్ద ఆసుపత్రులలో నీ సిరావేధ చికిత్సలు చేసి, వారి పరిశోధిత విషయములను ప్రకటించమని మన మాశించ వచ్చును. ఇది యొక రకము పరిశోధనము. వారి శాస్త్రమునకుకూడ క్రొత్తదగుటవలన ఆంగ్లాయుర్వేద వైద్యశాస్త్రములు రెండును వృద్ధి జెందగలవు

## 22. ధమనీ వ్యాకరణమ్ (Sympathetic nerves)

'ధమంతీతి ధమన్యః' అని చెప్పిన శబ్దః పత్తి ననుసరించి ధమనం అనగా గాలిచేతను పూరించుట యగునుగాన వాతవహానాడులను (నెర్వ్సు) ధమనులని వ్యవహరించుట సుశ్రుతుని యభిమతము. 'చతుర్వింశతి ధమన్య నాభిప్రభవా' యని చెప్పినందున 24 ధమనులు నాభిలోనుంచి బయలుదేరి 10 ధమను లూర్ధ్వముగాను, 10 ధమను లధోముఖముగాను,

4 ధమనులు అడ్డముగాను వ్యాపించు నని చెప్పుటవల్ల వీటికి నాభి (కేంద్రము centre) నెద్దానిగా మన శరీరములో చూపించదగునని ప్రశ్న కలుగుచున్నది. పాశ్చాత్యుల శారీర శాస్త్రము ననుసరించి వాతవహానాడు లన్నిటికి పుట్టుకస్థానము మెదడు, సుషుమ్నలుగాన వీనిని యీనాడులకు నాభి యన వచ్చునని తోచుచున్నది. 'నాభిప్రభవా అభిహితాః' యనుటవలన వాతవహానాడులకు పుట్టుకస్థానము కాదు, అని మనము తెలియదగినది. ఆనాడుల లోపల ప్రభవించుచున్న వాతశక్తి ద్రవ్యమునకు మూలాధారస్థానమని తెలియు చున్నది. అట్లయినచో . యోగతంత్రకారులు షట్చక్రము లలోకెల్ల ప్రధానమైన మణిపూరచక్రము సర్వశారీర నాడు లకు శక్తిప్రాభవస్థానముగానున్నదని చెప్పుచున్నారు. కనుక వాతవహానాడులన్నింటికిని మణిపూరచక్రమును నాభిగా గ్రహించదగును. ఇందుండియే జీవశరీరములో వాతశక్తి (నెర్వస్ ఎనర్జీ = Nervous energy) ప్రభవించుచున్నది. (పుట్టుచున్నది). దీనిని సోలార్ ప్లెక్సిస్ అనిడాక్టరు గ్రే గారు ఎనాటమీ (శరీరగ్రంథములో) వ్యవహరించినారు. కాని ఫిజి యాలజీ గ్రంథములలో నీ చక్రముల ప్రశంసగాని వ్యాపార ములుగాని వ్రాయకపోవుట విచారించదగిన విషయము. బహుశాశాస్త్రపరిశోధకుల కీవిషయము లందుబాటుకాక పోవచ్చును. డాక్టరు లెడ్ బీటరుగారు (Dr. Lead beater) ఒక్కొకషట్చక్రములను, నెర్వస్ గేంగ్లియాలనుగా గుర్తించి వానిని తాంత్రికవిషయములతో సమన్వయించిరి.

. . . . మణిపూరకచక్రము (solar plexus) ఉదరములోపల

బొడ్డున కెదురుగా ప్రేగులచాటున వెన్నున కంటిపెట్టుకొని యున్నది; ఇందులోనుంచి నెర్వసు ఎనర్జీ (వాతము) పుట్టి మెదడులోకి పోయి, అచటనుండి సుషుమ్ననాడి తంతుల ద్వారా సర్వ శరీరభాగములకు ప్రసరించుచున్నది. కనుక పాశ్చాత్య శాస్త్రజ్ఞులు సర్వ నాడులకు కేంద్రము అనిచెప్పిన మెదడు Brain) వాతశక్తికి నివాసస్థానమై (reservoir) యుండవచ్చును. కనుక నాడులకు ప్రాభవస్థానము మెదడు అనుటకంటె సోలార్ ప్లెక్ససు అని చెప్పిన సమంజసముగా నున్నది. ఫిజియాలజీ పండితులీ చక్రమును 'ఎబ్డామినల్ బ్రైన్' లేక 'స్మాల్ బ్రైన్' అని చెప్పుటకు కారణ మిదియే కావచ్చును.

ఈ నాభిచక్రమునుండి బయలుదేరిన పది యూర్ధ్వగత నాడులు జ్ఞానేంద్రియములకు పోయి విషయగ్రహణము చేయుచున్నవి. వీనికి నెర్వసు ఆఫ్ పెర్సెప్షన్ (Nerves of perception) అందురు. మరికొన్ని క్రియాహేతుకములై ఉచ్ఛ్వాస, నిశ్వాసలు, రక్తసంచలనము, మాట్లాడుట, దగ్గు నవ్వు, తుమ్ము, మొదలైన కార్యములు చేయుచుండును. అధోముఖముగా వ్యాపించిన నాడులు పది మూత్ర, పురీష శుక్రార్తవములను బయటకు విసర్జింపజేయు చున్నవి. అడ్డముగా వ్యాపించిన నాలుగు నాడులు శాఖోపశాఖలై చర్మమందు వ్యాపించి స్పర్శాది సుఖ దుఃఖానుభవములను, చమటను వెడలించుటను జరిగించుచున్నవి. ఈవిధముగా చెప్పిన ధమనుల గురించిన జ్ఞానము నేటి యాధునిక శారీర విజ్ఞానములతో విరోధము లేక సర్వసంపూర్ణముగ నున్నదని చెప్పవచ్చును.

## 22. స్రోతోమూలములు

(Sympathatic nerves related to various ducts)

స్రోతస్సు లనగా గొట్టములు. ఇవి 11 జతలుగా మన శరీరములో వ్యాపించి ప్రాణాన్నోదక, రసరక్తమాంసమేదో మూత్రపురీష శుక్రార్తవము లను స్థలాంతరములకు ప్రవహింప జేయుచున్నవి. ఈ స్రోతస్సులకు మూలములనుట చేతను అధారాధేయ పద్ధతిని ఆగొట్టముల లోపల నాయాద్రవ్యము లను వహింపజేయుచున్న శక్తిప్రాసాదక నాడీతంతులని మనము గ్రహించవలసి యున్నది. ఇట్టి నాడు లెవ్వియనగా:

(1) ప్రాణవహాస్రోతో మూలములు రెండు:- ఈ నాడులు హార్టు కండరములకును, రసవాహినీ గొట్టములనగా రక్తనాళములకును వ్యాపించును. వీనికి పాశ్చాత్య శారీర గ్రంథములో ఇచ్ఛా స్వాతంత్ర నాడులు (Right and left sympathetic nerves) అని పేరు. వీనికి వేగస్ నెర్వ్ అండు ఏక్సిలరేటార్ నెర్వ్ అని కూడా అందురు. ఈరెండును కలసి గుండె చలనమును కదన పద్ధతిగా (regular rhythical action) నడిపించును. వీని కభిఘాతము సంభవించిన తత్క్షణమరణము కలుగును.

(2) అన్నవహా స్రోతోమూలములు రెండు :- ఇవి ముఖము, అన్నగొట్టము, అమాశయములకు వ్యాపించును. అన్నము మ్రింగుటకు తోడ్పడుచు అమాశయములో నన్న మును వివిధజీర్ణరసములతో కలిపి జీర్ణకార్యమునకు తోడ్పడు చున్నవి. ఈ నాడుల కభిఘాతము కలిగినచో కడుపుబ్బరము, శూల, వాంతి, మరణములు కలుగును. ఈనాడులకు గ్లాసల్

అండు గేస్ట్రిక్ నెర్వ్సు Glossal and Gastric nerves అని పేరు.

(3) ఉదకవహ స్రోతస్సులు : తాలు క్లోమములకు వ్యాపించి, లాలాజలమును, ఇన్సూల్యిన్ అను హార్మోన్ ద్రవము నూరునట్లుజేసి తృష్ణను నివర్తింపజేయును. వీని కభిఘాతము కలిగిన తృష్ణ పుట్టి మరణము సంభవించును. ఇవి గస్టేటరీ అండ్ స్ప్లాంకినిక్ నెర్వ్స (Gustatory and splanchnic nerves) కాగలవు.

(4) రసవహ స్రోతోమూలములు:- 'రసస్యహృదయం స్థానం' అని చెప్పుటవలన అన్నరసము ప్రేగులలోనుంచి హృదయస్థానమునకు (హార్టులోకి) చేరుకొని రక్తముతో కలసి సర్వ శరీరమందున సంచరించుచు వివిధధాతువులను పోషించుచున్నది. కనుక రసవాహీను లనగా రక్తనాళములనియే గ్రహించదగును. రక్తవహస్రోతస్సులకు వ్యాపించిన వేసో డైలేటార్ అండు వేసోకంస్ట్రిక్టార్ నెర్వ్సు వల్లనే రక్తభ్రమణము జరుగుచున్నది. (Vasodilator and Vasoconstrictor nerves) వీని కభిఘాతము కలిగినవెంటనే శోషవచ్చి మరణము కలుగును.

(5) రక్తవహ స్రోతోమూలములు:- ఇవి పైన వివరించిన వేసోమోటారు నెర్వ్సు కాగలవు. వీనిద్వారా శరీర భాగములకెంత రక్త మవసరమగునో పరిస్థితులనుబట్టి పంపిణీ చేయుచుండును. కనుక వీనిని ట్రోఫిక్ నెర్వ్సు (Trophic nerves) అనికూడ నందురు. వీని కభిఘాతము కలిగినప్పుడు అనగా వేసోడైలాటర్ నెర్వ్సు ప్రభావము తగ్గుటవలన రక్త

నాళములు బిగిసికొని రక్తపారుదల నరికట్టుటవలన నాభాగ మందలి కండలకు కృశత్వము, ఒకప్పుడు కుళ్లుట (gangrene) కలుగును. వేసోకంస్ట్రిక్టార్ నెర్వుసు ప్రభావము (vasoconstrictor) తగ్గిన స్థలమున రక్తము నిల్లునగా పొరి గొట్టములు పగులుటకూడా సంభవించును. అప్పుడు రక్త స్రావములు (Hoemorrhrages) కండ్లు ఎఱుపు, జ్వరము, తాపము, పాండువర్ణము, వాపు కలుగును.

(6) మాంసవహ స్రోతోమూలములు :- ఇవి మాంస కండలను చలింపజేసి క్రియాచరణకు పురికొల్పుచున్న మోటర్ నెరుసు (motor nerves) కాగలవు. ఇంకను చర్మ మునుకూడ కదలింపజేయగలవు మరియు చర్మగతమైన రస గ్రంథులు వీనిగొట్టములకు వ్యాపించి (sebaceous glands and their ducts) ఆర్ద్రవము నూరునట్లు చేయును. వీని కభిఘాతము కలిగినప్పుడు వాపు, మాంసశోష, సిరల మధ్య గ్రంథు లేర్పడుట (varicose veins and lymphangitis) మరణము సంభవించును గనుకవీనినికూడ ట్రోఫిక్ నెర్వుసుగా (trophic nerves) పరిగణించవలసి యున్నది.

(7) మేదోవహ స్రోతమూలములు:- వృక్క గ్రంథులు మేదోధాతు పరిణామముతో సంబంధించినవని చెప్పితిమి, వీనికి (adrenal glands) ఎడ్రినల్ గ్లాండ్సు అని పేరు. మూత్ర పిండములపైన టోపీలవలె నతుకుకొని యున్నవి. ఈగ్రంథు లకు సంబంధించిన నెర్వుసు (splanchnic nerves) మేదో వహ స్రోతోమూలము లగును. వీని కభిఘాతము కలిగిన మిక్కిలి చమటపట్టుట, శరీరము జిడ్డుగానుండుట, తాలు

శోషము, శారీరస్థౌల్యము, వాపు కలుగును.

(8) మూత్రవహ స్రోతోమూలములు : ఈనాడులు మూత్రసంచి, మేఢ్రములకు వ్యాపించును. వీని కభిఘాతము కలిగినచో మూత్రప్రతిబంధకము, శిశ్నమునకు స్తబ్ధత్వము లభించును.

(9) పురీషవహ స్రోతోమూలములు : ఈ నాడులు పక్వాశయము (intestines) గుదము (Rectum) లకు వ్యాపించును. వీని కభిఘాతమువలన అనాహము (కడుపు ఉబ్బు) దుర్గంధయుక్తముగా నపానవాయువులు వెడలును. ప్రేగులందు స్తబ్ధత ఏర్పడి (chronic constipation) మలము యుండలు గట్టును.

(10) శుక్రవహ స్రోతోమూలములు : ఈ నాడులు స్తనములకు వృషణములకు, శుక్రవాహినులకు, శుక్రాశయములకు వ్యాపించి శుక్రప్రవర్తకములుగా నున్నవి. వీని కభిఘాతము కలిగినప్పుడు స్త్రీ పురుషులకు కామేచ్ఛ నశించును.

(11) ఆర్తవవహ స్రోతోమూలములు : ఈ నాడులు స్త్రీలకు గర్భాశయమందున్న (uterus) ఆర్తవవాహినులకును (Fallopian tubes), అండాశయ గ్రంథులకును వ్యాపించును. నెలనెలకు ఆర్తవమును వెడలించును. ఈనాడుల కభిఘాతము కలిగిన స్త్రీలు వంధ్యలగుదురు. మైథునకార్యమును సహించలేరు. ఆర్తవనాశము కలుగును.

# 3వ అధ్యాయము

## గర్భావక్రాంతి శాస్త్రము (Embryology)

ఆధునిక శారీర శాస్త్రవేత్తలు చెప్పిన అన్నివిషయములను ఆయుర్వేద తంత్రకర్తలు పొందుపరచుటయేగాక, ఆధునికుల కందరాని మరికొన్ని విశేషముల గూడ ప్రదర్శించుట వలన పండితులు ఆశ్చర్యనిమగ్నులై మన పూర్వీకుల విజ్ఞానమునకు జోహారులిడుచున్నారు.

సుశ్రుత శారీరస్థానం రెండవ అధ్యాయములో సత్సంతానాభివృద్ధి కొఱకు సాధనములుగా నున్న శుద్ధశుక్ర, శుద్ధార్తవముల లక్షణములును, వీని దూషితలక్షణములు, అదోషచికిత్సలను సంగ్రహముగా చెప్పిన పిదప దీర్ఘాయువు, మేధ, బలవంతులగు బిడ్డలను కనదలచిన దంపతులు ముందుగా పాటించదగిన బ్రహ్మచర్యాది నియమములున్ను, ముఖ్యముగా స్త్రీ రజస్వలా కాలములో వర్జించవలసిన విషయములున్ను, వీని యతిక్రమణమువల్ల గర్భమునకు రాబోయే వ్యాపత్తులున్ను, రజస్వలా నియమములు, సంభోగ నియమములు, గర్భిణ్యోపచారక్రియలు, అపచారములవలన గర్భమునకు కలుగు శారీరక మానసిక ఉపద్రవములును వివరించబడెను. మరియు కలలము, సర్వాద్యాకారములు, గర్భమునకు కుబ్జత్వాది వికారములు సంభవించుటకు హేతువులును వివరించబడినవి. గర్భమునకు నిశ్వాసలు, సంక్షోభములు, నిద్రాది చర్యలు, సుఖ దుఃఖానుభవములు తల్లిద్వారానే కలుగుచున్నవనికూడ వివరింపబడినవి. అన్నిటికంటెను పాశ్చాత్య పండితులకు దురవగాహ్యముగా నున్న విషయ మేమన

"గర్భస్థ శిశువునకు పూర్వజన్మలో శ్రద్ధగా నభ్యశించబడి, అతఃకరణమునందు దృఢముగా బంధింపబడిన సంస్కారణము లతో కూడిన శాస్త్రజ్ఞానాది ప్రజ్ఞలు ప్రకృత దేహములో స్వాభావికముగా సిద్ధించుచున్నవి."* జన్మపరంపర, ప్రారబ్ధ కర్మలున్నవని విశ్వసించని పాశ్చాత్యదేశస్థులకు యీవిషయ మెట్లు బోధపడును. పుట్టుకతోనే సామాన్య తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డలు దివ్యదృష్టి గలవారై, మహామేధావులుగ కన్పించువారి విషయమై ఆశ్చర్యముతో జూచుటతప్ప వారు శాస్త్రీయమైన సమాధాన మియ్యలేకున్నారు. మరియు సంభోగసమయమున దంపతు లెట్టి యాహారాచార చేష్ట లందు ప్రవర్తించియుందురో ఆసమయములో పుట్టిన బిడ్డ కూడ నదేగుణచేష్టలతో జనించగలదని మనవారు చెప్పిరి. కనుకనే రజస్వలా నియమములు, సంభోగ నియమములు మన వారి కత్యంత ప్రాధాన్యములుగా నున్నవి. పాశ్చాత్యశాస్త్ర ములో నిట్టి నియమములు లేవు.

---

1. శ్లో॥ *భావితః పూర్వదేహేషు సతతం శాస్త్రబుద్ధయః
భవన్తి సత్వభూయిష్ఠాః పూర్వజాతిస్మరా నరాః
కర్మణాచోదితో యేన తదాప్నోతి పునర్భవే,
అభ్యస్తాః పూర్వదేహే యేతానేవ భజతే గుణాన్॥
(సు. శా. 2 అ. 56)

2. శ్లో॥ ఆహారాచార చేష్టాభిర్యా దృశీభిస; మన్వితౌ,
స్త్రీపుంసౌ సముపేయాతాంతయోః పుత్రోఽపితాదృశః॥
(సు. శా. 2 అ. 46)

3. శ్లో॥ ఏవంజాతో గూపవన్తో మహాసత్వాశ్చిరాయుషః
భవన్త్యృణస్య మోక్తారస్సత్పుత్రాః పుత్రిణేహితాః॥
(సు. శా. 2 అ. 33

మనవారు బోధించిన నియమములను పాటించుచు ప్రవర్తించు దంపతులకు చక్కని రూపవంతులు, దీర్ఘాయుష్మంతులు, సత్త్వగుణ సంపన్నులు, తల్లిదండ్రుల కనుకూలురగు సత్సంతానము కలుగుననుటకు సందేహము లేదు. సంభోగ విధులలో జ్యోతిశ్శాస్త్ర విషయములనుగూడ చేర్చినారు. ఇది హైందవులకు చాల ముఖ్యమయినది.

(2) స్త్రీ పురుష జనన కారణమును మన ఋషులు కూడ చాలవరకు చర్చించిరి. సూ॥ తత్ర శుక్ర బాహుళ్యాత్పుమానార్తవ బాహుళ్యాత్ స్త్రీ, సామ్యాదుభయోర్నపుంసకమితి'' సు. శా. అని చెప్పిన వాక్యమును వ్యాఖ్యానకర్తలు సరిగా వివరించలేదు. శుక్ర మధిక మయినప్పుడు పురుష సంతానమును, ఆర్తవ మధికమయిన స్త్రీ సంతానము, రెండును సమములైన నపుంసకులు పుట్టుదురని మాత్రమే చెప్పిరి. ఇచ్చట చెప్పిన 'బహుళ' శబ్దము శుక్రార్తవములకు చెందినది. వ్యాఖ్యానకర్తలుకూడ వివరింపరైరి.

ఆధునిక విజ్ఞాన దృష్టితో విచారించినప్పుడు శుక్రద్రవమందలి యొక బీజము (spermatozoa, బీజరూప మయిన (ovum) స్త్రీ ఆర్తవముతో కలిసికొని గర్భమేర్పడుచుండగా పైవాక్యములోని బహుళశబ్దమున కేమని యర్థము చెప్పవలసియుండునని సందేహము కలుగుచున్నది. నిజమే. కలిసికొనునవి రెండును బీజములే. ఆర్తవము (ovum) ఆవగింజలో సగము ప్రమాణముండును. శుక్రబీజము కంటికి కానరానంతటి సూక్ష్మప్రమాణము కలది. భూతద్దపు సాయమున చూచినప్పుడు బల్లెము ఆకారముగా పొడవైనతోకతో

కన్పించును. గుండ్రముగానున్న ఆర్తములోనికి పురుష బీజము చొచ్చుకొని అందులో లీనమైపోవును. మరి బహుళ శబ్దము దేనికనగా:- శుక్రార్తవ బీజములను శక్తివంతమైన భూతయద్దముతో పరికించగా రెండింటిలోను మధ్య చుక్కలుండును. వీనికి న్యూక్లియై యందురు. వీటిని యింకను పరిశీలించినచో న్యూక్లియై లోపల 12 పుల్లలవంటివి జతలుగా చివరలందు మాత్రము కలిసికొని యింగ్లీషు అక్షరములలో 'వి' (V) ని బోలియుండి వాటి కోణములు కేంద్రీకరించుకొని కన్పించును. ఈపుల్లలకు 'క్రోమోసోమ్సు' (Chromosomes) అని పేరు. ఒక్కొక్క పుల్లను నిదానించి చూచినచో నవి పూసలు దారమున గ్రుచ్చబడినట్లు వరుసగా కన్పించును. ఈపుల్లలందలి ప్రతి పూసయు పితరుల దేహభాగములకు ప్రతినిధులుగా నున్నవనియు, యీపూసలలోనుంచియే శరీర భాగము లావిర్భవించు చున్నవనియు శాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు. పూసలకు జీనీస్ అని పేరు (Genes). తండ్రి సంబంధములు, తల్లి సంబంధములునైన జీనీస్ గర్భములో కలిసికొని మొదట నేర్పడిన అణువులోపల తిరిగి 12 జతల పుల్లలుగా నిర్మించబడుచున్నవి. జీనీసు సంఖ్య రెండు బీజములలోను ఎన్నడును సమముగా నుండదు. కనుక మొదటి యణువులో నేర్పడిన 12 జతల పుల్లలలోని జీనీస్‌ల సంఖ్యలో స్త్రీకి సంబంధించిన జీనీస్ ఎక్కువగానుండిన స్త్రీసంతానము, పురుష బీజాణువుల సంఖ్య యధికమయినచో పురుషగర్భ మేర్పడుచున్నదని ఆధునిక సిద్ధాంతము.

సుశ్రుతునకు యీవివరములు తెలియువా? తెలిసియుండినను స్థూలముగా 'శుక్రబాహుళ్యాత్పుమానార్తవ

బహుశాస్త్రి' అని చెప్పినాడా? యని సందేహము కలుగ వచ్చును. వేదములలో నెచ్చటనోగాని 'ఊనములు, భ్రూణ ములు' కన్పించుచున్నటుల వింటిని. వేదవిదులను తెలుప వలసినదిగా కోరుచున్నాను. భ్రూణశబ్దమును వ్యవహారములో 'భ్రూణహత్య' (abortion) అనుమాటలో వినుచున్నాము. ఊనములను క్రోమోసొమ్సుగాను, భ్రూణములను జీనిస్ గాను మనము భావించవచ్చును.

*'చరకుడు వీటిని బీజభాగములని పేర్కొనెను. కుష్ఠు రోగ ప్రకరణమున యీవ్యాధి బీజభాగములను చెడిచి నప్పుడే యట్టి దంపతులకుపుట్టిన సంతానమునకు కుష్ఠురోగము వచ్చుచున్నదనియు, పితరులు కుష్ఠు, గ్రుడ్డి, మూగ, చెవిటి, వారైనను వారి బీజాంశలు పరిశుద్ధములుగా నుండినప్పుడు పుట్టిన పిల్లల కాయావ్యాధులు, వికారములు సంభవించ వనియు సిద్ధాంతము. (Law of genetics)

---

*చరక సంహిత శారీరస్థానం 7వ అధ్యాయం 12వ సూత్రము దేహాను వులందలి భాగాంశలను వివరించుచున్నది. యచోక్తమ్ —

"యదిచ మనుష్యోమనుష్య ప్రభవః, కస్మాన్న జడాదిభ్యోజాతః పితృ సదృశారూప భవంతి, తత్రోచ్యతే - యస్యయస్యాంగావయవస్య బీజోబీజభాగ ఉపతప్తో భవతితస్య తస్యావయవస్య వికృతిరుపజాయతే, నోపజాయతే చానుపతాపాత్। తస్మాదు భయోపపత్తి రప్యత్ర॥"

(చరక. శరీర 3 అధ్యాయ 23 సూ.)

"యదాత్వతి వృద్ధ కుష్ఠతయాపిత్రో ర్బీజమపి, కుష్ఠజనక దోష దుష్టం భవతి, తదాదుష్టత్వంగాది బీజ భాగాత్ కుష్ఠ దుష్టైవత్వగ్ జాయతే। యదుక్తం - దంపత్యోః కుష్ఠ బాహుళ్యా ద్దుష్ట శోణిత శుక్రయోః। యద పత్యంతయోర్జాతం జ్ఞేయం తదపికుష్ఠితం.

(చరక సంహితాయాం చక్రపాణిః శా. 3 అ. 15)

స్త్రీ లేక పురుష సంతానము జనించుటకు పాశ్చాత్యు లును, మనవారుకూడ ననేక హేతువులను వివరించినారు. కాని యివన్నియు పరిశోధనలకు నిలువలేదు. ఋతుకాల ములో దంపతులు యుగ్మదినములలో ప్రవర్తించిన పుత్రుడు, బేసి దినములలో కలసిన స్త్రీ పుట్టునని యొక విధమయిన మతము. సంభోగ సమయమున పురుషునికి సూర్యనాడి అధిక ముగా ప్రవర్తించుచుండిన పురుష సంతానము, చంద్రనాడి యాడుచుండిన స్త్రీ జనించునని యోగతంత్రకారుల యభి ప్రాయము. దంపతు లిద్దరికి కుడి పార్శ్వములనుండి వచ్చిన బీజ ములు కలిసికొన్న పురుష సంతానము, ఎడమ వైపుననుండి పుట్టిన బీజములు కలసికొనిన స్త్రీ పుట్టునని యింకొక జన వాదము.

క్రోమోసోమ్సు సిద్ధాంతమే నేటి ఆధునికుల ప్రసిద్ధ వాదము.

మరియు నవీనముగా ఎండోక్రైనుల సిద్ధాంతము వెలువడినది. అదేమనగా — స్త్రీ లేక పురుష సంతాన ము కలుగుటకు హార్మోనులు ప్రధానపాత్ర వహించుచున్నవి. ఆడహార్మోను, ఎస్ట్రోజను (estrogen) శోణిత బీజసంబంధ ద్రవ్యముయొక్క ప్రభావ మధిక మయినప్పుడు స్త్రీ శిశువు పుట్టును. పురుష హార్మోనుల ప్రభావ మధికముగా నుండిన పురుష శిశువు పుట్టునని శాస్త్రపరిశోధకులు ఋజువు చేసి నారు. ఈమధ్యను న్యూయార్కు పట్టణములో చేసిన పరిశో ధనా ఫలితములను చూడగా నూటికి 98 మొదలు నూరు వరకున్ను అనుకొనునట్లుగా ఫలితములు కన్పించినవి. బాగుగ ముదిరిన కోడిగ్రుడ్లను కొంతసేపు ఆడ హార్మోనులు కలిపిన ద్రావములోనుంచి, పిమ్మట వాటిని పొదిగించగా నన్నియు

పిట్టలుగా మారినవి. మరికొన్ని కోడిగ్రుడ్లను మగ హార్మో నులు కలిపిన ద్రావములోనుంచి పొదిగించినప్పు డనుకొన్నట్లు గానే అన్నియు పుంజులే పుట్టినవి.

(ఆంధ్రపత్రిక 1956 సం॥ ఆగష్టు 9 తేదీ) నుండి

3. అంగప్రత్యంగములయావిర్భావము : గర్భధారణా నంతరం గర్భిణీ లక్షణము, దోహదక్రియలు, వినాశ హేతు లను, ఆధునిక శాస్త్రములలోవలెనే చెప్పియున్నారు. అయు ర్వేదములోని విశేష మేమనిన గర్భిణి స్త్రీయొక్క మానసిక ప్రవృత్తుల ప్రభావము బిడ్డయొక్క శారీర, మానసికాభి వృద్ధులపై చాల ప్రధానముగా నున్నదను విషయము. ఆధు నిక మిడ్ వైఫరీ గ్రంథములలో శారీర శుచికి (bodily hygiene) యిచ్చినంత ప్రాముఖ్యము, గర్భిణీ స్త్రీకి పుట్టిన కోరికలకు, మానసికప్రవృత్తుల కియ్యలేదు. *[1]జీవునకు ప్రార బ్ధాను గుణమైన కోరికలే దైవవశమున గర్భిణికి కలుగుచున్న వని మనవారు చెప్పిరి.

[2] నాల్గవ మాసమునకు దేహనిర్మాణమంతయు పూర్తి యై జరాయువుపుట్టి (మావి=(placenta) దీనితో బిడ్డ యొక్క బొడ్డుత్రాడుతో (unbilical cord) సంబంధము కలుగుచున్నది. నాటినుండి తల్లిభుజించిన యాహారరసము

1. శ్లో॥ కర్మణాచోదితం జన్తోర్భవితవ్యం పునర్భవేత్,
యథాతథా దైవయోగాద్దౌహృదం జనయేద్ధృది॥
(సు. శా 2 అధ్యాయం 15)

2. మాతుస్తుఖలు రసవహాయాం నాభ్యాం గర్భనాభి నాడీప్రతి
బద్ధాసాస్య మాతురాహార రసవీర్యమభివహతి॥

రక్తముతో కలసి, మావి బొడ్డుత్రాడు ద్వారా గర్భములోకి (foetus) ప్రవేశించి, దానిని పోషించుచున్నది. అంగ ప్రత్యంగము లావిర్భావించు కాలములను నిర్ణయించుటలో పాశ్చాత్యపండితులును భిన్న భిన్న మార్గముల బోయిరి. హైందవఋషులుకూడ విశేషముగా నీ విషయ సిద్ధారణకు చర్చలు సాగించి తుదకు 'గర్భోత్పత్తి కాలమందే సర్వాంగ ప్రత్యంగము లతిసూక్ష్మ రూపములుగా (బీజప్రాయముగా) దంపతులయొక్క బీజాణువుల లోపలనుండి ప్రవేశించినవి గనుక నీ బీజములే కాలాంతరమున నంకురించుచున్నవి." అని చెప్పిన ధన్వంతరి మతమును సర్వు లంగీకరించిరి.

*ఇక శారీర లక్షణములు గర్భమునకు అయిదు విధములుగా లభించుచున్నవని సుశ్రుతుడు చెప్పెను. ఎట్లనగా—

(1) పైతృకభాగములు:- వెంట్రుకలు, మీసము, శరీరముపైని రోమములు, ఎముకలు, గోళ్లు, దంతములు, సిరలు, స్నాయువులు, ధమనులు, శుక్రము.

(2) తల్లి సంబంధములు:- మాంస, రక్త, మేదస్సు, మజ్జ, హృదయ, నాభి, యకృత్ప్లీహాములు, ఆంత్రములు, గుదము.

(3) రసజములు:- శరీరవృద్ధి, బలము, కాంతి, ఆరోగ్యము, రోగములు.

(4) సాత్మ్యజ లక్షణములు:- పరాక్రమము, బుద్ధి.

---

* తత్రగర్భశ్య పితృజ మాతృజ రసజాత్మజ
సత్త్వజ సాత్మ్యజాని శరీరలక్షణాని వ్యాఖ్యాస్యామః॥

(౫) ఆత్మసంబంధములు:- ఇంద్రియములు, జ్ఞానవిజ్ఞానములు, ఆయుష్యము, సుఖదుఃఖాదులు. సాత్మ్యజలక్షణములు దేశకాల ఆహారాచార సాంఘికపరిస్థితులవల్లకూడ కలుగుచున్నవి.

అంగవైకల్యములు పుట్టుకతోనే లభించినవి ప్రారబ్ధవశమున సంభవించునని శాస్త్రము చెప్పుచున్నది. దౌహృదీయపచార కృత్యములని కూడ చెప్పెను. సూర్యచంద్రగ్రహణ వీక్షణము అంగవైకల్యములకు హేతువగునని జనులలో విశ్వాసమున్నది. ఈవిధమైన దేహభాగములసంప్రాప్తి ఆధునిక శాస్త్రగ్రంథములలో కన్పించదు.

ఇక జీవుడు గర్భములో నెప్పుడు ప్రవేశించుచున్నాడను విషయమును చర్చింతము.

*హృదయ నిర్మాణపూర్తి నాల్గవ మాసమున యగును గాన దీని నధిష్టించి జీవుడు ప్రవేశించునని కొందరు చెప్పుదురు. ఇంతకు పూర్వము జీవాత్మకు సంబంధించిన చైతన్యశక్తి పిండము నభివృద్ధిచేయుచున్నది. జీవుడు గర్భములో బ్రవేశించగానే నాల్గవమాసములో గర్భమునకు చలనాదిగతులు, తల్లియొక్క మానసిక శారీర క్షోభ జనితములైన సుఖదుఃఖము లనుభవించుట కారంభించునని అన్యశాస్త్రమతము లున్నవి. కాని జీవుడు పురుషబీజముతోనే కలిసి గర్భములో బ్రవేశించునని సుశ్రుతుని యభిప్రాయము.

---

*సూ॥ ........చతుర్థే సర్వాఙ్గ ప్రత్యఙ్గ విభాగః ప్రవ్యక్త తరోభవతి, గర్భహృదయ ప్రవ్యక్తి భావాచ్చేతనా ధాతురభి వ్యక్తోభవతి,
(సు. శా. 2 అ. 12.)

*జీవసంక్రమణ వృత్తాంతమును శృతులెట్లు చెప్పు చున్నవనగా:- మరణానంతరమున జీవుడుబుద్ధి యింద్రియ ములతో కలిసి పాంచభౌతికదేహమును విడిచి, సూక్ష్మ ధారియై, కర్మబద్ధుడై కొంతకాలము లోకాంతరముల వశించి తిరిగి భూలోకమున జన్మ ఎత్తుటకు సూర్య, మేఘముల నాశ్రయించి, వర్షముతో కలిసి భూమిపైన పడును. జలము లను, తద్వారా తరులత గుల్మాదుల నాశ్రయించి, మనుష్య జంతు పశ్వాదుల శరీరములలోకి ఆహార పానీయములద్వారా బ్రవేశించును. పురుషదేహములోకి ప్రవేశించినవి శుక్రబీజా ణువుల నాశ్రయించును. క్రమముగా స్త్రీ గర్భాశయమున బ్రవేశించి స్థూలదేహము నిర్మించుకొనును. కర్మబద్ధమయిన జీవునకు ఏ దంపతుల గర్భవాసమున జనించవలెనని విధించ బడినదో నట్లే జరుగును. పుణ్యావశమున ఆత్మకు స్థూలదేహము నిర్మించుకొను యవకాశము త్వరగా చిక్కును. పాపజీవులు నానాయోనులలో బ్రవేశించుచు తిరిగి బయటికి వచ్చుచు కాలమునకు కనిపెట్టుకొని నిరీక్షించుచుండును. ఈవిధమగు తపనమే యమయాతన యనబడును. ఈవిషయము లాలో చించగా పురుషుని శుక్రద్రవములో కన్పించుచున్న వేలాది బీజములు (Spermatozoa) జన్మలకొఱకు పరితపించుచున్న జీవాత్మలని మన మూహించవచ్చును

పాశ్చాత్యుల శారీరగ్రంధములలో జీవప్రశంస కాన

---

* శృతి:- "తస్మాద్వా ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః వాయోరగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృధివ్యా ఓష ధయః ఓషధీభ్యోన్నం, అన్నాత్ పురుషః, సవాఏష పురుషోన్న రస మయః"

రాదు. వారు కర్మసిద్ధాంతమును, పునర్జన్మలెత్తుటను నమ్మరు. పుట్టుట, గిట్టుట అంతా ప్రకృతి కార్యకలాప మందురు. (Natural Phenomina). ప్రాణముల సందర్భమున కూడ వారు మూకీభావము వహింతురు. ప్రాణము లనునవి శక్తి ద్రవ్యములనియు ఆత్మతో సంబంధించినవనియు మాత్ర మంగీకరింతురు. ఆత్మ ప్రాణముల గురించి చర్చ వేదాంత మునకు చెందినది గాని శారీరశాస్త్రమునకు సంబంధములేదని విడిచివేసినారు. ఆయుర్వేద శాస్త్రజ్ఞులకు భౌతికశాస్త్ర చర్చలకంటెను ఆధ్యాత్మిక చర్చలే ప్రధానములుగానున్నవి. హైందవుల భౌతికశాస్త్రములన్నియు నాధ్యాత్మిక చర్చలతో మేళవించియే నిర్మించుకొనిరి.

ప్రాణములు:- ప్రాణములను హైందవశాస్త్రవేత్తలే పలువిధములుగా ప్రదర్శించిరి. వేదాంతుల దృష్టి వేరు. యోగశాస్త్రకారుల దృష్టి వేరు. వైద్యశాస్త్రములో ప్రాణ శబ్దమును సుశ్రుతుడు 4 వ అధ్యాయారంభములో నీవిధ ముగా నిర్వచించెను.

"అగ్నిసోమౌవాయు స్సత్త్వం రజస్తమం పంచేం ద్రియాని భూతాత్మా యితిప్రాణా॥ ఇచ్చట అగ్నిసోమ వాయువులు మన శరీరములో పిత్త, శ్లేష్మ వాత రూపము లుగానుండి శరీరమును జీవింపజేయుచున్నవి. కర్త వాతము. ఇంకను మనస్సు, 5 యింద్రియములు, ప్రాణశబ్దములో నిముడ్చుట వైద్యకమతమని చెప్పవలెను.

ఈవిధముగా మన హైందవ ఋషులు శారీరవిషయ ములలో నతిముఖ్యములైనవాటిని వైద్యున కుపయుక్తములగు

నంతవరకు విపులముగానే వివరించినారు. ఆధునిక శారీర గ్రంథములలో పాశ్చాత్య శాస్త్రజ్ఞులు ప్రత్యక్షానుభవైక విషయములకు ప్రాధాన్యమిచ్చి సుదీర్ఘ చర్చలతో నతి విపులముగా వర్ణించిరి. వైద్యునకీ జ్ఞానమెంతవర కుపయోగించు నను దృష్టి శాస్త్రనిర్మాతలకును, గ్రంథకర్తలకును లేదు. పరిశోధకుల యనుభవములోకి వచ్చిన ప్రతి చిన్న విషయము గూడ శాస్త్రవిజ్ఞానముగానే పరిగణింపబడుచున్నది. క్రొత్తగా కనిపెట్టిన విషయము లెన్నియో చేర్చబడుచు, ఒక్కొక్క-విషయమును గురించి ప్రత్యేక గ్రంథములుగా వెలయుచున్నవి. ఇదియే వారి శాస్త్రజ్ఞానాభివృద్ధి. ముద్రణాసౌకర్యములు శాస్త్రవిజ్ఞానమును వెదజల్లుట కెక్కుడుగా తోడ్పడుచున్నవి.

ఆరువేల సంవత్సరముల క్రిందట కాగితము ముద్రణా యంత్రములు లేని రోజులలో అగ్నివేశుడు, సుశ్రుతుడు లోకహితార్థము అమూల్యమయిన విషయములను సంగ్రహముగా సూత్రప్రాయముగా రచించి భద్రపరచి నందులకు మనమెంతయో వారికి ఋణపడి యున్నాము.

# 4 వ అధ్యాయము

## Physiology in Ayurveda.

## ఆయుర్వేదమందలి శారీర వ్యాపారతంత్రం.

ఆయుర్వేదమున శరీరవ్యాపారమంతయు త్రిదోషముల యొక్క సమిష్టి సహాకార కలాపముగా వర్ణించినారు. 'దోష ధాతు మల మూలంహి శరీరమ్' అని చెప్పినందున శరీరము వాత పిత్త కఫము లనెడు మూడు దోషములతోను, రసరక్త మాంసమేదోఽస్థిమజ్జా శుక్రములనెడు సప్తధాతువులతోను, పురీష మూత్రస్వేదాదులైన మలములతోను కలిసి నిర్మింపబడినది. వీటిలో త్రిదోషములు ప్రధానములుగా నున్నవి. ఇవి శరీరము పుట్టుటకు, వృద్ధిజెందుటకు, నశించుటకు కారణములుగా నున్నందున ఆయుర్వేద తంత్రకర్తలు వీనినే ప్రాణములనికూడ నమ్ముచున్నారు. వాతాదులు మనదేహమును ధరించి పోషించుచున్నంతసేపు 'ధారయంతీతి ధాతవః' అను శబ్దనిష్పత్తి ననుసరించి ధాతువులుగా వ్యవహరించబడును. అవి కొన్ని బాహ్యాంభ్యంతర కారణములచేతను దూష్యమొంది, మిగతా శరీరధాతువులను, మలములను చెఱచి వ్యాధులను కలిగించుచున్నందున 'దూషయంతీత దోషాః' అని చెప్పిన ప్రకారము త్రిదోష సాంజ్ఞ సార్థకముగా చెప్పబడును. త్రిదోషములలో వాతము చాల ప్రధానమాయినది. *'తత్ర శరీరతంత్ర యంత్రధారి' యనుటవల్ల శరీరమందలి

శ్లో॥ *పిత్తం పంగుః కఫః పంగుః పంగవో మలధాతవః।
వాయునా యత్ర నీయంతే తత్ర గచ్ఛంతి మేఘవత్॥
(శార్ఙ్గధరసంహిత)

యన్ని కార్యములను చేయించునది వాతము. త్రిదోషము లెట్లు అన్నములోనుంచి పుట్టుచున్నవో, వాటి భౌతికలక్షణ ములు, పంచవిభాగము, ఎచ్చట నే యే కార్యములు చేయు చున్నవో మొదలగు వివరములన్నియు త్రిదోష సిద్ధాంత ములో చెప్పబడినవి. ఇచ్చటా కార్యములను మోడరన్ ఫిజి యాలజీ విషయములతో సమన్వయించుటకు యత్నించు దము. షట్చక్రములు (Sympathetic ganglia of nerve plexes) మెదడు, సుషుమ్న (Brain & Spinal cord) వాతమున కాశ్రయస్థానములు. మన శరీరమందలి ఎంజైమ్సు హార్మోన్సు (enzymes and hormones) పిత్తముయొక్క రూపములు. కఫము శరీరమందలి జలరూపక ద్రవ్యమునై యున్నది.

ఆయుర్వేద సంహితలలో వాతమునకు 141 సౌమ్య వ్యాపారములు (normal functions), 821 వికృతకార్య ములు (abnormal or pathalogical functions) వర్ణింపబడినవి. ఈ 962 వాతకార్యములను ఆధునిక శారీర శాస్త్రము ననుసరించి చెప్పిన దశవిధవర్గములతో సమన్వ యించుదము. పాశ్చాత్య శరీరగ్రంథములలో శరీరమందు జరుగుచున్న వివిధకార్యములయొక్క విభజీకరణము:- (1) మానసిక కార్యములు (mental functions) (2) ఇంద్రియ కార్యములు (functions of special sense organs) (3) హృదయము, శ్వాసాశయముల వ్యాపారము మ్రింగుట (functions of tue heart and respiration and the act of deglution) (4) మాట్లాడుపని (Speech) (5) అన్న జీర్ణ కార్యము (Alimentary digestion and metabolism)

(6) మలమూత్ర స్వేద బహిష్కరణ (Excretary function) (7) రసరక్తములను శరీరభాగములకు అవసరములను బట్టి కావలసిన పరిమితిలో పారించుట (Vasomator function relating to blood Circulation) (8) కరచరణాద్యవయవముల కదలిక (motor function) (9) స్పర్శజ్ఞానమును కలిగించుకార్యము (Cutaneous sensory function) (10) ఇతర చిల్లర కార్యములు (Genaral functions or cell functions).

ఈపైన వివరించిన కార్యములన్నిటిని ఆయుర్వేద ఫిజియాలజీ ననుసరించి పంచవిధ వాయువులలో దేనికి ఏవి చెందుచున్నవో నిర్ణయించబడును.

(1) ప్రాణవాతమునకు 1, 2, 3 వర్గములకు చెందిన కార్యమును.

(2) ఉదానవాతమునకు 4 వర్గములో చూపిన మాట్లాడుపని.

(3) సమానవాతమునకు 5వ వర్గములో చెప్పిన జీర్ణ కార్యము.

(4) అపానవాతమునకు 6 వర్గములకు చెందిన బహిష్కరణ వ్యాపారము. స్త్రీలకు రజస్సును, గర్భిణికి నెలలునిండిన పిమ్మట నొప్పులు పుట్టించి బిడ్డను త్రోసివేయుట అపానవాత కార్యములే యగును.

(5) వ్యానవాతమునకు 7,8,9 వర్గములకు చెందిన వ్యాపారములు. ఇక పదియవ వర్గమునకు చెందిన అణువులందు

సాగుచున్న కార్యము (Cell functions) వాత పిత్త కఫ ముల సమిష్టి సహాకారకృత్యమైయున్నది. 1921 సం॥రంలో డాక్టరు లేంగ్లేగారు Dr. Langley స్వతంత్ర నాడీమండల మును (autonimic nervons system) కనుగొనిరి. వీరి వ్రాతలనుబట్టి పంచవాతముల స్థానములను మనము సులువుగా నిర్ణయించగలము. ఎట్లనగా:-

(1) ప్రాణవాతస్థానము- అనాహతచక్రము (Superficial cardiac plexes).

(2) ఉదానవాతస్థానము- విశుద్ధచక్రము Superior cervical ganglia.

( ) సమానవాతస్థానము- మణిపూరచక్రము. ఇది Semilunar and superior messentric ganglia.

(4) అపానవాతస్థానము- ఆధారస్వాధిష్టానచక్రములు Inferior messentric ganglia and in the Cell-stations of Collataral ganglia of solor plexes.

(5) వ్యానవాతస్థానము- ఆజ్ఞాచక్రము- Ganglia of Rihes ఇది మానసిక వ్యాపారములకు తోడ్పడును.

ఈషడ్చక్రముల గుఱించిన జ్ఞానము యోగతంత్రము లలో పూర్తిగా కన్పించును. ఆయుర్వేద తంత్రకర్తలు వైద్యున కుపయుక్తమగునంతవఱకే నీజ్ఞానమును సంగ్రహించిరి. మన ప్రాచీనులకు నాడీమండలమును గుఱించి తెలిసినంతగా పాశ్చాత్యులకు తెలియదనుట అతిశయోక్తి కానేరదు.

2. పిత్త, కఫములయొక్క పుట్టుక, భౌతికలక్షణములు సామ్యన్యాపారములు, పంచవిభాగములు, వాని స్థానములను పాశ్చాత్య శారీరశాస్త్ర విషయములతో సమన్వయించి త్రిదోష సిద్ధాంత ప్రకరణములో వివరముగానే చెప్పబడినది. ఇక మిగిలినది

3. సప్తధాతు పరిణామపద్ధతి:- ధాతువులను యింగ్లీషున టిస్స్యూస్ అందురు. దేహాణువులయొక్క ఆకార నిర్మాణ పద్ధతి ననుసరించి మోడరన్ శారీరవేత్తలు (1) స్క్వామస్ టిస్స్యూ (2) మస్కులర్ టిస్స్యూ (3) గ్లాండ్యులర్ టిస్స్యూ (4) ఫేటీటిస్స్యూ (5) బోనీటిస్స్యూ (6) నర్వస్ టిస్స్యూ (7) బ్లడ్ టిస్స్యూ (8) ఎపితీలియల్ టిస్స్యూ మొదలైనవి 12 సంఖ్యను విభజించిరి. ఆయుర్వేదశాస్త్రములో అణువుల యాకార నిర్మాణమునగాక దాని ప్రయోజనమునుబట్టి (1) రసధాతువు (chyle, lymph) (2) రక్తధాతువు Blood) (3) మాంస ధాతువు (muscular tissue) (4) మేదో ధాతువు (Fatty tissue) (5) అస్థి ధాతువు (Bony tissues) (6) మజ్జా ధాతువు (Bone marraw) (7) శుక్ర ధాతువు (Spermatic fluid) అని సప్త ధాతువులుగా విభజించిరి. శుక్ర ధాతువులోనుంచి ఓజస్సు పుట్టుచున్నదనియు, మనస్థూలదేహమును అన్నమయ కోశమని చెప్పిరి, అనగా అన్నము చేతనే పుట్టుచున్నది. అన్నమే పోషించుచున్నది. గనుక అన్నము మన దేహములో వివిధ జీర్ణరసములతోకూడి విపాకము చెంది రస ధాతువుగా తయారగుచున్నది. అన్నసార రసమే రస ధాతువనబడును. ఇందులో అగ్నియంశలున్నవి. ఈ

ధాత్వగ్ని చేతను రసధాతువు పక్వముకాగా నది మూడు భాగములుగా విడుచున్నది. అతిసూక్ష్మ, సూక్ష్మ, స్థూల భాగములు. అతిసూక్ష్మ భాగము హృదయ స్థానమునకు చేరుకొని యచ్చట నిలవయుండును. సూక్ష్మ భాగరసము రంజక పిత్తముచేతను పక్వమై ఎఱ్ఱని రక్త ధాతువుగా పరిణమించుచున్నది. ఈ రక్త ధాతువు యందలి అగ్ని (రక్తాగ్ని) చేతను రక్తము పచనముకాగా వాయువు ఊష్మల సాయమున సూక్ష్మభాగము నిగరగొట్టి పడి ముద్దగా తయారగును. ఈ మాంసధాతువు తిరిగి మాంసాగ్ని చేతను పక్వమై త్రి భాగములుగావిడి, యందలి సూక్ష్మభాగము మాంసముగా నిలిచి, అతి సూక్ష్మభాగము మేదో ధాతువుగా పరిణమించుచున్నది. ఇదే ప్రకారము ప్రతి ధాతువు ఆయాధాత్వగ్నులచేతను, పక్వమై ఉత్తరోత్తర ధాతువులు పరిణమించుటకు హేతువులుగా నున్నవి. అనగా అన్నరసమే సప్త ధాతువులు పుట్టుటకు హేతువుగా నున్నదని యర్థము. *ఒక ధాతువులోనుంచి యింకొక ధాతువు పరిణమించుచున్నదని గ్రహించగలము. ఈ పరిణామ కార్య పద్ధతిని శాస్త్రకారులు బోధించుటకు త్రి విధ యుపమానములనిచ్చిరి. (1) క్షీర ప్రవృత్తి న్యాయము, (2) కేదార కుల్యా న్యాయము (3) ఖలేకపోత న్యాయము. మొదటి రెండును కార్యాచరణ పద్ధతిని బోధించునవిగా నున్నవి. మూడవది ధాతు పరిణామమునకు పట్టు కాలమును బోధించుచున్నది. ఈ వివరములకు చరక,

---

శ్లో॥ *రసాద్రక్తంతతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే
మేదసోఽస్థి తతో మజ్జా మజ్జ్ఞః శుక్రంతు జాయతే॥

(సు. సూ॥ 12-10-

సుశ్రుత, అష్టాంగ హృదయ గ్రంథములను జూడ దగును.

పాశ్చాత్యుల ఫిజియాలజీ గ్రంథములలో ధాతువుల యొక్క వృద్ధి వేరొక తీరుగా నున్నది. అది అణువిభజన పద్ధతి (double multiplication of tissue cells).

ప్రాతయణువులు నశించుచుండగా వీటిస్థానమును క్రొత్తగాపుట్టినవి ఆక్రమించుచుండును. పుట్టిన టిస్యూ సెల్సును అన్నరసము పోషించుచుండును. అన్నరసమందలి కొంతభాగమునకు చెందిన వివిధాంశలు సెల్ ఎంజైమ్ చేతను అక్సిజన్ సాయముతో కాలిపోవుచుండును. అప్పుడు వేడి, శక్తి కలుగుచున్నవి. నీరు, బొగ్గుపులుసుగాలి, మూత్రికాలవణ ములు ఏర్పడి, యివి మలభూతములగుటవలన శరీములో నుండి వెడలిపోవుచున్నవి. వేడిని, శక్తిని మన ముపయోగించు కొందుము. అన్నరసమందలి మిగిలినభాగము ధాత్వణువుల నిర్మాణమునకు తోడ్పడుచున్నది అని ఫిజియాలజీ గ్రంథ ములు బోధించును. ఈధాతుపోషణ, వృద్ధి కార్యకలాపమునకు మెటాబాలిజమ్ (Matabolism) అనిపేరు. ధాత్వణువుల వినాశమునకు కెటాబాలిజమ్ (Ketabolism) అనియు ధాత్వణువుల నిర్మాణము (వృద్ధికి) ఎన్నబాలిజమ్ (anna-bolism) అనియు వేర్వేరు పేర్లున్నవి. రెండుశాస్త్రము లందలి ధాతుపరిణామ పద్ధతులను జాగ్రత్తగా విమర్శించినచో నొకేవిధమని తోచును. ప్రదర్శించు పద్ధతులుమాత్రమే వేరుగా నున్నటుల కనిపించును. ఆయుర్వేదతంత్రకర్తలు సెల్ ఎంజైమ్సునే సప్తధాత్వగ్నులుగా భావించిరి. వాతము అణువిభజనముచేయుచు వృద్ధిగావించును. కఫము అణువు

వులనుకూర్చి సంధానపరచుచున్నది.

ఉపధాతువులు, మలములు:- సప్తధాతులలో రస రక్త మాంసామేదో ధాతువులు పరిణామమొందుచున్న సమయమున కొన్నియుపధాతువులుకూడ పుట్టుచున్నవని ఆయుర్వేద శాస్త్రము చెప్పుచున్నది. రసముయొక్క ఉపధాతువు స్త్రీలలో స్రావము (ఓవమ్ Ovum ), బాలింతలకు స్తన్యము. రక్తధాతువులోనుంచి పుట్టిన యుపధాతువులు, సిరలు, మాంస ధాతువుయొక్క ఉపధాతువు. వసాయను చమురు, చర్మపు పొరలు స్నాయువులు (ligaments) మేదోధాతువులోనుంచి పుట్టుచున్నవి. అన్నమలము పురీషము, రసధాతుమలము కఫమనియు, రక్తమలము పిత్తమనియు, మాంసమలములు నవరంధ్రములలోచేరిన వివిధ మలపదార్థములనియు, మేదస్సు యొక్క మలమే చమట యనియు, అస్థిమలములు వెంట్రుకలు, గోళ్లు యనియు, మజ్జామలము ఒంటిమీాద జిడ్డు అనియు ఆయుర్వేదశాస్త్రము చెప్పుచున్నది. శుక్రమత్యంత శుద్ధమగుటవలన నిందులోనుంచి మలములు పుట్టలేదు. ఈవిధమయిన వివరములు పాశ్చాత్యుల ఫిజియాలజీ గ్రంథములలో లేవు.

# 4వ భాగము - నిదానము

## 1వ అధ్యాయము

ప్రపంచములోని వివిధ శాస్త్రములందలి నిదాన పద్ధతులు:- రోగ నిశ్చయ జ్ఞానమే నిదానమనబడును. ఇంగ్లీషున డయాగ్నోసిస్ (Diagnosis), ఆయుర్వేద శాస్త్రములో రోగము కలుగుటకు వివిధ హేతువులు, ప్రధాన హేతువు, దూష్య విజ్ఞానము, రోగప్రాగ్రూప లక్షణములతో కూడిన రుగ్వి నిశ్చయ పద్ధతి యని చెప్పబడినది.

నేటి కాలమున ప్రపంచములో ఆరు రకముల వైద్య శాస్త్రము లనుసరింప బడుచున్నవి. (1) ఈజిప్టు దేశీయుల వైదము (2) చీనావారి వైద్యము (3) యునానీవైద్యము (4) భారతవైద్యము - ఆయుర్వేదము (5) హోమియో వైద్యము (6) మోడరన్ అల్లోపతి వైద్యము. వీనిలో ఈజిప్టు చైనావైద్యముల ప్రవర్తి మనకు లేదు. కనుక మన దేశములో నాచరణలోనున్న మిగిలిన నాలుగు వైద్యశాస్త్రములందలి నిదాన పద్ధతులను విమర్శింతము.

1. యూనాని వైద్య సాంప్రదాయమున రోగ నిదానము రెండు పద్ధతుల ననుసరించుచున్నారు. (1) 'రూా' సిద్ధాంతము (Theory of Ruh (2) ఖిల్ట్సు గారి సిద్ధాంతము (Theory of Khilts). 'రూా' అను పదమునకు అరబ్బీ భాషలో గాలి లేక వాతమని యర్థము. ఆయుర్వేదములో చెప్పిన వాతదోషమే యీ సిద్ధాంతము ప్రకారం రోగ నిదానమునకు ప్రధానముగ నెన్నబడు చున్నది. (2) ఖిల్ట్సు

గారి సిద్ధాంతము ప్రకారము నాలుగు ద్రవ్యములను దోష ములుగా (రోగ హేతువులుగా) నెన్నబడుచున్నవి. అవి ఏమనగా:- (1) సోఫ్రా అనగా పసుపురంగు పిత్తరసము. (yellow bile) (2) సౌండా అనగా నలుపు పిత్తరసము (Black bile) (3) ఖన్ అనగా రక్తము (blood) (4) బాల్ఘమ్ అనగా కఫము 'phlegm)

(ఎ) 'రూ' సిద్ధాంతము :- 'రూ' (వాతము) దేహేంద్రియములను చైతన్యవంతములుగా చేయుచున్నది. ఇది మూడు స్థలములలోనుండి, మూడు పేర్లతో వ్యవహరింపబడుచు, నియమిత కౌర్యముల జేయుచున్నది. (1) హార్టు అంను లంగ్సు యున్న ఉరస్సు నందున్న వాతమునకు 'రూ హావానీ' (Ruh Hawani) అని పేరు. ఇది గుండె (Heart) ఊపిరితిత్తులను (lungs) చలింపజేయుచున్న ప్రాణవాతము. (2) మెదడులోనున్న వాతమునకు 'రూనేఫ్సాని' (Ruh Nefsani) అని పేరు. ఇది రూహావానీ వాతముతో కలసినప్పుడు మాత్రమే మనకు జాగ్రదవస్థ (conscious state) కలుగుచున్నది. (3) మూడవది యగు 'రూతేబాయి' (Ruh Tabai) అను వాతము యకృత్ లో నున్నది. దీనికి రూహావానీ వాతసహాయము లభించినప్పుడు అన్న జీర్ణ కార్యము, ధాతునిర్మాణము జరుగుచున్నవి. యూనానీ వైద్య తంత్రకర్తలు వాతమును త్రివిధములని విభజించగా నాయుర్వేద తంత్రకర్తలు పంచభాగములు చేసిరి. ఇది భారతీయుల ప్రజ్ఞావిశేషము. వాతము సర్వప్రాణులకు ప్రాణాధారమయిన ద్రవ్యమని యుభయ వైద్యతంత్రకారు లంగీకరించిరి, వాతమును నెర్వు ఫోర్సుగా (Nerve force) శక్తి

ద్రవ్యముగా నాధునిక పాశ్చాత్య విద్వాంసులు పరిగణించు చున్నారు. మనుష్య జంతు వృక్ష శరీరములలో నవశ్యముగా కన్పించును. మెదడు సంగతి సృష్టి పరిణామములలో చివరను కలిగినది.

(బి) 2. ఖిల్ట్సుగారి సిద్ధాంతము:- (Theory of Khilts) ఖిల్ట్సు సిద్ధాంతములో చెప్పిన సోఫ్రా, సౌండా, ఖన్ అను ద్రవ్యము లాయుర్వేద మందలి పిత్తముతో సరిగా పోలుతూగుచున్నవి. బాల్గమ్ అనునది కఫమని స్పష్టమగు చున్నది. ఆయుర్వేదములో కూడ దోష సంఖ్యానిరూపణ ములో చరక సుశ్రుతుల భేదాభిప్రాయములు కన్పించును. చరకుడు వాతపిత్త కఫములు మూడు దోషములని చెప్పగా సుశ్రుతుడు రక్తమునుకూడ చేర్చి నాలుగు దోషములని చెప్పెను.

---

1. Nerve force of the vegitative nervous system (the original nervoas system in the animal kingdom) for the brain comes on when the higher animals including man are evolved,

"Neither the Khilts of the Greeko-younani system nor the corresponding doshas of Ayurvedists, are not humours but hormones. Thus Dr. Adam Brock M. D., the able translator of seme Galen's books, considers that those so-called humours have some resemblance to hormones, Similarly, various Ayurvedic scholars also consider them not as humours but as hormones."

(Dr. Ashtosh Roy - Pulse in Ayurveda)

## 2. హోమియో వైద్యమందలి చికిత్సా సూత్రములు

## (The homeopathic principles of treatment)

హోమియోపతి వైద్యులు, రోగహేతువులు, దోష దూష్య విజ్ఞానములతో నిమిత్తము లేకుండగనే రోగలక్షణముల ననుసరించి సరిగా నిదే లక్షణములను, ఆరోగ్యవంతుని శరీరములో విషమోతాదుల తినినప్పుడు పుట్టించగల మందు ద్రవ్యమును సూక్ష్మమోతాదులలో రోగులకిచ్చి వ్యాధి నయము చేయుచుందురు. అతి సూక్ష్మమోతాదులలో తిని పించిన మందు విషమోతాదువలన కలిగిన లక్షణములకు విరుద్ధముగా ప్రవర్తించును. ఈ విధమగు చికిత్సకు తదర్థ హేతు వ్యాధి విపరీతార్థకారి చికిత్సాపద్ధతి యని ఆయుర్వేదములో నందురు. ఈరకము చికిత్సను చేయువారలు పాటించవలసినవి ముఖ్యముగా నాలుగు విషయములున్నవి.

1. సారూప్యౌషధములను సూక్ష్మ మోతాదులో ప్రయోగించుట (similia similibus curantor and infinitsmal dose) ·

2. ఏకవస్తు ప్రయోగము, గుణవంతముగా జేసిన దానిని (use of single drug, potentialised) వాడుట.

3. చికిత్సాద్రవ్యముయొక్క శక్తి నభివృద్ధిపరచుట (drug dynamisation by mechanical means)

4. రోగియొక్క శారీర మానసిక, ప్రకృతిని నిర్ణయించుట - Study of Constitution and individu-lisation of caeh case.

ఈపై సూత్రముల ననుసరించి రోగికిచ్చిన మందేవిధముగా రోగమును నయముగావించునో, వ్యాధికి విపరీత లక్షణములను ఏప్రకారము సూక్ష్మద్రవ్యమునకు పుట్టించే సామర్థ్యము కలుగుచున్నదో శాస్త్రము వివరించదు. ఇవి ప్రత్యక్షానుభవముద్వారా విశదమగుచున్నవని శాస్త్రము బోధించును. రోగహారణము మందు ప్రభావ ఫలితమని మనమూహించవచ్చును. ఈవిషయమున నొక వాదము కలదు. మిక్కిలి సూక్ష్మప్రమాణముగల ఔషధము మిక్కిలి సూక్ష్మమగు మనస్సు నాక్రమించి తన గుణములను మనస్సునందావహింపజేయును. స్థూలముకంటెను సూక్ష్మద్రవ్యమునకు బలమధికముగాన, బలమగు సారూప్య సంస్కారమునందిన మనస్సు రోగముయొక్క బాధలను గుర్తింపదు. రోగనివారణ సహజముగానే శరీర ధర్మమునుబట్టి జరుగును.

ఈపైన వివరించిన హోమియోసూత్రములు నాలుగు నాయుర్వేద చికిత్సలలో నిమిడియున్నవనుటకు సందేహము లేదు. ఎట్లనగా:- ఆయుర్వేదము రోగియొక్క శారీర మానసిక ప్రవృత్తులద్వారా గ్రహించి ప్రకృతి నిశ్చయముచేసి దేశ, కాల, వయోసాత్మ్యములు, శరీర బల, రోగ బలాదుల ననుసరించి చికిత్సలాచరించవలెనని యాదేశించుచున్నది. ఇదియే 4 వ సూత్రముయొక్క భావము. మందుయొక్క ప్రభావము నతిశయించుటకు మర్దన, భావనసంస్కారములు, పుటముబెట్టి భస్మీకరణమొనర్చుట, మొదలైన క్రియలు మందు కల్పనలలో చేయబడుచున్నవి. ఇది 3వ సూత్రముయొక్క భావము. ఒకవ్యాధి యే హేతువులవల్ల జనించినదో తెలిసికొని ఆహేతువులనే యుక్తిగా నుపయోగించి విపరీత

ఫలమునుబడయుట. ఉదాహరణ:- ఈతలో సంభవించిన సమ్మూర్ఛవాతమునకు (muscular spasms) నీటిలో నీత గొట్టుటయే చికిత్స కాలిసఘ్నంట్లకు ఉష్ణగుణమును కలిగిన అగరు, శొంఠిగంధముల పట్టించుట. జడిసికొన్న ఉన్మాద రోగిని తిరిగి ఎక్కువ భయపెట్టుటద్వారా వ్యతిరేకఫలము లనుపొంది వ్యాధులను శమింపజేయువచ్చును. ఇది 1వ సూత్రమందలి భావము. చరకసంహితలో ఏకమూలికా ప్రయోగము లెన్నియోగలవు. లక్ష్మణపంజి, సహదేవి ప్రయోజనము తెలుగనివారు లేరు. పాము కుబుసము పొగ మూవిని వెడలించగలదు. పిల్లిపిత్తము తిమిరవ్యాధి (నేత్ర వ్యాధి)కి చికిత్సగాయున్నది. ఇంకను ఏకవస్తుప్రయోగము లెన్నో భైరాగి చిటికెలను పేరుతో కన్పించును ఇదియే సింగిల్ డ్రగ్ ట్రీట్మెంటు

3. ఆధునిక అల్లోపతి వైద్యనిదాన సిద్ధాంతములు.

నేటి అల్లోపతి వైద్యశాస్త్రములో (మోడరన్ మెడిసిన్) పంచవిధ రోగ హేతువాదములు అమలులోనున్నవి..

(1) సూక్ష్మక్రిమిసిద్ధాంతము (Bacterial theory)

(2) హార్మోనుగ్లాండుస్రావాదము (Theory of hormone glands)

(3) రాసాయనికద్రవ్య సిద్ధాంతము (Biochemical reactions)

(4) మానసిక హేతువులు (mental factors or Psychological theory)

(5) సాంఘికవాదము (Sociological factors)

ఈపంచవిధ రోగ హేతువాదములను గురించి విమర్శించుచు *డాక్టరు హెరాల్డు కాక్సు అను నతడు "శారీర శాస్త్రము (Physiology), మరియు రోగ హేతువాద శాస్త్రము (Pathology) లను ఆధునిక వైద్యములో కంటెను మన పూర్వీకులే ఎక్కువ కట్టుదిట్టముగా నిర్మించుకొనినారు" అని అభిప్రాయమును వెల్లడించినాడు.

*ఇంకను డాక్టరు హ్యూలెట్‌గారు తమ పెథాలజీ గ్రంథములో నీక్రింది విధముగా వ్రాసినారు. "రోగ కారణముల సంఖ్యాకములుగా నున్నవి. చాలవరకు బాహ్యకారణములని చెప్పవచ్చును. ఇవి వ్యక్తికి సంబంధించినవి కానప్పుడు వ్యక్తియొక్క పూర్వీకులకు చెందినవై యుండవచ్చును. ఈవిషయమును ఋజువుచేయుటకుగాని ఋజువు కాలేదనుటగాని వలనుపడదు.

మరియు *లండన్ పట్టణ సుప్రసిద్ధ వైద్యపుంగవుడు

---

* Thus Dr. Harold cox, another able translater of Galen and Hippoerates had started that 'the physiology and pathology of the ancients are built on more solid foundation than those of Modern Medicine'.

(Sydenham society publication)

* The causes of diseases are manifold and can usually be treated to external causes, acting if not on the individual on the ancesters of the individual — a proposition difficult either to prove or disprove."

(Dr. Hewlelt's physiology)

* Thus Leonard Williams, the well known Harley st. physican of London had remarked regarding theories of Modern Medicine at present, as folllows;— (See P. 153)

(హార్లీస్ట్రీట్ ఫిజిషియన్) లియొనార్డు విలియమ్సు పండితుడు మోడరన్ వైద్యమందలి రోగ హేతువాదముల గురించి యీక్రింది విధముగా నభిప్రాయమును వెలిబుచ్చెను:-

*"నిన్నటివరకును 'బేక్టీరియాలజీ', సూక్ష్మక్రిమిసిద్ధాంతము సుప్రసిద్ధమై సర్వులకు శిరోధార్యముగా నుండెను. మొన్నటివరకును చాల విజయవంతముగా పెరిగిన సర్జరీ, ఫిజియాలజీ, వైద్యశాస్త్రము లిప్పుడు తమ స్వాతంత్ర్యమును కోల్పోయి సూక్ష్మక్రిమిసిద్ధాంతమునకు దాసోహముచేయుచు తృప్తి జెందుచున్నవి. కాని కాలము తన కసిని తీర్చుకొనక మానదు. నేడో, రేపో భవిష్యత్తులో ఫిజియాలజీ శాస్త్రవేత్తలు, వైద్యశాస్త్రనిష్ణాతలు, చికిత్సకులు తిరుగుబాటు చేయవలసిన తరుణము రానున్నది. అట్టి సమయము నేటితోనే యీ సింపెతిటిక్ ఎండోక్రైన్ గ్లాండ్సు సిద్ధాంతముతో నారంభమయినది." (జర్నల్ ఆఫ్ ఆర్గనోథిరపి) మరియు మోడరన్ వైద్యశాస్త్రములో చెప్పిన వివిధరోగ హేతుక సిద్ధాంతముల గురించి ప్రస్తావించుచు సుప్రసిద్ధ వైద్యాను

---

*"Yesterday was the day of Bacteriology. The day before the triumphant progress of surgery, physiology and medicine wrung in the Wither and quite crest fallen, contend themselves perforce with the crubs that fell from the rich microbic table of these others. But the whirlgig of time brings in its revenge. To day, tomorrow and the day after are fore ordained to the phigiologist, the physi- 'cian and therapeutists. Their hour has come through the agency of the sympathetic endocrine system".

(Journel of argann-therapy)

భవశాలియైన *డాక్టరు ముత్తుగారు తాము రచించిన క్షయ వ్యాధిని గురించిన గ్రంథములో నిట్లు వ్రాసినారు:-

"రోగ హేతువుల నన్వేషించుకొనుటకు మనము సాగించుచున్న ప్రయాణములో చాలకాలమునుండి వ్యర్థముగా 'బేక్టీరియాలజీ' అనెడు మైలురాయి దగ్గరనే ఆగి పోయినాము. ఇకముందు మనకు కనుచూపు మేరలోనున్న బయోకెమిస్ట్రీ అనెడు మైలురాయి దగ్గరకు చేరుకోవలెనని నుత్సాహపడుచున్నాము. దీనికి పైన సింపతిటిక్ ఎండోక్రైనాలజీ అనే మైలురాయి యున్నదని విను చున్నాము. దీనిని కూడ నెంతవేగముగ చేరుకొందమా యని ఆతురపడుచున్నాము. దీనికి ఆవల నింకను 'సోషియాలజీ'ని చేరుకోవలసియున్నది. ఈలోగా సైకోలజీశాస్త్రము తనను ముందుగా పరిశీలించమని మనల నాహ్వానించు చున్నది.

*ఇంకను మదరాసు గవర్నమెంటు దేశీయ వైద్య పాఠశాల ప్రిన్సిపాల్‌గా నుండిన కెప్టెను. జి. శ్రీనివాస మూర్తిగారు "ఆధునిక వైద్యసిద్ధాంతములన్నియు కొలిమి యందలి మూసలో కరుగుచున్నవి" అని చమత్కారముగా శలవిచ్చినారు.

---

*"We have lingered long enough on the mile-stone of Bacteriology. We are tempted to stop at Biochemistry and sympathetic endocrinology. Further on sociology meets us and psychology beckons us." (Dr. Muthu)

*Thus captain G. Srinivasamurthy states that "the theories of Modern Medicine are in the melting pot."

## 1 సూక్ష్మక్రిములకు రోగ హేతుకత్వము

మరియు ఆరోగ్యము, అనారోగ్యపరిస్థితులకు సూక్ష్మక్రిములే కారణమనుట సరికాదు. ఏలయన కొన్ని రోగములు మాత్రమే క్రిములవల్ల కలుగుచున్నవని పాశ్చాత్య వైద్యులు నమ్ముచున్నారు. వీరిలో సూక్ష్మక్రిములు రోగ ఫలితముగా నుద్భవించుచున్నవి గాని నిజముగా నవి రోగములను పుట్టించలేదని నమ్మువారుకూడ గలరు. *వీరిలో ప్రముఖ శాస్త్రవేత్త, సర్ జేమ్సు గుడ్ హార్టుగారు "రోగ క్రిములు సహితము బహుశః రోగఫలితముగా పుట్టినవేగాని రోగహేతులై యుండవు" అని అభిప్రాయపడినారు. ఇటీవల పాశ్చాత్యశాస్త్రజులు కనుగొనిన విషయములను చూడగా వారుకూడను విత్తునకంటెను క్షేత్రముయొక్క స్థితికే ప్రాధాన్యత నిచ్చుచున్నట్లు తోచుచున్నది. ఏలయనగా శరీరమును మంచి యారోగ్యస్థితిలో నుంచుకొన్నచో రోగక్రిముల నెదిరించు సహజ శరీరశక్తులు ఎక్కువగానే వృద్ధిజెందును. ఈస్థితిలో ప్రమాదవశమున శరీరములోకి ప్రవేశించగలిగినను వెనువెంటనే యవి నశించునుగాని వృద్ధిజెందలేవు. శరీరధాతువులలో నీవిధమైన ప్రతిఘటనాశక్తి మిథ్యాహార విహారములద్వారా దుర్బలము లైనప్పుడుగాని లోన

---

*The statement of Sir James Good heart, a much honoured scientist, "Even bacteria are probably the results and not causes for discases".

The recent findings of Western Scientists attach more importance to the "soundness of soil conditions in preference to the seed."

ప్రవేశించిన క్రిములు వృద్ధియగుట కవకాశములేదు. క్రిముల కనుకూలమగు పరిస్థితి ఏర్పడినదానికి ససెప్టిబిలిటి యని (Susceptibility) అని వారిశాస్త్రములో చెప్పినారు. రోగక్రిముల నెదిరించు ప్రతిఘటనాశక్తులకు ఇమ్యూనిటీ అని పేరిడిరి. అవసరమని తోచినప్పుడీ శరీరశక్తులను కృత్రిమపద్ధతులద్వారా వృద్ధిచేసికోవచ్చునని కూడ శాస్త్రపరిశోధకు లుపాయములను కనిపెట్టుచున్నారు. ఈప్రయత్నములు యిది వరలో సూక్ష్మక్రిములే రోగములను కలిగించుచున్న వాద మును త్రోసిపుచ్చి, క్రిముల నాటంకపరచగల శరీరశక్తుల నభివృద్ధి చేసికొనుచుండుట జూడ క్షేత్రమునకు ప్రాధాన్య మిచ్చుటగాదా? ఈఅభిప్రాయమునే *డాక్టరు హార్వే పండి తుడు 1912 సం॥ములో నీవిధముగా చెప్పియున్నాడు. "మన నిదాన శాస్త్రము రోజు రోజుకి మార్పులు చెందుచునే యున్నది. అది యింకను సుస్థిరము కాలేదు. బహుశా రోగములలో కన్పించుచున్న సూక్ష్మక్రిములు రోగ జనితములుగాని రోగ జనకములు గావు. ముందు తరముల వారికి రోగ నిరోధము, క్రిమినాశకర ప్రయత్నములను మందుల సాయముతో జేయుట కంటె శరీర శక్తుల నభివృద్ధి పరచుకొనుట ముఖ్యముగా నుండవచ్చును."

---

*1: Our pathology is shifting from day to day. It is not yet stabilised. Probably the 'germs are the result of the diseased condition of the body but not the cause for disease. Moreover, increasing Vital powers of the body becomes more important here after than for the prevention of and eradication of the disease germs from the body." (Dr. Harvey, the great physiologist, 1912)

(1) ఈ క్రిమి సిద్ధాంతము వచ్చి సుమారు రెండు శతాబ్దము లైనది. ఇంతకు పూర్వము రెండువేల సంవత్సరముల క్రిందటనే ఆయుర్వేదతంత్రకర్తలు రోగములను పుట్టింపగల కొన్ని సూక్ష్మజీవు లున్నవని గుర్తించినారు. అధర్వణ వేదములో నీసూక్ష్మ క్రిములను, వాటి క్రూరస్వభావము ననుసరించి రక్షస్సు లనియు, పిశాచము లనియు, భూతము లనియు వ్యవహరించినారు. యక్ష్మనాశన మంత్రములు, తక్మ నాశ మంత్రములు, పిశాచనాశ మంత్రములు, రక్షోఘ్న మంత్రములను చదివినచో క్రిముల జాతులు, పేర్లు ఎన్నియో కన్పించ గలవు ఆయుర్వేద తంత్రకర్తలు యీ విషయము లన్నిటిని క్రోడీకరించి ఆయుర్వేదమును ఎనిమిది భాగములుగ విభజించి వానిలో భూతవిద్యా తంత్రమను పేరుతో క్రిమి విజ్ఞానమును, మంత్ర శాస్త్రముతో జోడించి వాని పారదోలుటకు కొన్ని తంత్రక్రియల నేర్పరచిరి. మన దేశములో నీ భూతవిద్య నవలంభించువా రక్కడక్కడ యున్నారు. వీరినికూడ వైద్య సోదరులుగా పరిగణించి తోడివైద్యులతో సమాన గౌరవప్రతిపత్తు లియ్యవలసి యుండును. ఈ సూక్ష్మ క్రిముల జ్ఞానము శల్యతంత్రజ్ఞులకు మిక్కిలి యవసరము. మిగతా ఆయుర్వేదశాస్త్ర భాగములన్నియు త్రిదోష సిద్ధాంతము ననుసరించి నిర్మింపబడినవి కనుక కాయచికిత్స (Medicine) ల నాచరించు వైద్యులకు క్రిముల కంటెను త్రిదోషములే ప్రధానములుగ నున్నవి.

(2) బయోకెమిక్ సిద్ధాంతము (Theory of Bio-chemstry) ఆరోగ్య స్థితిలో ధాతువులలో నిండిన ఏసిడ్

ఆల్కలీ నిష్పత్తి (acid-alkali ratio) హెచ్చు తగ్గులు చెందుటవలన రోగములు కలుగుచున్నవని ఒక సిద్ధాంత మున్నది. దీని ననుసరించి డాక్టరు షుష్లర్‌గారి ద్వాదశ లవణ చికిత్సా శాస్త్రము నిర్మించబడినది. ఆయుర్వేదములో చెప్పిన పిత్త కఫవృద్ధి యవస్థలు యీ సిద్ధాంతమును లీనము చేసికోగలవు.

(3) సింపతిటిక్ ఎండ్రోక్రైనాలజీ సిద్ధాంతము:- ఆయుర్వేద మందలి త్రిదోష సిద్ధాంతమునకు చాల సమీపముగా నున్నదని యిదివరలో చెప్పితిమి.

(4) సోషియాలజీ సిద్ధాంతము - మనుష్యుని జీవన పరిస్థితులు, పరిసర పరిస్థితులు, మానసిక ప్రవృత్తులు సింపతిటిక్ ఎండ్రోక్రైను గ్రంధుల వ్యాపారములపై నెంతయో ప్రభావమును కలిగియున్నవని చెప్పినందున యీ విషయముకూడను ఆయుర్వేదమందలి వ్యక్తిగత ఆరోగ్య సూత్రములు, ఆహార అభ్యాసములు, రాగాదులను విసర్జించి మనస్సును ప్రశాంతముగ ఆనందమయముగా నుంచుకోవలె చెప్పిన హితోపదేశములో నిముడుచున్నది.

(5) సైకాలజీ సిద్ధాంతము(Psycholigical factors) * డాక్టరు ముత్తుగారు యీ సిద్ధాంతమును గురించి వెల్లడిం

*"The new psychology" says Dr. Muthu, tells us that the physical energy that is derived from food and air acts on the lower plane and that the real power that gives the driving force comes from the higher energies acting on the higher or psychic plane. The body nutrition is only

చిన అభిప్రాయము మన ఋషుల భావముతో సరిపోవు చున్నది. అదేమనగా "నవీన మానసిక శాస్త్రము ఆహారము గాలిద్వారా మనకు లభించుచున్న భౌతికశక్తి (Physical energy) పాంచభౌతిక దేహమునకే సంబంధించినది (acts on lower plane). కొన్ని యుత్తమ దివ్యశక్తులు దేవతలు, సూర్యాది గ్రహ నక్షత్రముల ద్వారా మనకు లభించు చున్నవి. ఇవి మనస్సు, బుద్ధి, యింద్రియములపైన యధి వసించి నూతనశక్తుల నిచ్చుచున్నవి. ఈనూతన శక్తులను ప్రాణశక్తులన వచ్చును. ఈ ప్రాణశక్తులు రసరక్తాది సమస్త ధాతువుల నారోగ్యస్థితిలో నుంచుట కుపకరించ గలవు". *ఆయుర్వేద తంత్రకర్తలు పై విషయములను బాగుగా గ్రహించి మన శరీరభాగముల కధిష్ఠాన దేవతలను వివరించిరి. సుశ్రుత శారీర స్థానము 1వ అధ్యాయంలో మన శరీరములో బ్రహ్మ బుద్ధిని, ఈశ్వరుడు అహంకారమును, చంద్రుడు

---

intended to keep the various organs and tissues in a healthy state, so that the vital energy may freely flow through our being".

*సూ॥ అథ బుద్ధేర్బ్రహ్మా, అహంకారస్యేశ్వరః మనసశ్చంద్రమాః దిశశ్రోత్రస్య, త్వచో వాయుః చక్షుషోనూర్యః రసనస్యాపః, పృథ్వీ ఘ్రాణస్య, వచసోగ్నిః హస్తయోరింద్రః, పాదయోర్విష్ణుః, పాయోర్మిత్రమ్, ప్రజాపతి రుపస్థస్యేతి.

(సుశ్రుత శారీర స్థానం 1 అధ్యా 14 సూ.)

శ్లో॥ దేహోదేవాలయః ప్రోక్తో జీవదేవస్సనాతనః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్ ॥

(ప్రాచీన నుండి)

మనస్సును, దిక్కులు శ్రోత్రేంద్రియమును, వాయువు చర్మమును సూర్యుడు కన్నులను, పర్జన్యుడు రసనేంద్రియమును, పృథ్వి ఘ్రాణేంద్రియములను, అగ్ని దేవుడు వాగింద్రియమును, ఇంద్రుడు హస్తేంద్రియమును, విష్ణువు పాదేంద్రియమును, మిత్రుడను పేరుగల దేవుడు పాయురింద్రియమును, ప్రజాపతి ఉపస్థేంద్రియముల నధిష్ఠించి యుందురని చెప్పెను. న్యూ సైకాలజీ శాస్త్రము (ఆధునిక మానసిక వ్యాపారతంత్రము) లో చెప్పిన విషయము ననుసరించి దేవతలందఱు మన శరీర భాగముల నధిష్టించి, ఆయా భాగములకు తమ శక్తులను ప్రసాదించి పుష్టివంతములుగా చేయుచున్నారని మనము గ్రహించవలసి యున్నది. అందుచేతనే 'ఓం భద్రం కర్ణేభి శ్రుణు యామ దేవాః' అని ఆరంభమైన ఋగ్వేద మంత్రము భగవంతుని సేవించుకొరకే తన యింద్రియము లన్నింటిని భద్రమైన స్థితిలో నుంచమని ఆ యా యధిష్ఠాన దేవతలను గూర్చి భగవద్భక్తుడు ప్రార్థించుచున్నాడు. అనగా మన శరీరము సర్వదేవతా మయమని గ్రహించ గలము. కనుకనే సుశ్రుతుడు ఆపరేషను చేయుటకు ముందుగ నా స్థలాధిష్ఠాన దేవతను గురించి అతని అనుగ్రహమును పొందుటకై కొన్ని మంత్రములను కూడ నుదహరించెను. ప్రాచీనుల నుడి ప్రకారము దేహము జీవాత్మకు నివాస స్థానము. జీవాత్మకు పరమాత్మ కభేదము. ఈ విషయమును గ్రహించిన మానవునకు సోహంభావ ముదయించి దేహము నతి పవిత్రముగా నుంచుకొనును. మరియు బొంబాయి వాస్తవ్యులు డాక్టరు వి. జె. రెలె, ఎల్. ఎం. యస్., గారు 'వేదిక్ గాడ్సు ఏజ్ ఫిగర్సు ఆఫ్ బయాలజీ' (Vedic gods as

figures of Biology) అను గ్రంథమును వ్రాసినారు. ఇందులో బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, వరుణ, కుబేర, అశ్విని, మరుత్తులును, అగ్ని, సూర్య, చంద్రులు తమ నివాసములుగా మెదడులోని వివిధ భాగముల నేర్పఱచుకొని, ఆ యా భాగములను పుష్టివంతముగా జేయుచు, తమ శక్తుల ద్వారా సర్వాంగములను పోషించుచున్నారని చెప్పుచు, ఆయాదేవతల క్రియా శక్తులను ఆధునిక ఫిజియాలజీలోని మెదడు, సుషుమ్న, నాడీ తంతుల శక్తులుగా సాదృశ్య పద్ధతిని (Vedic physiology of Brain and nervous system) వైదిక నాడీ విజ్ఞానశాస్త్రమును సృష్టించినారు. ఇందులో శారీరపటములుకూడా నున్నవి.

మరియు అథర్వణవేదములో హిరణ్య విద్యను గురించిన ప్రసంశకలదు. హిరణ్య మనగా దివ్యప్రాణ శక్తులని యర్థము. పరమేశ్వరునకు హిరణ్యగర్భుడని పేరుకలదు. పరమేశ్వర ప్రసాదిత హిరణ్య పదార్థము సూర్యునిలోనికి బ్రవేశించును. కనుక సూర్యునికి కూడ హిరణ్యగర్భ డను పేరు సార్థకముగాకలదు. 'సూర్య ఆత్మా జగతః తస్థుషశ్చ' అని చెప్పుటవలన సర్వజగత్తున కాధారమైన సూర్యునిలోని హిరణ్య ద్రవ్యము, ప్రాణశక్తులు, ప్రాణికోటుల దేహములలో బ్రవేశించి జీవింపజేయుచున్నవి. మన శరీరమందలి ప్రాణశక్తులు తగ్గినప్పుడు అన్యత్రా లభించుచున్న ప్రాణశక్తులను సంపాదించి మన శరీరములోనికి ప్రవేశ బెట్ట

వచ్చును. కనుక ప్రాపంచిక ద్రవ్యములన్నియు రోగ చికిత్స కనుకూలించును.

ఓషధు లధికముగా సూర్యుని యందలి ప్రాణశక్తులను గ్రహించి వృద్ధి జెందుచుండును. కనుక యోషధుల నుపయోగించుచున్నాము. వీనిని గివ్య భేషజములని *అధర్వణ వేదము చెప్పును. ఇంకను యోషధులను సేకరించునప్పుడు మనవారు ఓషధుల నాశ్రయించుకొనియున్న దేవతలను ముందుగా పూజించి వారి యనుగ్రహమును బడసి, దానిని చికిత్సగా నుపయోగించమని చెప్పినారు, ఈ విధమైన రోగ చికిత్సలు నిదానము ననుసరించి చేయబడుచున్నవి. ఈ పైన వివరించిన విషయములన్నియు నమ్మకము (Psychological beliefs) మీద నాధారపడినవి. అయు ర్వేదములో వేదాంత విషయములు, మతాచారములు, ప్రజలలోనున్న విశ్వాసములు కలగాపులగము చేయబడినవి అని ఆక్షేపించువారు గొప్పశాస్త్రజ్ఞుడైన 1 'కార్లుపియర్సన్' గారి యుపదేశములను గమనించమని కోరుచున్నాము:- "మానవ

1. "The scope of science is to assertain truth in every possible branch of knowledge; there is no sphere of inquiry which lies out side the legitimate field ot science. To draw distingtion between science and philosophy is obscurantum". (Karl pearsonl Grammer of science, vol. I page 37)

*మంత్రం— "ఆథర్వణీరాంగిర సీర్దైవీ ఓషధయ మనుష్య జా ఉత"

అని భేషజ ద్రవ్యములు అధర్వణీయములు, అంగీరసములు, దివ్యభేషజములు, ఓషధులు అని నాలుగు రకములుగా నున్నవి.

(అధర్వణ వేదం)

విజ్ఞానమునకు తోడ్పడుచున్న సర్వవిషయములను పరికించ దగును. శాస్త్రము, వేదాంతములకు విభేదములను కల్పించుట తెలివితక్కువ. ఇదివరలోవలె ఫిజిక్సు (భౌతిక శాస్త్రమును) మెటాఫిజిక్సు (తత్త్వశాస్త్రముచు వేర్వేసుగా నుంచుటకు వీలుకాదు'' వీనిని సమన్వయించ వలసి యుండు నని ఆధునిక పండితు లభిప్రాయ పడుచున్నారు.

—o—

# 2 వ అధ్యాయము

## Diagnostic methods in Ayurveda

## ఆయుర్వేద నిదాన విషయములు, పద్ధతులు.

ఆయుర్వేదములో రోగ నిశ్చయజ్ఞానము కొఱకు రెండు విధములైన పరీక్షల జెప్పిరి. (1) పంచలక్షణ నిదానము (2) అష్టస్థాన పరీక్ష. మొదటి పరీక్ష వలన రోగమును గురించిన జ్ఞానమంతయు గలుగును. రెండవ పరీక్ష దోషములయొక్క వైషమ్య వివరమును మరింత ధృవ పరచును. దూష్యవిజ్ఞానమొసంగును.

పంచ లక్షణ నిదానము లేక రోగవివరముల దెలిసి కొనుటకు పంచ విధోపాయములు:- (1) నిదానము అనగా రోగము కలుగుటకు వివిధ హేతువులు (2) పూర్వరూపము (3) రూపము (4) ఉపశమనము (5) సంప్రాప్తి. వీని వివరములను తెలియుదము. నిదానము (Eteology)

I నిదానము: (causes for disease)

(1) ఈ హేతువుల సంఖ్యాకములుగా నుండును. ప్రధాన హేతువులు -- వైషమ్యము జెందిన వాతపిత్త కఫములు. (important causes or chief causes)

(2) వ్యభిచార హేతువు:- ఆ దోషప్రకోపమునకు సహాయ పడుచున్న స్వల్ప హేతువులు వీనికి (Helping causes or anxillary) Coruses అందురు.

(3) విప్రకృష్ట హేతువులు (Remote or distant causes)

(4) సన్నికృష్ట హేతువులు (immediate causes). ప్రధాన హేతువులైన వాతాదులు ప్రకోపించి శరీర ధాతువులను చెఱచుటవలన వ్యాధి కలుగుచున్నది. మన శరీరములో సామ్యముగా వ్యవహరించుచున్న త్రిదోషములు దూషింపబడుటకు చెప్పిన యన్ని కారణములను మన వారు మూడు వర్గములుగా విభజించిరి.

(అ) అసాత్మ్యేంద్రియార్థసంయోగము: అనగా నొకని యింద్రియములకు సాత్మ్యముకాని (సరిపడని) విషయము లనుభవమునకు వచ్చినప్పుడు వాతాదులు ప్రకోపించును. ఇట్టి యనుభవము అతియోగ, అయోగ, మిథ్యాయోగములు కావచ్చును. ఈ మూడు రకముల యనుభవములలో నే యొక్కటి యైనను దోషముల బ్రకోపింప జేయజాలును.

(ఆ) ప్రజ్ఞాపరాధము. అనగా తెలిసియుండియుగాని లేక అజ్ఞానము చేతగాని బుద్ధిపూర్వకముగా నారోగ్య భంగకరములైన ఆహార విహారాది ప్రవృత్తులందు మెలగుట. దీని వలన దోషములు ప్రకోపించి వ్యాధుల కలిగించును.

(ఇ) పరిణామము:- పురుష యధీనములో గాకుండ స్వాభావికముగా సంభవించు వాతాతపశీతములవల్లను, ఋతుమార్పువల్లను, వయస్సు నిమిత్తముగాను, సూర్యచంద్ర గ్రహ ప్రభావములవల్లను, రాత్రి పగలు, భోజనాదికములకు

సంబంధించి వాతాదులు ప్రకోపించి రోగహేతువులగుట కలదు.

వాతాదులకు ఆరు యవస్థలున్నవి. చయ, ప్రకోప ప్రసర, ధాత్వాశ్రయ, ప్రస్ఫోట, ప్రశమనములు. ఈ యవస్థలను లక్షణముల ద్వారా తెలియవలెను. పిమ్మట నా దోషములు సామములా లేక నిరామములా? యని తెలిసి తదనుగుణముగా చికిత్స లాచరించవలెను. (ఆమ మనగా పక్వముగాక చెడిపోయిన అన్నరసము). ప్రకోపించిన రెండు లేక మూడు దోషములలో ప్రధానమెయ్యది, అనుసరణ దోషములెవ్వి (అనుబంధానుబంధ్యజ్ఞానము) యని తెలిసి కోవలెను.

త్రి దోషములు ఏక కాలములో ప్రకోపించినస్థితికి సన్నిపాత యవస్థ యందుము. ప్రకోపించిన శరీరజన్య దోషములు, ప్రకృతి దోషములు (పుట్టుకతో కలిసి లభించినవి) కలిసికొని రోగ లక్షములను చాల తీవ్రరూపములో పుట్టించును. ప్రకృతి దోషములకు చికిత్సయవసరములేదు. నిజదోషములను శమింపజేసిన వ్యాధి నయమగుచున్నదికాన రోగి యే ప్రకృతికి చెందినవాడో రోగియొక్క శారీరక, మానసి కాహార యభ్యాసాది ప్రవృత్తుల నడిగి తెలిసికొన్నచో గ్రహించవచ్చును. ఈ జ్ఞానము వలన రోగ సాధ్యాసాధ్యములను కొంతవరకు గ్రహించ వీలగును.

(2) ప్రాగ్రూపము (Prodromal symptoms or premonitary symptoms). దోషములు చయావస్థలో

నుండగానే కొన్ని స్వల్పబాధలు, లక్షణము లారంభము లగును. ఈ వ్యాధి యారంభ లక్షణములు (initial symptoms) కన్పించిన వెంటనే చికిత్స యారంభించినచో రోగము రాకుండా నాగిపోవును. లేదా మిగిలియుండిన అల్పదోషములతో వ్యాధిలక్షణములు కన్పించినను విశేష ముగా బాధించక చికిత్సకు సుసాధ్యమగును. కనుక దోష వైషమ్యమును ఆరంభావస్థలోనే (చయావస్థ) గుర్తించుట అవసరము. ఆవలింతలు వాతమునకును, దాహము, ఒళ్లు మంట, అరుచి, పిత్తమునకును, ఒళ్లుబరువు, నిరుత్సాహము, నోరు తీపి, కఫమునకు చయాలక్షణములుగా నున్నవి.

(3) రోగస్వరూపము:- (Signs and symptoms)

రోగియనుభవించు బాధలకు సిమ్టమ్సు అనియు, వైద్యుడు కనిపెట్టిన గుర్తులు, దోషములకు సంబంధించినవి సైన్సు అని యనబడును ఇవి శరీర మనస్సంబంధములు కూడ కావచ్చును. ఈ జ్ఞానమునకు తోడు దూష్యజ్ఞానము కూడ యవసర మగును. అనగ ప్రకోపించిన దోషము లేయే ధాతువుల నాశ్రయించి, యెంతవరకు చెఱచినవి, యనెడు జ్ఞానము. ఇదికూడను లక్షణములు, బాధలను గుర్తించుట ద్వారా గ్రహించవచ్చును. ఈదోషదూష్యజ్ఞానమునకు యింగ్లీషున పెథాలజీ (pathology) అనిపేరు.

రోగము ప్రధానముగా వచ్చెనా? (primary disease) లేక వేరొక వ్యాధి ననుసరించి పుట్టినదా? (secondary to the first appeared disease) తెలియు టవసరమగును.

అను సరణవ్యాధికి కాంప్లికేషన్ (complication) అని పేరు. రోగలక్షణములలో కొన్ని మరణసూచకము లున్నవి. వీనికి అరిష్టము లందురు. (signs of impending death) వీటిని రోగారంభమున కనిపెట్టిన వైద్యుడు తన యశస్సును కోరినచో చికిత్స చేయక విడుచును.

(4) ఉపశయము :- ఉపశయము రెండు విధములు. వ్యాధియుపశయము(treatment to eliminate suffering) దోషశమనము, ప్రకోపించిన వాతాదులు శమించి స్వస్థత చెందుట. శమన చికిత్సను ప్రయోగించి తద్వారా సందిగ్ధ దోషప్రకోపజ్ఞానమును కూడ పొందవచ్చును. ఇదియొక యుపాయము.

(5) సంప్రాప్తి:- (pathology) ఇది 5 విధములుగ నున్నది 1. సంఖ్యాసంప్రాప్తి 2. బలసంప్రాప్తి 3. కాల సంప్రాప్తి 4. ప్రాధాన్యసంప్రాప్తి 5. వికల్పసంప్రాప్తి. ఈ అయిదింటివలన కలిగిన జ్ఞానము రోగము యొక్కయు, దోషముల యొక్కయు, వివరములను బోధించును. ఇందువలన దోషములు ఏయే యంశలతో వృద్ధిజెందినవో, యేస్రోతస్సుల ద్వారా ప్రసరించి, యేయేధాతువుల జెఱచినవో తెలియగలము. శాస్త్రములో ప్రతిరోగమునకు చెప్పిన యీ సంప్రాప్తిజ్ఞానము వలన బాధలు లక్షణములకు కార్యకారణ సంబంధమును గ్రహించవచ్చును. దీనికి ఆయుర్వేదిక్ పేథాలజీ యనవలెను.

ఆయుర్వేద పేథాలజీ దోషదూష్యజ్ఞానమును కల్గించుచుండగా పాశ్చాత్యుల పేథాలజీ శాస్త్రము దోషములను విడిచి ఒక్క దూష్యజ్ఞానమునే విశేషముగ వివరించుచున్నది. కంటితో కన్పించువరకు ధాతువులు, కోష్ఠాంగములందు రోగ ఫలితముగా సంభవించిన మార్పులను వర్ణించియు, ఒక శతాబ్దమునుండి అణుదర్శిని యంత్రసహాయముతో (Micro-scopic pathology-histology) వికృతిజెందిన దేహాణువులనుకూడ వివరములుగా వర్ణించిరి, ఈ విశేషజ్ఞానమును ఆయుర్వేద వైద్యులు పాశ్చాత్యవైద్యుల సాయమున గ్రహించినమేలుగానుండును.

## 2. అష్టస్థాన పరీక్ష

పైన వివరించిన పంచ విధోపాయముల (పంచ లక్షణ నిదానముల) ద్వారా రోగ వినిశ్చయ జ్ఞానమును బడసిన పిమ్మట వైద్యుడిచ్చట చెప్పిన అష్టస్థాన పరీక్షా పద్ధతి ననుసరించినచో ఆతనికి దోష దూష్య జ్ఞానము మరింతగా ధృవ పడగలదు. ప్రాచీనాయుర్వేద గ్రంథము లన్నిటిలోను పంచవిధ లక్షణోపాయములు బోధించబడినవి. సుమారు రెండువందల సంవత్సరముల క్రిందట వైద్య చింతామణి గ్రంథకర్త ఈ రెండవ రకము పరీక్షా పద్ధతిని దక్షిణదేశ వైద్య గ్రంథములనుండి గ్రహించి తన గ్రంథములో వ్రాసెను ఈ తరువాత బసవరాజీయ గ్రంథములోకి వ్యాపించినది. ఆంధ్రప్రదేశ వైద్యులెల్లరు అష్టస్థాన పరీక్షలను చేసియే రుగ్వినిశ్చయము చేయుచున్నారు. ఇందలి విశేషమేమనగా రోగస్థితిలో దోష్య దూష్యజ్ఞాన

మును కలిగించుటయే గాక రోగముయొక్క సాధ్యాసాధ్య ములను, రోగియొక్క ఆయుఃవును గూడ నతిసులభముగా నిశ్చ యించ వచ్చును. ఈ పరీక్షలు ఆధునిక శాస్త్ర విజ్ఞాన ముతో తుల్యములుగా నున్నందున వాటి వివరము లిచ్చుట తెలుపబడినవి. ఈ అష్టస్థాన పరీక్షలద్వారా లభించిన జ్ఞానమును ప్రత్యక్ష జ్ఞానమని చెప్పవలెను. పంచ లక్షణ నిదాన విషయములు చాలవరకు శాస్త్రముపై నాధారపడి నవి. అష్టస్థాన పరీక్ష లెవ్వియనగా:-

(1) నాడీ పరీక్ష (2) శరీర వర్ణాదుల పరీక్ష (3) నాలుక పరీక్ష (4) కన్నుల పరీక్ష (5) మాట్లాడి నప్పుడు కంఠధ్వని పరీక్ష (6) రోగియొక్క స్పర్శజ్ఞాన పరీక్ష (7) మల పరీక్ష (8) మూత్ర పరీక్ష.

(1) నాడీ పరీక్ష:- (Pulse examination in Ayurveda) అష్టస్థాన పరీక్షలో వైద్యునికి నాడీపరీక్ష చాల ప్రధానముగా నెన్నబడు చున్నది. ఈ పరీక్షా జ్ఞానము లేని వైద్యుడు అనుభవ వైద్యుడుగా పరిగణింప బడడు. రోగియొక్క చేతి మణికట్టు దగ్గర బొటన వ్రేలు వైపునున్న నాడిని, రేడియల్ ఆర్టరీని (Radial artery వైద్యుడు మూడు వ్రేళ్లతో నదిమి నొక్కుచు నీ దిగువ విషయములను కనిపెట్టి ఆ కార్యములు త్రిదోషముల ప్రభా వము వలన కలుగు చున్నవని భావించి వానిలో బలాబలము లను నిర్ణయించుట ద్వారా త్రిదోషములయొక్క స్థితు లను గ్రహించును.

వాతము రసరక్త పిత్త కఫములను సర్వశరీరభాగములకును రక్తపు గొట్టముల లోపల నడిపించుచున్నది. చలన హేతుకమయిన వాతముయొక్క సమ, వృద్ధి, క్షీణ స్థితులను నాడీ చలనమందలి సమవేగ, అతివేగ, మంద గతుల ననుసరించి గ్రహించవలెను. ఈ పరీక్ష ఒక వ్రేలుతోనే సాధ్యమగును. వేగ నిశ్చయమునకు రోగియొక్క వయస్సు ప్రకృతులతో సమానముగా నున్న ఆరోగ్యవంతుని నాడి గమనమును ప్రమాణముగా తీసికొని ఆరోగ్య నాడి కుండవలసిన వేగముకంటె నధికముగా నున్నదా? లేక తక్కువ వేగముతో నాడి పరుగెత్తుచున్నదా చూడవలెను. ఈ పరీక్ష చేయునప్పుడు రోగియొక్క మనస్సు స్తిమితముగా నుంచుకో వలెను. శరీర ప్రయాస యే మాత్రముండ కూడదు. ఆకలిగా నున్నప్పుడు, భోజనమైన వెంటనేయున్ను, మలమూత్రాదులను విసర్జించిన వెంటనేయున్ను, పరిశ్రమ చెందియున్నప్పుడున్ను నాడీ పరీక్ష చేయరాదు. ఇంకను వాతస్వభావము ననుసరించి నాడి నడకలందు వికారములు కన్పించును, ఈ గతి వికారములను మనవారు కొన్ని జంతు, పక్షి, కృముల నడకలతో పోల్చి వర్ణించిరి. వీనిని పోల్చుకొనుటకు విశేషానుభవము కావలెను. కాని పాశ్చాత్య వైద్యులు నాడీ పరీక్ష చేయుటలో కనిపెట్టిన విషయములతో సరిచూచి త్రిదోష పరముగా నన్వయించుట సులభమైన మార్గము. ఇందు వలన ఉభయ శాస్త్రములకును మేలుకలుగును. పాశ్చాత్య వైద్యులు నాడి పరీక్ష చేసినప్పుడు గమనించు విషయములు:-

(1) రేటు అనగా నిమిషమున కెన్ని నాడి కెరటములు వ్రేలి క్రిందను పరుగెత్తుచున్నవి యనువిషయమును తెలిసికొనుట. (2) రిథిమ్ అనగా కెరటములమధ్య కన్పించే యవకాశము క్రమముగా నున్నదా లేకఎక్కువ తక్కువగా నున్నదా? (3) వాల్యూమ్ అనగా నాడికెరటము చిన్నదియా లేక పెద్దదియా? దీనినే సన్నముగా నున్నదా లేక లావుగా నున్నదా యనికూడ నందుము. (4) టెంషన్ అనగా నాడి ప్రవాహ మెంతటి బలముతో పరుగెత్తుచున్నది.

ఈ విషయములను త్రిదోషములతో సమన్వయ పరచుటకు ముందుగా నాడి కీస్థితులు యే యే దోషములవల్ల కలుగుచున్నవో గ్రహించుదము.

(1) రేటు అనగా ప్రవాహవేగము (Speed) ఎంత? ఈ వేగము సామాన్యము, అతివేగము, మందవేగమని మూడు రకములుగా నుండును. ఇవి వాతముయొక్క సామాన్యావస్థ, ప్రకోపావస్థ, క్షయావస్థలను తెలుపును. నాడి రేటును గడియారము సాయముతో లెక్కించి యాసంఖ్య రోగి వయస్సునకుండ వలసిన దానికంటె నధికముగా నున్నదో, తక్కువగా నున్నదో లేక సరిగానే యున్నదో కనిపెట్టవలెను. పసిపిల్లలకు నిమిషమునకు 250 నాడి దెబ్బలు కన్పించును. ఒక సంవత్సరము మొదలు 5 ఏండ్ల లోపు పిల్లలకు 200 నాడి చలనము లుండును 5మొదలు 12సం॥ రముల వయస్సువారికి 150 నాడి చలనములు, యిరువై [illegible] 100 నాడి చలనములు, 20-25 లకు 75 చొప్పున సగటున కన్పించును. రేటు

పైన యీ సంఖ్య స్థిరమగును. ఆయా వయస్సులలోనున్న రోగుల కుండవలసిన సంఖ్యకంటె నెక్కువగా నాడీ చలనములు కన్పించినచో వాత వృద్ధి యనియు తక్కువైనచో వాతక్షయ మనియు, సమముగా నుండిన వాత బలము సమముగా నున్నదని చెప్పవచ్చును.

(2) రిథమ్ (Rhythm) అనగా నాడి దెబ్బల మధ్యను కన్పించు విరామ కాలము. సక్రమముగా నుండిన అనగా సమానమయిన కాలములున్నచో రెగ్యులర్ రిథమ్ అనగా ఒకసారి ఎక్కువ కాలము, మరొకసారి తక్కువ కాలములు కన్పించిన రిథమ్ సక్రమముగా లేదనియు (Irregular rhythm) చెప్పుదుము. తీగెల ద్వారా ఎలెక్ట్రిసిటి సక్రమముగా (uniform) ప్రవహించుచుండినగదా బల్బు స్థిరముగా కాంతి నిచ్చును. కరెంటు అగియాగి వచ్చుచుండిన దీపము మిణుకు మిణుకు లాడుచుండును. ఇట్లే నాడియందలి సక్రమ, అక్రమగతులుకూడ వాతవహానాడు లందలి వాత శక్తి ప్రవాహము వలన కలుగు చున్నవని గ్రహించగలము.

(3) వాల్యూమ్(Volume)అనగా నాడిలోపల రక్తము యొక్క కెరటములు పెద్దవా లేక చిన్నవా యను విషయమును వ్రేలితో స్పృశించి సులువుగా చెప్పగలము. పెద్ద నాడి రక్తములో కఫమధికముగా చేరుటవలన సంభవించును. రక్తమందలి జలాంశలు (కఫము) తగ్గినపుడు, సన్నని కెరటములు పరుగెత్తును. పెద్ద కెరటములు నెమ్మదిగా (slow) [illegible] steady) గా పరుగెత్తును. సన్నని కెరటములు [illegible]గా పరుగెత్తుచుండును.

(4) టెంషన్ (Tension ) అనగా నాడీ ప్రవాహము యొక్క బలము (force or velocity);- ప్రవాహబలము హృదయ కండల కుంచితశక్తి ననుసరించియు, రక్తనాళముల స్థితి ననుసరించియు, నాళములయొక్క ఆకుంచన, వ్యాకోచముల ననుసరించి యున్నది. ఈమూడును కలసి సమిష్టిగా నాడీప్రవాహమునకు బలము నొసంగుచున్నవి. ఈ శక్తులలో దేనికి వికారము సంభవించినను మిగిలిన రెండును వికారము చెందును. హృదయకండరముల సంకోచము బలముగా నుండిన నాడీప్రవాహము బలముతో కన్పించును. లేనియెడల దుర్బలముగా నుండును. గొట్టము లారోగ్యస్థితిలో పలుచగా నుండి రబ్బరు గొట్టములవలె స్థితిస్థాపకత్వమును (elastic) కలిగి ప్రవాహమును నడిపించును. రోగస్థితిలో నీరక్తపు గొట్టములు దళసరియెక్కి స్థితిస్థాపకత్వమును గోల్పోయి సిమెంటు గొట్టములవలె తయారగుట కలదు. ఈ స్థితికి ఆర్టిరియోస్క్లిరోసిస్ అనిపేరు. తరచుగా ముసలివారికి సంభవించును. (Arteriosclerosis in the old)చిన్నవయస్సులో కూడ సిఫిలిస్, డయాబిటిస్ రోగుల కీ విధమయిన మార్పులను చూడవచ్చును. ఇట్టివారికి నాడి చాల గట్టిగా (hard and stiff) నుండును. ఇక రక్తనాళములయొక్క సంకోచ వ్యాకోచ కార్యములు ఆగొట్టములకు ప్రసరించుచున్న (వ్యానవాతము) వేసోమోటార్ అందు వేసో డైలేటార్ నెర్వ్సు యొక్క వ్యాపారమై యున్నది. (Vaso motor nerves) ఈ నాడులశక్తి బలము సక్రమముగానుండిన నాడి సమబలముతోను, ఎక్కువ బలముతోవచ్చిన, ప్రవాహ

మెక్కువ బలముతోను, తక్కువబలముతో ప్రసరించిన ప్రవాహము క్షీణబలముతోను నడచును. అధిక బలమునకు హైబ్లడ్ ప్రెషర్ (High blood pressure) అందురు. ఇది పైన వివరించిన మూడు విధములైన శక్తు లధికమైనప్పుడే సంభవించును. ఒకదానికి వికారము కలిగిన మిగిలిన రెండును వికారవంతమగుట కలదు. బలమైన నాడి (High tension pulse) గట్టిగా స్థిరముగా కన్పించును. సులువుగా నొక్కబడదు. అల్పబలము గలది చాలా మెత్తగానుండి వ్రేలితో నేమాత్రము నొక్కినను ఆగిపోవుచుండును. ఈ విషయములను కనిపెట్టుటకు నాడిని మూడు వ్రేళ్లతో నొక్కుచు వదులుచు తిరిగి నొక్కుచుండ వలెను. ఎక్కువ బలముతో నొక్కినను (మోచేతికీలువైపు వ్రేలుతో) నాడి క్రిందికి త్రోసికొనివచ్చి దిగువ వ్రేళ్లక్రిందను కనిపించుచుండినచో నాడికి బలము (force or tension) చాల యధికముగా నున్నదని గ్రహింతుము. చాల తక్కువ బలముతోకూడిన ఒత్తుడునకే నాడి యాగిపోవుచున్నయెడల నాడి క్షీణబలముతో పరువెత్తుచున్నదని గ్రహించగలము.

నాడి ప్రవాహముయొక్క బలము పిత్తమువలననే కలుగుచున్నది కనుక పైన చెప్పిన విధముగా పిత్తముయొక్క బలాబలములను వ్రేళ్ళతో నొక్కి నిశ్చయించ వచ్చును.

ఆధునిక వైద్యశాస్త్రములో నీవిషయమును స్పష్టముగా గ్రహించుటకు స్ఫిగ్మోమేనో మీటరు (sphygnomano metre బ్లడ్ ప్రెషర్ కొలుచు యంత్రము) సహాయమును తీసికొందురు.

పాశ్చాత్య వైద్యులు చెప్పు నాడి విషయములు ఏయే దోషములకు వర్తించుచున్నవో యిచ్చట సంగ్రహింప బడును:—

1. రేటు } వాతకార్యములు.
2. రిథిమ్ }

3. టెన్షన్ - పిత్తమువలన కలుగుచున్నది.

4. వాల్యూమ్ - రక్తము, కఫముల పరిమితి ననుసరించును.

ఇక మిగిలిన అష్టస్థాన పరీక్షలను పరిశీలనా సామర్థ్యము వివేకముగల ప్రతివారును సులువుగా నాచరించి విషయములను గ్రహించవచ్చును. విషయగ్రహణమునకు శాస్త్రము, అనుభవము తోడ్పడుచున్నవి. 'షడ్విధోహిరోగాణాం విజ్ఞానోపాయః, తద్యథా - శ్రోత్రాదిభిః ప్రశ్నేనచేతి", అని ఆయుర్వేద శాస్త్రకారులు చెప్పిరి. అనగా నీక్రింది నిదాన విషయములను, పంచలక్షణ నిదాన, అష్టస్థాన పరీక్షలను చేయుటకు వైద్యుడు రోగిని ప్రశ్నలు వేసియు. తన పంచేంద్రియముల సాయముతోను గ్రహించవలయును.

## Urine Examination in Ayurveda

## ఆయుర్వేదములో మూత్రపరీక్షా పద్ధతి

ఆయుర్వేద వైద్యులు రోగి మూత్రముపై తిలతైల మొక్క చుక్కనువేసి, ఆబిందు పరివర్తనములను గమనించి

రోగికి, రోగిమునకు సంబంధించిన యనేకవిషయములను గ్రహింపగలుగుచున్నారు. కనుక నీవిధము పరీక్షను ఆధునిక శాస్త్రముల దృష్టి విమర్శించు టావశ్యమగును.

పరీక్షాపద్ధతి:— ఉదయపువేళ రోగి నిద్రనుండి మేల్కొనగానే వెడల్పు మూకుడు లేక పళ్ళెములో మూత్రమును పట్టి ఉదయించుచున్న లేత ఎండలో దానినుంచి ఆమూత్రముపైన ఒకబొట్టు తిలతైలమును (Gingly oil) మూత్రోపరి మధ్యభాగమున మెల్లగా విడువవలెను. పిమ్మట జరిగే పరివర్తనములను పరిశీలించవలెను. పరివర్తనముల కన్నిటికిని ఫలితములను, వైద్యచింతామణి, బసవరాజీయ గ్రంథములలో వ్రాసినారు. ఎట్లనగా:-

(1) తైలబిందువు మూత్రములో మునిగిపోయినచో రోగి వారము రోజుల లోపల మరణించును.

(2) తైలబిందువు మూత్రోపరి భాగముపైన తేలియుండి బిందు రూపముగా నిలిచిపోయిన ఎడల రోగము చికిత్స కసాధ్య మగుచున్నది.

(3) తైలబిందువు మూత్రోపరి భాగమున వడివడిగా వర్తులముగా వ్యాపించిన రోగము చికిత్సకు సుఖ సాధ్యమగును. త్వరలోనే నయమగును.

(4) బిందువు వర్తులముగా గాక నలుదెశలకు కొన్ని శాఖలుగా వ్యాపించినచో (నది వడిగా గాని నెమ్మది గాని వ్యాపించవచ్చును) రోగము చికిత్సకు కష్టసాధ్యముగా నుండును. వడిగా వ్యాపించిన తక్కువ కాలములోనే నయము

కాగలదు. చాలా నెమ్మదిగా ప్రవర్తించినచో రోగము యాప్యము కాగలదు (becomes chronic)

(5) బిందువుయొక్క శాఖలు వ్యాపించు దిక్కులో కూడ శుభాశుభములు నిర్ణయింప బడినవి. ఆ శాఖలు కలిసి కొనుటవలన కొన్ని ఆకారములు పొడగట్టును. వీనిలో కొన్ని శుభాకారములుగాను మఱికొన్ని యశుభములుగాను చెప్ప బడినవి. ఈపైన వివరించిన తైలబిందు పరివర్తనములనుబట్టి రాబోవు ఫలితముల నెట్లు మనవారు గ్రహించిరి యని సందేహము కలుగుచుండును. అనుభవము కావచ్చును. వారి యనుభవములు నేడు ప్రతివారికి ప్రత్యక్షము లగుచున్నందున సందేహించ నవసరములేదు. కాని ఆధునిక శాస్త్రము లేమ యిన ఈపరిశీలనలను విమర్శించుటకు తోడ్పడగలవా? యనిన, యిందులకు సమాధానమున కించుక ప్రయత్నింతము.

ఈ పరీక్ష చేయుటకు తిలతైలము నేల గ్రహించ వలెను? ఇతర తైలములు పనికిరావా? బిందువు తేలుట మును గుట లోని భావమేమి? ఏపరిస్థితులలో నది తేలగలదు. మును గుటకు కారణమేమి? బిందువుయొక్క వికాసమునకు హేతు వేమి? బిందుశాఖలు వ్యాపించుదిక్కు లేవిధముగ ప్రధానము లగుచున్నవి? అవి కలిసికొనుట వలన ఏర్పడిన యాకారము లెట్లు కొన్ని శుభములు, మరికొన్ని యశుభవ లుగా నిర్ణ యింపబడినవి: త్వరగావ్యాపించుట, మెల్లగా వికసించుటలో నర్థమేమి? అను ప్రశ్నలు సహజముగా ప్రతివాని కుదయిం చును వీనికి శాస్త్ర సమ్మతముగా సమాధాన మిచ్చినప్పు డీ పరీక్ష సైంటిఫిక్ యని అంగీకరించుట కభ్యంతర ముండదు.

ఈ పై ప్రశ్నలకు సమాధానము:-

తైలబిందు సహిత మూత్రమును నీరెండలోనుంచి చూడవలెననుట బిందుపరివర్తనములను స్పష్టముగా చూడ గలుగుటకే. దీనికి బదులు టార్చిలైటును ప్రసరింపజేయ వచ్చును. తైల బిందువునే ఉపయోగించ వలెనని చెప్పిన విషయము ఆధునికుల ద్రవ్యవిజ్ఞాన శాస్త్రమునకు (physical properties) చెందిన విషయము. ఈపరీక్ష వలన మూత్రము యొక్క సాంద్రత, గురుత్వములు నిశ్చయింపబడును. ద్రవ్య ముల యొక గురుత్వము స్వచ్ఛమయిన ఉదకము యొక్క భారముతో సరిచూడబడుచున్నది. పాశ్చాత్యులు ఉదక భారము వెయ్యి అని అనుకొని అన్ని ద్రవ ద్రవ్యములయొక్క భారమును (Density) నిర్ణయించి వాటి తారతమ్యమును (relative density or specific gravity)నిశ్చయించినారు.

వివిధ ద్రవద్రవ్యములకు భారమానము (స్పెసిఫిక్ గ్రేవిటి Specific gravity) వేర్వేరుగా నిరూపించబడినది. అన్నిటికంటెను ద్రవద్రవ్యములలో తిలతైలముయొక్క భార మానము ఉదకముయొక్క భారమానమునకు చాల సమీప ముగా నున్నది. తిలతైలభారమానము 1000.8 అని నిశ్చ యింపబడినది. వెయ్యి కంటె తక్కువ భారమానము కలి గిన ద్రవ ములన్నియు నీటిపైన తేలును. ఇంతకంటె నెక్కువ బరువుగల ద్రవ్యము లన్నియు నీటిలో మునుగును. అయితే మునుగుట తేలుట యను విషయ మీయొక్కదాని మీద నాధారపడి యుండలేదు. ద్రవ్యాణు సంధానమును బట్టికూడ మునుగుట, తేలుట లేక లీనమై పోవుట కలుగు

చున్నది. తిలతైల మందలి యణు సంధానము (molecular affinity or attachmant) చాల దగ్గఱగా కూర్చ బడుట చేతను నీటిలో లీనముగాక తేలియుండగలదు. నీటి యణువుల కంటె తేలికగా కూర్చబడిన కిరసనాయలు, పెట్రోలు, మొదలయిన తేలిక ద్రవ్యముల నుపయోగించిన అవి నీటిలో లీనమై స్పష్టముగా కన్పించవు. ఇంతకంటె బరువైన ద్రవ ద్రవ్యముల నుపయోగించిన అవి తప్పక మునుగును. కనుక మనవారు మూత్రము యొక్క సాంద్రత గురుతలను కని పెట్టుటకే తిలతైలమును గ్రహించిరి.

తిలతైలము నీటిమీద తేలియుండి, బిందువు నీటిలో లీనముగాక స్పష్టముగా కన్పించును. మూత్రములో కొన్ని మూత్రికాలవణములు (యూరియా, యూరిక్ ఏసిడ్ సాల్టులు) లీనమై యున్నందున నీటి కంటె మూత్ర మధిక బరువుగలది యని చెప్పవచ్చును. నీటికంటె నధిక భారముగల మూత్రముపై తప్పక తేలుననుట నిశ్చయము. ఒక బిందు పరివర్తనా ఫలములను విమర్శింతము.

తైల బిందువు మునుగుట మూత్రములోని మూత్రికాలవణముల అభావమును తెలుపుచున్నది. మరియు నీటి కంటెను తేలికయైన ద్రవము మూత్రమే రోగి శరీరములో నుంచి బయటకు వచ్చుచున్నదని యర్థము. ఈపరిస్థితిలో రోగి త్వరలో మరణించుట తథ్యము. ఏల యనగా ధాతు పరిణామకార్యములోను, ఆహార పరిణామ సమయములోను ఏర్పడిన శేషద్రవ్యములు (Nitrogenous was e products) యకృత్ లోకి పోయి మూత్రికా లవణములుగా తయారై

మూత్రము చమటలతో కలిసి పోవుచుండునని ఆధునిక ఫిజి యాలజీ బోధించుచున్నది. రోగి మూత్రములో నీమూత్రికా లవణములు లేనందున యకృత్తు రోగభూయిష్టమై యీ లవణములను తయారు చేయలేకున్నది అని తెలియుచున్నది. ఈ పరిస్థితులలో ఆహార, ధాతు మలములు (Waste products) శరీరములోనే నిలిచి పోవుచున్నవని యర్థమగును. మలములతో నిండిపోవుచున్న దేహము ఇంకెంతో కాలము నిలిచియుండదు గనుక త్వరలోనే మరణము సిద్ధించుట తథ్యమని మనవారు చెప్పగలిగిరి.

(2) తైలబిందు పరివ్యాప్తము రోగముయొక్క కష్టసాధ్య, సుసాధ్య, అసాధ్యములను బోధించును. ఎట్లనగా ఆరోగ్యవంతుని మూత్రములో మూత్రికా లవణములు తప్ప యితర ద్రవ్యములుండవు. ధాతుక్షయము విపరీతముగా జరుగుచున్న యన్నిరోగములలోను అనగా దీర్ఘకాలజ్వరములు, పాండురోగములలో అల్బ్యూమిన్ అనెడు పదార్థము, ఫోస్ఫేట్సు, మధుమేహరోగికి సుగర్, యకృత్ వ్యాధులలోను, పచ్చకామిర్లలోను (Jaundice) పైత్యరసము, (Bile) మూత్రమార్గమున వుండు, వాపుయున్నప్పుడు చీము, రక్తము, యీ మొదలైన విశేష ద్రవ్యములు కల్పించును. క్షీణధాతు ద్రవ్యములలో స్నేహపదార్థములున్నచో నవి మూత్రోపరిభాగమున తేలియాడును. ఈ పరిస్థితిలో తైలబిందువు తేలియుండియు వికసించజాలదు. దాని పరివ్యాప్తమును స్నేహద్రవ్యములరికట్టుచుండును. స్నేహద్రవ్యములు చాలహెచ్చుపరిమిలో నున్నవనగా దీని కాశ్రయములైన

శుక్ర, మజ్జా, మేదో ధాతువులుక్షీణించుచున్నవని యర్థము. శుక్రము దగ్గర నారంభించి పూర్వాపూర్వధాతువులు క్షీణించుచున్న క్షయ పద్ధతికి విలోమక్షయ యని పేరు, ఇట్లు క్షీణించిన ధాతువులను పునరుద్ధరించుట అసాధ్యముగాన రోగి మరణించును. మూత్రములో స్నేహద్రవ్యములు తక్కువగా నున్నను లేక చాల యల్పములుగా నుండినను చికిత్సకు రోగము కష్టసాధ్యము లేక అసాధ్యము కావచ్చును. ఈ చివరి ధాతువులను పునరుద్ధరించుటకు చాలకాలము పట్టును. కనుక రోగము యాప్యమగునని చెప్పుదుము. స్నేహద్రవ్యములు తక్కువగా నుండిన మూత్రమైన విడిచిన తైల బిందువు నెమ్మదిగా కొసలు జారును. అల్పదోషమున్నప్పుడు తైలశాఖలు వడి వడిగా వ్యాపించగలవు. ఇక తైల శాఖలేర్పడునప్పుడు కన్పించిన జంతు, పక్షి, మృగ, వస్తువుల యాకారములలో శుభా శుభ నిర్ణయము కేవలానుభవము మీదనే చెప్పియున్నారని యూహించవలసి యున్నది. ఏలయనగా నే పరిస్థితులలో నెట్టి యాకారము లేర్పడుచున్నవో ఆయుర్వేద శాస్త్రము వివరించ లేదు. ఆధునిక శాస్త్రములు యీ విమర్శకు తోడ్పడజాలవు.

—o—

## 3వ అధ్యాయము.

## ఆధునిక వైద్యములో నిదాన పద్ధతులు

ఆధునిక వైద్యము నూటికి 80 వంతు రోగములు క్రిమిజన్యములని చెప్పుచున్నది మిగిలినవి యితర కారణ ములవల్ల కలుగుచున్నవి. కనుక క్రిమి సిద్ధాంతము నిదాన చికిత్సలకు ప్రధానముగా నున్నది. సూక్ష్మ క్రిము లెన్నిరకము లుగా నున్నవో అన్నిరకముల వ్యాధులున్నవి. ఈరోగ హేతుక సూక్ష్మక్రిములకు మైక్రో ఆర్గేనిజమ్సు అని పేరు. వీనిని అణు దర్శిని యంత్రము (Microscope) తోనే చూడవలెను. రోగక్రిములు రోగులయొక్క శరీరములో ప్రవేశించి వాని కాప్యాయములైన శరీర భాగములను స్థావర మేర్పర్చుకొని వృద్ధి చెందుచు, కొన్ని విషపదార్థములను పుట్టించును. ఈ విషపదార్థములు తామాశ్రయించిన భాగములకు వాపు పుట్టించి క్రమముగా చీమును వృద్ధిచేసి ఆభాగములను నాశ నము చేయును. ఈలోపుగా శరీర శక్తులు యూరకుండవు. శరీర శక్తులకును, రోగ సూక్ష్మక్రిములకును సంఘర్షన జరుగు చునే యుండును. ఈ పోరాటములో శరీర శక్తులు రోగ క్రిముల నాశన మొనర్చినా రోగము నయమగును లేదా క్రిములు రోగిని చిరకాలము బాధించును లేదా చంపును.

క్రిమిజన్య రోగము లన్నిటిలోను వైద్యుల దృష్టి క్రిముల రకములను రోగిశరీరద్రవములోనుంచి అనగా రక్తము కళ్ళె, మల,మూత్రాదులలో భూతయద్దసాయమున పరీక్షించి

కనుగొనుటయందే నిమగ్న మగుచున్నది. క్రిమి రకము తెలిసినచో నా క్రిమిని సంహరించుట కేర్పడిన మందులను ప్రయోగించి వాటిని చంపును. అటుపిమ్మట రోగిశరీరములో రోగక్రిములు ఏ యేభాగములను ఎంతవరకు చెఱచెనో, తెలియగోరి వివిధరకముల పరీక్షలు చేయ నారంభించును. రోగముయొక్క చరిత్రను, రోగి పడుచున్న బాధలను, రోగి ప్రవృత్తి అభ్యాసములు, కుటుంబ చరిత్ర మొదలయినసామాన్య విషయములను ప్రశ్నలువేసి కనుగొన్న పిమ్మట, దూష్య జ్ఞానమును సంపాదించుటకు నీదిగువ చూపిన పరీక్షలు చేయును. అవి ఏమనగా:-

(1) Inspection — దర్శన విధాన పరీక్ష. రోగి పరుండియున్న యవస్థ, రోగియొక్క శరీరవర్ణాదులు వాపు, ఉబ్బు, పాండుత మొదలైన వికారములను కనిపెట్టి రోగియొక్క చేష్టల ద్వారా నాతని మానసిక ప్రవృత్తినికూడ గ్రహించును.

(2) Palpation — స్పర్శన విధాన పరీక్ష-రోగి శరీరమును తాకి, నొక్కి శరీరోష్ణపరిమితిని (normal or feverish) గ్రహించును. వాపు, గడ్డ లున్నచోట నొక్కి నొప్పి యున్నదేమో గ్రహించును. (ఆనొప్పి యధికమయిన ఆగుర్తునకు టెండర్ నెస్ (Tenderness) అని పేరు. వాపు స్థలము గట్టిగానున్నదో లేక మృదువుగా నున్నదో తెలిసికొనును. ఒళ్లు తడిగా లేక జిడ్డుగా నున్నదో, పొడిగా గరుకుగానున్నదో తెలియగలడు. మరియు గుండె కొట్టుకొనుటను,

ఊపిరితిత్తులలో రోగకారణమున పుట్టిన వికారములను, (pluritic rub) ఉదరమును నొక్కి తడిమి యకృత్ప్లీహములు వృద్ధిజెందినవేమో గ్రహించును.

(3) Percussion — అనగా తాడనపరీక్ష :- రోగి వక్షము, ఉదరముపైన వైద్యుడు వ్రేళ్లతో కొట్టినప్పుడు కలిగిన ధ్వని విశేషములను గ్రహించి అది ఎందువల్ల సంభవించునో తెలిసికొనును. ఈ పరిశోధనము అనుభవసిద్ధముగా నేర్వవలసియున్నది. ముఖ్యముగా నాలుగు రకముల ధ్వనులను గుర్తించ వచ్చును. అదేమనగా :-

1) గట్టి అవయవము లున్న శరీర భాగములమీద అనగా హార్టు (Heart) యకృత్ (Liver) ప్లీహము (Spleen) మూత్రపిండము లున్నచోటులందు వ్రేళ్లతో కొట్టినప్పుడు గట్టి ధ్వని (Dull sound) వినిపించును. 2) ఊపిరితిత్తులున్న వక్షముమీద దెబ్బకొట్టి నప్పుడు వానిలో గాలియుండుట వలన స్వల్ప ప్రతిధ్వనితో కూడిన ధ్వని వినిపించును. దీనికి నార్మల్ లంగ్ రెజొనెన్సు ( normal lung resonance ) అని పేరు 3) గాలితో నిండిన ప్రేగులు కలిగిన యుదరము మీద కొట్టినప్పుడు ఎక్కువగా ప్రతిధ్వని కలుగును. ఈరకము ధ్వనికి టింపెనిటిక్ సౌండు (Tympanitic sound) అని పేరు. 4) నీటితో నిండిన మూత్రాశయము, గర్భాశయము (గర్భిణ్యావస్థలో) లుండిన దిగువ పొట్టమీద కొట్టినప్పుడు గట్టిగా గాక గుల్లగా గాక మధ్యస్థ ధ్వని వినిపించును. దీనిని డల్ థడ్ అని పేరు. వైద్యుడు ముందుగా నారోగ్యవంతుని శరీర భాగములను తడవి, కొట్టి వానియొక్క నిజస్థానముల

గుర్తించి అనుభవమును గడించిన పిమ్మట రోగి శరీర భాగములను పై విధముగా కొట్టి ధ్వనివిశేషములను గ్రహించి తద్వారా నా అవయవములలో కలిగిన వికారములను (మార్పులను) గ్రహించును.

(4) Auscultation —అనగా స్టెతస్కోపు యంత్ర సాయమున శ్రోత్రి పరీక్ష జేయుట. రోగిమాట్లాడుచున్న కంఠ ధ్వని స్వభావమును సులువుగానే విని గుర్తించవచ్చును. ఇక ఊపిరితిత్తులలోపుట్టిన శ్వాసజనిత ధ్వనులను, గుండెధ్వనులను అంత్రకూజనములను స్టెతస్కోపుతో స్పష్టముగా విన గలము. ముందుగా నారోగ్యవస్థలోనివి ఏవిధముగానుండునో గ్రహించిన పిమ్మట నీభాగములు రోగపూరితములైనప్పుడు క్రొత్తగా పుట్టిన వికృత ధ్వనులను గ్రహించ సామర్థ్యము కలుగును. అటుపిమ్మటనీవికృతులను అన్వయించుకోవచ్చును.

5) ఎక్సరే ఫోటోలు: ఇంతరకు వైద్యునకు దూష్య విజ్ఞానమంతయు కరతలామలక మగును. ఇట్లు నిర్ధారణచేసి కొన్ని విషయములు సందేహరహితముగా ప్రత్యక్ష మొన ర్చుకొనుటకు చెడిపోయిన శరీరభాగములను ఎక్సరే యంత్ర కిరణముల సాయముతో ఫోటోతీయించి పరీక్షించవచ్చును. మరియు స్వయముగా కంటితో స్క్రీనింగుపద్ధతిని(screening method) జీవశరీరములో నాయాభాగముల యదార్థరూప ములనే చలనాది కార్యములు చేయుచుండగా చూడ వచ్చును.

(6) కెమికల్ ఎగ్జామినేషన్ (Chemical examinition) దూష్యవిజ్ఞానో పార్జనా నంతరముయిక రోగజనిత

వికార వ్యాపారములను తెలిసికొనుటకు రక్తమును, మలమును, మూత్రమును, కఫమును, వాంతి పదార్థమును కొన్ని రసాయనిక పరీక్షలు చేసి అందలి విశేషములను తెలిసికొనును.

(7) Microscope examination:—ఇక మిగిలినది. రోగహేతుక క్రిముల రకమును తెలిసికొనుట. ఇందుకు రోగి రక్తమును, కఫము, మలమూత్రములను భూతయద్దముక్రింద (Microscope) పరీక్షజేసి వానిలో సూక్ష్మ జీవాణువులు కన్పించిన యడల వాని ఆకారముల ననుసరించి గుర్తించిన పిమ్మట రుగ్వి నిశ్చయము నిస్సందేహముగా చేయును రోగ హేతుక సూక్ష్మ క్రిములలో ముఖ్యముగా నాలుగు జాతులున్నవి. (1) బేక్టీరియా (Bacteria) భూతయద్దముతో చూచినపుడు చిన్న నలుసులువలె కొంచెము పొడవైన పుల్లలుగా కన్పించును. (2) చిన్న చుక్కలవలె కల్పించునవి కాకై (Micro-cocci) యనబడును. (3) మెలికలు తిరిగిన సన్నతీగెలవలె కన్పించునవి స్పైరెల్లా (Spirella) (4)నాల్గవజాతిని ఫంగై (fungi)యందురు. ఒక్కొక జాతిలో పలురకముల క్రిములున్నవి. ఈక్రిములయొక్క ఆకార స్వభావాదులను బోధించు శాస్త్రమునకు బేక్టీరియాలజీ (Bacteriology) అని పేరు. ఈవిధముగా రోగ లక్షణములు, పరీక్షలు ద్వారా దోష దూష్యజ్ఞానము కలుగుచుండగా, ఇంకను దూష్యజ్ఞానమును తెలియగోరి చెడిపోయిన అభ్యంతర భాగములను దర్శించుటకు పలువిధములయిన యంత్రముల సాయమపేక్షించును. (many verieties of scopal instrumets.)

(8) యంత్రములసాయముతో పరీక్షించుటకు (Instrumental diagnosis) అనిపేరు. వీనికి ఏషణి యంత్రములని పేరు. డాక్టరు తఱచుగా నపేక్షించు యంత్రములలో ముఖ్యము లెవ్వియనగా:-

(1) ఉష్ణమాపక యంత్రము. దీనికి థర్మామీటర్ అని యందురు. దీనిసాయమున జ్వరోష్ణ పరిమితి స్పష్టముగా తెలియును. స్వల్ప జ్వరములు చేతి తాకుడుతో తెలియబడవు. మరియు జ్వరమే వేళకు ఆరంభ మగుచున్నది, యెంతవరకు వృద్ధియగుచున్నది, యే వేళకు జారుట కారంభించి, ఎప్పుడు పూర్తిగా వదిలిపెట్టినది మొదలగు జ్వర వివరములు యీ యంత్రసాయమున తెలిసికొనుటకు వీలగుచున్నది. ఈ విధమైన జ్వరస్వభావముల ననుసరించి మోడరన్ వైద్యములో రోగ నిదానము చేయబడుచున్నది. కొన్ని వ్యాధులలో సతత జ్వరము (continuous fever), కొన్ని రోగములలో సతత జ్వరము (Remittant fever), మరి కొన్నిటిలో విరామిక జ్వరము (intermittant fever) కలుగు చుండును. ఏ రోగ క్రిములు యే రకము జర్వమును కలిగించునో శాస్త్రము తెలుపును.

(2) శ్రోత్రీపరీక్షకు స్టెతస్కోపు గొట్టముల (Stethoscope) నుపయోగించును.

(3) దూష్యజ్ఞాన వివరములను బడయుటకు రాసాయనిక పరీక్షలు (chemical tests of body secretions, X-ray photo) ఉపకరించును. ఆయుర్వేద వైద్యులు యీ యంత్ర

సాయపరీక్షలనుకూడ తెలిసికొనినచో అతనికి మరింత స్పష్టముగా దూష్య జ్ఞానము కలుగును.

(4) రక్తపుపోటు పరీక్షకు స్ఫిగ్మోమేనోమీటర్ (Sphygnomanometer, Blood pressure reading instrumeut) నుపయోగింతురు. దీనిసాయమున రక్తప్రవాహము యొక్క ఒత్తుడు స్పష్టముగా దెలియగలదు. రాబోవు యనేక ప్రమాదముల నివారించుటకు వీలగును. ఆయుర్వేద వైద్యుడు వ్రేళ్ళతో నాడిని స్పృశించి కొంతవరకు గ్రహించగలిగినను ఈయంత్రముకూడ నెక్కుడగా సాయపడగలదు. చికిత్సా కాలములో అప్పుడప్పుడు యంత్రసాయములతో నాయా విషయములను పరీక్షించుచుండిన స్వల్పమయిన మార్పులనుకూడ గుర్తించగలుగును.

(5) నాడి నడకలను గీయుటకు (Sphygmo-graph యంత్రమును, గుండె చలనములను గీయుటకు (కార్డియోగ్రాఫ్) యంత్రములున్నవి. వీని సహాయమునకూడ నపేక్షించినచో ఆయుర్వేదవైద్యునకు విశేషజ్ఞానము లభించును. నాడియంత్రముగీసిన గీతలను త్రిదోషపరముగా నన్వయించుకొనుటవలన త్రిదోషములయొక్క ప్రకోప, శమనాది యవస్థలు నూహామాత్రములేగాక ప్రత్యక్షములు కాగలవు.

నాడీ నడకలను యంత్రముతో కాగితముపై ని.గీయించి ఆగీతలను త్రిదోషపరముగా సమన్వయించుటను గూర్చి తెలిసికొనుటకు చదువరులు కుతూహలము చెందుదురు. గాన నీవిషయము కొంచెము వివరములతో చర్చించబడును.

స్ఫిగ్మోగ్రాఫ్ యంత్రము చిన్న రిస్టువాచి యంతయుండి చేతి మణికట్టునకు కట్టబడును. దానికి కీ నియ్యగానే దానిపైన డయల్ వడిగా తిరుగును. ఈడయాల్ పైన ఒక రేకుగొట్టము (డ్రమ్) కార్బన్ పేపర్ చుట్టబడి, డయాల్‌తో కలిసి గిర్రున తిరుగుచుండును. డయాల్ ప్రక్కను ఒక సూది నిలుచును. దీని యడుగునయున్న బిళ్ళసరిగా నాడిపైన నిలిచియుండును. నాడితోబాటు సూది క్రిందికిమీదికి ఎగురుచుండును. సూది యొక్క మీదికొన కొంచెము వంచబడి డ్రంమ్‌నకు చుట్ట బడిన కార్బన్ కాగితముపైన గీతలు గీయును. పిమ్మట కాగితమును తీసి దానిపై గీతలను ఫొటో కెమిరాతో పెద్దగా నింకొక కాగితముమీదకు తీయవచ్చును. అప్పుడా గ్రాఫ్ గీతలు ఆరోగ్యవంతుని క్రిందగువ చూపిన ప్రకారము కన్పించును. (చూడు పటము)

వాతము :- ఆరోగ్యవంతునికి నిమిషమునకు సగటున 72 నాడికెరటములు పరుగెత్తును. చలనవేగము వాత కృత్యము కనుక యంత్రమొక నిమిషములో ఎన్నిసారులు ఎగిరి పై విధముగా గీతలను గీచినదో లెక్కించవలెను. ఆరోగ్యవంతునికి 72 కెరటము లెగిరిపడుటను చూడవచ్చును. ఎక్కువ కెరటములుండిన వాతమధికమయినదనియు, తక్కువైనచో వాతబలము తగ్గినదనియు సులువుగా గ్రహించవచ్చును.

పిత్తము :— పిత్తము కెరటమునకు బలమిచ్చుచున్నది. కెరటబలము హెచ్చినచో నకస్మాత్తుగా మీదను లేచును. అందువల్ల ఆరంభగీతకొంచెము వాలుగా నుండుటకు

బదులుగా బలాధిక్యమునుబట్టి నిటారుగా నిలుచుటకు ప్రయ త్నించుచుండును. పిత్తబలము తక్కువగా నుండిన ఆగీతకు దాని ననుసరించి వాలు హెచ్చును

కఫమువల్లనే మీాదికెగిరిన కెరటము తిరిగిపడి పోవు చున్నది. కఫబలము హెచ్చుగా నుండిన నాడి చాలా సేపు నిలుచును. కనుక కోణమేర్పడుటకు బదులుగా వంకరగా కన్పించును. కఫక్షయములో కెరటము తక్కువమీాదికే ఎగురుటను చూడవచ్చును.

ఈప్రకారము వాతాదుల బలాబలములను యంత్ర సాధనమునకూడ గ్రహించుట కవకాశ మేర్పడినది. కనుక నాయుర్వేద వైద్యులీ విషయములను తెలిసికొని ఆచరించిన ఉభయ వైద్య శాస్త్రములకు పొత్తుకలిసి వృద్ధిచెందును.

రోగ నిదానముకొరకు యంత్రముల సహాయమును గురించి డాక్టరు బ్రాడ్ బెంటుగారి (నాడీ నిదానవైద్యులు) అభిప్రాయములను డాక్టరు ఎ. టి. రాయ్ గారు వ్రాసిన 'పల్సుయిన్ ఆయుర్వేద' గ్రంథమునుండి యథాతథముగా నిచ్చుట పొందుపరచడమయినది.

"There is no doubt that physicians had continued to estimate with care and accuracy the diagnostic and prognostic significance of the indications furnished by the pulse, but it was a great loss to medical science, for, it becomes impossible to transmit the knowledge gained by experience."
Page 56.

"Broadbent is clear on the point which he says that "every important veriety of the pulse revealed by the

sphygmograph was recognised, described, and named before the Christian Era." He further says that " sphygmograph is rarely necessary for diagnosis and scarsely to be trusted in prognosis." Page 57

In the absence of instrumental aid and other aids for diagnosis, so common now-a-days, the ancient physicians had to fall back on the surest clinical signs of nature for interpretation of disease - the pulse...... Page 55.

A normal pulse wave as recorded shows a sharp ascent (Vayu-pitta excitation) and a gradual descent (Vayu-Kapha depression).

By alternate stimulation of pitha and Kapha (chemical agencies), the Vayu — (cardiac nervous mechanism) is alternately excited and depressed. The Nervous mechanism of the heart is therefore secondary and not primary in producing alternate contractions and expansions of the heart. The Pitha induces muscular contraction or systole and the Kapha, dilatation or diastole. By alternate excitation and depression of Pitha and Kapha, the Rhythmic action of the heart is kept up. Pulse is therefore the result of hormonious action of two opposing chemical energies of Pitha and Kapha. The action of the heart is automatic, started by chemical agencies not not nervous (the modern idea) ... ... ... ...

The sense of touch which is absolutely necessary for all medical men to develop even in modern times was almost perfected by the ancients and thus they became specialists in examining the pulse and interpreting it correctly. P. 57

It is said that the best Kavirajis can distinguish the finest shades of differences between the pulses of the five

## త్రిదోషములను నాడి నడకవల్ల గ్రహించుట.




1. ఆరోగ్యవంతునినాడి, 2. వాతాధిక్యనాడి, 3. పిత్తాధిక్యనాడి, 4. కఫాధిక్యనాడి, 5. సన్నిపాతనాడి.

vayus, five pithas and five Kaphas, so that from pulse alone they could diagnise a case affecting an organ or a system locally, the derangement of each dosha in its three degrees (slow moderate and severe). the vital reaction of nature to remove the morbid conditions and the effect of treatment. Such knowledge as can be gained by experience cannot be transmitted in writing. ... ... ...

Broadbent says that normal variations of the pulse in health are met with quite independently of disease in both sexes and in all ages. There may be variations of circulation in the same person at different times. Unlike Ayurveda, he, however, assigns no reason for these variations to be found in health. ... ... ... ... P 56.

It may, however, be noted that the touch, however delicate and well trained, may occasionally fail, but a properly acting instrument never does so, if only the student knows how to handle it properly. This is the triumph of moderners over ancients." P 80.

(A. T. Roy's 'Pulse in Ayurveda').



## 4వ అధ్యాయము.

### త్రిదోషములకు రోగహేతుక సూక్ష్మక్రిములకు సంబంధము

ఆధునిక వైద్యశాస్త్రములో సూక్ష్మ క్రిములు రోగోత్పాదకములని చెప్పుచున్నను శారీరక శక్తులు తగ్గినప్పుడే శరీరములోకి ప్రవేశము గనిన క్రిములు వృద్ధిచెంది రోగములను పుట్టించగలుగుచున్నవని నమ్ముచున్నారు. ప్రతికూల పరిస్థితులలో నవి నశించును. లేదా కొన్ని మొండి జాతి క్రిములు తమకనుకూల పరిస్థితులేర్పడువరకును శరీరములో కనిపెట్టుకొనియుండి తరుణము చిక్కగానే విజృంభించి రోగములు గలిగించును. క్రిముల యభివృద్ధి కాటంకపరచి, నశింపజేయు శరీరశక్తులకు వైటల్ పవర్సు (Vital Powers) అందురు. ఈశక్తి ద్రవ్యముల స్వరూపమెట్టిదో నిర్వచించ లేదు. కాని ఈక్రిమి ప్రతిఘటనాశక్తులను (తెల్లకణముల కుండిన క్రిమి భక్షణాచాతుర్యములోను (phagocytocis), యకృత్ప్లీహములు, రసగ్రంధుల (lymph glands) లోపల క్రిమి విషములు నిర్విషములుగా మార్చబడి నశించుటలోను చూడవచ్చును. బయోకేమిస్ట్రీ సిద్ధాంతము ప్రకారము రక్తమునకుసహజముగా నుండవలసిన లవణరసము ప్రధానముగానుండిన (alkaline blood) రోగక్రిములు వృద్ధిచెందజాలవనియు, రక్తము ఆమ్లసంక్లిష్టమైనప్పుడు (acid blood) అవి యథేచ్ఛగా వృద్ధిచెందుచున్నవనియు చెప్పుచున్నారు. నూతనముగా వెలసిన ఎండోక్రైనుగ్లాండ్సు శాస్త్రము

యీా గ్రంధుల వ్యాపారమందలి ఒడుకుదుడుకులే క్రిములభి వృద్ధి చెందుటకును యింకను పలువిధ రోగములు పుట్టుటకు కారణమనుచున్నది.

ఆయుర్వేద శాస్త్రము మన శరీరమందలి రోగ నిరోధక శక్తికి 'ఊర్జ'శక్తి అని వ్యవహరించినది. ఉర్జశక్తి (immunity) వాతపిత్తకఫముల సాయమున అన్నరసములోనుంచి పరిణమించిన సప్తధాతువులలో చివరిదగు శుక్ర ధాతువులోనుంచిపుట్టిన ఓజస్సు అనెడుద్రవ్యమునకు గలదని నిరూపించును. ఒజస్సు సోమగుణ ప్రధానమై శరీరమునకు వర్చస్సును. పుష్టిని, మనస్సునకు ధైర్య స్థైర్యమును. దీర్ఘాయువును ప్రసాదించుచున్నది. ఓజస్సు సమృద్ధిగానుండు వారలారోగ్యముగా నుందురు. ఓజస్సు క్షీణించిన రసాది సప్తధాతువులు క్షీణించును. ఓజోత్పకి ప్రధాన కారణములుగానున్న వాతపిత్త కఫములు రోగోత్పత్తికి చాల ముఖ్యములుగా నెన్నబడినవి. ఇవి దూషింపబడినప్పుడు సప్తధాతువులు దూషింపబడి ఓజోత్పత్తి జరుగదు. ఓజస్సునకు ముఖ్యస్థానము హృదయమని (హార్టు) చెప్పబడినను అది శరీర భాగములందు సంచరించుచు వానిని పోషించుచున్నది. చర్మముక్రింద కన్పించుచున్న స్నేహద్రవ్యము (sebacious fluid) రక్తములలో ఓజోద్రవ్య మెక్కువగా నుండును. పాశ్చాత్య వైద్యశాస్త్రములో నూతనముగా వెలసిన ఎండోక్రైను సిద్ధాంతము ననుసరించి వృషణగ్రంధులలోనుంచి, అంతర్వాహినిగా నూరుచున్న స్పెర్మిన్ అనేద్రవ్యము (spermin) ఓజస్సు కార్యములన్నిటిని జేయుచున్నదని

చెప్పుచున్నది. కనుక స్పెర్మిన్ ద్రవ్యమునే మనము ఓజస్సు యొక్క రూపమని భావించవచ్చును. మరియు ఎండోక్రైనుగ్లాండ్సును సక్రమముగా నడిపించుటకు ఆహారపదార్థమందలి విటమినులు చాలబాధ్యతను వహించుచున్నవని శాస్త్రవేత్తలు నిరూపించినారు. కనుక ఓజోత్పత్తికి విటమిన్సు సహకారులు కావచ్చును. ఓజస్సు బ్రహ్మచర్యము, యోగవ్యాయామము, సదాచారములు, సదభ్యాసములు మనోదార్ఢ్యము, సాత్వికపౌష్టికాహార సేవనములద్వారా వృద్ధియగుచున్నది. స్వాస్థ్యరక్షణము, ఓజోవృద్ధిద్వారా జరుగుచున్నది. కనుక ఓజస్సులేక ఊర్జస్కర ద్రవ్యము ఆయుర్వేద తంత్రకర్తలకు స్వాస్థ్యరక్షణకు ప్రధానముగా నున్నది. సూక్ష్మరోగ క్రిముల ప్రధానములు కాసర్ జేమ్స్, గుడ్ హార్టుగారు డాక్టరు హార్టీ పండితుడు క్రియహేతు కారణమునుగురించి వెల్లడించిన యభిప్రాయములు ( 169, 167 పేజి) అధునిక వైద్యశాస్త్రావలంబకులకత్యంత ప్రమాణములు కాగలవు. ఈవిషయముల నమ్మియు నేటి యాధునిక వైద్యులింకను సూక్ష్మక్రిమి సిద్ధాంతమునే పట్టుకొని వ్రేలాడుచు, ఆ సిద్ధాంతానుసారముగా చికిత్సలో క్రిమిసంహారక మందుల ప్రయోగించి వాటిని వేటాడుచు, శరీరమును క్రిమి రహితమొనర్చుటయే రోగము నయమొనర్చుట యని సంతృప్తి జెందుట జూడ విచారము కలుగకమానదు. ఇటువైన క్రిమి సంహారక్రియలకంటెను, క్రిమి నిరోధక కార్యము (prevention) లో నిమగ్నులయ్యెదరని ఆశించుచున్నాము. అనగా సూక్ష్మక్రిములకంటె క్షేత్ర విచారణ మవశ్యమని తెలియుచున్నది.



## 4వ భాగము — భైషజ్యానకము

## Pharmacy and Pharmacology in Ayurveda

### 1 వ అధ్యాయము

ఆయుర్వేదశాస్త్రములో చికిత్సా ద్రవ్యములు మొదట మూలికలతో నారంభమయినవి. చరక, సుశ్రుతాది గ్రంథములలో మందు లన్నియు ఓషధులతోనే తయారగు చుండెను. సుశ్రుతుడు పాదరసముయొక్క బాహ్యోపయోగమును మాత్రమే నొక్కచోట జెప్పెను. భావమిశ్రుని కాలము నాటికి విదేశములనుండి దిగుమతి యగుచున్న నల్లమందు, పాదరసము, లోహాదులు, కొన్ని జంతు ద్రవ్యములు చికిత్సా ద్రవ్యములలో చేర్చబడినవి. చక్రదత్తుడు లోహాదుల భస్మీకరణ పద్ధతులను విపులముగా చెప్పెను.

చరక మాతానుసారముగా భేషజ ద్రవ్యములు మూడు రకములుగా లభించుచున్నవని యున్నది. (1) జంతుద్రవ్యములు (animal substances) (2) ఓషధులు (vegetable or herbs) (3) ఖనిజ ద్రవ్యములు (mineral substances)

1. జంతుద్రవ్యములలో తేనె, పాలు, మలమూత్రములు, క్రొవ్వు, మజ్జ, మాంసము, చర్మము, శుక్రము, అస్థులు, డెక్కలు, కొమ్ములు, గోళ్లు, వెంట్రుకలు, పిత్త సంబంధమయిన రాళ్లు పేర్కొనబడినవి.

2. ఖనిజద్రవ్యములలో బంగారము, వెండి, రాగి, సీసము, జసదము (zinc), లోహము (iron), యిసుక

(silica), సున్నము, మణిశిల (Realgar), వజ్రము, ఉప్పు ఇంగిలీకము (Red ocher), సౌవీరాంజనము (antimony), మొదలుగాగల వానియొక్క ఉపయోగములు వివరింప బడినవి.

(3) మూలికలు నాలుగు రకములని విభజింప బడినవి:-

(1) పుష్పించ కుండానే కాయలను కాచే మర్రి. జువ్వి, రావి, మేడి, పనస మొదలైనవి. (2) పుష్పించి ఫలములను కాచునవి. (3) ఓషధులు—— ఒక సంవత్సరములోనే ఫలించి వెంటనే నశించునవి (4) వీరుద్ధములు చిన్నపొదలు, తీగెలు (Herbs and creepers) వీనియొక్క వేళ్లు, పట్టలు, చేవ, బంక, పాలు, తొడిమలు, ఆకురసములు, క్షారములు, కాయలు, పండ్లు, పువ్వులు, బొగ్గు, చమురులు, ముళ్ళు, ఆకులు, మొగ్గలు, చివుళ్లు, మందులుగా వాడుదురు. మరియు చరకుడు 16 రకముల వేళ్లను 19 రకములు ఫలములను, 3 నిర్యాసములను, 3 పట్టలను, 4 స్నేహ ద్రవ్యములు అనగా:- నెయ్యి, నూనె, క్రొవ్వు, మజ్జలను, పంచ లవణములను అనగా:- సౌవర్చ, సైంధవ, బిడ, సముద్ర, ఔద్భిద లవణములును, జంతు మూత్రములను అనగా గొఱ్ఱె, మేక, ఆవు, బఱ్ఱె, ఏనుగు, లొట్టియ, గుఱ్ఱము, గాడిదెల మూత్రములను, యీ జంతువుల పాలను, మనిషి పాలను గురించి ప్రత్యేకముగా వివరించెను.

సుశ్రుతుడు (1-37) ఓషధులను సేకరించునప్పుడు దాని పరిసరములను పరీక్షింపుమని చెప్పెను, బొరియలు,

గనులు, రాళ్ళు, పుట్టలున్నవేమో చూడవలెను. పంచ భూతాంశలలో జల పృథ్వ్యాలెక్కువగా నుండిన స్థలమందలి విరేచనకారి యౌషధులు ప్రశస్థములు, వాయ్వగ్ను లధిక ముగా నుండి మంచిగాలి తగులుచున్న స్థలములందు పెరిగిన వమనకరౌషధములు మిగులప్రశస్తములు. ఓషధుల గురించిన ప్రత్యక్ష జ్ఞానమా యా ప్రాంతమందలి పసుకాపరులు, ఆటవికులు, సన్యాసుల ద్వారా పొందవచ్చును. సుశ్రుతుడు (1-37) లో 700 మూలికలను 37 గణములుగా విభజించి వాని ప్రయోజనములను పలురోగములకు వివరించెను ఈగణ ముల పేర్లు గణారంభము యొక్క ఓషధి పేరుతో నుండును. మరియు మూలికలయొక్క యుపయోగములబట్టి (1-39) కూడ వీనిని వర్గీకరణ మొనర్చెను. శార్ఙ్గధర సంహితలో నీ యౌషధుల గణవిభజనము పూర్తిగా నున్నది.

1. దీప నౌషధములు = (drugs which stimulate digestive secretions.)
2. పాచ నౌషధములు = (drugs which increase digestive enzymes.)
3. దీపన పాచ నౌషధములు= (drugs which digest food well)
4. సంశమ నౌషధములు=దూషిత దోషములనుసమస్థితికి దెచ్చునవి.
5. అనులోమ నౌషధములు=ఆహారమును పచనము జేసి సార కిట్టములుగా విభాగించి మలమును వెడలించునవి.

6. సంస్రన నౌషధములు= ఆహార సారకిట్టములను వాటి స్థానములకు చేర్చునవి.
7. భేద నౌషధము=మలమూత్ర బంధముల సడలించి వెడలించునవి.
8. రేచ నౌషధములు=(Purgatives)
9. వమనౌషధములు=(emetics.)
10. ఛేద నౌషధములు=ఒకదానితో నొకటి కలిసియున్న వాతాదులను విడగొట్టి వాటిని స్వస్థానములకు చేర్చునవి.
11. సంశోధ నౌషధములు=దోషములను మలములను వెడలించునవి.
12. లేఖ నౌషధములు = దోష యుక్తములైన రసాది ధాతువులను శోషింపజేసి రోగశమనము కలిగించునవి.
13. గ్రాహ్యౌషధములు=దీపన పాచన శక్తులు కలిగి యుష్ణ ప్రధానమైన ద్రవములను శోషింప జేయునవి.
14. స్తంభ నౌషధములు = రూక్ష శీత వీర్యగుణములు కలిగినవి.
15. రసాయనౌషధములు = ఆరోగ్యమునిచ్చి ముదిమి రాకుండ చిరకాలము జీవింపజేయునవి. (Elixirs)
16. వాజీకరణౌషధములు=వీర్యవృద్ధిచేసి సంభోగ శక్తి నిచ్చునవి. (aphrodisiacs)
17. ధాతువృద్ధికరౌషధములు = (Tissue builders)
18. సూక్ష్మౌషధములు=చర్మరంధ్రములలోన ప్రవేశము గలవి.

19. వ్యవాయ్యౌషధము = శీఘ్రముగా శరీర మంతట వ్యాపించిన తరువాత పాకమగునది.

20. వికాస్యౌషధము = సంధిబంధములను సడల జేయునది.

21. మదకారి ఔషధము = మత్తును కలిగించునది. (Hypnotics).

22. ప్రాణహారౌషధము = (poisons)

23. ప్రమాథ్యౌషధములు = వీనిని చెవులు ముక్కు రంధ్రములలో వేసినను స్వవీర్యప్రభావములచేత దోషములు శమించును.

24 అభిష్యందౌషధములు=జిడ్డుగానుండి గురుగుణమును కలిగి రసవహస్రోతస్సుల నడ్డగించుటవలన స్థౌల్యరోగమును కలిగించును.

మరియు అధర్వణ వేదములో భేషజ ద్రవ్యములు నాలుగు రకములని చెప్పబడినది. మంత్రం॥ ఆధర్వణీరాంగిరసీర్దైవేర్మనుష్య జాఉత ఓషధయః॥ అనగా:-

(1) ఆధర్వణీయ భేషజములు-అనగా 'ధర్వాతశ్చరతి కర్మతత్ ప్రతిషేధః అధర్వః' అనుటచేతను దుఃఖ నాశనమని భావార్థము. దీనికి హిరణవిద్య యనిపేరు. సూర్యుని యందలి ప్రాణద్రవ్యములకు హిరణ్యామని యందురు. ఈవిధములైన ప్రాణశక్తులు కలిగిన ఓషధులను, జంతుద్రవ్యములను, లోహముల భస్మములను, హిరణ్యావిద్యాతంత్ర సాంప్రదాయాను సారముగా రోగులకిచ్చి జీవింపజేయ వచ్చును.

(2) ఆంగీరస భేషజములు:- అంగరస ప్రతిపాదితవేదము అంగీరస విద్య. "అంగీరసః భిషక్ వేదశ్చ"అని ఛాందోగ్యో పనిషత్తు, బృహదారణ్యకములోను, "అంగీరసం మన్యంతే అంగానాంహి యద్రసః" (ఛాందోగ్య 1-2-10) లోను, ఆంగి రసోఽఅంగనాం హిరసః (బృహదా 1-3-8) లోను, "ప్రాణోవా అంగానాం రసః" (బృహద 1-3-10) లోను, కన్పించుటచేతను యీఅంగీరస భేషజమును మోడరన్ మెడి సిన్ లోచెప్పిన ఎండ్రోక్రైనాలజీ సైన్సు, (endocrinology) science) అని మన మూహించుట తప్పుకాదు. ఈ గ్రంథి రసములు (హోర్మోనులు) జంతుక్షీర, మూత్ర, పిత్త రసము లలో కలిసియున్నవి. కనుక ఆయుర్వేదములో నీ రకము భేషజ ద్రవ్యములను ఓషధి చికిత్సలతో కలిపినారు.

(3) దైవీవిద్య అనగా ప్రాక్తన కర్మ క్షయ హేతువు లైన ఉపాసన, మంత్ర, తంత్ర, జప, తపో దానాదులద్వారా రోగవిమోచనము గావించుట.

(4) మనుష్యజాఉత ఓషధయః - ఆయుర్వేదము లోను, మోడరన్ వైద్యములోను రోగ శమనము కొఱకు ఓషధులను, పాషాణాది లోహద్రవ్యములను యుక్తిగా ప్రయోగించుట.

ఈపై నాలుగింటిలో దైవీవిద్య నవలంభించువారు మనదేశములో భూతవైద్యులని పిలువబడుచున్నారు. భూత విద్యనే గ్రహచికిత్స యని ఆయుర్వేద శాస్త్రములో నొక యంగముగా మనవారు పరిగణించినారు. సుశ్రుతుడు మాత్రము ఆయుర్వేద శాస్త్రములో భూత, గ్రహాశబ్దములను

రోగ హేతుక సూక్ష్మక్రిములుగా భావించమని ఆదేశించు చున్నాడు.

ఇక ఆథర్వణీయ విద్యలేక హిరణ్యవిద్యను గురించి సంగ్రహముగా ప్రస్తావించవలసియున్నది. ఋగ్వేదమంత్రం (1-7-46) పేజి 20 సూక్తములను పరికించిన త్రివిధ దివ్య భేషజము లర్థించబడినటుల తెలియుచున్నది. అవేమనగా :- (1) త్రిదివ్య భేషజములు-సూర్య, చంద్ర, అగ్ని. (2) త్రిపార్థివ భేషజములు -- ఆకాశ. దిక్, ఋతువు. (4) త్రిర్మర్త్య భేషజములు—పృథ్వి. జల, విద్యుత్తులు.

ఈ 9 ది లోను విరాట్ ప్రాణశక్తులధికముగా నున్నం దున వీనిని నవప్రాణ ద్రవ్యములందురు. "సూర్య ఆత్మా జగత స్త స్థుషశ్చ" అనుటవల్లను, జ్యోతిరమృతం మర్త్యేభ్యః ఉద్యంతూన్సర్య రస్మిరాతనోతి" అని పాఠముండుటచేతను సూర్యుడు తనయందలి అమృతమును (ప్రాణశక్తులు) సహస్ర కిరణములద్వారా వర్షింపజేయగా నవి పైన జెప్పిన తొమ్మిది ద్రవ్యములలో బ్రవేశించుచున్నవి. ఆకాశ, దిక్, ఋతువుల లోని ప్రాణశక్తులను గ్రహించి స్థావర జంగమ ప్రాణులు వృద్ధిజెందుచున్నది. ఇక పృథ్విలోకి ప్రవహించిన ప్రాణ శక్తులు హారితార్జునాయములలో నధికముగా లభించును. హారితము=బంగారము. అర్జున=రజితం, వెండి. అయము= ఇనుము.

ఔషధులకు రాజు చంద్రుడు. చంద్రునిలో నవప్రాణ ద్రవ్యములను గ్రహించి ఔషధులు వృద్ధియగుచున్నవి. ఈదిగువ చూపిన ప్రకారము ఒక్కొక్క-జాతి ఓషధి

యొకొక్క రకము ప్రాణశక్తి నధికముగా గ్రహించినందున వానికి సార్థక నామము లియ్యబడెను.

1 అగ్ని ప్రాణమధికముగా గలది — చిత్రమూలము
2 సూర్య ,, ,, — అర్క (జిల్లేడు)
3 చంద్ర ,, ,, — సోమ, అమృత-తిప్పతీగె.
4 పృథ్వి ,, ,, — ధాత్రి (ఊశిరిక)
5 ఆపః ,, ,, — జల (కురువేరు)
6 ద్యౌ ,, ,, — ఇంద్ర (కొండిశపాల)
7 అంతరిక్ష ,, ,, — ఆకాశవల్లి (సీతామ్మవారి నూలుపోగులు.
8 దిశః ,, ,, — కకుభః (మద్ది)
9 అర్తవ ,, ,, —ఆదిత్య (పుష్కరమూలము)

ఇట్లే జంతు, పక్షి, మనుష్య దేహములుకూడ నీ నవ ప్రాణద్రవ్యములను గ్రహించి వర్ధిల్లుచున్నవి. కాని ఒకొక్క జాతి యొకొక్క ప్రాణము నధికముగా గ్రహించుటకలదు. ఉదా:- గోవు సూర్యప్రాణమును, మేక అగ్నిప్రాణము నధిక ముగా గ్రహించును.

ఇక రోగుల శరీరములలో నేయే ప్రాణశక్తులు తగ్గినవో నిదానించి ఆప్రాణశక్తు లధికముగానుండిన జంతు, పక్షి ఓష ధులద్వారా తిరిగి లోపము నుద్ధరించుట భేషజము కాదా. డాక్టరు సుస్లెర్ గారి ద్వాదశ లవణాచికిత్స మాదిరిగానే నేర్పరియైన వైద్యుడు స్వర్ణ, రజిత, అయోభస్మములు,

పైన చెప్పిన 9 ఓషధుల చూర్ణములతో సర్వరోగములు చికిత్సించవచ్చును.

ఇక మణిధారణము కూడను యీ ప్రాణశక్తి సిద్ధాంతము ననుసరించియే యున్నది. నవగ్రహములకు ప్రీతి కరములైన వజ్ర వైఢూర్య, మరకత మాణిక్యములను మనవారు అలంకారముగా ధరించుచుండినను వాటి ప్రభావము వానిని ధరించిన వారికి లభించుచునే యున్నది పవడములు మంచి ముత్యములకు కూడ నిట్టి శక్తియే కలదు. కనుక వీనిని ధరించుట ఆరోగ్యము కొఱకే యని తెలిసికొందము. కొన్ని వృక్ష శకలములకు మణి శబ్దము సార్థముగా వ్యవహారమున నున్నది. వీనినే తావేదులు కట్టుట, కొన్ని రోగముల ద్భుతముగా వృక్ష మణులను ధరించు మాత్రమున నయము కాగలవు. అందరకు తెలిసినది కోరింతదగ్గు రోగులకు మెడలో కోరింత తీగెను కట్టుట. కొండజాతివారు పలు రకముల తీగెలను దండకు కడియముగా ధరింతురు. కౌశిక సూత్రములలో రాజయక్ష్మరోగులకు వరుణ వృక్ష శలాకను, యత్కొంచాది సర్వరోగములకు దశ వృక్షశలాకను మంత్ర సహితముగా తయారైన బంగారు, వెండి, రాగి రేకులతో తావేదులు చేసి కట్టవలెను అని యున్నది. 'శతవారో అవినశత్' ఇతి సంతతి కులక్షయ గ్రహాజుష్ట యిత్యాది ఉపద్రవేషు శతవారం అభిమంత్ర్య పునః సూక్తం జపిత్వాబధ్నీయాత్॥ అని కౌశిక సూత్రములు బోధించుచున్నవి.

ఈ మణిధారణ విషయమై ఆధునిక విద్యావంతులు నమ్మకుండినను ప్రాణశక్తుల విషయములో నందరును నమ్మ

వలసి వచ్చును. ఏలయన ఏటమ్ ఎనర్జీ, న్యూక్లియర్ ఎనర్జీ లను కనుగొనుచున్న శాస్త్ర పరిశోధకులు యీ ప్రాణశక్తు లను గ్రహించుట కెంతయో శ్రమపడ నక్కరలేదు.

హైడ్రోజనుబాంబు ప్రేలుడు ఫలితంగా ప్రపంచము లోని మానవ, జంతు, వృక్షములలోని తత్వములే మారి పోవుచున్నాయని శాస్త్రజ్ఞులు చాటుచున్నారు. ఎక్సురే ఆల్ట్రా కిరణ ప్రసారమువలన మనుష్య దేహములలో ధాత్మిక శక్తి విశేషముగా ప్రవేశించి కేన్సర్ మొదలైన క్రొత్త రోగములను పుట్టించగలవట. కొన్నివేల సంవత్సర ముల క్రిందట హైందవ ఋషులు లోకహితార్థముబోధించిన హిరణ్య విద్యను మనమేల యుపయోగించుకొనరాదు?

ఇక ఆయుర్వేద తంత్రకర్తలు యుక్తిసాధనముగా నిర్మించుకొనినిభేషజ ద్రవ్యముల గురించి విచారింతము రోగ హేతువులలో మొదటిది కర్మ సిద్ధాంతము. కర్మానుభవము కాకుండ రోగమునకు విముక్తిలేదని చాలమంది నమ్మకము. కాని మనపూర్వులు కర్మవిపాకమునకు సహితము కొన్ని యుపాయములను బోధించిరి. ఆయుపదేశమే దైవవ్యపాశ్రయ చికిత్సగా చరకుడు ప్రతిపాదించెను - అనగా భక్తి నియమ ములతో భగవంతుని ప్రార్థించుట. అనన్య చింతనతో కూడిన భక్తి సహిత ప్రార్థనలకు సాధించరాని కార్య మెద్ధి కలదు? (More things are wrought by prayer than the world can dream of) అని ఒక ఆంగ్లకవి చెప్పినాడు. గాంధి మహాత్ముడును 'రామనామ సంకీర్తనమే సర్వరోగము

లకు దివ్యౌషధ' మని పునరుద్ఘాటించినాడు. చరకుడు చెప్పిన యుక్తి వ్యపాశ్రయచికిత్స ద్వివిధములుగా నున్నవి.

(1) శారీరక రోగములకు ఔషధాన్న విహారచికిత్స, (2) మానసిక రోగములకు సత్త్వావజయ చికిత్స (psycho-therapy).



## 2వ అధ్యాయము

## ఆయుర్వేద ఔషధ గుణ నిశ్చయము.

## (Pharmacognacy in ayurveda)

ఆధునిక పరిశోధకులవలె నాయుర్వేద తంత్రకర్తలు జంతువులకు, పక్షులకు ఔషధ ద్రవ్యములిచ్చి దేహాయంత్ర వ్యాపారముల మీాద వాటి ప్రభావమును కనిపెట్టలేదు. పాశ్చాత్యులు కూడను సుమారు 200 సం॥ నుండి జంతు పరిశోధనల జేయుచు ద్రవ్యగుణమును గ్రహించుచున్నారు. ఇంతకు పూర్వము మనుష్యులచే తినిపించి వాని కార్యములను కనిపెట్టుచుండిరి. ఈ అనుభవైకజ్ఞాన మొకరినుండి యింకొకరికి వ్యాప్తినొందుచుండెను. ఈవిధముగా లభించిన జ్ఞానమునకు ట్రెడిషనల్ లేక ఎంపిరికల్ నాలెడ్జి (Traditional or emperical knowledge) అని పేరు. ఇందువల్ల నొక చికిత్సా ద్రవ్యమొక రకము వ్యాధిని నయముచేయగలదని తెలియునేగాని అదే విధముముగా దేహాయంత్ర వ్యాపారములను మార్పుజేసి సుఖమును కలిగించును? ఆద్రవ్యమునకు రోగహరశక్తివ హేతువులవల్లకలిగినది? అనెడు నిర్దుష్టమయిన జ్ఞానము కలుగలేదు. అందుపైని కొందరు బుద్ధిమంతులు చికిత్సా ద్రవ్యమును మొదట నారోగ్యముగా నుండిన జంతువులకు, పక్షులకు, మనుష్యులకు తినిపించి, దాని ప్రభావమును వివిధ దేహాయంత్ర భాగములమీాదను కనిపెట్టి, పిమ్మట

ద్రవ్యమందలి ప్రధానాంశములను (active principles) రసాయనికోపాయములచేతను విడదీసి, దానియొక్క విష మోతాదులను, సౌమ్యముగా వ్యవహరించగల కనిష్ట మోతా దులను నిర్ణయించుచున్నారు. ఈవిధముగా పరిశోధన పరిశీల నలద్వారా కలిగిన నిశ్చిత జ్ఞానమునకు రేషనల్ నాలెడ్జి (Rational knowledge) అనగా హేతువాద పూర్వకజ్ఞాన మని పేరు. ఏ అయినాను మందుల విషయముననోతప్ప, పాశ్చాత్య వైద్యమందలి మందులన్నిటికి పైన చెప్పిన విధ ముగా ద్రవ్యగుణ నిశ్చయము గావించబడినది. కనుక మోడరన్ మెడిసిన్ 'సైంటిఫిక్ మెడిసిన్' అనికూడ వ్యవ హరించుచున్నారు.

ఆయుర్వేద తంత్రకర్తలు హైందవ సాంప్రదాయాను సారముగా ద్రవ్యగుణ నిశ్చయమును ప్రత్యక్షానుభవముల తోను, తాంత్రిక సిద్ధాంతముల ననుసరించి యుక్తివాదము తోను, అప్తవాక్య ప్రమాణములననుసరించియు, చేసినారు. కనుక నాయుర్వేదీయ ద్రవ్య గుణపాఠము సశాస్త్రీయ మనియే చెప్పవలెను. ఔషధ ద్రవ్యమందలి పంచ భూతాం శలను నిర్ణయించియు, ద్రవ్యములయొక్క రస, గుణ, వీర్య, విపాక, ప్రభావములను అనుభవముద్వారా కనిపెట్టియు, వేదవాక్యములను ప్రమాణములుగ నంగీకరించియు ద్రవ్యగుణ నిశ్చయమొనర్చినారు.. ఈవిషయములను యీ గ్రంథములో రెండవభాగములో పంచభూత, షడ్రస సిద్ధాంతములలో వివరముగా చూడదగును.

1. ద్రవ్యములరసము :- ద్రవ్యములందలి వివిధ రసము

లను మన జిహ్వేంద్రియము కనిపెట్టగలదు. ఇందుకు పాశ్చాత్య శాస్త్రపరిశోధకు లింతవరకు యంత్రసాధనములను కనిపెట్టలేరు. ఒక్క పులుపు, ఉప్పు, తీపి, రుచులవిషయములో నవి యధికముగానున్న ద్రవ్యములను వాసనబట్టికూడా గ్రహించవచ్చును. ఈ మొదటి రెండురసములు చాల స్వల్పముగా నున్నప్పుడు రసాయనికోపాయము నొకదానిని శాస్త్రవేత్తలు సూచించినారు. అదేమన:- ఎరుపు, నీలిరంగుల లిట్మస్ కాగితములతో ద్రవ ద్రవ్యమును పరీక్షించుట. (Red and blue litmus paper test). పులుపు ద్రవములో నీలిలిట్మస్ కాగితమును ముంచినప్పుడది ఎర్రరంగుగా మారును. (దీనికి acid reaction అనిపేరు). నీలిరంగు కాగితము ఎర్రగా మారినయెడల ఆల్ కలైన్ రీయాక్షన్ (క్షారయుక్తమని) అని తెలియవలెను. మిగతా రుచులను కనిపెట్టుటకు అవకాశములేదు. తీపికి చీమలు చేరునుగాన నీయుపాయముతో కొంత గ్రహించవచ్చును. మిగిలిన ద్రవ్యరసములను నోటిలో వేసికొనియే తెలియవలెను.

ఆహారపదార్థముల నాశ్రయించుకొనియున్న షడ్రసములు పంచభూత సమ్మేళనమువలన ఏర్పడుచున్నవని ఆయుర్వేద తంత్రములు బోధించును. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు రసములను (రుచులను = Tastes) ద్రవ్యాశ్రితగుణములుగా చెప్పిరి. వీని స్వరూపము వారికందుబాటులో లేదు. గనుక అన్నజీర్ణవిషయమై పదార్థములమీద వివిధ జీర్ణరసములందలి ఎంజైమ్సుయొక్క రాసాయినిక పరివర్తనమే (Chemical change) అన్నజీర్ణకార్యమని చెప్పుచున్నారు. ఇకపదార్థము

లందలి షడ్రసములపై నీ ఎంజైమ్సుయొక్క పరివర్తనా పద్ధతి నింత వరకు కనిపెట్టలేదు.

ఆయుర్వేద తంత్రకర్తలకు, ఆహార, ఔషధద్రవ్యము లందలి షడ్రసములు ద్రవ్యగుణ నిరూపణమునకు చాల ప్రధానములుగానున్నవి. మరియు షడ్రస భూతాంశలతోనే వాతాది త్రిధాతువులుపుట్టుచున్నవని సిద్ధాంతీకరించిరి. పదార్థములతోబాటు షడ్రసములుకూడ మన శరీరములో పిత్తాగ్ని చేతను పచనమగుచున్నవని వివరించిరి. పాచకభాగాంశమైన పిత్తమును జఠరాగ్నియని వ్యవహరించినారు. సౌకర్యము కొఱకు యీ అగ్ని ద్వివిధములని చెప్పుచు, ఆహారపదార్థములను జీర్ణముచేయుదానిని పాచకాగ్నియనియును, షడ్రసములను విపాకమొందించు అగ్నిని జఠరాగ్నియనియు త్రంతకారులు చెప్పినారు. పాశ్చాత్య ఫిజియాలజీ గ్రంథములలో చెప్పిన వివిధ ఎంజైమ్సులనే పిత్తాగ్ని స్వరూపములని మనము గుర్తించినప్పుడు, యీఎంజైమ్సు పదార్థములతోబాటు షడ్రసములనుకూడ విపాకమొనర్చుచున్నవని మనమూహించుట తప్పుకాదు. ఈవిషయము పాశ్చాత్య పండితులకు తెలియక పోవచ్చును. అంతమాత్రమున ఆయుర్వేద సిద్ధాంతము తప్పు యనుటగాని అసంభవమనుటగాని బుద్ధిమంతుల లక్షణముకాదు. అహారపదార్థములందలి పంచభూతాంశలతో శారీర ధాతువులైన రసరక్తాదులు నిర్మింపబడుచున్నవి. షడ్రసములందలి పంచభూతాంశలతో వాతపిత్త కఫములేర్పడి రసరక్తాది శారీర ధాతువులను పోషించుచున్నవని చెప్పిన ఆయుర్వేదము శాస్త్రముకాదా? పంచభూతములు, షడ్రసములను

గూర్చి సజ్ఞానమే పాశ్చాత్యులకు లేనప్పుడు, యిక త్రిదోష జ్ఞానమెల్లు అలవడును. ప్రత్యక్షానుభవ విషయములను మాత్రమే నమ్మెదము. అనుమాన, ఆప్తవాక్యములపై నాధారపడి నిర్మించిన సిద్ధాంతము లంగీకరించబడవు. అని చెప్పుట మూర్ఖత్వమును వెల్లడిచేయును. పాశ్చాత్యుల శాస్త్రములలో మాత్రము కొన్ని సిద్ధాంతములను (Hypothesis) నమ్ముటలేదా? అవన్నియు ప్రత్యక్షానుభవముతో ఋజువైనవా? ప్రతి శాస్త్రము మొదట కొన్ని ఊహలతో నారంభమగును. ఈయూహాలు బుద్ధివికాసము, అనుభవములతో పరిశోధన పరిశీలనాపూర్వకముగా ఋజువగుచుండును. గనుక సత్యాన్వేషణాపరులు ఆయుర్వేద సిద్ధాంత విషయములను జాగ్రత్తగా పరిశీలింతురుగాక.

(2) ద్రవ్యగుణము :- దేహాయంత్రకార్యములు గుణములు కావు. ఈకార్యములలోని ద్రవ్యప్రభావమువలన జరుగుచున్నవిగాన ద్రవ్యము నాశ్రయించుకొనియున్న మహత్తర ప్రభావమును కలిగిన ద్రవ్యవిశేషములని చెప్పవలెను. దీనిని గుణ శబ్దముచేతను వ్యవహరించుచున్నారు. సాంఖ్యులు ప్రకృతికంటె భిన్నమైనగుణము పదార్థమనియు, అవ్యక్త ప్రకృతి (మూల ప్రకృతి)తో కలిసి యున్నదనియు చెప్పుదురు. ఇది ప్రకృతి పరిణామద్రవ్యము లన్నిటియందును అనుసరించును. కనుక పాంచభౌతిక దేహము, మనస్సునకును సంక్రమించి సర్వచేష్టలకును మానసిక ప్రవృత్తులకును కారణభూతముగా నున్నది. సృష్టి పదార్థములన్నియు .పాంచభౌతికము లగుటంజేసి ఆహార ఔషధ ద్రవ్యము లన్నిటిలోను నున్నది. సత్వ, రజ, తమో

గుణాంశల ప్రధానములుగా నీద్రవ్యములు త్రివిధములుగా నున్నవి. నిత్యము సాత్వికాహారమును భుజించు వారిలో సాత్విక గుణాంశ లభివృద్ధి జెందును. ఇట్లే మిగతా గుణములుకూడ వృద్ధియగుచున్నవి. రజోగుణము చురుకుతనమునుస్వాతికగుణమును, తమోగుణాంశ లధికముగాగల ద్రవ్యములకు జడత్వము కలిగించునని మనవారు అనుభవపూర్వకముగా చెప్పిన విషయము. మరియు ఆహారౌషధములకు వీర్యము, విపాకము, ప్రభావములున్నవి. వీని వివరములకు చూడు పేజి 80, 81, లు. ఆయుర్వేద తంత్రకర్తలు వేలకొలది ఓషధులు, జంతు పక్షి మాంసాదులు, ఖనిజలోహములు, వివిధరకముల భక్ష్యభోజ్యములయొక్క రస, గుణ, వీర్యవిపాక, ప్రభావములను అనుభవపూర్వకముగా నిర్ణయించి ద్రవ్య నిఘంటువుల వ్రాసియున్నారు. వారి అనుభవములను మనము పొందుటయే మనవంతు. ఈవిషయమున సందేహము లనవసరము. క్రొత్త వస్తువులకు నేటి వైద్యులుగాని ముందుతరమువారుగాని వారుసూచించిన మార్గముల ననుసరించి ద్రవ్యగుణ నిశ్చయ మొనర్చి, ఆయుర్వేద సాంప్రదాయము ప్రకారము వానిని వాడుకొనుట కెట్టి యభ్యంతరము లేదు. స్వానుభవ పరీక్షాపద్ధతియే శ్రేష్టమయినది. కొన్ని తీవ్రతరౌషధముల విషయమున జంతు పక్షుల మీాద పరిశోధనలుసల్పి, గుణ నిశ్చయముచేయవలసి యుండునని ఆయుర్వేద తంత్రకారులు కూడ నుడివినారు.

ద్రవ్యగుణ నిశ్చయము కేవలము జంతు పక్షి పరిశోధనాలయములో సాగనేరదు. ఏలయనగా జంతువులు పక్షులు,

ద్రవ్యానుభవములను ముఖ్యముగా మానసిక ప్రభావములను ప్రకటించలేవు. అయిన నీ పరిశోధనలు కొంత మార్గదర్శకములుగా నుపచరించును.

## 3. అధ్యాయము

## Pharmacy in Ayurveda

## ఆయుర్వేదములో ఔషధకల్పనము.

ప్రత్యేక విశిష్ట ప్రభావము కలిగిన మూలికలు యే కొలదియో తప్ప మిగిలిన ఓషధులను సంపుటిచేసి యిచ్చుటయే ఆయుర్వేద సాంప్రదాయము. ఏక వస్తుప్రయోగములు చాల తక్కువగా నున్నవి. ఏలయనగా రోగములు తఱచుగా ఏక దోష జనితములు కావు. ద్వంద్వజ, సన్నిపాతజములుండును. మరియు నీ దోషములు అంశాంశ భేదములతో ప్రకోపించుట కలదు ఈ సంసర్గ భేదములన్నిటికిని తదనుగుణమైన ఏక వస్తువు లభించుట కష్టము గనుక బహు ద్రవ్యములు సంయోగ పరచి మందును సిద్ధము చేయుదురు. ఒకే యోగమును రోగావసరములనుబట్టి అనుపాన భేదములతో నుపయోగింతురు. ప్రయోగ సౌకర్యము నిమిత్తము ఒకే యోగమును పలురూపములుగా తయారు చేయుటయు కలదు బహువస్తు సంపుటీకరణములో రెండు ఉద్దేశములిమిడి యున్నవి. (1) గుణాధిక్యము కలిగించుట (2) ప్రధాన ద్రవ్య మందలి దుర్గుణములేమైన యున్నచో వానిని సంస్కరించుట.

తయారైన మందులకు సామాన్యముగా పేర్లు గుణసార్థకములుగా నుండును. కొన్ని మందుల పేర్లు ఆయోగ మందలి ప్రధాన ద్రవ్యనామముతోగాని మరికొన్నిటికి ద్రవ్య సంఖ్యా సూచక నామములుగాని, యికకొన్నిటికి ఉపయుక్త

రోగ నామములుగాని వ్యవహరించిరి. ఉదా:- వాత గజాంకుశం, కఫకేసరి, పైత్త్యాంతక రసం, అశ్వినీ మాతులుంగ గుటిక, అమృత (ప్రాశఘృతం, దశాంగఘృతం, దశమూలారిష్ట, పలీఫలిత నాశన తైలం మొదలైనవి.

ఇక తాయారైన మందుల స్వరూపములను యింగ్లీషు పేర్లతో వివరింతము.

1. ఘృతములు=(Medicated Ghee).
2. తైలములు=(Medicated oils).
3 కాషాయములు, క్వాథలు = (Decoctions & infusions).
4. చూర్ణములు=(Powders)
5. భస్మములు=(Calcined metalic preparations)
6. వటి, గుటిక=(Pill).
7. మోదకము=పంచదార లేక బెల్లము చేర్చి నోటిలో నుంచుకొని చప్పరించదగిన మందులు= (Confections).
8. ఖజ్జలీ మందులు= (a combination of metalic Charnams with mercury and Sulphur).
9. వంట ఔషధములు=(Chemical compound formed after boiling on fire, of different ingredients including mercury and Sulphur or arsenic).

10. పుటపాక ఔషధము = (medicines burnt in a pit with cow-dung cakes).

11. కల్కము = (Paste of plant parts bruised on a stone).

12. స్వరసము = (fresh juice expressed from leaves or barks of plants or exudations).

13. లేహ్యములు=(medicines that can be licked).

14. యవాగులు = (meal 'sauce with medicinal stuffs).

15. ఆసవారిష్టము =(a fermented drink of honey, Syrup and water prepared with medicinal stuffs).

16. కాంజికము = (fermented rice grual).

17. లేపములు=(Ointments for external use only),

18. కలికములు, వర్తులు = (medicines applied to eyes).

19. సింధూరములు = (Oxides of metals which appear red).

20. పంచలవణములు=(the five verieties of earthy salts).

1. సౌవర్చలవణము =(a black salt being the precipitate after mixing the two solutions of common salt (Sea salt) and of rock salt).

2. సైంధవలవణము=(Rock salt obtained from the Indus region).
3. బిడాలవణము=(a black salt got by mixing common salt in the deccction of Myrobalans, soda added and boiled to Crystalisation).
4. సముద్రలవణము=(Common table salt got by eveporating sea water).
5. ఔద్భిద లవణము=(Desert salt).

21. రసౌషధములు=(Mercurial Compounds).

22. క్షారసత్వములు = (active ingredients of plant having caustic Properties).

23. పార్థివ ద్రవ్యములు = (metals and non-metals and their compounds obtained from earth and mines). వీనిలో చాల రకములున్నవి. అవి ఏమనగా:—

పటిక (alum), నవాసారము (ammonium chloride) టంకణము (Borax) దీనిని వెలిగారమని కూడ నందురు. సూరేకారము (Patassium nitrate), కాసీసము (iron Sulphate) మైలతుత్థము (Copper Sulphate), తుత్థము (Ziuc Sulph) మృద్దారుశింగు (Red oxide of lead), సఫేదు (white oxide of lead), కాంతము (Magnetic Stone), సౌవీరాంజనం (antimony), సౌవీరము (crude mercury chloride), తాళకము (trisulphide of arsenic), మణిశిల (penta sulphide of

arsenic), ఉల్లిపాషాణము (white arsenic or arsenious acid), గౌరీపాషాణము, ఇంగిలీకము (Sulphide of mercury), రస సిందూరము (red oxide of mercury) మొదలైనవాటిని, మరియు వజ్రాది నవరత్నములను, ప్రవాళము (corals), మంచిముత్యములు, ముత్యపు చిప్పలను (pearls) నేటి కాలమున ఆయుర్వేద వైద్యులు తఱచుగా మందుల తయారీలో వాడుచున్నారు.

ఈపైన వివరించిన ఔషధ ద్రవ్యములును, యోగ కల్పనలును ఆయుర్వేదములోను, మోడరన్ వైద్యములోను నించుమించుగా నొకేతీరుగా నున్నవి. కాని మోడరన్ వైద్యములో పాదరస సంబంధమయిన మందులు లోపలికిచ్చునవి మూడుమాత్రమే. (1) కేలమిల్ (2) సౌవీరద్రావకము (Liquor mercury Perchloride and (3) liquor hydrargyri iodide). మందులను తయారుచేయుటకు కూడ పాదరసము సాయ మపేక్షించరు. ఆయుర్వేద వైద్యములో పాదరసముతో తయారుచేసిన మందులసంఖ్య అపరిమితముగా నున్నది. ఈరసౌషధములను తయారుచేసి ప్రయోగించలేని వైద్యుడు నీరసుడుగా భావింపబడుచున్నాడు. 'రసవైద్యం భవేద్దివ్యం' అనికూడా చెప్పినారు. అనగా పాదరసము దేవతా సంబంధమయిన మహత్తర శక్తులుగల ద్రవ్యమని మనవారి యభిప్రాయము. కనుక నిచ్చట పాదరసము, రసౌషధ కల్పనలనుగురించి వివరముగా చర్చించబడును.

పాదరసము (Mercury and its compounds) క్రీస్తుశకము 15, 16 శతాబ్దములలో భావమిశ్రునిచే ఫిరంగి

జబ్బులో (Syphilis) లోపలికిచ్చుటకును, పైపూతలతోను ఆరంభమయినది. దీనితోబాటు యితరలోహాదులుకూడ వాడుకలోకి వచ్చినవి. చక్రదత్తునికాలమున లోహాదుల సంస్కరణ, భస్మీకరణపద్ధతులు విస్తరించబడెను. అన్ని లోహములకంటెను పాదరసము మిక్కిలి శ్రేష్ఠమైనదని మనవారు గుర్తించి దీనికి లోహరాజమని పేరుపెట్టిరి. (King of metals) ఏలయనగా — (1) ద్రవరూపక లోహ మిదియొక్కటియే. 320 డిగ్రీల వేడికి ఆవిరిగామారి మీదికెగ యును. (2) పాదరసమునకు ఆశు, వ్యవాయి, వికాసి గుణము లున్నవి. (3) దీనికి మూలికా సంబంధమును కల్పించి పుటముబెట్టినపుడు మూలికలయొక్క రోగహరశక్తి నది గ్రహించి, మూలిక కాలిపోగా పుటానంతరమున తాను భస్మమై నిలుచును. ఈ ఒక్కవిషయమే ఆయుర్వేద వైద్యుల నాకర్షించినది. ఎందుకనగా ఓషధు లన్ని దేశము లందును అన్ని ఋతువులలోను లభించవు. వాని నెంతో శ్రమతో సంపాదించి నిలవచేసికొందమనిన ఆనుమాసముల కవి నిర్వీర్యములగుచున్నవి. కనుక పాదరసమును గురించి తెలియనిరోజులలో వైద్యులు మూలికలను సేకరించుట కెక్కువ బాధపడుచుండెడివారు. నేడు రససహాయమున మూలిక లందలి రోగహరశక్తిని ఎంతకాలమైనను భద్రపరచ గలుగు చున్నారు. పాశ్చాత్యవైద్యములో మందులను నిలవచేయు టకు ఆల్కహాల్ (alcohoe) ఎంత యుపయోగకారిగా నున్నదో ఆయుర్వేదవైద్యునకు పాదరసమంతగా నుపయోగ పడుచున్నది.

ఔషధోపయుక్తమగుటకు పాదరసమునకు అష్టాదశ సంస్కారములు చేయవలెనని తంత్రకారులు చెప్పినారు. అప్పుడది దివ్యరసాయనమగును. ఇట్టిదానిని మనవారు అమృతమని వ్యవహరించిరి. ఈ యమృతపాన మొనర్చిన వారల కష్టసిద్ధులు లభించును. ఇతరమందులతో కలుపుకొను టకు కనీసము మొదటి ఎనిమిది సంస్కారములైనను చేయ వలెను. ఈ సంస్కారక్రియల ప్రయోజనమేమన — పాద రసములో స్వతస్సిద్ధముగా సప్తకంచుక దోషములు, కొన్ని సంసర్గదోషము లున్నవి. ఈ దోషములు స్వేదన, మర్దన, మూర్ఛన, ఉత్థాపన, దీపన, పాతన, జారణాది సంస్కారముల ద్వారా తొలగిపోవును. పిమ్మట దానిని మందులతో వాడు కొనుట కుపయోగించును. ఈ శ్రమలుపడలేక వైద్యులు కొందఱు జారణసంస్కారముతో పాదరస దోషములన్నియు నశించినట్లేయని తలంచి ఇంగిలీకములో గంధకజారణము భూమిలోనే జరిగినదిగనుక హింగుళాకృష్టరసమును దీసికొని మందులలో వాడుచున్నారు. రససంయోగమువలన యితర ఔషధములు శరీరములోకి శీఘ్రగతిని వ్యాపించి మంచి ఫలితములనిచ్చుచున్నవి. శీఘ్రగతిని శరీరములోకి ప్రవేశిం చిన పాదరసము, యితరలోహభస్మములు తిరిగి బయటకంత తేలికగారాలేవు. ప్రతిరోజు నిచ్చుచుండిన మోతాదులో కొంచెము కొంచెము శరీరములోనిలిచి, అది పెద్దమొత్తమై చివరకు బాధించుట కలదు. ఈ కార్యమునకు క్యుములేటివ్ యాక్షన్ (cumulative action) అందురు. ఇట్టిది సంభ వించకుండ రోగియొక్క శరీరతత్వము ననుసరించి చాలచిన్న మోతాదులలో ప్రయోగించుటమేలు. కొన్ని తత్వముల

వారికి చాలచిన్న మోతాదులుకూడ సరిపడవు. నోట నీరు కారుచు చిగుళ్లు వాచును. కీళ్లనొప్పులువచ్చును. మందు సరిపడకుండుటకు ఇడియోసింక్రొసీ (idiosyncrocy) అని పేరు. పెద్దవారికంటె పసిపిల్లలు పెద్దమోతాదులను భరించ గలరు. ఏలయన వారు త్రాగుచున్న చనుపాలు పాదరసపు టణువులను శరీరములోనుంచి త్వరగా తొలగించుచుండును.

---

## 4వ అధ్యాయము

## ఔషధ ప్రయోగ పద్ధతులు.

## Methods of administration of medicines.

ఆయుర్వేదశాస్త్ర ప్రకారము రోగికి ఔషధ చికిత్స నారంభించుటకు ముందు శరీరములో ప్రకోపించియున్న వాతాది దోషములను, మలములను, కొంతవరకు విడగొట్టి బహిష్కరించుటకుగాను పంచకర్మ లాచరించవలసియున్నది. పంచకర్మ లెవ్వియనగా:— (1) విరేచనము (Purging) (2) రక్తమోక్షణము (3) వమనక్రియ(inducing vomitting(4) వస్తిక్రియ (enemata) (5) నస్యక్రియ (snuffing medicines). వస్తికర్మ మూడు విధములుగా నున్నది (a)నిరూహ వస్తి (b) స్నేహికవస్తి లేక అనువాసనవస్తి (c) ఉత్తరవస్తి- అనగా పురుషులకు మూత్రమార్గములోని, స్త్రీలకు యోని మార్గములోకి మందు ద్రవ్యములను సాధనములతో నెక్కిం చుట, మిగిలిన రెండు వస్తిక్రియలు అనగా నిరూహ, అను

వాసన వస్తులను స్త్రీ పురుషులకు గుదమార్గములోకి ఎక్కించ వలెను. నస్యక్రియ కూడ రెండు రకములుగా నున్నది. (1) శిరోవిరేచనక్రియ (2) స్నేహన లేక బృంహణనస్యక్రియ. స్నేహనక్రియ బాహ్యాభ్యంతర భేదములచేతను రెండు విధములుగా నున్నది. స్వేదక్రియలు 13 రకములుగా నున్నవి. ఈపంచకర్మలు ప్రతిరోగికి చెయ్యవలసిన పనియుండదు. రోగావసరమునుబట్టి, రోగియొక్క అర్హతనుబట్టి కొన్నిటిని గాని అన్నిటినిగాని చెయ్యవలెను.

ఇక మందులను ప్రయోగించు పద్ధతులు సుమారు 14 రకములుగా నున్నవి. ఏరోగి కేది యవసరమో ఆపద్ధతిని మందును ప్రయోగించవలెను

I సామాన్య పరిస్థితులలో మందును అనుపాన సహితముగా తినిపించుట జరుగుచుండును (Oral method).

II ధూమపానక్రియ - ఉబ్బసరోగులు మందు దినుసుల పొగను పీల్చుట (Smoking medicinal stuffs).

III కవలగ్రహణము లేక గండూషధారణము (gargling).

IV అశ్చ్యోతనక్రియ (Eye instillations of medicinal drops).

V అంజనక్రియ లేక కలికము వేయుట (application of medicinal pastes to conjunctiva).

VI ప్రలేపము = application to the skin (annointing).

VII లేపనము = Smearing to the skin అనులేపనము.

VIII అభ్యంగ = baths of varions kinds.

IX రసాయన = Elixirs.

X దాహక్రియ = Cauterisation and branding.

XI శస్త్రక్రియ = operation (Surgery).

XII శలాక్యతంత్రము = Surgery of eye, ear, nase and throat)

XIII రక్తమోక్షణక్రియ (blood letting)

XIV ఇంజెక్షన్‌క్రియ (Injection method)

ఈపద్ధతులన్నియు నించుమించుగా మోడరన్ వైద్యములోకూడ చేయబడుచున్నవి. చివరి పద్ధతిని మోడరన్ వైద్యులను చూచి ఆయుర్వేదవైద్యులు నేడు ఆచరించుచున్నారు. ఆయుర్వేదీయ మూలికలలో నుండి తయారైన యింజక్షను మందు లిప్పుడు లభించుచున్నవి. కలికములు, నస్యములు, వస్తిక్రియలు, ఫలవర్తులు, అనులేపములు యింజక్షను తుల్యములనియే చెప్పవలెను. చర్మమును గ్రుచ్చి, కండలోకిని, రక్తనాళములోకిని సూది పిచికారితో మందు ద్రవ్యములను శరీరములోని కెక్కించుట అశాస్త్రీయమని కొందఱు ఆయుర్వేదపండితులువాదింతురు. *అసాధారణ పరి

సూ॥ *చర్మకషాయాః కల్కం బిల్వ సమం మూర్ధ్ని కాక పదస్య కృత్వా దద్యాత్కామి కటుకల్కల ప్రథమనంచ। ఘ్రాణం గవ్యం మాహిషం వా మాంసం కాక్కుటమేవ వా। దద్యాత్కాకి పదే తస్మిన్ తతః సంక్రమతే విషం.

(చరక. చికిత్సా 23 అధ్యా. శ్లో 66-67)

స్థితిలో అనగా రోగి స్పృహదప్పి మందును మ్రింగలేని పరిస్థితిలో మన పూర్వులు కాకపద పద్ధతిని నెత్తిమీద గంటుపెట్టి ఆ గాయములోకి అతి సూక్ష్మ మోతాదు మందును (సూదిమొన కంటుకొన్న ప్రమాణము) రుద్దుచుండిరి. దీనికి సూచీముఖ ప్రయోగమని పేరు.

చరకుడు విషయము యొక్క మత్తుచే శవమువలె నుండు మనుజునకు శిరస్సుపైన కాకియొక్క పాదమువంటి యాకారముగ గంటుపెట్టి దానిపై ఒకఫలప్రమాణము సంబరేణుకల్కము నుంచి కట్టుకట్టవలెను. లేక మేక, ఆవు, దున్నగొఱ్ఱె, కోడి, మొదలగువాని మాంసములను వేసి కట్టిన శరీరమందలి విషము పైన కట్టిన మాంసములోకి వ్యాపించును. మాల్కంగిని, త్రికటుకములు, కాయఫలము వీటిని నస్యము చేయించవలెను. *సుశ్రుతుడుగూడ నిదేవిధముగ చెప్పెను.

కాకపద పద్ధతిని సరాసరి రక్తములోనికి ప్రవేశింపదగిన మందులసంఖ్య ఆయుర్వేద గ్రంథములలో చాల తక్కువగానే కన్పించును. నారాయణాస్త్రము, బ్రహ్మాస్త్రము, పాశుపతాస్త్రము మొదలయినవి. వీనిని అవసాన దశలలోనే వాడుదురు. ఈమందులను ఆధునిక యంత్రసాధనములైన సూది పిచికారితో (hypodermic syringe) నెక్కించుట కేమి యభ్యంతర ముండును? ఇదే ప్రకారముగా నితర

*సూత్ర॥ తాను అప్రతిపచ్యమానాను మూర్ధ్ని శస్త్రేణ శస్త్రవిత్। కుర్యాత్ కాకపదాకారం వ్రణమే వంచశాస్త్రం విద్ సరక్తంచర్మమాంసం వానిక్షిపేత్ చాస్యమూర్ధ్ని- చర్మవృక్షు కషాయం వాకల్కంవా కుశలీ భిషక్॥ (సుశ్రుత-కల్పస్థానం. 5 అధ్యా 46—47)

ఆయుర్వేద మందులను, మూలికాస్వరసములను, క్షారసత్వ ములను శుద్ధజలములోనో (Distilled Water) రెక్టిఫయిడ్ స్పిరిట్ లోనో లేక ఈథర్ లోనో కలుపుకొని యింజక్షనులు చేయవచ్చునుగదా! అయితే ఈ మందులు బాధించకుండా కొంచెము మార్పులు చేసికోవలసి యుండును. 1930 సంllరం లోఝాన్సీ పట్టణ సుప్రసిద్ధవైద్యులు పండిత రాధా గోవింద మిశ్రగారు ఆయుర్వేద మందులను యింజెక్షనులుగా తయారు చేసి అనేక రోగులకు వాడి వాటిని ప్రచారములోకి తెచ్చినారు. ఆయుర్వేద వైద్యులు విదేశీ మందుల తత్త్వములను తెలియకుండ నింజెక్షనులు చేయుచుండుట క్షమింప దగినది కాదు. మోడరన్ వైద్యసాంప్రదాయమెఱిగి, ద్రవ్యతత్వ మును తెలిసికొని, రోగియొక్క క్షేమమే ప్రధానముగా వాటిని వాడినను వాడవచ్చును. కాని ఆ మందుల గుణము లను కార్యములను ఆయుర్వేదాను సారముగా — అనగా వాతాదులపైని వాటి ప్రభావముల గుర్తించి వాడుచుండుట మెచ్చదగిన విషయము. ఇందువలన నిజముగా నాయుర్వేద చికిత్సా శాస్త్రము ముందడుగు వేయుచున్న దనవచ్చును. మోడరన్ వైద్య దృష్టితోనే ఆ మందులను వాడుచుండిన ఆయుర్వేదశాస్త్రమునకు తిరోగతి యే పట్టును. క్రొత్త మందులను క్రొత్త పద్ధతులను ఆయుర్వేదీయములుగా నొనర్చుకొని వాడుట కెట్టి యభ్యంతరము లేదు. "శ్లో॥ తదేవ యుక్తం భైషజ్యం యదారోగ్యాయ కల్పతే।" అని చరకుని ఆదేశము.

మోడరన్ మెడిసిన్ లో పాదరస సంబంధములైన మందులు రెండు మూడు మాత్రమే గలవు. వీని నతిసూక్ష్మ

మోతాదులలో మాత్రమే యుపయోగింతురు. ఆయుర్వేద వైద్యు లుపయోగించుచున్న రసభస్మము, సావీరము, రస కర్పూరము, రసపర్పటి మొదలైన ప్రయోగములను చూచి మోడరన్ వైద్యులు (Allopathy Doctors) ఆశ్చర్యపడు చుందురు. ఆధునిక రసాయనవేత్తలు రసౌషధములను పృథక్కరణ మొనర్చి, వానికి రసాయనాది యద్భుత మహాత్త్యము లెట్లు కలుగుచున్నవో విమర్శించుటకు ప్రయత్నములు చేసి విఫలులైనారు. ఆయుర్వేద వైద్యులు సర్వలోహములను, పాషాణద్రవ్యములను శుద్ధిచేసిన పాదరసముతో సంపుటి చేసి పుటము పెట్టుచుందురు.* "లోహభస్మములు రస సహాయముతో తయారైనవి శ్రేష్ఠములనియు, యింకొక లోహముతో చేర్చి తయారు కాబడినది అధమమును, దుర్గుణ ప్రదమనియు, ఓషధుల సాయముతో తయారైన లోహభస్మములు మధ్యములనియు మనవారి యభిప్రాయము,"

ఇక రసమును మూలికలతో బంధించి భస్మమొనర్చి నప్పుడా భస్మమునకు ఆ మూలికా గుణము సంక్రమించు చున్నది. ఈ విషయమును ఆధునిక రసాయన శాస్త్రము కనిపెట్టజాలదు. కలకత్తాలో కేంబెల్ హాస్పిటలులో ప్రధాన వైద్యులుగా నుండిన డాక్టరు హేమచంద్రసేన్ ఎం. డి. గారి అనుభవము నిచ్చట తెలుప వలసి యున్నది. ఈ డాక్టరు గారు అల్లోపతి వైద్యులైనను ఆయుర్వేదశాస్త్ర మందెక్కువ

---

* శ్లో॥ లోహానాం మారణం శ్రేష్ఠం సర్వేషాం రసభస్మనా। మూలీభిర్మధ్యమం ప్రాహుః కనిష్ఠం గంధకాదిభిః। అరిలోహేన లోహస్య మారణం దుర్గుణప్రదం. (రసరత్న సముచ్చయం 5 అధ్యా.)

అభిమానముగలవారు. వైద్యులు తయారుచేసిన ఆయుర్వేద మందులను తఱచుగా తమ రోగుల కిచ్చుచుండిరి. ఒకసారి ఆయుర్వేద మిత్రుడు ప్రమంగకాయల రసముతో మర్ధించి పుట మొనర్చిన రసభస్మమునిచ్చి, సూదిమొన ప్రమాణము మనుష్యులకు తినిపించినచో వెంటనే విశేషముగా వాంతులౌ నర్చునని చెప్పెను. డాక్టరుగారు ఆసభస్మముయొక రసాయన సంయోగ వివరములను (Chemical Composition) తెలియగోరి ఆభస్మమును గవర్నమెంటు రసాయనశాలాధికారి అయిన హూపర్ (Govt. Chemical examiner) గారికి పరీక్ష నిమిత్త మిచ్చెను. ఆయన దానిని రెండు మూడు సారులు పరీక్షించి యీ భస్మము కేలోమిల్ (Mercury subchloride) అని ప్రత్యుత్తర మిచ్చెను. అందుపైని హేమచంద్రసేనుగారు కేలోమిల్‌ను సూక్ష్మ మోతాదులలో తినిపించినప్పుడు (fraction of a grain dose) వాంతులను కట్టించును గదా, యీ భస్మమును సూదిమొన ప్రమాణము తినిపించిన వెంటనే వాంతుల నెట్లు కలిగించు చున్నది? కనుక విశేషద్రవ్య మెద్దియో నిందులో కలిసియున్నది. ఆవిశేష ద్రవ్యమే వాంతుల గలిగించుచున్నది. కనుక దానిని మీ పరిశోధన శాలలో కనిపెట్ట గలరా! యని అడుగగా తాను రెండు మూడు సార్లు భస్మమును పృథక్కరణముచేసితిననియు, యీభస్మముయొక్క విశేషగుణమును కనిపెట్టుటకు రసాయన శాస్త్రములో సాధనము లేదనియు చెప్పెను.

అందుపైని హేమచంద్రసేనుగారు పాదరసముతో సమ్మిళిత మొనర్చిన ఓషధులయొక్క గుణములు భస్మమునకు

సంక్రమించగా నాయోషధి పుటములో కాలిపోవుచున్నదని సమాధానపడెను. మంగకాయరసముతో తయారైన భస్మమునకు మంగగుణము కలిగినది. ఆయుర్వేద మందుల యొక్క పృథక్కరణము ఆధునిక రాసాయన పద్ధతులచే చేయుట అసాధ్యమని డాక్టరు హూపర్‌గారు అభిప్రాయ పడినారు.

ఇక రసౌషధములలో షడ్గుణము, మకరధ్వజము, సిద్ధమకరధ్వజ, చంద్రోదయము, పూర్ణచంద్రోదయములు సుప్రసిద్ధములు. షడ్గుణములో పాదరసము 1 పాలు 6 పాళ్లు గంధకము కలిసినవి. మిగిలినవాటిలో రసము, గంధకము వివిధపాళ్ళలో కలిగి బంగారముకూడ చేర్చబడి వంటగావింప బడును. పాళ్ల భేదముచేతను వానిగుణములు వేర్వేరుగా నుండును. ముందుగా శుద్ధిచేసిన పాదరసమును శుద్ధిచేసిన బంగారు రజనుతో శాస్త్రములో చెప్పినప్రకారము చేర్చి మర్దించి పిమ్మట గంధకముచేర్చి మర్దించి యాముద్దను గాజుకుప్పెలోనుంచి వాలుకాయంత్రమున మంట మధ్యమ, తీక్షాగ్నులతో వంటచేయవలెను. పాకానంతరమున గంధక మంతయు కాలిపోవును. రసము సింధూరించును. బంగారము కుప్పెయడుగున నిలిచిపోవును. ఆయుర్వేదవైద్యు లందఱును వేరుగా విడిపోయిన బంగారమును మందుతో కలిపినూరి కుప్పెలు చేయుదురు. ఢక్కా సాధనౌషధాలయము వారు మాత్రము కుప్పెయడుగున మిగిలిపోయిన బంగారమును తీసి వేసి మిగతామందునే మకరధ్వజమను పేరుతో నందజే కంటెను చాల చౌకగా తులము 1కి రు 8 లకే యమ్ము

చున్నారు. జర్మనీవారు మకరధ్వజము తులము రెండు రూపాయల కిచ్చుచున్నారు. ఆధునికుల తయారీ పద్ధతి అశాస్త్రీయమని ఆయుర్వేద వైద్యులు చెప్పుచున్నారు. సాధనౌషధాలయాధ్యక్షులు డాక్టరు మధురబాబుగారు ఆధునిక రాసాయన శాస్త్రపండితుడు (Professor of chemistry). ఈతని వాదమేమనగా మనదేహములో బంగారపుటణువులు చేరుకొనుటకు తావులేదు కనుక; బంగారమును తినిపించినను అది ధాత్వణువులలో నైక్యము కాదు. తిరిగి మలమూత్రములతో బయటికిపోవుచున్నది. కనుక బంగారమును మందులతో కలిపి యిచ్చుట అనవసరము అని అధ్యక్ష మధురబాబుగారి వాదన. బంగారము లేకుండ తినిపించిన మందునకును బంగార సహితముగా నిచ్చిన మందులకును గుణభేదము అనుభవములో కన్పించుచున్నదని ఆయుర్వేదపండితులవాదము. ఆధునిక శాస్త్రవేత్తలు చెప్పినయొక యుక్తి చేతను మకరధ్వజములో బంగారము కలియుటవసరమని తెలియుచున్నది. అదేమనగా రాసాయనశాస్త్రవేత్తల యనుభవములలో రెండు ద్రవ్యములు రాసాయన మిశ్రమద్రవ్యముగా (chemical compound) నేర్పడుటకు మధ్యవర్తిగానుండి రెండు ద్రవ్యములను కలుపుటకుగాను వేరొకద్రవ్యము కొన్ని సందర్భములలో నవసరమగుచున్నదని చెప్పుచున్నారు. ఈమధ్యవర్తి ద్రవ్యమునకు కేటాలిటిక్ ఏజంటు అని పేరు. మరియు మోడరన్ ఫార్మశిస్టులు బంగారము ప్రేగులలో పుట్టి ఔషధమును రక్తములోకి చేరకుండా బహిష్కరించుచున్న విషపదార్థములను (auto-toxins) అరికట్టుచున్నదనియు, ఆ విషద్రవ్యములను నిర్విషములుగా మార్చుచున్నదనియు చెప్పుచున్నారు.

(intestinal atiseptic arresting the auto-toxin and facilitating absorption of medicines. Gold prevents the growth of putrifying organisms in the intestines). ఈవిషయములనుబట్టి విచారించగా మకరధ్వజమును తయారుచేయుటకు కెటోలిటిక్ ఏజంటుగానున్న, ప్రేగులలో పుట్టుచున్న విషపదార్థములను నిర్విషములుగా మార్చుటకును బంగారము విధిగా మకరధ్వజయోగములో కలిసియుండవలెనని తెలియుచున్నది.

లోహభస్మములను తయారు చేయుట:- మోడరన్ వైద్యములో లోహాది ధాతువులను, ఉపధాతువులను కొన్ని ఏసిడ్సుతో కలిపి లవణములుగా తయారుచేయుదురు. ఆక్సిడేషన్ పద్ధతిని భస్మములు తయారగుచున్నవి. ఆయుర్వేదములో లోహాది ధాతూప ధాతువులను శుద్ధమొనర్చుటకు భావన సంస్కారములు చెప్పబడినవి. పిమ్మట మూలికారసములతో మర్దన సంస్కారము చేసి పుటములుబెట్టి భస్మములు చేయుదురు. భావనసంస్కార క్రియకు మూలికాస్వరసములు, కషాయములు, నిర్యాసముల, జంతువుల, పిత్తరసములు, పాలు, మూత్రములు, మనుష్యుల చనుబాలు వాడుచుందురు. ఈశుద్ధి సంస్కారములవలన లోహాదులందలి నైజదోషములు దొలగును. ఓషధీభాగములతో కలిపి మర్దనలు చేయుటవలన మందునకు రోగహరశక్తి వృద్ధియగును. పుటము బెట్టినప్పుడు ఓషధీద్రవ్యము కాలిపోయినను అందలి రోగహరశక్తి భస్మమునకు సంక్రమించుచున్నది గాన ఎక్కువ గుణవంతములగుచున్నవి. పుటములద్వారా లోహాదులకు కాఠిన్యము తగ్గి, అణువులు విస్తరించి గురుత్వము నశించును. ఈపద్ధతిగా

తయారైన లోహాదుల భస్మములయొక్క ప్రశస్తతను నిరూపించుటకు వారితరము రేఖాపూర్ణము, నిశ్చంద్రికము లనెడు పరీక్షలు నిర్మించబడినవి. భస్మముయొక్క రంగుకూడ చాల ప్రధానము. అధికోష్ణమువలన మందు మాడిపోయి బొగ్గగును. తక్కువ యుష్ణమునకు సరిగా పక్వముకాదు. ఇట్టి మందులు నిర్వీర్యములై పనిజేయవు. పుటభేదములు వాటి కాలము, వంటౌషధములకు కావలసిన, తీక్ష్ణ, మధ్యమ, మందాగ్నులను శాస్త్రము బోధించును. ఈమందులను తయారు చేయుటకు విశేషానుభవము కావలెను.

నేటి యంత్రయుగములో కొందఱు ఫార్మశీదారులు భారీఎత్తున యంత్రముల సాయముతో చూర్ణములు, టేబ్లెట్లు తయారుచేయుచున్నారు. మర్ధనలు చేయుటకు స్వల్పకాలములో తక్కువశ్రమతో యంత్రముల నుపయోగించుచున్నారు. మందులవంట ఎలెక్ట్రిక్ ఫర్నెస్సుల (Electric furnace) పై జేయుచున్నారు. ఈ నవీన పద్ధతుల నాయుర్వేద మందుల దయారుచేయుట అశాస్త్రీయములని కొందఱు తలంచుచున్నారు. కొన్ని మందుల మర్ధనలు వివిధ కషాయములతో ఒకదాని తర్వాత నొకటి చేర్చుచు కొన్ని మాసములకు తయారుచేయవలసి యుండును. నెమ్మదిగా ఖల్వములో మర్ధనక్రియ సాగవలెనుగాని వడివడిగా యంత్రసాయమున మర్ధనలు సలిపిన మందులు గుణవంతములు కావని చాలమంది యభిప్రాయము.

## మోడరన్ వైద్యములో ఔషధకల్పనము.

మోడరన్ మెడిసిన్‌లో నౌషధకల్పనము లించు

మించుగా నాయుర్వేదములోవలె కన్పించును. మూలికలతో తయారుకావలసిన ద్రవములను ఆల్కహాల్‌తో (రెక్టిఫైడ్ స్పిరిత్‌తో) టింక్చర్లుగాను, ఎక్‌స్ట్రాక్టులు, స్పిరిట్లుగాను తయారు చేయుదురు. ఆల్కహాలు మూలికాసారములను గుంజుకొని లీనము చేసికొనును. మూలికలలో చాల వరకు మన దేశమునుండియే గొనిపోవుచుందురు. ఆల్కహాల్ ద్రవ్యము యొక్క వీర్యము చెడిపోకుండ నెంతకాలమైన నిలవయుంచును. ఆల్కహాల్‌నకు అశు, వ్యవాయి, వికాసిగుణములు గలదగుట వలన మందును శీఘ్రగతిని శరీరములోకి ప్రవేశపెట్టును. మరియు మోడరన్ వైద్యములో నింకొక విశేషమున్నది. అదేమన — మూలికలందలి ప్రధాన సత్వములను విడదీసి వాటిని నోటిద్వారా యింజెక్షను పద్ధతిని ప్రయోగించుట. ఈప్రధాన సత్వద్రవ్యములకు ఆల్కలోయిడ్సు (alkaloids) అని పేరు. ఇవి నిలవయుండుటకును, నీళ్ళలో కరుగుటకును యేదేని యొక ఏసిడ్‌తో కలిపి ఆల్కలాయిడల్‌సాల్ట్సుగా (alkaloidal salts) మార్చుదురు. ఈసత్వామ్ల లవణములను నీటిలో కరగించుకొని యింజెక్షను చేయుదురు. క్షార సత్వములను కొన్ని ఓషధులలోనుంచి తయారుచేసి వ్రణ చికిత్సల కుపయోగించమని సుశ్రుతుడు చెప్పెను. ప్రత్యేక సత్వలవణము లతిచురుకు, తీక్ష్ణగుణము గలవగుటచే వీని మోతాదు లతి సూక్ష్మములుగా నుండును. ఎట్రోపిన్, హాయోసిన్, స్ట్రిచ్‌నైన మొదలైన సత్వలవణములు $\frac{1}{200}$ మొదలు $\frac{1}{100}$ గ్రైను మోతాదులలో నిచ్చుచుందురు. ఓషధిలోని సత్వపదార్థము లితర ద్రవ్యములతో కలిసియున్నందున ఓషధినంతయు ప్రయోగించిన సౌమ్యముగా కార్యము జరుగు

నని మనవారు ప్రత్యేకసత్త్వములను వాడలేదు. ఓషధులతో తయారైన మందులోని సత్త్వద్రవ్య పరిమితిని నిరపాయకరముగా పరిమితమొనర్చుటకు స్టేండర్డైజేషన్ (Standardisation of the drug) అందురు. వైద్యనిపుణులు నిర్ణయించిన స్టేండర్డు ప్రకారము దేశములోని వైద్యులు ఫార్మసీదారులు మందులను తయారుచేయవలసి యుండునని ఆదేశించెదరు. స్టేండర్డైజు చేసిన మందులు ప్రధానసత్త్వద్రవ్యములు నియమిత పరిమితులను గలిగియున్నందున ఆమందులను నిరపాయకరముగా గరిష్ట ప్రమాణములలో నుపయోగించ వీలగును. ఆయుర్వేదమందులలోని రస, గంధక, పాషాణాదులు, ఓషధీసత్వ ద్రవ్యములయొక్క పరిమితులు ప్రతి మోతాదులో నెంతెంత యున్నవో తెలియనందున మోడరన్ మెడికల్ ప్రేక్టీషనర్సు యీమందులను వాడుటకు వెనుదీయుచుందురు. ఆధునిక రాసాయనశాస్త్ర మర్యాదననుసరించి తీక్ష్ణఓషధులందలి ప్రధాన సత్త్వద్రవ్యప్రయోగములను గుర్తించి, దాని నిరపాయ గరిష్ట మోతాదులనెఱిగి, యిట్టి ఓషధులతో తయారైన ఆయుర్వేదమందుల కనిష్ఠ, గరిష్ఠ ప్రమాణములను నిశ్చయించుట చాల మంచిపద్ధతి. అప్పుడు నిస్సందేహముగా సర్వులు మందుల వాడుచుందురు. ఈవిధమయిన పరిశోధనలే నేడు ఆయుర్వేదాభివృద్ధి కవసరములగును. ఈ పరిశోధనలు చేయుట ఆయుర్వేద వైద్యులకు సాధ్యముకాదు. రసాయనశాస్త్రము (chemistry) వృక్షశాస్త్రము(Botony) ఔషధ నిర్మాతలు (Pharmacist) పూనుకోవలసియుండును. జాతీయప్రభుత్వము యిట్టి రిసెర్చి యిన్‌స్టిట్యూట్ స్థాపించి

ప్రోత్సహించదగును. ఇదియే ఆయుర్వేదమునకు పురోభివృద్ధి (Progress), పునర్నిర్మాణము (reorganisation) కాగలదు.

---

## VI భాగము

## ఆయుర్వేద చికిత్సలు

## Fundamentals of Ayurvedic Treatment.

### 1 అధ్యాయం—హేతువు ననుసరించి రోగ విభజనము

ఆయుర్వేదములో చికిత్సలు రెండువిధములని చెప్పిరి:—

1. స్వాస్థ్యోర్జస్కర చికిత్సలు:-అనగా ఆరోగ్యముగా నున్న వారికి ఊర్జశక్తిని వృద్ధిచేసి రోగములను రాకుండా ప్రతిఘటించుచు, నారోగ్యము, బలము, వర్చస్సులను ప్రసాదించి ముదిమి రాకుండా దీర్ఘజీవితము కొఱకు చేసెడు రసాయన చికిత్సలు, కుటీ ప్రవేశము.

2. వ్యాధి హరణము లేక శమనకారి చికిత్సలు (ఔషధాన్న విహారములు)

చికిత్సా సాధనములు వ్యాధి హేతువుల ననుసరించి పలువిధములుగా నుండును. ఆయుర్వేద తంత్రకర్తలు హేతువుల ననుసరించి రోగముల నీ క్రింది విధముగా విభజించిరి.

1. నిజరోగములు:- మిథ్యాహార విహారాదుల ద్వారా ప్రకోపించిన వాతాదులు శరీరధాతువుల జెఱచి పుట్టించిన రోగములు.

2. అగంతుక వ్యాధులు:- అనగా బయటనుండి శరీరములో ప్రవేశించిన కొన్ని హేతువుల వలన జనించిన శారీరకములును, మానసికములునగు వ్యాధులు కలుగు చున్నవి. వీనికి అభిషంగ లేక సంసర్గజ వ్యాధులని పేరు. అభిషంగ హేతువు లయిదు రకములు.

(1) భూతాభిషంగము (demonical iufluences) (2) శాపాభిషంగము (curses) (3) శోక, భయ, క్రోధ, మోహా దులు (mental emotions) (4) క్రిమి సంసర్గజవ్యాధులు (infectious diseases) (5) విషాభిషంగము (toxins or Poisons of vegetable and animal origin introduced in to the body by eating or through bites of wild animals or creatures such as scorpion and snake bites).

3. భౌతిక హేతువులు =(wind, sun, rain, fire, water, thunderbolt, electricity, and seasonal variations)

4. కాల హేతువులు = (age) వయస్సు నిమిత్త ముగా పిల్లల వ్యాధులు, యువకుల వ్యాధులు, ముసలితన ములో సంభవించు రోగములు స్త్రీలకు ప్రత్యేక వ్యాధులు. ఆయాకాలములలో సంభవించును.

5. పైతృక హేతువులు=(Hereditory influence) కొన్ని వ్యాధులు వంశపరంపరగా సంతానమునకు లభించును. కీళ్ల వాతము (Rheumatism) మధుమేహ రోగము (Diabetis) కుష్టు (leprosy) బొల్లి (leucoderma)

సవాయి (Syphilis) మూలవ్యాధి (Piles) మొదలైనవి వంశపరంపరా లభించును. పితరులకుండిన వ్యాధులు సంతానమునకు పుట్టగానే కన్పించకపోయినను, ఆ వ్యాధి యంశలు శుక్ర శోణితములతో గర్భములో ప్రవేశించి తమ కనుకూల పరిస్థితు లేర్పడి నప్పుడు బయల్పడును. వ్యాధియంశలు అణగి యుండిన దేహప్రకృతికి డయాథిసిస్ (diathesis) అని పేరు. ఇట్టి రోగ ప్రకృతి శరీరులకు అల్ప హేతువులు రోగోత్పాదకములుగా నుండగలవు.

6. కర్మజవ్యాధులు=పూర్వజన్మలలో చేసిన పాప కర్మలు యీ జన్మలో వ్యాధిరూపములుగా బాధించును. కర్మసిద్ధాంతమును త్రిదోష సిద్ధాంతమును తక్క మిగిలిన హేతువులను పాశ్చాత్య వైద్యశాస్త్రములో నిదేవిధముగా నంగీకరించినారు.

ఆయుర్వేదములో వ్యాధులన్నింటిని ఆశ్రయభేదము చేతను ద్వివిధముగా భాగించి చెప్పిరి. (1) శారీరిక వ్యాధులు (Bodily afflictions) (2) (Mental disorders) మానసిక రోగములు. శారీరిక వ్యాధులకు ప్రధాన హేతువులు ప్రకోపించిన వాత, పిత్త, కఫములు. రజస్తమో గుణములు మానసిక రోగములకు హేతువులు. మిథ్యాహార విహారము లీ రెండు రకములను వృద్ధిచేసి ప్రకోపింప జేయును. మనశ్శరీరముల కవినాభావ సంబంధము కలదు. కాన మానసిక క్షోభల వలన శరీరములో వికారములు కలుగుచుండును. శరీరము వ్యాధిచే తను పీడింపబడుచుండిన మనస్సునకు స్తిమితముండ నేరదు. దృఢతర మనస్కులకు శరీరములో నెంతటి

బాధయున్నను మనస్సు నిర్మలముగా నుండుటయును, పిచ్చి వారు శరీరపోషణము సరిగా నుండిన బలముగలవారుగా నుండుటను చూడవచ్చును.

ఆయుర్వేద తంత్ర కర్తలు పైన చెప్పిన హేతువుల ననుసరించి రోగులకు చేయవలసిన చికిత్సలు త్రి విధములని చెప్పిరి.

1. యుక్తి వ్యపాశ్రయ చికిత్సలు= (medicinal treatment, proper diet and nursing).

2. దైవవ్యపాశ్రయ చికిత్సలు=జప, తప, దాన ములు మొదలైనవి.

3. సత్వావజయము = (psychical treatment).

ఈ త్రి విధ చికిత్సలను ప్రతి రోగమునకు జేయ వచ్చును. ఒక దానికొకటి తోడ్పడి సత్వర ఫలసిద్ధి కలుగును.

1. మానసిక రోగములకు సత్వావజయ చికిత్సలు;- సత్వము=మనస్సును, అవజయము=వశపరచు కొనుట. అనగా రోగి యొక్క దుర్బల మనస్సును వైద్యుడు తన మనశ్శక్తి చేతను వశపరచుకొని, తన శక్తినందు ప్రవేశపెట్టి పుష్టివంతముగా నొనర్చుట. ఇందువలన వ్యాధి నయమై మనస్స్వస్థత చేకూర్చును.

మోడరన్ మెడిసన్‌లో కూడ నీవిధముగు చికిత్స నాచరించుచున్నారు. నూరు సంవత్సరములనుండి మానసిక శక్తులను, దాని స్వస్థవ్యాపారములను గ్రహించుచున్నారు.

మానసిక తత్త్వశాస్త్రమునకు సైకోలజీ (psychology) అని పేరు. వైద్యుడు తన మనశ్శక్తుల నుపయోగించి మానసిక వికారముల నయముచేయుటకు సైకోథెరపీ (psycho-therapy) అందురు. ఈ చికిత్సా విధానములు రెండు విధములుగా నున్నవి:—

(1) రోగిని మోహపరవశునిగా జేసి తనయధీనములో నుంచుకొనుట. దీనికి మెస్మరిజమ్(Mesmerism or hypnotism)అని పేరు.

(2) రోగికి తన రోగవిషయమైన యజ్ఞానమును బోధలుద్వారా తొలగించి మనోదార్ఢ్యమును కలిగించుట (Education of the patient to strengthen his mind) ఇందుకు రెండు ఉపాయము లున్నవి.

(a) Assure the patient that the disease will not harm him. వ్యాధిగ్రస్థుడనను తలంపు పెట్టుకోవద్దని చెప్పుట. ఇందున కాతని మనస్సన్యథా ప్రవర్తించు నటుల జేయుట. వ్యాధికి భయపడనవసరము లేదని, త్వరగా నయమగునని వైద్యుడు నమ్మకము కల్గించుట.

(b) Auto - suggestion — వ్యాధివిషయమై యాలోచన వద్దని చెప్పుట. వ్యాధియే కాదని నమ్మించుట.

II దైవవ్యపాశ్రయ చికిత్సలు:- పూర్వము యూరోపు దేశములో మతగురువులు (Bishops) యీ విధమయిన చికిత్సలు చేయుచుండిరి. దీనికి క్రిస్టియన్ హీలింగు (christian healing) అనియు, విశ్వాస చికిత్స (faith cure) అనియు నందురు. రోగి కారోగ్య మివ్వించమని దైవప్రార్థనలు చేయు

దురు. భక్తితోకూడిన ప్రార్థనలకు సాధ్యము కానిది లేదు. ఆయుర్వేదములో భక్తి, జ్ఞానము, వైరాగ్యము దేవతాప్రీతి, కోరికు జపములు, తపస్సు, దానము లిచ్చుట, భూతదయ, పరోపకారశీలనము కలిగియుండుట, సాధనములుగా చెప్ప బడెను. ఈ చివరి గుణములను వృద్ధిచేసుకొనుటకు *చరక సంహితలో రోగియొక్క జీవనపద్ధతి ప్రవర్తనా విషయములు చక్కగా బోధించ బడినవి. "సదాహార విహారముల నభ్యాస ముగా గలవారును, సుఖదుఃఖములను సమబుద్ధితో ననుభ వించు వారును, ప్రాపంచిక విషయములను మనస్సున కంతగా పట్టించుకొనకుండు వారును, దానశీలురును, మన స్సును నిర్మలముగాకొంచుకొను వారును, ఓరిమిగల వారును ఆపదలో నున్నవారికి సేవజేయుచుండు వారును, ఎల్లప్పు డారోగ్యముగా నుందురు." ఈ సద్వర్తనములు మనుష్యునకు బ్రహ్మానందము నిచ్చును. ఇక ప్రారబ్ధ కర్మల ఫలితముగా వచ్చిన రోగముల నయము గావించుటకు ఆకర్మనాశకరము లైన భక్తిజ్ఞాన వైరాగ్యములతోకూడిన జపతప, దాన హోమాదులు తోడ్పడును.

III యుక్తివ్యపాశ్రయ చికిత్సలు : (Treatment of diseases through the application of logieal reasoning) యుక్తి అనగా తర్కించుట. తర్కశాస్త్రము నను సరించి ఆయుర్వేద చికిత్సలు నిర్మింపబడినవి. బుద్ధి వితరణ శక్తిచేతనే రోగోత్పాదక వివిధ హేతువులను ప్రబల హేతు

*శ్లో॥ నిత్యం హితాహార విహారసేవీ. సమీక్ష్యకారీ, విషయేష్వసక్తః
దాతా సమస్సత్యపరః క్షమావాన్, ఆప్తోపసేవీచ భవత్యరోగః॥
(చరక సంహిత)

వును నిశ్చయించి దానికి విరుద్ధహేతువులను ప్రయోగించు టయే యుక్తివ్యపాశ్రయ చికిత్స యందురు.

1. వైశేషిక దర్శనములలో సృష్టిహేతుక మూల ద్రవ్యములు ఆరుమాత్రమనియే చెప్పిరి. అవేననగా (1) ద్రవ్యము, (2) గుణము, (3) కర్మ, (4) సామాన్యము. (5) విశేషము, (6) సమవాయము. వీనికి వరుసగా నింగ్లీషున Substance, quality, action, genus, species, inhension or inseparability, respectively అందురు. చరకసంహిత సూత్రస్థానం 28 అధ్యాయములో శ్లో॥ సామాన్యంచ విశేషంచ గుణాన్ ద్రవ్యాణి కర్మచ, సమవాయంచ తత్ జ్ఞాత్వా తంత్రోక్తం విధిమాస్థితాః॥ అని చెప్పబడినది. ఇచ్చట వైశేషిక దర్శనములో చెప్పిన వరుసనుగాక ఆయుర్వేద తంత్రకర్తలు సామాన్య విశేషములను ముందుగా పేర్కొనినారు. ద్రవ్యగుణములయొక్క వృద్ధి హ్రాసముల కివియే కారణములుగా నున్నవి. గనుక నాయుర్వేదచికిత్సలో కార్యములీ సూత్రము ననుసరించి జరుగుచున్నందున ముందుగా సామాన్యవిశేష హేతువులను చెప్పిరి. పిమ్మట ద్రవ్యజ్ఞాన హేతుకమైన గుణమును, గుణముల కాశ్రయస్థానములైన ద్రవ్యమును, అటుపిమ్మట ద్రవ్యకార్యమును (కర్మ), చివరను పై అయిదింటికి పరస్పర సంబంధమును కలిగించుచున్న సమవాయకారణమును చెప్పిరి. రోగస్థితిలో వృద్ధిక్షయములొందిన శారీరక ద్రవ్యములకు వివిధోపాయముల ద్వారా క్రమముగా హ్రాసవృద్ధులు కలిగించుట ఆయుర్వేద చికిత్సయందలి ప్రధాన సూత్రము. (1) ద్రవ్యముయొక్క వృద్ధిహ్రాసములు సామాన్య విశేషముల కార్యజ్ఞానముపై

సాధారపడి యున్నది. ఎట్లనః "సామాన్యమేకత్వ కరమ్" (చ. సూ. 1అ. 44సూ) అనెడు వాక్యము ననుసరించి అనే కము లందేకత్వబుద్ధిని కలిగించునది సామాన్యమనబడును. ఇదేభావము 'తుల్యార్థ తాహి సామాన్యం' అను వాక్య ముచే గ్రహింపబడినది. మరియు 'సర్వదా సర్వభావానాం సామాన్యం వృద్ధికారణం' అని (చరక సూ. 1అ. 43సూ) చెప్పిన తంత్రయుక్తి ననుసరించి మన శరీరములో దోష ధాతు మలములయొక్క వృద్ధికార్యము జరుగుచున్నది. దీనిని పురస్కరించుకొని బృంహణ చికిత్సావిధాన మేర్పడినది. (Genus basing on similarity)

2. విశేషము: (Dissimilarity). విశిష్టతా జ్ఞాన మును కలిగించునది విశేషమనబడును. "విశేషస్తు పృథక్త్వ కృత్" అని (చ. సూ, 1అ. 44సూ) ప్రమాణము. ఇంకను 'విశేషస్తు విపర్యయః' అనియును, 'హ్రాసహేతుః విశేషస్తు' అనియును విశేషలక్షణము నిరూపించబడినది. అనగా భావ పదార్థము లన్నింటికిని ఎల్లప్పుడు విశేషము హ్రాసహేతువుగా నున్నది. హ్రాసమనగా తఱుగుదల, క్షయము. ద్రవ్యగుణ కర్మలు విశేషవత్తులగు ద్రవ్యగుణ కర్మలతో చేరినప్పుడవి తఱిగిపోవును. విశేషమున కేర్పడిన యీ హ్రాసహేతువు ననుసరించి ఆయుర్వేద తంత్రకర్తలు దోషధాతుమలముల క్షయమును కలిగించు క్రియలతో గూడిన లంఘన చికిత్సా విధానమును నిర్మించిరి.

ఈవిధముగా ద్రవ్య గుణ కర్మల సామాన్యవిశేష ములు ద్రవ్యవృద్ధి హ్రాసములకు హేతువులుగ నున్నందున

మన శరీరమందలి వాత, పిత్త, కఫములు, రస, రక్తాదిసప్త ధాతువులు, మలములు ద్రవ్యములగుటంజేసి సృష్టిలో కనిపించుచున్న చేతనాచేతన ద్రవ్యములన్నియు భేషజార్హములే యని మనవారు చెప్పిరి. వీనిని నేర్పుగా నుపయోగించుట ద్వారా రోగి శరీరములో వృద్ధిచెందిన వాతాదిధాతువులను, లంఘనలేక కార్శ్యచికిత్సలచేతను తగ్గించుటయును, అవి హ్రాస్వమొందినప్పుడు వాటిని బృంహన చికిత్సలచేత వృద్ధిపరచి సమస్థితిలోనికి చేకూర్చవచ్చును. సృష్టిలో చేతనాచేతన ద్రవ్యములన్నియు పాంచభౌతిక పదార్థములగుటవలన పాంచభౌతికద్రవ్యములైన వాతాదిధాతువులకు వృద్ధిహ్రాసలు కలిగించగలవు. ఈపదార్థములలో కొన్ని భోజ్యాయుక్తములై ఆహారయోగ్యములుగా నున్నవి. ఇవి శరీరధాతువులను పోషించును. లోహాదులు, ఓషధులు షడ్రసముల కాశ్రయస్థానములుగా నున్నవి. ఇవి హితముగా భుజించదగినవికావు. *షడ్రసములుకూడ పంచభూత నిర్మితములగుటంజేసిరోగావసరమును బట్టి యేరసప్రధానమయిన మందుల నిత్తుమో ఆరసమందలి భూతాంశలతో సమాన భూతాంశలను గలిగిన వాతాది దోషములు వృద్ధియగుచుండును,

దోషధాతు వైషమ్యమే రోగమనియును, వీనిసామ్యమే ఆరోగ్యమనియు సంగ్రహాముగా నిర్వచింపబడినవి. కనుక రోగస్థితిలో రోగహేతుకములైన వాతాదులు వృద్ధిచెందినప్పుడు వానిని క్షీణింపజేయు కార్శ్యోపాయములను హేతు

---

* రస దోష సన్నిపాతేతు యే రసా యైర్దోషైః సమాన గుణాః సమానగుణ భూయిష్ఠావా, తేతానభి వర్ధయంతి.

(చరక విమానస్థానం 1 అధ్యాయం 7 సూత్రం.)

విపరీత చికిత్సయందుము. ఇట్లే క్షీణించియున్న దోషములను తిరిగి బృంహణచికిత్స ద్వారా వృద్ధిబరచుటయును హేతు విపరీతచికిత్సయే యగును. ఈవిపరీత చికిత్సాపద్ధతులు (Law of contraries) అదివరకుండిన పరిస్థితికి వ్యతిరిక్త పరిస్థితిని కల్పించి సమత్వమును సాధించుట అనెడు యుక్తి ననుసరించును.

ఆయుర్వేదములోను, మోడరన్ వైద్యము (అల్లోపతి వైద్యం) లోను చేయబడుచున్న చికిత్సలన్నియు చాలవరకు యీ విపరీత చికిత్సాపద్ధతినే యనుసరించును. అసాధారణ ముగా కొన్ని సందర్భములలో నీ విపరీతఫలములను తుల్యగుణ ద్రవ్యప్రయోగముల వల్లనున్ను, తుల్యహేతువుల నుపయో గించుటద్వారాయున్నూకూడ సాధించవచ్చును. ఈతుల్యార్థ కారి ద్రవ్యములు (Law of similars) విపరీతార్థకారులగు చున్నవి. హోమియోపతివైద్యము (Homeopathy) తుల్య గుణద్రవ్య, తుల్యహేతు ప్రయోగములనే వృద్ధిచేసినది. దీనిని సారూప్యౌషధ చికిత్సాశాస్త్రమనికూడ నందురు. ఆయు ర్వేదమున నీరెండువిధములైన చికిత్సలు ఒక్కొక్కటి మూడేసి రకములుగా నున్నవి :-

3 రకముల విపరీతచికిత్సలు:
1 హేతువిపరీతచికిత్స.
2 వ్యాధివిపరీతచికిత్స.
3 హేతువ్యాధి విపరీతచికిత్స

3 విపరీతార్థకారి చికిత్సలు:
4 హేతువిపరీతార్థకారిచికిత్స
5 వ్యాధివిపరీతార్థకారిచికిత్స
6 హేతువ్యాధివిపరీతార్థకారి చికిత్స.

ఈపైన చెప్పిన ఆరురకముల చికిత్సలలో ప్రతిది తిరిగి మూడేసి విధములుగా నుండును. (1) ఔషధ సేవనము (medicinal treatment) (2) ఆహారము (Diet) (3) విహారము, ఉపచారము (nursing).

రోగి, వైద్యుడు, ఔషధము, ఉపచారకుడు, యీ నాలుగును భేషజమునకు పాదచతుష్టయ మందురు.

# 2వ అధ్యాయము

## రోగచికిత్సలు

## (Principles and methods of treatment)

చికిత్సాకౌశల్యము యుక్తిపై నాధారపడినది. 'నదోషైర్వినారోగాః' అనుటవల్ల వాతాదిదోషములు వికారము చెంది రసరక్తాది ధాతువులను చెఱచినప్పుడు వ్యాధికలుగుచున్నది. సౌమ్యముగా దేహయంత్రపాలనము జేయుచున్న వాత, పిత్త కఫములుకొన్ని బాహ్యాభ్యంతర కారణముల వల్ల దూషింపబడుచున్నవి. ఈ భాహ్యాభ్యంతర కారణములన్నిటిని శాస్త్రకారులు 'మిథ్యాహార విహారములను' పదములో నిమిడ్చినారు. పాశ్చాత్యులు వివరించిన వివిధరోగ హేతువులను పరికించినప్పుడు యివన్నియును మిథ్యాహార విహారములలో చేరగలవు. సూక్ష్మక్రిములుగూడ నిందులో చేరును. గనుక రోగచికిత్సకు బూనుటకుముందుగా మిథ్యాహార విహారములను తొలగించి దీనికిబదులుగా హితాహార విహారముల ప్రవేశపెట్టిరి. ప్రిమ్మట రోగోపశమనమునకై ఔషధము నియ్యవలెను. హితాహార సేవనకు (Proper diet) అనియును, హితవిహారమునకు (Regulation of environments, habits and nursing congenial towards health) అనియు నందుము. రోగప్రధాన హేతువులుగా ప్రకోపించిన వాతాదులున్నవి గనుక నివి ప్రకోపించకుండ సక్రమాహార విహారములను ముందుగా ఆయుర్వేదములో స్వస్థవృత్త ప్రకరణమున బోధించిరి. ఇందులో నే ఋతువులలోనే రసప్రధానమైన

ఆహారపదార్థముల తీసికొనవలెనో, వ్యాయామము, పరిశ్రాంతు లెంతవరకు అవసరమో వివరింపబడినవి. జనపద సాంక్రామిక వ్యాధులు (Severe epidemic diseases) విజృంభించి నప్పుడు వ్యాధి క్రిములనెదిరించుటకు, క్రిమి నాశన ప్రయత్నములకంటెను, మన శరీరశక్తులను (ఊర్జశక్తి) (vitality, disease resisting power or immunity) వృద్ధిచేసికొనుటకు మనవారు రసాయనౌషధ సేవనము, యోగవ్యాయామ పద్ధతులు, శౌచ, నియమబద్ధ జీవితమును బోధించిరి. వీని ద్వారా స్వాస్థ్యరక్షణము చేసికొనవచ్చును.

ఇక రోగచికిత్సల నాచరించుటకు ఆయుర్వేదశాస్త్రము ప్రకోపించిన త్రిదోషములకు ప్రాధాన్యమిచ్చినది. శరీరము పాంచభౌతికము. శరీరమందలి పంచభూతాంశలు వృద్ధిక్షయము లందినప్పుడు రోగములు కలుగుచున్నవిగదా యీ పంచభూత జ్ఞానమువల్ల నేల చికిత్సచేయరాదు? త్రిదోషములేల కల్పితమయినవనిన :- సౌకర్యముకొఱకేఅని చెప్పవచ్చును. ఆహార సంబంధమయిన పంచభూతాంశలే మనశరీరములో వాత, పిత్త, కఫములుగా నేర్పడుచున్నవి. ఈద్రవ్యములయొక్క ప్రశమన, చయప్రకోప స్థితులను రోగ లక్షణములద్వారా సులభముగా గుర్తించుటకు వీలగును. పంచభూతాంశల వృద్ధిక్షయలను గుర్తించుట కష్టమయినపని. కొన్నిరోగములలో పంచభూత జ్ఞానమునుకూడ ననుసరించుటకు వీలగును. ఉదాహరణకు పాండురోగమునకు లోహద్రవ్య చికిత్సను విచారింతము. ఆరోగ్యవంతుని రక్తములో పంచభూతాంశ లీక్రిందివిధముగా కలిసియున్నవను కొందము.

ఆరోగ్యరక్తము= 1 ఆ + 1 వా + 4 అగ్ని + 3 జ + 1 పృ. పాండురోగిరక్తము = 1 అ + 1 వా + 2 అగ్ని + 5 జ + 1 పృ.

ఇచ్చట రక్తధాతువులో కలిగిన వైషమ్యను తొలగించి సామ్యత కలిగించుటయేకద చికిత్సయొక్క ఉద్దేశము. కనుక తేజో, పృథివ్యాంశ లధికముగాను, జలాంశలు తక్కువగానుండిన లోహము (iron) ను చికిత్సగా నిచ్చెదము. లోహమందలి భూతాంశలు = 1 ఆ + వా + 5 అగ్ని + 1 జ + 2 పృ. కనుక పాండురోగికి లోహద్రవ్యము నిచ్చుటవలన అగ్ని పృథివ్యాంశలు వృద్ధియై, జలాంశలుతగ్గి రక్తము స్వస్థతకు వచ్చుచున్నది. ఈవిధముగా నన్నిరోగములకు ప్రయోగించిన చికిత్సాద్రవ్యములను కార్యముల నిరూపించవచ్చును. గాని సామాన్యముకాదు. దేహధాతువులయొక్క సామ్యస్థితి త్రిదోషముల యొక్క సౌమ్యవ్యాపారములపై నాధారపడినందున యీ త్రిదోషాను సారమైన చికిత్స లాచరించుట తేలికనైనపని. త్రిదోషములు ద్రవ్యములు, స్వతంత్రములు. ఇవిసౌమ్యముగా వ్యవహరించినప్పు డారోగ్యమును, వీనికి వైషమ్యము కలిగినప్పుడు రోగములు కలుగుచున్నవి. కనుక 'నదోషైర్వినారోగాః' అని చెప్పిరి.

మనదేహములో సంచరించుచున్న వాత, పిత్త, కఫములకు త్రివిధావస్థలున్నవి, (1) చయావస్థ - అనగా దోషములు స్వస్థానములందుండి వృద్ధిజెందుట. వృద్ధిపరిమితి, గుణాంశలలోకూడ కలుగవచ్చును (increase of quantity and quality of doshas in disproportiou to each other.)

(2) ప్రకోపావస్థ :- వృద్ధిచెందిన దోషములు స్వస్థానములనుండి కదలి ఇతరభాగములకు వ్యాపించి అచ్చట బాధలను పుట్టించుట.

(3) ప్రశమనావస్థ – ప్రకోపించిన దోషములు స్వస్థత జెంది తమతమ స్థానములకు తిరిగి వచ్చుట.

దోష, దూష్యజ్ఞానమును రోగలక్షణముల ద్వారా గ్రహించితిరిగి వాటిని స్వస్థత చేకూర్చుట కొనర్చిన యుపాయములకేచికిత్సయని పేరు. దోషములయొక్క చయావస్థలోనే చికిత్సల నారంభించిన యడల స్వల్పకాలములో సుఖముగా దోషములు స్వస్థత చెందగలవు. ఒకప్పుడు రోగము రాకపోవచ్చును, వచ్చినను స్వల్పబాధలతో నయమగును. దోషములు ప్రకోపించిన పిమ్మట దేహధాతువులుకూడ చెడిపోవును గనుక రోగము చికిత్స కసాధ్యము లేక కష్టసాధ్యమగును. దోషముల పరిమితి వృద్ధిజెందుటయేగాక ఒకప్పుడు వాటి గుణాంశలు వృద్ధిజెందుట కలదు. ఉదాహరణకు– పాలు పిత్తము (ద్రవ్యపరిమితి)ను వృద్ధిచేయును. నెయ్యి పిత్తము (పరిమితి)ను శమింపజేసి పిత్తగుణాంశమైన ఉష్ణము నధికపరచును. వాతము వృద్ధిచెందినప్పు డందలి రూక్ష, లఘు, ఖర, శీత, విశద గుణాంశలలో నొకటి లేక రెండు గుణాంశలతో వృద్ధిజెందుట కలదు. ఈవిషయములను రోగలక్షణములనుబట్టి గ్రహించదగును. జ్వరములలో వాతము రూక్షప్రధానముగా వృద్ధిచెందిన తృష్ణ పుట్టును. మలేరియా జ్వరారంభమున వాతము శీతగుణ ప్రధానముగా నుండుట వలన చలి, వణుకు కన్పించును. రజోగుణ సహితవాతము

కంపములను (Convulsions) కలిగించును. ఇట్టి గుణాంశ భేదములతో వృద్ధిచెందిన దోషములను గుర్తెఱిగి అవి శమించుటకు వ్యతిరిక్త గుణాధిక్య ద్రవ్యములతో చికిత్సించ వలసి యున్నది.

రోగముయొక్క నిదాన, సంప్రాప్తి, దూష్యజ్ఞానము లేకుండ రోగమునకు చికిత్స చేయుటకు వీలుకాదు. నిదానము దోషములు వృద్ధిచెందుటకు వివిధబాహ్యాభ్యంతర హేతువులను బోధించును. సంప్రాప్తిజ్ఞానము రోగిబలము, రోగబలము, అనగా ధాతువులలో దేని నాశ్రయించి యెంత వరకు చెఱచినవి, రోగియొక్క ఊర్జశక్తి, దోషములు వృద్ధి చెందుట కనుకూలములయిన వయస్సు, ఋతువు, వంశ పారంపర్య మొదలైన విషయముల బోధించును. ఈదోష దూష్య, సంప్రాప్తిజ్ఞానముతోనే వ్యాధి శమన చికిత్సల చేయనారంభించవలెను.

చికిత్సాపద్ధతులు పలు విధములుగా నున్నవి. రోగ స్వభావము, రోగియొక్క బలము, వయస్సు, కాలము, దేశము, ప్రకృతి, దోషస్వభావముల ననుసరించి తదనుగుణమైన చికిత్సాపద్ధతిని బుద్ధిమంతుడగు వైద్యుడు నిర్ణయించవలెను. ఈదృష్టితో చికిత్సలను మూడు విధములుగా విభజించ వచ్చును. (1) లంఘన చికిత్స, (2) శోధన చికిత్స, (3) శమన చికిత్స.

(1) ఆమదోషములకు ముందుగా లంఘన లే[illegible] తర్పణచికిత్స కనుకూలమైన యుపాగులనిచ్చి అగ్నిదీపన పాచనశక్తులను వృద్ధిచేయవలెను. ఆమము సామాన్యముగా

వారము రోజులకు పచనమగును. ఇక దోషములు నిరామ ములై నిలుచును.

(2) శోధన చికిత్సలు:- అధిక పరిమితిలో వృద్ధిచెంది యున్న నిరామదోషములను వివిధ శరీరమార్గములద్వారా బహిష్కరింపజేయుటకు పంచశోధన కర్మలు చెప్పబడినవి. ఎట్టి కర్మ లెవరికి యవసరములో (అర్హానర్హతలు), దుష్ట ప్రయోగము వలన కలిగే యుపద్రవముల నెఱిగి, అనుకూల మైన కర్మల నాచరించవలెను. ఇందువలన ప్రకోపించిన దోషములు చాలవరకు వెడలిపోయి స్వల్పభాగము మిగులును.

(3) దోషశమన చికిత్సలు:- మిగిలిన దోషములు శమించుటకుగాను ఔషధముల నియ్యవచ్చును.

(4) పూర్తిగా దోషములు శమించిన పిమ్మట నష్ట పడిన శరీరధాతువులను పూరించుటకు తర్పణచికిత్సలు అనగా పౌష్టికములైన రసాయనౌషధములు, ఘృతములు, లేహ్య ములు, పౌష్టికాహారములను తినిపించవచ్చును. దీనికి బృంహణచికిత్స యనికూడ నందురు.

I ఆమసహిత దోషములను లంఘనము (ఉపవాసము లేక లంఘనతుల్యమయిన యవాగు పానీయములు) ద్వారా యున్ను స్నేహ, స్వేద క్రియల ద్వారాయున్ను నిరామదోష ములుగా మార్చినపిదప శోధనకర్మలాచరించవలసియున్నది. స్నేహ స్వేదక్రియలు నిరామదోషములను వెడలించుటచే రోగిని సిద్ధపరచును.

(a) స్నేహన సంస్కారము:- (Preparation of the patient to undergo sodhana treartment). ఇందుకు

క్రొవ్వు, మజ్జిగ, నెయ్యి, నువ్వులనూనె వీనిలో నొకదానితో సైంధలవణము, మాంసరసము, పాలు, పాలువిరిగిన నీళ్లు చేర్చి రోగిచే త్రాగించవలెను. ఒంటికి పూయవచ్చును. కళ్లు, ముక్కు, చెవిరంధ్రములలో వేయవచ్చును. శరీరశోఫ (dropsy), సర్పదష్టము (Snakebite) విసర్పి, ఉన్మాదము (madness) మూత్రకృచ్ఛ్రము, మలబద్ధరోగులకు శరీర బలము, జీర్ణశక్తుల ననుసరించి ఉత్తమమాత్ర (full dose) త్రాగించవలెను. కణుతులు (tumours) కాలినపుండ్లు, చర్మరోగము, కుష్ఠురోగులకు మధ్యమమాత్ర (medium dose) దుర్బలులకు, ముసలివారికి, చిన్నపిల్లలకు, జీర్ణశక్తి తక్కువగా నున్నవారికి, దీర్ఘకాల జ్వరపీడితులకు, దగ్ధరోగు లకు చిన్నమోతాదు చాలును.

(b) స్వేదన సంస్కారము:- చరకుడు 13 రకముల స్వేదక్రియలను వివరించెను. (1) సంకర స్వేదక్రియ - వేడి యిసుక, వేడి పిడకలను గుడ్డలో మూటగట్టి, బాధయున్న స్థలమున కాపడము పెట్టుట. (2) ప్రస్తార స్వేదక్రియ - వట్టి గడ్డిపరుపుమీద బాధాకరభాగము నుంచుట. (3) నాడీ స్వేదక్రియ - ఒక గొట్టములోనుంచి నీటి ఆవిరిని బాధాకర స్థలమున పట్టుట. (4) పరిషేకము - చిదుకగొట్టిన ఓషధు లతో తయారైన కషాయముతో కాపడము పెట్టుట. (5) అవగాహక్రియ-తొట్టిలోని వేడినీళ్లలో మందులనుచేర్చి యందులో కూర్చుండుట. (medicated tub bath). (6) జేంతాక స్వేదక్రియ - ఒక చిన్న గదిలో కిటికీలు, వాకిళ్లు బిగించి మంటలువేసి ఆవెచ్చని గదిలో రోగిని కొంతసేపు

యుంచుట. (7) అశ్మఘన స్వేదక్రియ - వెచ్చని రాతిపలక మీాద రోగి పరుండుట. (8) కర్షూ స్వేదక్రియ - రోగి మంచము క్రింద నిప్పుల కుంపటులుంచుట. (9) కుటీ స్వేద క్రియ - గాలి చొరకుండ గదితలుపులు మూసియుంచి ఆగదిలో రోగి పరుండుట. (10) భూస్వేదక్రియ - వెచ్చని నేలపైన రోగి పరుండుట. (11) కుంభీ స్వేదక్రియ - రోగి మంచముక్రిందను మందుతో నింపిన పాత్రనుంచి దానిపైన నిప్పులు వేయుట. (12) కూప స్వేదక్రియ - ఒక లోతైన గోతిలో కట్టెలుకాల్చి, మంట లారినపిదప నాగోతిపైన మంచమువేసికొని పరుండుట. (13) హోలాక స్వేదక్రియ - కాల్చిన పిడకనిప్పులను మంచముక్రింద నుంచుట. ఈస్వేద క్రియలు కీళ్ళనొప్పులు (Rheumatism) దగ్గు, ఎక్కిళ్ళు (Hiccough) ఉబ్బస, చెవిపోటు, గొంతునొప్పి, తలపోటు, స్వరభంగము, మెడ ఇరుకుపట్టుట (Spasm of neck muscles or sprain) పక్షఘాతము (apoplexy) మలబద్ధము, మూత్రకృచ్ఛ్రము, మొదలైన పలువ్యాధులలో చాల మేలు చేయును. రోగానుకూలమయిన ప్రతిక్రియ లాచరించవలెను.

II శోధనక్రియలు :- నిరామదోషములను బహిష్కరించుటకు చేయబడును.

(1) వమనక్రియ (inducing vomittng) :- కఫము ప్రకోపించిన రోగములు - అనగా విషభక్షణము (Poisoning) ఆమదోషము (కఫప్రధాన) తోకూడిన జ్వరము, క్షయ వ్యాధి (Consumption), స్త్రీకి స్తనవిద్రధి (abscess of female breast), అతిసారము (diarrhoea), మధుమే

హము (diabetes) అనాహము (flatulanee or tympanitis) విషూచి (cholera) కఫాజీర్ణము (Phlegmatic dyspepsia) వమనానుమానము కడుపులో త్రిప్పు (nausea), విసర్పి (erysepalus), కుష్ఠు (leprosy) ఉబ్బస (Asthma) దగ్గు (cough) శ్లీపదరోగము (elephantiasis) హృద్రోగము (heart deiseas) స్థౌల్యరోగము (obesity) ఉన్మాదము (mental disorders) మూర్ఛ (epilepsy) కీళ్ల నొప్పులు (Rheumatism) నాసాస్రావరోగము (ముక్కు పడిశము) గవదబిళ్లలవాపు (Tonsillitis) యీ మొదలైన రోగములలో వాంతిచేయించవలెను. ఇందుకు మదనఫలము బ్రమంగకాయల కషాయము త్రాగించి వాంతిచేయించిన కఫముపోవును.

(2) విరేచనక్రియ :- ఇందుకు త్రివృత్ చూర్ణము (ఆలుతెగడ) (Ipomea turpethum) చాల ప్రశస్తమయినది. ఆముదమునుకూడ తఱచుగా వాడుచుందురు.

జీర్ణజ్వరములు, గరము (Piosoning), ఆకలిలేకుండుట, మూలవ్యాధి (piles) ఒళ్లు నీరుపట్టుట (general dropsy), యకృత్ప్లీహావృద్ధులు (enlaged liver & Splen) విద్రధి (abscess) కుష్ఠు (leprosy) భగంధరము (fistula) స్త్రీరోగములు (female diseases) విసర్పి (eczema) అనాహము, మధుమేహము, మూత్రకృచ్ఛ్రము (Stranguary) గాయములు (wounds) ఒళ్లుకాలుట, నేత్రరోగములు, తల కాళ్లు, చేతులు వేడిగానుండుట, రక్తస్రావములు (hemorhages) పచ్చకామిర్లు (Jaundice) శూల

(colic) మొదలైన రోగములలో రోగారంభముననే విరేచన సాధనము చేయించుటమంచిది.

(3) వస్తికర్మ :- (Enemata). మూత్రసంచికి వస్తి యనిపేరు. జంతువుల మూత్రసంచితో తైల, కషాయాదులను గుదముద్వారా నెక్కించుటంజేసి యాకర్మకు వస్తి కర్మయనిపేరు కల్గినది. దోషశమనముకొఱకు చెప్పిన వస్తి ద్రవ్యములు రెండువిధములుగా నున్నవి. (1) (తైలవస్తి) అనువాసనవస్తి (2) నిరూహావస్తి (కషాయవస్తి)వీనిని గుదము ద్వారా నెక్కింతురు. ఉత్తరమార్గమున అనగా పురుషుల శిశ్నమార్గముద్వారాయున్ను, స్త్రీలకు మూత్రమార్గము, యోనిమార్గములను శుభ్రపఱచునట్టి వస్తిక్రియలకు ఉత్తర వస్తియనిపేరు (irrigation or flushing or douching). నేటికాలమున లభించుచున్న Enema can, irrigator and douche nozle ను పూర్వపువస్తి యంత్రములకు బదులుగా వాడుకొనుట తప్పుకాదు. జ్వరము, అతిసారము, నేత్రరోగములు, తలనొప్పి, అపతానక వాతము, అక్షేపకవాతము (convulsions), పక్షవాతము (paralysis) అనాహము (tympanitis) అశ్మరి (urinary calculi) శూల, వృషణములవాపు, మలబద్ధము, మూత్రకృచ్ఛ్రము మొదలైన రోగములలో చెప్పిన ఔషధద్రవ్యములతో తయారైన తైల కషాయాదులను గుదములోనికెక్కించిన వాతము శమించి బాధలు నయమగును. ముందుగా కషాయవస్తిజేసి, దోషములు శమించినపిమ్మట అనువాసనవస్తి చేయవలెను. వస్తి కర్మజేయుటవలన 76 రకముల యుపద్రవములు సంభవించగలవని సుశ్రుతుడు చెప్పెను.

(4) నస్యకర్మ:- శిరోరోగములకును, గొంతు, ముక్కు రోగములకును ఓషధుల చూర్ణములను పీల్చుటగాని లేక ఓషధీరసములను ముక్కురంధ్రములలో వేయుటగాని లేక ఓషధులతో తయారైన తైలములనైన పీల్చదగును. ప్రయోజనమునుబట్టి నస్యక్రియలు రెండువిధములుగా నున్నవి. (1) శోధన నశ్యక్రియలు (purifying and purging) (2) స్నేహన లేక బృంహణ నస్యక్రియలు. యివి ఆచరణభేదముల ననుసరించి మూడు విధములు - (1) అవపీడనము: అనగా ముక్కులోకి ఓషధీరసములను పిండుట. (2) ప్రధమనము: అనగా ఔషధ చూర్ణముల బీల్చుట. (3) ప్రతిమర్షము: అనగా మందుద్రవము నెగపీల్చుట.

పైన వివరించిన చికిత్సా క్రమముయొక్క వరుస నీ దిగువ సూచించడమైనది.

1. హేతు నివారణము (Remove the cause).

2. ఆమదోషములను నిరామములుగా నొనర్చుటకు లంఘనాది క్రియలు -

3. స్నేహ, స్వేదక్రియలు (preliminary to Sodhana).

4. పంచశోధన క్రియలు (elimination of doshas)

5. శమనక్రియ (medicinal treatment).

6. బృంహణక్రియ (Supporting the body tissues and vitality through Rasayanas and nutritious diet).

## 3వ అధ్యాయము

## మోడరన్ మెడిసిన్‌లో చికిత్సా సూత్రములు

## Fundamental principles of treatment in modern medicine.

మోడరన్ వైద్యములో చికిత్స 'విశేషస్తు విపర్యయః' అను సూత్రము (law of contraries) ననుసరించినది. శారీరవిజ్ఞానము, (anatomy and physiology) దూష్య విజ్ఞానము (pathology), రోగములు కలుగుటకు వివిధ హేతుజ్ఞానములపైన వారి చికిత్సాశాస్త్ర మభివృద్ధి జెందినది. హేతువుల ననుసరించిన రోగ విభజన మెట్లనిన:—

1. సాంక్రామిక వ్యాధులు=Infectious diseases.
2. శారీరవ్యాపార దోషజనితములు=Metabolic diseases.
3. ఆహార ద్రవ్యాంశల లోపమువలన పుట్టిన రోగములు= food defficiency diseases.
4. ఆంగతుక వ్యాధులు - భౌతిక హేతు జన్యములు= Diseases from physical agencies, accidents and bites of animals and creatures.
5. మానసిక క్షోభ జనిత వ్యాధులు=psychological diseases arising from emotional origin.
6. అంతర్వాహినీ గ్రంథుల వ్యాపారదోష జన్యములు= diseases of endo-crine glands & disfunction.
7. విషభక్షణజనిత వ్యాధులు=toxicology.

8. వంశ పరంపరా లభించిన వ్యాధులు=Hereditory diseases.

ఇక పైన వివరించిన వివిధ రకముల వ్యాధులకు మోడరన్ వైద్యములో చికిత్సలయొక్క యుద్దేశము లెవ్వి యనగా:-

1. హేతు నివారణము=Removal of the cause.

2. క్రిమి సంహారక, క్రిమివిష బహిష్కరణోపాయములు= Anti Bacterial and antitoxic treatment through administering antibiotics and chemo-therapeutic medicines and vaccines and seerums.

3. నష్టద్రవ్య పూరణ చికిత్సాపద్ధతి=suplimental and substitution therapy by administering glandular products and vitamines.

4. మానసిక చికిత్సలు=psycho - therapy.

5. వ్యాధిహరణ చికిత్సలు=Symptomatic treatment.

6. బృంహణ చికిత్సలు=Supporting treatment by giving tonics, nutritious food etc.

7. రోగ నిరోధక చికిత్స= preventive treatment such as antitetanus vaccine and anti rabies seerum and small pox vaccine and B. C G. vaccine for prevention of Tuberculosis.

మోడరన్ వైద్యములో నాచరించుచున్న వివిధ చికిత్సాసాధనములు :- (1) ఔషధచికిత్స=medicinal

treatment (2) పథ్యము=diet (3) ఉపచార క్రియలు= nursing methods. ఇవి ఎవ్వియనగా - విశ్రాంతి= Rest, physical and mental, వ్యాయామము=exercise, మర్దనలు=massage, పట్లువేయుట=use of plasters and ointments, కాపడములు =fomentations, స్నానములు=steam bath, water bath, (simple or medicated), అచూచణ cupping, వమన, రేచన క్రియలు use of emetics and purgatives, క్షాళన ప్రయోగము irrigation and flushing methods, ధూమ ప్రయోగము=fumigation మొదలైనవి. ఇంకను శస్త్రకర్మలలో దుష్టరక్తము, చీము, నీరును వెడలించు క్రియలు (aspiration and letting out impure blood, pus and water collected inside cavities). శస్త్రచికిత్సలు (cutting operations), వర్ణచికిత్సలు (colour treatments), కిరణ ప్రసార చికిత్స (light exposure), రేడియం చికిత్స లున్నవి.

అల్లోపతి యాయుర్వేద వైద్యములలో రోగముల విభజనము, చికిత్సాపద్ధతులు, వాని యుద్దేశము లించుమించుగా నొకేతీరుగా కన్పించును. రోగములు కలుగుటకు ఎనిమిది హేతువులను చెప్పి హేత్వనుసరణముగా చికిత్సల జేయుటను అల్లోపతి వైద్యములో చూడవచ్చును. ఆయుర్వేద శాస్త్రములో రోగవిభజనము హేతువుల ననుసరించి ఆరువిధములని చెప్పియు, రోగనిదాన, సంప్రాప్తి, చికిత్సలు వాతాది త్రిదోషములను పురస్కరించుకొని నిర్మింపబడినవి. కాన సర్వరోగములను హేతువులతో నిమిత్తములేకుండ

త్రిదోషానుసారముగా చికిత్స జేయవచ్చును. పాశ్చాత్య వైద్యములో నూటికి 80 వంతు రోగములు సూక్ష్మక్రిమి ప్రధానములై యుండగా ఆయుర్వేదజ్ఞులు యీసూక్ష్మక్రిము లను ఆగంతుక హేతువులలో చేర్చి, చికిత్సావిషయమున వాటి యవసరమే లేదను చున్నారు. వేరే క్రిమిసంహార మందుల ప్రయోగము ఆయుర్వేదచికిత్సలో నవసరమగుటలేదు. ప్రకోపించిన వాతాదులను చికిత్సాసాధనముల ద్వారా సమ స్థితికి దెచ్చినప్పుడు శరీరశక్తులు రోగోత్పాదక సూక్ష్మ క్రిముల నణచివేయును. అవి వృద్ధిజెందుట కవకాశములేక శరీరములోనే చచ్చును. క్రిమివిషములను బహిష్కరించుటకు ఆయుర్వేదవైద్యులు చేయుచున్న స్వేదనక్రియలు, వమన రేచన క్రియలు తోడ్పడుచునే యున్నవి. వాతాదులు సామ్యస్థితిలో వ్యవహరించునప్పుడు అంతర్వాహినీ గ్రంథుల వ్యాపారములు సక్రమముగానే జరుగునుగనుక ఈగ్రంథుల ప్రసక్తి ఆయుర్వేదశాస్త్రములో చెప్పనవసరము కన్పించదు. క్రొత్తగావచ్చిన విటమిన్ చికిత్సలు మనవారి పథ్యాపథ్య విషయమందిమిడియే యున్నవి.

ఇటుపైని కొన్నిముఖ్య రోగములకు మోడరన్ వైద్య-ఆయుర్వేదచికిత్సా పద్ధతులను వివరించి వాటిసామరస్యములు, వైరుధ్యములు, విశిష్టతలు తెలుపబడును.

---

## 4వ అధ్యాయము

### జ్వరము= fevers.

ఆయుర్వేదములో జ్వరమును ప్రత్యేకవ్యాధిగా పరిగణించినారు. చాలవ్యాధులకిది ప్రధానలక్షణముగా నున్నది. శరీరశక్తులకును త్రిదోషములకును జరుగుచున్న సంఘర్షణ ఫలితమని చెప్పవచ్చును. ఇది శరీరములోనుంచి ప్రకుపిత దోషములను (మలములను) పారదోలుటకు చేయుచున్న ప్రకృతికార్యము. నోటియరుచి, ఆకలి మందగించుట, మల బద్ధము, చమటబట్టకుండుట, బడలిక, ఆవులింతలు తలనొప్పి, ఒళ్లునొప్పులు, నిరుత్సాహము, శరీరములో నుండవలసిన మామూలువేడికంటె నధికముగా పెరుగుట యీ మొదలైన పరిస్థితికి జ్వరమనిపేరు కలిగినది. శరీరోష్ణము పెరుగుదల యన్ని జ్వరస్థితులలోను విధిగానుండనక్కరలేదు. గాన ఆయుర్వేదవైద్యుని కీవిషయము ప్రధానముకాదు. మోడరన్ వైద్యములో దేహోష్ణముయొక్క పెరుగుదలకు పైరెక్సియా (pyrexia) అను శబ్దము ప్రత్యేకించబడినదిగాన ఆయుర్వేదజ్ఞులు ఈలక్షణమువినా మిగిలిన లక్షణములన్నియు కలిసి యున్నస్థితిని జ్వరమనిచెప్పుట తప్పుకాదు. చాల జ్వరము లలో దేహోష్ణపరిమితి పెరుగుదల కన్పించును.

### ఆయుర్వేదములో జ్వరనిదాన, సంప్రాప్తులు

1 జ్వరనిదానము : Etiology of fever in Ayurveda.

జ్వరముకలుగుటకు ప్రధానహేతువులు ప్రకోపించిన

వాత, పిత్త, కఫములు. వీనిని ప్రకోపింపజేయుచున్న అభ్యంతర హేతువులను సన్నికృష్ణ (immediate causes) విప్రకృష్ట (Remote causes) వ్యభిచారహేతువులుగా (helping causes) విభజించవచ్చును. వీనినన్నిటిని 'మిథ్యాహార విహారములలో' నిముడ్చవచ్చును. మరియు ఆగంతుకములైన మానసిక క్షోభలు జ్వరమును కలిగించును.

మోడరన్ వైద్యశాస్త్రములో జ్వరముపుట్టుట కీదిగువ కారణములను చెప్పిరి :-

(1) సూక్ష్మక్రిములు ప్రధానహేతువులు. జ్వరమును కలిగించునవి క్రిమిజన్య విషపదార్థములు (Bacterial toxines) గాని క్రిములుగావు. ఒక్కొక్కవ్యాధి కొక్కొక సూక్ష్మక్రిమిరకము హేతువుగా నున్నదని నిరూపించబడినది. ప్రత్యేకక్రిమి రకమువలన కలిగిన ప్రత్యేకరకము జ్వరమునకు స్పెసిఫిక్ ఇన్‌ఫెక్షస్‌ఫీవర్ (Specific infectious fever) అందురు.

(2) స్థావర, జంగమవిషములు (Poisons of vegetable and animal origin). ఈవిషజనిత జ్వరములకు రీయాక్షనరీఫీవర్సు అని పేరు.

(3) మానసిక క్షోభలవలన పుట్టిన జ్వరములు (fevers of psychic origin)

(4) హేతువు నిరూపించరాని జ్వరములు (fevers of doutful origin).

పాశ్చాత్యుల జ్వరచికిత్సా విధానములో మొదటి సూత్రము హేతుబహిష్కరణము గనుక మొదటి మూడు

రకముల జ్వరములు చికిత్సకు సాధ్యములుగా నున్నవి. నాల్గవదియగు హేతు నిరూపణముగాని జ్వరము అసాధ్య ముగా పరిగణింప బడుచున్నది.

2. జ్వరసంప్రాప్తి: (Pathology of fever in Ayurveda)'-

శ్లో॥ మిథ్యాహారవిహారాభ్యాం దోషాహ్యామాశయాశ్రయాః
బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్యూరసానుగాః॥
(మాధవనిదానం.)

మిథ్యాహారవిహారములచేతను ప్రకోపించిన వాతపిత్త కఫములు ఆమాశయము నాశ్రయించి అచ్చటి యగ్నిని బయటికితఱిమి రసస్రోతస్సులద్వారా సర్వశరీరమందును వ్యాపించుచున్నవి అని భావము. ఇచ్చట 'జ్వరదా స్యూరసానుగాః' అనుటవల్ల ప్రకోపించిన వాతాదులు అన్న రసముతో కలిసి దానిని చెఱచుటవలన అన్నిజ్వరములు మొదట రసధాతువునాశ్రయించియే పుట్టుచున్నవని యర్థము. పిమ్మట యాప్యమయిన కొలదిని రక్తగత, మాంసగత, మేదోగత, అస్థిగత, శుక్రగత జ్వరములుగా మారవచ్చును.

మరియు మనవారు జ్వరోత్పత్తిక్రమమును పౌరాణిక ముగా కూడ వివరించుటకలదు. అదేమనగా- శ్లో॥ దక్షా వమాన సంక్రుద్ధ రుద్రనిశ్వాససంభవః॥ (మాధవనిదానం.)

పౌరాణికగాథ సుప్రసిద్ధమయినదగనుక హైందవులు సులువుగానమ్మెదరు. ఆధునిక శాస్త్రవేత్తలకు దిగ్భ్రమను కలిగించును. ఈ కథను ఆయుర్వేదపరముగా నన్వయించు కోవలెను.

మోడరన్ వైద్యశాస్త్రములోని జ్వరసంప్రాప్తి.

భక్షణ, శ్వాసలు, గాయములద్వారా శరీరములో ప్రవేశించిన విషపదార్థములుగాని, (Bacterial toxins) శరీరములోపల పుట్టినవిగాని (auto toxines) రక్తముతో కలిసి మెదడులోకిపోయి అచ్చటనున్న దేహోష్ణకేంద్రముల వ్యాపారములను చెఱచుటవలన జ్వరముపుట్టుచున్నది. ఎట్లనగా మెదడులో నుష్ణవ్యాపారమునకు సంబంధించిన మూడు కేంద్రములున్నవి.

(1) ఉష్ణజనితకేంద్రము (Thermogenetic centre) ఇది 'పాన్సు', అను మెదడుభాగము. మెదడుయడుగున నున్నది.

(2) ఉష్ణమాపకకేంద్రము (Thermo-lytic centre) మెదడు ఉపరిభాగము (Cerebral cortex) లో నున్నది.

(3) మనస్సు యధీనములో నీపై రెండింటి వ్యాపారములున్నవి. గనుక నిది బేలెన్సింగ్ సెంటర్ అనవచ్చును.

ఇక రససహిత దూషిత రక్తము మెదడులో ప్రవహించునప్పుడు విషప్రభావమువలన దేహోష్ణమునకు సంబంధించిన మూడు కేంద్రములలో నేయొక్కటి చెడినను జ్వరమధికముగ శరీరములో పుట్టి తాపమును కలిగించును. కేంద్రములను చెఱచుట యనగా వాటి పనులకు చురుకు (Stimulation) గాని అణచిపెట్టుట (depression) గాని కావచ్చును. ఉష్ణోత్పత్తి కేంద్రమునకు చురుకువచ్చిన యధికోష్ణము పుట్టును. మాపక కేంద్రమునకు చురుకుపుట్టిన ఉష్ణము చర్మగతమై బయటికి పోవుచుండును.

ఇది యణచిపెట్టబడిన, చలి వణుకు పుట్టును. ఈకార్యములు రక్తనాళములకు వ్యాపించిన నాడులు (Vasomotor nerves) ద్వారా జరుగుచున్నవి.

ఈ రెండు వైద్యములలో భిన్నపద్ధతులుగా వివరింపబడిన జ్వరోత్పత్తిని సమన్వయించుటకు ప్రయత్నించెదము.

ఆయుర్వేదములో 'దోషాహ్యామాశయాశ్రయాః' అని చెప్పుటవలన ప్రకోపించిన దోషము ఆమాశయములోకి వచ్చి అచ్చటి జఠరాగ్నిని చెఱచి అన్నరసము నాశ్రయించి రక్తముతోకలిసి సర్వ శరీరమందును సంచరించునప్పుడు దుష్టరసము మొదట చర్మగత సిరలను పీడించుటవలన చలి, గగుర్పాటులు పుట్టి పిమ్మట చర్మగత రక్తస్రోతస్సులు వికసించును. ఇచ్చట "కోష్ఠాగ్ని"యను శబ్దమునకు కాయాగ్ని లేక వైశ్వానరాగ్ని యని యర్థము. దీనిని మెటాబాలిక్ హీట్ (Motabolic heat) అందురు. సర్వప్రాణులకు యీ వేడి కొంత పరిమితములో నెల్లవేళల నుండును. మనుష్యులకు సామానోష్ణము 98.4° (normal temperature) 'జ్వరదాస్యూరసానుగాః' అనుటవల్ల దుష్టరసముద్వారా శరీరగత రక్తస్రోతస్సులు వికసించి వేడి చర్మముద్వారా బయటికి వెడలిపోవును. అధికోష్ణము చర్మగత మగుటయే జ్వరము. దుష్టరసము ధాత్వణువుల లోపలికి ప్రవేశించినప్పుడందలి శరీరశక్తులకును విషపదార్థములకును సంఘర్షణ సాగుచుండగా నిరంతరముగా నధికవేడి పుట్టుచున్నది, గనుక నీయుభయవాదులకును జ్వరోత్పత్తి విషయమున భిన్నాభిప్రాయము లేదు.

ఇక 'దక్షావమాన సంక్రుద్ధ రుద్ర నిశ్వాససంభవః' అని చెప్పిన పౌరాణిక గాథను శాస్త్రవిషయముతో సమన్వయము చేయుదము,

మన శరీరధాతువులను పోషించుచున్న దక్షపదార్థము అన్నరసము. గనుక 'అవమానదక్షుడు' ప్రకోపించిన దోష సహితరసము, ఇది రుద్రునికి కోపకారణ మయ్యెననిన మన శరీరములో రుద్రస్థానమేమనిన మెదడు అడుగునయున్న పాంస్సు (pons) అనెడు ఉష్ణజనిత కేంద్రస్థానము (Thermo-genetic centre). త్రిదోషములతో కూడిన రసము (రక్తము) *పాంస్సునకు చురుకు (Stimulation) చేయగా మామూలు కంటె నెక్కువగా నుష్ణమును పుట్టించి జ్వరముగా పరిణమించును. ఈవిధముగా హైందవుల దే శాస్త్రముగాని వేదాంత, పౌరాణిక, మత విషయములు, జీవితసమస్యలతో పెనవైచుకొని కనిపించును. ఇందువలన క్లిష్టమైన శాస్త్రవిషయములు పామరులకు సుబోధకమగుటయేగాక నావిషయము లతి భక్తిశ్రద్ధలతో నాచరణ యోగ్యములగును.

3. ఆయుర్వేదములో జ్వరచికిత్సలు:- జ్వరముయొక్క జాతిరకము, దోషావస్థల ననుసరించి జ్వరచికిత్సలు చేయబడును.

I నిరామ లేక సామజ్వరమునకు చికిత్స:- జ్వరారంభమున దోషములు సాధారణముగా ఆమముతో కూడి యుండును. ఆమమనగా నపక్వాన్నరసము. దోషములయొక్క

---

* (చూడు డాక్టరు వి. జె. రిలేగారి 'వైదికదేవతలు' అను గ్రంథము (The Vedic Gods as figures of Biology).

సామనిరామ స్థితులను లక్షణములనుబట్టి తెలియదగును.
1. దోషములు నిరామము లగువరకు తీవ్రమయిన చికిత్సలు చేయరాదు. అనగా శోధనక్రియ లాచరించుటగాని, తీవ్ర మయిన మందుల నిచ్చుటగాని కూడదు. లంఘనములు, యవాగులు, దీపన పాచనౌషధములనిచ్చి ఆమము పచనమై దోషములు నిరామస్థితికి వచ్చువరకును వేచియుండవలెను.

2. దోషములు నిరామములైన పిమ్మట శోధనక్రియ లాచరించవచ్చును. కఫదోష మెక్కువగానుండిన వమనము, పిత్తదోష మధికమైన విరేచన సాధనము చేయించవలెను. జ్వరసమయములో విరేచనమగుటకు మందునియ్యకూడదు. వేడినీళ్లు త్రాగించవలెను.

II. జ్వరకాలము ననుసరించి జ్వరనామములు :-

(1) నవజ్వరము - జ్వరారంభము మొదలు 3 రోజులవరకు.
(2) తరుణ జ్వరము - ,, 7 ,,
(3) మధ్యమజ్వరము - ,, 14 ,,
(4) జీర్ణ జ్వరము లేక పురాణజ్వరము ,, 21 ,,

III దోషప్రాధాన్యము ననుసరించి వాతజ్వర, పిత్త జ్వర, కఫజ్వరము అని 3 రకములు, రెండేసిదోషములుప్రధాన ములుగా కలిసినజ్వరములు 3 రకములు, మూడుదోషములుఏక కాలమున ప్రకోపించిన సన్నిపాతజ్వరము, ఆగంతుకజ్వరము మొత్తము ఎనిమిది రకములుగానున్నవి. సన్నిపాతజ్వరము 7, 10, 12 రోజులలో ప్రాణముల హరించును లేదా కాలము దాటినపిమ్మట విడుచును. దోషబలము ననుసరించి తీవ్ర

లక్షణములతో నారంభమయిన జ్వరము చికిత్స కసాధ్యమగును. లేదా కష్టసాధ్యముగా నుండును. ఒకవేళ నయమయినను శాశ్వతముగా నంగవైకల్యము లేర్పడుట కలదు. కర్ణికా గ్రంధుల వాపు ప్రాణోపద్రవకరము. దోషోల్బణమును బట్టి 13 రకముల సన్నిపాతజ్వరములు గుర్తించబడినవి.

IV విషమజ్వరములు :- అనగా ఒకసారి సామాన్య జ్వరముఃవచ్చి అది తగ్గుచున్నసమయమున అనగా ప్రకోపించిన దోషములు శమించి స్వస్థానములకు చేరుకొనులోపుగా రోగి అపథ్యములను చేసినయడల అనగా గురుపదార్థముల దినుట. అధికపరిశ్రమ, మైథునాది క్రియలాచరించినప్పుడు యింకను శేషించియున్న దోషము లొక్కసారిగా విజృంభించి విషమజ్వరమును కలిగించును. ఇవి అయిదురకములని చెప్పిరి :- (1) సంతతజ్వరము (continuous fever) ఆరంభ దినము మొదలు 7, 10, 12 రోజులు విరామములేకుండా జ్వరముకాచును. ఈజ్వరము సామాన్యము. రసధాతువు నాశ్రయించి యుండును.

(2) సతతజ్వరము :- (Intermittant fever) రక్తము నాశ్రయించుకొని పగలొకసారి, రాత్రియొకసారి గాని, పగలు రెండుసార్లు, రాత్రి రెండుసార్లుగాని జ్వరము వచ్చుచు విడుచుచుండును. ఇది మోడరన్ వైద్యములో చెప్పిన కాలాజార్ ఫీవర్ (Kalazar) కావచ్చును.

(3) అన్యేద్యుష్కజ్వరము :- ఇది మాంసధాతువు నాశ్రయించును 24 గంటలలో నెప్పుడో యొకసారి తగిలి

విడుచుచుండును. దీనికి ఏకాహికజ్వరము (quotidian fever) అనిపేరు.

(4) తృతీయక జ్వరము : (Tertian fever) దినము విడిచి దినము జ్వరము వచ్చి విడిచుచుండును. మేదోధాతువు నాశ్రయించి పుట్టును.

(5) చాతుర్థిక జ్వరము (quartan fever) ఎముకలను మూలుగనాశ్రయించి యుండును. ప్రతి నాల్గవరోజున జ్వరము వచ్చును. లేదా మొదటిరోజు, నాల్గవరోజు విడిచి మధ్యను రెండురోజులు విడువకుండ కాచును. ఇది చాలా ప్రమాదమయినది.

(6) ప్రలేపక జ్వరము : (Hectic fever) (సుశ్రుత) ఇది యొకరకమైన అసాధ్య జ్వరము. సంతత జ్వరమునే పోలి యుండును. చాలారోజులు పీడించి చివరకు చంపును. వాత బలాసక జ్వరము దీనికి సంబంధించినదే.

ఈప్రకారము జ్వరముయొక్క జాతి, భేద, నవ, తరుణ, మధ్యమ, పురాణాది యవస్థలను కనిపెట్టి దోషానుగుణముగా ఔషధాన్నపానక్రియలచే దోషముల శమింపజేసి, అవి స్వస్థతజెందిన పిమ్మట రోగికి బలమును చేకూర్చుటకు రసాయనౌషధముల (tonics) నియ్యవలెను.

## ఆధునిక వైద్యశాస్త్ర ప్రకారము జ్వరచికిత్సలు

## Treatment of fevers according to Modern Medicine

ఈచికిత్సలు మూడు విధములుగా నున్నవి:-

(1) స్పెసిఫిక్ ట్రీట్‌మెంటు (specific treatment) హేతువు తెలిసినప్పుడు ఆక్రిమినాశన, క్రిమివిషహార చికిత్స లాచరించుట.

(2) బాధోపశమన చికిత్స (palliative or symptomatic treatment)

(3) బృంహణ చికిత్స (Supporting vital function)

(1) ఆధునిక వైద్యములో నూటికి 80 వంతు జ్వరములు సూక్ష్మక్రిముల వల్ల కలుగుచున్నవని కనుగొనినారు. ఈ రోగక్రిములు రోగి శరీరములో రక్తము, కళ్లె, చీము, మలమూత్రములలో నివాసములుగా నుండును గనుక నీద్రవములను సూక్ష్మవస్తుదర్శిని యంత్రసాయముతో పరీక్షలు సలిపి రోగహేతుకమయిన సూక్ష్మక్రిమిని దర్శించిన పిమ్మట నారోగ క్రిమిని నశింపజేయుటకు నిశ్చయింపబడిన ఔషధముల ప్రయోగింతురు. దీనికి స్పెసిఫికె ట్రీట్‌మెంటు అని పేరు. క్రిమిజ్ఞానము తెలియని జ్వరములకు బాధోపశమన చికిత్సలు మాత్రము శరణ్యము లగును. క్రిమిని కనిపెట్టులోపుగా లంఘనాది చికిత్స లాచరించుచుందురు.

(2) బాధోపశమన చికిత్సలు: (Symptomatic or palliative treatment) సామాన్య జ్వరములో అధికదేహోష్ణమును తగ్గించుటకు (antipyretic) చికిత్సోపాయము లాచరింతురు. శీతలోపచారములు - మంచు తలకు కట్టుట (icebag to the head) తడిగుడ్డలతో ఒళ్లుతుడుచుట (cold sponging) నుదురుపైన చల్లగా నావిరియగు

ద్రవములతో తడిపిన గుడ్డనుంచుట (evaporating lotions to fore head) చల్లనినీళ్లు ఎనిమాచేయుట (cold enemata) చేయుచు, చమటమూత్రము లధికపరచుటకు డయాఫార్టిక్ మిక్చర్‌ను త్రాగించెదరు. నిద్రానాశనమునకు, శూలబాధ నివారణకు, తలనొప్పి, ఒళ్లునొప్పులు బాధలు శమించుటకు బ్రోమైడ్ మిక్చరు త్రాగించవచ్చును. ఇంకను బాధలు మిక్కుటమైన మార్ఫియా యింజెక్షను చేయ వచ్చును. బాధలు తెలియకుండ జేసి, ప్రలాపము (delerium) తగ్గించి సుఖముగా నిద్రపట్టును.

క్రిమి నాశనముతో బాటు క్రిమి విషములకు విరుగుడు ద్రవ్యములను (anti-toxic seerums) ప్రయోగించుటకలదు. శరీరమును శోధించుక్రియలు, అనగా విరేచసాధనము, స్వేద మూత్రరేచనకారి మందుల ప్రయోగము క్రిమి విషములను బహిష్కరించుటకు తోడ్పడును.

స్పెసిఫిక్ ట్రీట్‌మెంటులలో క్వినైన్ మందు నేటికిని మలేరియాజ్వరమునకు ప్రశస్తముగా నున్నది. టైఫోయిడ్ చికిత్సకు క్లోరోమైసిన్, క్షయరోగమునకు స్ట్రెప్టోమైసిన్ యింకను పలురకముల క్రిముల నశింపచేయగల ఆరోమైసిన్ టెర్రోమైసిన్ మందురకములు యిప్పుడు లభించుచున్నవి.

పెనిసిల్లిన్ మందు సర్వరోగ నివారిణిగా పరిగణింపబడు చున్నది. ఇది పలురోగ క్రిములను నాశనము చేయగలదు. చీముక్రిములు, న్యూమోకాకై, మెనింజోకాకై, గనోకాకై క్రిములను, మంపు, యిన్‌ఫ్లూయింజా, రుమేటిక్ ఫీవర్ లకు హేతువులైన సూక్ష్మక్రిములను పెనిసిల్లిన్ నిర్మూలించును.

మరియు సల్ఫాడ్రగ్సుకూడ సూక్ష్మక్రిములను చాలవరకు ప్రతిఘటించగలవు.

## 5వ అధ్యాయము.

### 2 అతీసారము, గ్రహణి, విషూచి, కలరారోగము లకు చికిత్సలు.

### Diarrhoea, Vishuchi cholera and dyseutry.

### ఆధునిక వైద్యచికిత్స.

1 ఈవ్యాధులకు హేతువులైన సూక్ష్మక్రిములు ఆహార పానీయములద్వారా శరీరములోకి ప్రవేశించును గనుక వీనికి వాటర్ బార్నుడిసీజెస్ (Water - born diseases) అందురు., వ్యాధి ప్రబలముగా నున్నప్పుడు శరీరమందలి జలాంశలు నిర్గమించుటవలన శోష, ప్రాణాపాయముకలుగును (dehyration) గనుక విరేచనములను వాంతులను తగ్గించవలెను. రోగక్రిములను బయటికి వెడలించవలెను. ఈరెండు పనులుకలిసి వచ్చునట్లుగా స్వల్పసంగ్రహాణి గుణమునుకలిగిన ఔషధద్రవ్యములను విరేచనౌషధముతో కలిపి ఇయ్యవలెను. తఱచుగా ఆముదమును తుమ్మజిగురుతో మర్దించి, టించర్ కేంఫర్ కో కలిపి త్రాగించెదరు. ఈపరస్పర విరుద్ధకార్యములుగల ద్రవ్య సంపృటివలన సౌమ్యముగా పనిసాగి వ్యాధి యొక్క ఉరవడి కొంతతగ్గును. శోధనముకూడా జరుగును. (Both elimination and sedation). నాడి చాల దుర్బలముగానుండి తృష్ణజాస్తిగా నున్నప్పుడు ఉప్పునీరు, గ్లూకోజు

ద్రవములను (Saline glucose solution) రక్తనాళములోని కెక్కించిన నాడికి పుష్టికలిగి దాహము, ఆయాసముతగ్గును.

2. మల పరీక్షలో గుర్తించిన సూక్ష్మక్రిమి రకమును బట్టి ఆరక్రిములతో తయారైన సీరమ్ మందులున్న యెడల (anti-bacterial and antitoxic seerum యింజెక్షనులు చేయవచ్చును. బంక విరేచనములైన ఎమీబా క్రిములను చంపుటకు ఎమిటిన్ యింజెక్షనులు ప్రశస్థములు. క్రిమిజన్యాతిసారములో షైగాస్ ఏంటిడిసెంట్రిక్ సీరమ్ మందు పని చేయును.

3. కేవలము అజీర్తివలన సంభవించిన అతిసార రోగమునకు ముందుగా నాముదమును త్రాగించి కడుపును శోధించిన పిమ్మట సంగ్రహాణ గుణముగల వగరు ద్రవ్యములనిచ్చి వ్యాధిని నయముచేయవలెను. ఇందుకు బిస్మత్ సబ్ నైట్రేటు, టింక్చర్ కేంఫర్‌తో కలిపిన మిక్చర్ బాగా పని చేయును. వగరురస ప్రధాన ఓషధులతో తయారైన కషాయము (vcgetable astringent decoction) చాల మేలు చేయును. డైల్యూట్ యాసిడ్సు కూడ సంగ్రహాణి గుణము కలవి.

ఆయుర్వేదములో చెప్పిన విషూచి రోగ లక్షణముల కును, మోడరన్ వైద్యమందలి కలరా లక్షణములకును యించుక భేదముండుటవలన రెండిటిని వేర్వేరు వ్యాధులుగా పరిగణించక తప్పదు. విషూచి రోగమును మోడరన్ మెడిసిన్‌లో చెప్పిన ఫుడ్ పోయిజనింగు లేక టోమైన్ పోయిజనింగు (food poisoning or ptomain poisoning) గాపోల్చ

వచ్చును. దీనికి శోధన, వ్యాధిహరణ చికిత్సలు చెయ్యవలసి యున్నది. కలరా వ్యాధి ప్రత్యేక క్రిమివలన (cholera vibrio) కలుగుచున్నది. ఇది సాంక్రామిక వ్యాధి. ఆయుర్వేదములో జనపదధ్వంసక వ్యాధిగా (epidemic infectous disease) చెప్పబడినది. ఇట్టి వ్యాధులు జనులలో నొక్కసారిగా నన్నపానములు, గాలి, పరిసరములు దూషింపబడి నందున సంభవించునని ఆయుర్వేదము బోధించును.

అతిసారము, గ్రహిణి, విషూచి, కలరా రోగములకు ఆయుర్వేదములో నొకవిధమయిన కట్టుబాటులతో దోషానుసారముగా చికిత్సలు, శోధన, శమన, వ్యాధిహరౌషధముల నుపయోగించి తదనుకూలమైన పథ్యములు ఉపచార క్రియలు చెప్పబడినవి. వ్యాధి శమించిన పిదప అగ్నిదీపనౌషధములను బృంహణ చికిత్స లనాచరించవలెను.

మోడరన్ వైద్యములో కలరా రోగికి ఉప్పునీళ్ళను (hypertonic saline solution) తగినంత పరిమితిలో పరిస్థితులు చక్కబడేవరకు రక్తనాళములోకి నెమ్మదిగా (slow intravenous injection by drip method) నెక్కింతురు. ఈ క్రియవలన తృష్ణ, (thirst) ఒళ్లు పీకుట (cramps) తగ్గును నాడికి పుష్టి బలము చేకూరును. గుండెకు బలమిచ్చుటకు పై ద్రవములో గ్లూకోజు, ఎడ్రినలిన్ కలుపవచ్చును. ఈ చికిత్సా పద్ధతిని ఆయుర్వేద వైద్యులు కూడ నాచరించి యీ దారుణరోగము నెదుర్కొని మృత్యువాత బడకుండ అనేక మంది రోగులను రక్షింపవచ్చును.

ఆయుర్వేదచికిత్స:- అతిసారము, గ్రహణి, విషూచి, కలరా వ్యాధులకు లక్షణములనుబట్టి ప్రకోపించిన దోషము లను నిశ్చయించి, యీదోషము లామముతోకూడియుండును గనుక మొదట లంఘనచికిత్సలు చేసి, పిమ్మట దీపన పాచ నౌషధములనిచ్చి, దోషములు పక్వమైనపిదప సంగ్రహౌష ధములను, దోషశమనౌషధములను సంపుటిజేసి యిచ్చి నప్పుడు వ్యాధి శమించును. బాగుగా నాకలి, జీర్ణశక్తికలి గిన తరువాత పుష్టికరాహారములను, బలవర్ధకౌషధముల నియ్యవచ్చును. వ్యాధి మధ్యలో నుపద్రవములు కన్పించి నచో ముందుగా వీనికి చికిత్సలుచేసి, అవి శమించినపిదప వ్యాధికి చికిత్సను చేయవలెను. మూత్రబంధము, మూత్రా భావము (Suppression of urine) ఏర్పడి, నాడి సన్నగిలి, శ్వాస లధికముగానున్నస్థితిలో నాయుర్వేదవైద్యులు సెలైను గ్లూకోజు సొల్యూషను రక్తనాళములోకి ఎక్కించుట తప్పు కాదు. ఇట్లే డిసెంటరీరోగులకు దోషానుసారముగా నాయు ర్వేద మందులను కుటజ, బిల్వ కలిసినవి ప్రయోగించియు ఎమిటిన్ యింజెక్షనులుకూడ చేసిన సత్వరముగా రోగమును జయించవచ్చును. ఎమిటిన్ ద్రవ్యము కుటజవిత్తులు, చెట్టు పట్టలోనుంచి విడదీసినది (chief alkaloid)· from holarina Antidysentrica.)

## 6వ అధ్యాయము

## అజీర్ణము, అగ్నిమాంద్యము, పరిణామశూల, కడుపులోపుండు.

## Dyspepsia, indigestion and duodenal ulcers.

నిదానము (ఆయుర్వేదము):- అజీర్ణరోగములు దోష ప్రకోప హేతువు ననుసరించి నాలుగు రకములని చెప్పబడి నవి.

(1) ఆమాజీర్ణము (2) వాతాజీర్ణము (3) పిత్తాజీర్ణము (4) కఫాజీర్ణము ఈవివిధ వ్యాధులలో చెప్పిన లక్షణము లనుబట్టి ఇంగ్లీషు వైద్యములో చెప్పిన వ్యాధులపేర్లతో వీనిని సరిపెట్టవచ్చును.

1. ఆమాజీర్ణముఅనగా డిస్‌పెప్సియా=Atonic Dyspepsia or mucous dyspepsia.
2. వాతాజీర్ణము=indigestion due to hypermotility of the stomach.
3. పిత్తాజీర్ణము=ఆమ్లాధిక్యవ్యాధి (hyperacidity of the stomach.
4. ఆమాశయ, గ్రహణి వ్రణములు=Gastric and duodenal ulcers.
5. కఫాజీర్ణము=mucous dyspepeia.

ఆయుర్వేదచికిత్సలు:- ఆమాజీర్ణమునకు, కఫాజీర్ణము నకు మొదట లంఘన, పాచన చికిత్సలుచేసి, పిమ్మట వమన

విరేచనాదులగు శోధన చికిత్స లాచరించిన తరువాత దోష ములు శమించుటకుగాను కఫహరౌషధములు కలిసిన యుష్ణ వీర్య ప్రధాన యగ్నిదీప నౌషధముల నియ్యవలెను. వ్యాధి హేతువులను ముందుగా తొలగించుటవసరమగును. కఫవృద్ధి కరములయిన గురు శీత గుణాహారములను, పగటినిద్రను విస ర్జించవలెను. శొంఠి, పిప్పలి చేర్చిన మజ్జిగ త్రాగుటమంచిది.

వాతాజీర్ణ రోగులకు వాతశమనౌషధములు కలిసిన ఘృతమును త్రాగించవలెను. చేదు, వగరు, ద్రవ్యములతో తయారైన కషాయములు త్రాగిన మేలుచేయును.

పిత్తాజీర్ణ రోగులకు పిత్తమును వృద్ధిచేయు ఆహార ములను మానిపించి, పిత్తశామక ద్రవ్యముల తినిపించవలెను. వాంతి చేయించకూడదు, క్షారద్రవ్యముల నిచ్చుటవలన అధికామ్లము నశించగలదు. పిత్తహరౌషధములతో తయా రైన స్నేహ, ఘృతములను సేవించుచుండిన రోగము శమిం చును. పెరుగుపైన నీళ్ళుత్రాగుట మంచిది.

## ఆధునిక వైద్యచికిత్సలు= Modern treatment

పాశ్చాత్య వైద్యములోకూడను రోగ హేతుకాహార మును విడిచిపెట్టి ఆమాజీర్ణమునకు లంఘనము చేయించి దీపన పాచనౌషధముల (Carminatives & digestants) నిచ్చెదరు. వాతాజీర్ణములో వాతప్రకోప హేతువును (Nervous irritability) తొలగించి అటు పిమ్మట వాతము శమించుటకు (nervous sedatives) నల్లమందు టింక్చరు, హాయోసియామస్ టింక్చరు, త్రైకరుమార్ఫియా, క్లోరోటోన్,

కెనాబిస్ యిండికా టించ్చరు, కొకేను మొదలైన మందు లిచ్చెదరు.

కఫాజీర్ణము (Phlegmatic or mucous dyspepsia

మొదట లంఘనము చేయించి, గురుపదార్థముల వర్జించి, ఆమాశయములో నధికముగా నిలవయున్న కఫద్రవ మును వెడలించుటకు వమనము చేయింతురు. సోడాఉప్పు చేరెడు సుమారు ఒకశేరు వేడినీళ్లలో కరిగించి దీనిని కడుపు నిండా త్రాగించి గొంతుక కెలికిన చక్కగా వాంతియగును. రబ్బరుగొట్టమును ద్రింగించి (Stomach wash tube) తద్వారాకూడ నుప్పు నీళ్ళను కడుపులోకి పోయవచ్చును. తిరిగి ఆనీరు గొట్టముద్వారానే కఫసహితముగా బయటికి వెడలును. ఈక్రియకు 'లేవేజి' (Lavage or Stomach wash) అనిపేరు. ఆయుర్వేద వైద్యులు ద్రంగ కషాయ మును వాంతిచేయించుట కుపయోగించెదరు. పిమ్మట అగ్ని దీపనౌషధములను, జీర్ణకారియగు పెప్సిన్ మందు నిచ్చెదరు.

పిత్తాజీర్ణమునకు మోడరన్ వైద్యములో దాని యవ స్థల ననుసరించి చికిత్సలు చేయుదురు ఆరంభావస్థలో.

(a) అధికామ్ల పరిస్థితి నెదుర్కొనుటకు (hyper-chloridria) క్షారద్రవ్యప్రయోగ మొనర్తురు. సోడాబైకా ర్బొనేట్, బిస్మత్ కార్బనేట్, మెగ్నిషియం కార్బొనేట్సు ప్రశస్థములయిన క్షారద్రవ్యములు. వీనిని చూర్ణములుగానో లేక మిక్చరుగానో ఇయ్యవచ్చును. వీనితో రూక్షగుణముగల టించ్చరు బెలడోనాగాని, దీని సంబంధమయిన లైకరు ఎట్రో

పిన్ ద్రవమునుగాని కలిపిన మరియు గుణవంతమగును. ఆమ్ల వృద్ధికరములైన పులుపు, కారము, పచ్చి దినుసులు, మాంసాహారములను రోగము పూర్తిగా నయమగు వరకును వర్జించవలెను. మజ్జిగ త్రాగుట మంచిది. అన్నము జీర్ణమయిన పిమ్మట కూడ నధికముగా నూరిన ఆమ్ల ద్రవము మిగులుచుండుట చేతను కడుపులో మంట, శూలనొప్పి, పుల్లని త్రేనుపులు కలుగుచున్నవి. కనుక నీవ్యాధిని పరిణామ శూల యందురు.

(b) ఈవ్యాధికి రెండవ యవస్థ కడుపులో పుండు పుట్టుట (Gastric and duo.'er .. ulcers): అధికామ్లము అమాశయ గ్రహణి లోపలి పొరలను నాశనము చేసి వ్రణములను పుట్టించును. అధికామ్లము... కు విరుగుడుగా పైనచెప్పిన ఆహారములను, కెయోలిన్ బెలడోనా వందుల నియ్యవలెను. కురుపు గ్రహణి భాగములో పుట్టి దీర్ఘమయినప్పుడు (Gastro-Jejunostomy) అనెడు ఆపరేషను జేయుదురు. ఇందువల్ల అమాశయములోనుంచి ఆమ్లరస సహితముగా అన్నము సరాసరిగా సన్నప్రేగులలోకి జారిపోవును. గ్రహణి భాగమునకు విశ్రాంతి కలిగినందున కురుపు మానును.

---

# 7వ అధ్యాయము

## ప్రమేహ రోగములు

Metabolic disorders resulting in tissue waste and the appearence of abnormal ingredients or constituents in the urine.

మూత్రవికారములతో కూడిన రోగమునకు ప్రమేహ రోగ మందురు. అనేక వ్యాధులలో ప్రమేహ లక్షణములు కన్పించుటయు కలదు. ధాతుశైథిల్య మెక్కువగా జరుగుచున్నప్పుడు, ఏ ధాతువులు క్షీణించుచున్నవో ఆ ధాతు సంబంధమయిన ద్రవ్యము మూత్రముతో కలసి పోవుచుండును. ఆయుర్వేదములో 10 కఫదోషము వలనను, 6 పిత్తవికారము వలనను 4 వాతప్రకోపవలనను మొత్తము 20 రకముల ప్రమేహ వ్యాధులు పుట్టుచున్నవని గుర్తించబడినవి. మూత్రముయొక్క రంగు, చిక్కదనము, గురుత్వము, పాత్రలో మూత్రమును పోసి నిలువ యుంచినప్పుడు అడుగునకు దిగిన పదార్థస్వభావమును బట్టిని ప్రమేహనామములు కల్పించబడినవి. మోడరన్ వైద్యములోకూడ సుమారు ఇరవైకిపైగా మూత్రవికారములు పేర్కొన బడినవి. వీనికి యూరినరి డిజార్డర్సు (urinary disorders) అని పేరు. కనుక నుభయ వైద్యశాస్త్రములందలి మూత్రసామాన్య లక్షణములనుబట్టి, ఆయుర్వేదములో చెప్పిన ప్రమేహరోగములకు వరుసగా నింగ్లీషు పేర్లు తెలుపబడును.

1 పది కఫదోషమువల్ల పుట్టిన ప్రమేహరోగములు.

(1) ఉదకమేహము=polyuria

( 2) ఇక్షుమేహము = advanced stage of diabetis mellitus

( 3) సాంద్రమేహము = albuminuris

( 4) సురామేహము = phosphoturia

( 5) పిష్టమేహము = chyluria

( 6) శుక్రమేహము = spermatoriaoea

( 7) శనైర్మేహము = stranguary

( 8) శీతమేహము = cold urine

( 9) సికతామేహము = oxaluria or stones in the urine

(10) లాలామేహము = puss in the urine as in gleet.

II ఆరు పిత్తమేహ రోగములు :-

(1) క్షారమేహము = alkalinuria

(2) కాలమేహము = black urine as occurs in black water fever (haemoglobinuria)

(3) నీలమేహము = indicanuria

(4) శోణితమేహము = haematuria

(5) మాంజిష్ఠమేహము = acetonuria

(6) హారిద్రమేహము = bile in the urine

III నాలుగు వాతజన్యమేహములు :-

(1) వసామేహము =
(2) హస్తిమేహము =
(3) మజ్జామేహము =
} fat in the urine known as lyposuria

(4) మధుమేహము = glycosuria as in diabetis mellitus

ఆయుర్వేదములో దూష్యధాతు నిశ్చయము మూత్రవికార లక్షణములు, అనగా అందలి విశేషద్రవ్య జ్ఞానముతోనే చేయబడినదని చెప్పవచ్చును. ఎట్లనగా —

1 ఉదకమేహరోగములో మూత్రముపైన విడిచిన తైల బిందువు మునుగుచుండుటచేతను నీటికంటెను తేలికయైన యతి పలుచని ద్రవము మూత్రలవణ రహితమై శరీరములోనుంచి వెడలుచున్నది. కఫాధిక్యమువలన యకృత్ నందలి మూత్రికా లవణములను తయారుచేసే పిత్తాగ్ని క్షీణించినదనియు, మూత్రాభావ మేర్పడినదిగనుక ప్రధాన యంత్రమయిన (Vital organ) యకృత్ (liver) దోషయుక్తమయినదని గ్రహించగలము

2 ఇక్షుమేహములో మూత్రము (ఇక్షురసము) చెరుకు రసముయొక్క రంగును, మధురవాసనకలిగి యుండును. మధుర వాసన, అందలి చక్కెర పదార్థము (glucose or sugar) అధికాంశలో పోవుచుండుట వలనను, రంగు ఎసిటోన్ అనెడు విశేషద్రవ్యము వలనను కలిగినవి. ఈలక్షణ ములు మధుమేహ రోగముయొక్క చివరిదశలో సంభవిం

చును. అనగా రక్త, మాంస, మేదోధాతువులు దూష్య మొందినవి.

3. సాంద్రమేహము. మూత్రమునకు సాంద్రత అనగా అధిక బరువు, చిక్కదనములు అందలి విశేషద్రవ్యములైన అల్బ్యామిన్, ఫోస్ఫేటులవల్ల కలిగినవి. అల్బ్యామిన్ పదార్థము జీవపదార్థము. కోడిగ్రుడ్డు లోపలి తెల్లనిసొన వంటిది. దేహమందలి ప్రతి అణువు లోపల నుండును. దీనికి టిస్యూ అల్బూమిన్ (tissue albumen) అందురు. మరియు ఆహారపదార్థములందలి ఆల్బ్యామిన్ పదార్థము రక్తములో నుండును. దీనికి బ్లడ్ అల్బ్యామిన్ (blood albumen) అని పేరు. ఇదియే టిస్యూ అల్బ్యూమిన్‌గా పరిణతి జెందును. ఇవి మూత్రముతో కలిసిపోవుచున్న వనగా బ్లడ్ అల్బ్యూమిన్ పరిణామము జరుగక నిలిచపోయినదనియును, అదియే మూత్రముద్వారా పోవుచున్నదనియును గ్రహింతుము. మరియు మధుమేహ రోగికి ధాతుశైర్య కార్య మధికముగా జరుగు చున్నందున (incıcased Katabolism) అక్షీణ ధాతువులకు సంబంధించిన అల్బ్యూమిన్ ద్రవముకూడ శరీరములో నుంచి బహిష్కరింపబడు చున్నదనియు తెలియ గలము. అల్బ్యూమిన్ పదార్థము సామాన్యస్థితిలో మూత్రములో లీనమై కంటికి కన్పించదు. మూత్రమును మరగించి నప్పుడది తెల్లగా ముద్దకట్టి బరువుచే పాత్రయడుగునకు దిగి పోవును. వేడికి మూత్రములో కరిగియున్న ఫోస్ఫేటు లవణ ములుకూడ అల్బ్యూమిన్‌తో కలసి పాత్ర యడుగునకు దిగును (precfpitate) గనుక నీ రెండింటిని నిరూపించుటకు

మరగించిన మూత్రములో ఎసిటిక్ ఏసిడ్ రెండు చుక్కలను చేర్చిన వెంటనే ఫోస్ఫేటు లవణములు తిరిగి కరిగిపోయి ఆల్బ్యూమిన్ పదార్థమొక్కటియే మిగులును. దీని పరిమితిని బట్టి రోగబలమును నిశ్చయించగలము. కనుక సాంద్ర మేహ రోగములో దూష్యధాతువులు ముఖ్యముగా రక్తము, మాంసమని తెలిసికొందుము.

4 సురామేహము — మూత్రము కల్లువాసన వేయును అనగా ఎమ్మోనియా వాసన. (strong alkaline small) ఫోస్ఫేటు లవణములు మూత్రము క్షారయుతమైనప్పుడు పాత్ర యడుగున దిగిపోవును. ఆమ్లయుతముగా నుండిన కరుగును. ఫోస్ఫేటు లవణ రకములు అనగా కేల్సియం మెగ్నిషియమ్ ధాతువులతో సంబంధించిన గ్లిసరో ఫోస్ఫేట్సు, ఎముకలు, మెదడు, నరములలో నెక్కువగా నుండును. ఈ ధాతువులు క్షీణించుచున్నప్పుడీలవణములు మూత్రముతో కలసి బయటికి పోవును.

౫. పిష్టమేహము. ఇందులో రసధాతువు ప్రధానముగా దూష్య మొందును. కనుక అన్నరసము మిగిలిన ధాతువులను పోషించకుండా మూత్రముతో కలిసిపోవుచున్నది. ఇది కలిసిన మూత్రము తెల్లగా చిక్కగా పాలవలె కంటికి కన్పించును.

6 శుక్రమేహము - వాతబలముచేతను శుక్రధాతువు ఓజస్సుగా మారకుండ నంతయు శుక్రద్రవముగా తయారై మూత్రముతో కలిసి బయటికి వెడలింపబడును. ఇందువలన ఓజోక్షయముకలిగి రోగి యచిరకాలములో మరణించును.

బరువుచేతను మూత్రములో పాత్రయడుగున చిక్కగా ముద్దగా దిగిపోయి కంటికి కన్పించును. మూత్రపిండములు (kidueys) మూత్రాశయము (Urinary blader), మూత్ర మార్గము (Urethra) లోపల గనేరియా వ్యాధివలన పుండు యేర్పడిన వారికి మూత్రములో చీము కలిసియుండుట సంభవించును. దీనినిచూచి శుక్రమని భ్రమచెందుట గలదు. సందేహనివృత్తి, యీచిక్కని పదార్థమును భూతయద్ద సాయమున (మైక్రోస్కోపు) పరీక్షించిన, కాగలదు.

7. శనైర్మేహము – ఇందులో మూత్రము చుక్కలు చుక్కలుగా బయటికి ప్రవర్తించును. దీనికి కారణము మూత్రమార్గావరోధము. గనేరియా వ్యాధివలన మూత్ర నాళ మధ్యమున పుండుపుట్టి అది మానిన పిదప నాళము సన్నగిలును. ఒకొకప్పుడు బిగపట్టును. కండ పెరుగవచ్చును.

8. శీతమేహము – ఆరోగ్యవంతుని మూత్రమును గాజు గ్లాసులోకి పట్టినప్పుడు గోరువెచ్చగా నుండును. చావసిద్ధముగానున్న రోగికి (Collapsed condition) శరీరవేడి పూర్తిగా నశించుటవలన మూత్రము చల్లగా వెడలును.

9. సికతామేహము – ఇది ఆక్సేలిక్ ఏసిడ్ అత్యధికముగ నుండిన యాహారపదార్థములను సదా తినుచుండిన వారికిని, కేల్సియం, మెగ్నిసియం సంబంధమయిన ధాతు లవణము లధికముగానుండిన గోదావరిజలమును త్రాగువారికిని మూత్రమార్గములో రాళ్ళు ఏర్పడుచుండును గనుక ఆరంభములో యిసుకవంటి చిన్నరాళ్ళు .మూత్రప్రవాహముతో కొట్టుకొనివచ్చును.

10. లాలామేహము - అనగా ఉమ్మినీరువలె పిచ్ఛల మూత్రము తీగెలుగా సాగును. ఇట్టి మూత్రములో చీము కలిసియుండును. గనుక నీవ్యాధిని పూయమేహమనికూడ నందుము.

11. క్షారమేహము - అనగా క్షార లవణము లధిక ముగా గలిగిన మూత్రము. ఎమ్మోనియా వాసనగొట్టును. అనగా నిలవయుండిన మూత్రము వాసన. ఈపరిస్థితి మూత్ర సంచిలో నెక్కువసేపు నిలవయుండినందున క్రిములవల్ల మురు గుట కారంభమై దుర్గంధయుక్తమగును. ఈపరిస్థితి మూత్ర సంచికి వెలువరించే శక్తి లేనందుననే (atony of the blader) కలుగును. అభిఘాతమువలన నీస్థితి కలుగును.

12. కాలమేహము - అనగా నల్లని మూత్రము తీవ్ర తరమయిన మన్యజ్వరము (Black water fever) లో సంభ వించును. మలేరియా క్రిమి విషములు రక్తమందలి ఎర్రకణ ములను విపరీతముగా నాశనమొనర్చుటచేతను వానిలోని హిమోగ్లోబిన్ పదార్థము నల్లగామారి మూత్రముతో కలిసి పోవుచున్నది. ఇందులో పిత్తము, రక్తము దూష్యద్రవ్యము లుగా నున్నవి.

13. నీలమేహము - మాంసధాతువు కుళ్లినప్పుడు యిండికాన్ అనెడు నీలిమందురంగు పదార్థము పుట్టుచున్నది. ఇది కలిసిన మూత్రము నీలిరంగుగా కన్పించును.

14 శోణితమేహము — రక్తనాళములు మూత్రపిండ ములలో పలచిట్లుటవలన రక్తము స్రవించి మూత్రపిండముల వాపు (acute Brights' disease) వలన సిద్ధించును. రక్త

పిత్త ప్రకృతిగలవారికి (Haemophilic diathesis) కూడ కలుగవచ్చును.

15 మాంజిష్ఠమేహము — మంజిష్ఠగడ్డి నానవేసిన నీటిరంగు - అనగా కొంచెము ఎరుపు, పసుపు కలిసినరంగుతో మూత్రము వెడలును. ఈరంగు ఎసిటోన్ పదార్థమువలన కలిగినది. మాంసధాతు క్షయములోను, ప్రొటీను ఆహార దినుసులు సరిగా పక్వముకాని వారికిని ఎసిటోన్ ద్రవ్య మేర్పడుచున్నది. ఫేటు (చమురు) జీర్ణముకాని మధుమేహ రోగులకుకూడ మూత్రములో ఎసిటోన్ ద్రవ్యము కన్పించును. రక్తములో నీద్రవ్య మధికముగా నిలిచినందున మధుమేహ రోగులకు పిటికలు, రాచకురుపులు, ఒళ్లు చీమలుప్రాకినట్లు కన్పించును. క్రిమినిరోధకశక్తి వీరికితగ్గును.

16 హారిద్రమేహము-అనగా పసుపురంగు మూత్రము, మూత్రమునకు పసుపురంగుబైల్ (పైత్యరసము) కలియుట వల్ల సంభవించును. పచ్చకామిర్లు (జాండిస్) రోగుల మూత్రము పసుపురంగుగానుండి మలములో పైత్యరసము లేకుండ మట్టిరంగుతో వెడలును. యకృత్‌లో నూరిన పైత్త్యరసము (Bile) ప్రేగులలోకి రాకుండ రక్తగతమై యావత్తు శరీరమందును సంచరించుచు, రక్తములోనుంచి మూత్రముతో వడగట్టబడుచున్నది. ఈరక్త పైత్యమధిక మయిన చిన్నపిల్లలకు మెదడు ప్రకోపించి (Meningitis) ఆక్షేపక వాతలక్షణముతో (convulsions) చనిపోవుదురు. పెద్దవారికి భ్రమ మొదలైన పిచ్చిలక్షణములు పుట్టును. మూత్రమునకు పసుపురంగుబైల్ వలన కలిగినదో మరి యితర

పదార్థములవల్ల కలిగినదో తెలిసికొనుటకు గాజుపెంకుమీద నొకచుక్క మూత్రమును వేసి దానిప్రక్కనే యింకొకచుక్క స్ట్రాంగునైట్రిక్ యాసిడ్ వేసి, రెండుచుక్కలు కలియునట్లుగా గాజుబిళ్ల నేటవాలుగాపట్టి, రెండును కలిసినపిమ్మట వెలుతురున కెదురుగా పట్టిచూచినచో పంచరంగులు కన్పించును. (యింద్రధనస్సురంగులు) అప్పుడా మూత్రములో బైల్ యున్నదని స్పష్టముగా చెప్పగలము.

17, 18, 19 వసా, మజ్జ, హస్తిమేహముల మూడింటిలోను ఆయా ద్రవ్యములు, (క్రొవ్వుచమురులకు సంబంధించినవి). మూత్రముమీద తేలును, మీదిభాగముమూత్రమును జాగ్రత్తగా గ్రహించి గుడ్డవత్తివేసి వెలిగించినదీపము చక్కగా వెలుగును.

20 మధుమేహరోగి మూత్రములో చక్కెర యధికముగా నుండును. అందువలన మూత్రమునకు చీమలు పట్టుట కలదు. చక్కెరపరిమితి స్వల్పముగానుండిన మనము గ్రహించుటకు మోడరన్ వైద్యములో చెప్పిన మూత్రపరీక్షా విధానమును చేయుటమంచిది. నూటికి ఎన్ని శతాంశల చక్కెర పోవుచున్నదోకూడ గ్రహించ వీలగును. ఆహారమందలి చక్కెరయంశలు జీర్ణాంతమున చక్కెర (glucose or suger) గా మారి, ధాత్వణువులలోకి పోయినపిమ్మట, ధాత్వగ్ని, ఆక్సిజన్, వాయువులసహాయముతో కాలిపోయి, ఆరోగ్యశరీరములకు జవము, వేడి (energy and heat) నిచ్చుచున్నవి మధుమేహ రోగులకు ముఖ్యముగా ధాత్వగ్ని వాతకఫములచేతను చెడినందున చక్కెర కాలిపోకుండ రక్తము

లోనే నిలిచిపోయి, మూత్రముతో కలిసి, బయటికి పోవు చుండును. ఇందువల్ల ధాతుపోషణము లేకపోవుటచేత నీరసము హెచ్చును.

## మేహరోగములకు ఆయుర్వేద చికిత్స

దోషదూష్యములను నిశ్చయించినపిమ్మట స్నేహ, స్వేద, వమన, విరేచన, వస్తికర్మలచేతను శోధించి, ధాత్రీఫల రసములో (ఉశిరిక =fresh juice of Myrobalan officinali) పసుపు, తేనెకలిపి త్రాగించవలెను. అటుపిమ్మట దోషదూష్యములను చక్కబఱచుటకు స్వర్ణ, అభ్రక, రజత వంగాదులుతో తయారైన రసౌషధములను, వంటలేక కజ్జలీ మందులను రసాయన కల్పనలను యియ్యవలెను. రోగాను కూలముగా పథ్యము నియ్యవలెను. గోమూత్ర శిలాజిత్ ప్రమేహరోగము లన్నిటికి ప్రశస్తమయిన రసాయనము. మూత్రముతో కలిసి యే ద్రవ్యము పోవుచున్నదో దానిని నిలుపుచేయగల సంగ్రహణౌషధములతో తయారుచేసిన కషాయములను పైన జెప్పినరసాయనౌషధముల కనుపానముగా త్రాగించవలెను. చెడిన ధాతువులయొక్క పునఃనిర్మాణ మున కనుకూలముగా బృంహణ చికిత్స లాచరించవలెను. మేహరోగములన్నియు యాప్యమైనయడల మధుమేహముగా మారగలవు. సికతామేహము, సురామేహరోగము లుపేక్షించిన మూత్రాశ్మరి (మేహరాళ్లు) యేర్పడగలవు. ఈస్థితికి పాషాణభేది పునర్నవాది ఓషధులతో చిరకాలము చికిత్సలు చేసినను రాళ్ళు కరుగకుండినచో ఆపరేషను చేసి తీసివేయ వలెను. సుశ్రుత (4-7) అష్టాంగ హృదయ (4-11) అష్టాంగ

సం|గహము (4-13) లలో మూత్రాశ్మరి ఆపరేషను వివరింప బడినది.

## ప్రమేహ రోగములకు ఆధునిక చికిత్స.

## Allopathic treatment of Uriuary disorders.

మూత్రవికారములు చాలరోగములలో సంభవించును. ఇవి ఆయారోగములయొక్క ఉపద్రవలక్షణముగా (Complications) చెప్పబడును. మూత్రపిండముల వాపుతోకూడిన యుబ్బురోగము (Acute Bright's disease) ప్రధానముగా జనించవచ్చును. హృద్రోగము (Heart disease), పాండు రోగము (anaemia), యకృద్దోషము (Liver disease and jaundice) అన్నజీర్ణ, ధాతుశైర్య, ధాతునిర్మాణ కార్యములు (Metabolic function) సరిగాజరుగక మూత్రవికారములు సంభవించును. మానసికవికారములు (psychological factors) కూడ మూత్రవికారముల కలిగించగలవు. ప్రధానముగా మూత్రపిండముల వాపు, మూత్రాశయ వాపు, మూత్రమార్గములో పుండు పుట్టిన స్థితిలో (Gonorrhoca of urinary tract) మూత్రములలో చీము కన్పించును. ఈ రోగములకు హేతువుల ననుసరించి చికిత్సలు చేయబడును. అన్యరోగ ఫలితముగా పుట్టిన మూత్రవికార మారోగము తోనే శమించును. గనేరియా వ్యాధి క్రిమి సంసర్గమువల్ల కలుగుచున్నది. కనుక దీనికి ప్రత్యేక చికిత్స లవుసర మగును. పెనిసిలిన్, సల్ఫాడ్రగ్సు గనేరియా క్రిములను చంపుటకు ప్రసిద్ధి కెక్కినవి. వ్యాధి యాప్యమయినప్పుడు క్రిమిహారశక్తి శరీరములో సంపాదించుటకు గాను గనేరియా వేక్సిన్

యింజెక్షను లియ్యవలెను. మూత్రనాళము, మూత్రాశయ ములను క్రిమిహరద్రవములతో (lotions) ప్రక్షాళన చేయుచు లోపలి పుండును మాన్పవలెను.

## 8వ అధ్యాయము

## మధుమేహ రోగము

## (Diabetes mellitus)

ఈ వ్యాధి శరీరతత్త్వము యొక్క వికారఫలితమని (Metabolic disorder) యుభయ వైద్యశాస్త్రములు చెప్పుచున్నవి. ఆయుర్వేదజ్ఞులు యీ ప్రకృతి వికారమును సరిదిద్దుటకు దోషానుగుణ చికిత్సల నాచరింతురు ఇందుకు రసాయనౌషధములు ప్రశస్థములు. వసంతకుసుమాకరము, పంచబాణరసము, సిద్ధమకరధ్వజము, స్వర్ణాభ్రకవంగభస్మ ములు, గోమూత్రశిలాజిత్తు శరీరతత్త్వములను మార్చుటకు శక్తివంతములైన రసాయనౌషధములు. మూత్రసంగ్రహ ణౌషధముల నిచ్చి మూత్రపరిమితిని తగ్గించి, అగ్నిదీపన కార్యము ద్వారా శరీరములో శర్కర పదార్థము వినియోగ మగునటుల జేయుటయే చికిత్సయొక్క యుద్దేశము. 50 సం॥ర పైన వయస్సుగల వారికిని, యూష్యమయినప్పుడును, 10సం॥ మొదలు 20 సం॥రము లోపు వయస్సున వచ్చిన తరుణ వ్యాధులు నయముకావు. చికిత్సలు పొందుచు, పథ్య మాచ రించుచున్నంతవరకు వ్యాధి అదుపులో నుండుటే గాని పూర్తిగా నివర్తించుట దుర్లభము.

మోడరన్ వైద్యశాస్త్రములో మధుమేహమునకు హేతువుల నీ క్రింది విధముగా విభజించిరి.

(1) వారసత్వము=Heridity

(2) సోమరితనము=Sedentary habits

(3) స్టార్చి, శర్కరలనధికముగా నిత్యము భుజించుట Intake of carbo-hydrate and sugars beyond the tolerance limit for assimilation.

(4) అంతర్వాహిని గ్రంధుల వ్యాపారదోషము = Disturbance of hormone glandular function. ఈ రకము గ్రంధులలో ముఖ్యముగా పేంక్రియాస్ గ్రంధిలో నుంచి రావలసిన అంతరరసము (యిన్‌స్యూలిన్) యొక్క అభావస్థితివలన రోగ మేర్పడుచున్నది.

(5) మానసికక్షోభలు (Psychological factors) ఈ పైన చెప్పిన హేతువులలో నివారింపదగిన వాటిని విసర్జించి, యిక గ్రంధుల వ్యాపారములను చక్కదిద్దుటకు జంతు గ్రంధులను తినిపించియు, యిన్‌స్యూలిన్ ద్రవ్యలోపమును భర్తీ చేయుటకు జంతు గ్రంధులలోనుంచి సంపాదించిన యిన్‌స్యూలిన్ (Insulin) యింజెక్షనులు చేయించుచుందురు. యిన్‌స్యూలిన్ యింజెక్షనులు తాత్కాలికముగా మూత్రముతో కలిసి పోవుచున్న శర్కరను (Sugar) అరికట్టి, దేహములో వినియోగ మగునట్లు చేసి, చురుకు నుత్సాహము నిచ్చును. ఒక యింజెక్షను శక్తి 8 గంటలలో తగ్గిపోవును. చెడిపోయిన గ్రంధుల వ్యాపారములను పునరుద్ధరించుటకు సాధనోపాయములు లేవు గనుక మధుమేహ రోగము చికిత్సకసాధ్యమని చెప్పినారు.

## ఆమవాత కీళ్ళనొప్పులు

## (Chronic Rheumatism & Gout)

రుమేటిక్ ఫీవర్ Rheumatic fever) క్రిమిజన్య మని మోడరన్ వైద్యశాస్త్రము చెప్పుచున్నది. కాని దీర్ఘకాల బాధితముగా నున్న కీళ్లనొప్పులు, గనేరియా మొదలైన యితర రోగములలో నుపద్రవలక్షణములుగా సంభవించు చున్నను, ప్రధానముగా కలిగిన కీళ్లనొప్పులను (primary disease) రుమేటిజమ్ (Rheumatism) అను పేరుతో వ్యవహరించుచున్నారు. ఇది క్రిమిజన్యవ్యాధి కాదు. ఆహార దోషము వల్లనే పుట్టినది. ఈ వ్యాధిలో రక్తము దూష్య మగును. సోడియం బిబోరేట్ అను లవణములు ఏర్పడి రక్తములో సంచరించుచు కీళ్లలో నిలిచిపోయి వాపు, నొప్పు లను కలిగించునని వారి శాస్త్రము బోధించును.

ఆయుర్వేదములో నీరోగమును ఆమవాత రక్తదోష ఫలితముగా నిర్ణయించిరి. మొదట రసధాతువు ఆమద్రవ్య ములతో కూడ రక్తమును చెఱచి భాధించుచున్నది. కనుక దోషములను పరిహరించుటకు లంఘన, స్వేదన, మవన, విరే చన క్రియ లుపచరించును. అగ్నిదీపనౌషధముల నిచ్చిన వ్యాధి నయమగును. తైలమర్దనలు, కాపడములు బాధలను శమింపజేయును. రసపర్పటి, గుగ్గులౌషధములు శరీర శోధక ములుగా పనిచేయును.

## రక్తపుపోటు

## (Hyper-tension or high blood pressure)

ఈ మాటను యిటీవల నిరువది సంవత్సరముల నుండి

వినుచున్నాము. రోగులను భయావహులుగా నొనర్చు చున్నది. రక్తపుపోటును కొలచు యంత్రసాధనము నదే పిచ్చిగా తరచుగా నుపయోగించు వారును గలరు. అధిక రక్తపోటును తగ్గించుటకు మోడరన్ వైద్యములో మందులు లేవని నిస్పృహను చెందుచున్న డాక్టర్లున్నారు.

అసలు రక్తపోటు అనగా నేమి? ఆరోగ్యవంతుల కెంత యుండవలెను. అధిక రక్తపోటునకు కారణము లెవ్వి? ఆయు ర్వేద శాస్త్రములో దీనికి ప్రశంస ఏమైన యున్నదా? ఈ వ్యాధికి చికిత్సయేమి? యీ మొదలైన ప్రశ్నలకు సమాధా నము దెలియ కుతూహలు రున్నారు.

రక్తము రక్తనాళములోపల కొంత యొత్తుడు బల ముతో ప్రతివారికి ప్రవహించును. ప్రవాహబలము (1)గుండె కాయ యొక్క పీడనశక్తి (2) రక్త పరిమితి (3) రక్తగొట్ట ముల స్థితిస్థాపకత్వము (4) సిరాశాఖల చివరను (కేశనళికల లోపల) అభ్యంతరముల ననుసరించి ఎక్కువగాని తక్కువగాని యగుచుండును లేక సమముగా నుండును. 25 సం॥ రముల వయస్సున ఆరోగ్యవంతునకు బాహుధమనిలోని (Brachial artery) రక్తప్రవాహము యొక్క పీడనశక్తి 120" సిస్టాలిక్ 80° డయాస్టాలిక్ అని యంత్రముతో పరీక్షించి చెప్పుదురు. ఈ పీడనశక్తి యధిక మగుటకు పైన వివరించిన నాలుగు విషయములలోను దోషము లావహించవలెను. ఒక విషయము దోషయుక్త మయిన క్రమముగా మిగిలినవికూడ చెడును. ఇవి చెడుటకు బహుకారణము లున్నవి. గుండెకాయ వ్యాపా రము, రక్తనాళముల స్థితిస్థాపకత్వములు ఎక్కువగా మనస్సు

యధీనములో నున్నవి. కనుక అధిక మానసిక పరిశ్రమ, మానసిక క్షోభలు అధిక రక్తపోటునకు ప్రధాన కారణము లని చెప్పవచ్చును. రక్త పరిమితి భోజన పానీయములపై నాధారపడిన విషయము. రక్తనాళశాఖల కభ్యంతరము అనేక రోగహేతువుల వల్ల కలుగ వచ్చును. సిఫిలిస్ (Syphilis) వ్యాధి జీర్ణించిన వారికి చిన్న సిరలు దళసరి ఎక్కి, వాటిగోడ లలో సున్నపు లవణము నిలువయుండి (calcium deposits or calcification of end arteries) రక్త ప్రవాహమున కభ్యంతరము కలిగించును. ఇన్ని హేతువులలోనే యొక్కటి గాని అన్నియునుగాని కలిసి కన్పించిన నది అధికరక్తపోటు (hypertension) వ్యాధిగా పరిణమించుచున్నది. చాల మందికి డాక్టర్లు పరీక్షించి చెప్పేవరకు వారికిట్టి వ్యాధియున్న దను సంగతి తెలియకుండును. కొందఱు దాని ఫలితముగా కొన్ని బాధల ననుభవించుచుందురు. ఈ బాధలంత భయా వహములు కావు గాని ఈ వ్యాధిలో సంభవించు యుపద్రవ ములు చాల భయంకర మయినవి. ప్రాణాపాయము కూడ కలిగించును. రోగికి యధిక రక్తపుపోటు యున్నదని తెలియ కుండుటయే మంచిది. రక్తపుపోటు తాత్కాలికముగా కలిగి నందువల్ల వచ్చిన బాధలు స్వల్ప చికిత్సలకు నయమగు చున్నవి. రోగి చిరకాలములో స్వస్థుడగును. ఒకసారి, రోగికి రక్తపుపోటు యధికముగా నున్నదని తెలిసెనా, పదేపది సారులు యంత్రపరీక్ష చేయించుకొన గోరును. అతనికి పుట్టిన మానసికాందోళనయే అధిక రక్తపు పోటును యంత్రము ద్వారా చూపుటకు కారణ మగుచున్నది. ఇతరవేళల అనగా మనస్సు స్థిమితముగా ధైర్యముగా నున్నప్పుడు రక్తపోటు

అతని వయస్సునకు తగినంతగా నుండవచ్చును. రక్తనాళములో కలిగిన వికారము వలన (calcified arteries)ను సిరాస్రోతస్సుల కభ్యంతరము స్థిరముగా కలిగినప్పుడును సంభవించిన రక్తపోటు ఎల్లవేళల స్థిరముగానే అధికముగా కనిపించును. ఇట్టిదానికి చికిత్స లవసర మగును. ఉపేక్షించిన యెడల ననేక యుపద్రవములకు (complications) దారి తీయును. భయంకర మయిన ఉపద్రవములలో ముఖ్య మయినది (apoplexy) పక్షఘాతము. రక్తముయొక్క యధిక ఒత్తుడునకు మెదడులోని సన్న సిరలు తట్టుకోలేక పగులును. వెంటనే రక్తము స్రవించి, గడ్డకట్టి జ్ఞానవహాచలన హేతుక నాడీ కేంద్రస్థానములను (Motor and sensory nerve centres in the brain) నొక్కుట వలన వాత చలనము స్థంభించి, ఆనాడులు వ్యాపించిన శరీరభాగములు చచ్చుపడును. (paralyis of limbs) ఒకప్పుడు శ్వాసకేంద్రముల సమీపమున రక్తము చిమ్ముకొనిన ప్రాణాపాయము వెంటనే కలుగును. ఇంతటి దారుణోపద్రవములకు పూర్వరూపముగా నున్నది అధిక రక్తపోటు గనుక నెల్లరులు యీవ్యాధియనిన భయకంపితు లగుదురు.

## చికిత్స

## (Treatment of hypertension)

మోడరన్ వైద్యములో అధిక రక్తపోటును తగ్గించుటకు చాల తీవ్రతరమగు మందులున్నవి. నైట్రేట్సు పోటును తక్షణమే తగ్గించగలవుగాని వీనివల్లు మేలుకంటెను అపకారమే ఎక్కువ జరుగుచున్నది. వెరేట్రమ్విరిడి అను మందు

(Veratrum Viridi) గర్భిణీ స్త్రీలకు ఎక్లాంప్సియా యను వ్యాధి వచ్చినప్పుడు సంభవించిన అధిక రక్తపోటును తగ్గించుట కిచ్చుచున్నారు. పొటాషియం అయొడైడ్ చాలరోజులిచ్చినప్పుడు కొంత మేలు చేయగలదు. ఈ మందులకు సాయముగా లంఘన, స్వేదన, విరేచన సాధనములను చేయుట మంచిది. రక్తమోక్షణము (Veni-section and blood letting) చాలయధికపోటువలన కలిగిన ప్రమాదవస్థల నుండి తప్పించుటకు చేయబడుచున్నది. నేడు భారతదేశీయ ఓషధి (సర్పగంధా) (Rowulfia serpentina) అధిక రక్త పోటు నమోఘముగ తగ్గించుచున్నదని మోడరన్ వైద్య శాస్త్ర పరిశోధకులు కనుగొనినారు. హిమాలయా డ్రగ్ కంపెనీ వారు తయారు చేసిన మందు ప్రశస్త మయినది. నిరపాయకరముగా సౌమ్యముగా అధిక రక్తపోటును తగ్గించ గలదు.

ఆయుర్వేదములో నధిక రక్తపోటు ప్రశంస కానరా దనుకొనువా రున్నారు. రక్తప్రచారకార్యము వాత పిత్త కఫ ముల యొక్క సమిష్టి కార్యఫలితమని తెలిసికొని యున్నాము. వాత పిత్తాధిక్యముల వలన రక్తప్రవాహమునకు అధికమయిన బలము కలుగుచున్నది. వీనితో కఫము కూడ వృద్ధి చెంది చేరిన యడల రక్తపరిమితి యధికమై నాడి లావుగా కన్పించును. నాడియందలి యధిక బలము, పుష్టిని గ్రహించుటకు యంత్రసాయ మపేక్షించకయే మనవారు వ్రేళ్లతో స్పృశించి గ్రహించగలరు. నాడిపై నుంచిన మూడు వ్రేళ్ళలోను మోచేతివైపు నుండిన వ్రేలుతో గట్టిగా నొక్కి కెరటము

దిగువ వ్రేళ్ళక్రింద కనిపించకుండా చేయవలెను. ఎక్కువ బలము నుపయోగించిన నాడి నిలిచిపోవును. తక్కువ బలముతో నొక్కిన క్రిందికి త్రోసికొని వచ్చును. కనుక ఒకసారి నొక్కుచు యింకొకసారి వదలుచు ఎక్కువ బలముగాక తక్కువ బలముగాక నాడి కెరటము నిలుచుట కెంతటినొక్కుడు కావలెనో అంతే బలముతో నాడిని నొక్కి అరికట్టవలెను. దీని నరికట్టుట కుపయోగించిన బలమునకు సమానమయిన బలముతో నాడి ప్రవాహము నడచుచున్నదని చెప్పవచ్చును. అనుభవము చేతను రోగికి వయస్సునుబట్టి ఆరోగ్యావస్థలో నుండవలసిన దానికంటె నెక్కువ బలముతో రక్తము ప్రవహించుచున్నదని తెలియవచ్చును. ఇదియే అధిక రక్తపోటు యనబడును. నాడి కెరటమును నిలగొట్టిన పిమ్మట దిగువ రెండు వ్రేళ్ళతో కాళీ గొట్టము నిటునటు దొర్లించి నొక్కి చూచినప్పుడు గొట్టము మెత్తగానున్నదో లేక గట్టిపడి నులక త్రాడువలె నున్నదో తెలియవచ్చును. ఈపరీక్ష వలన రక్తనాళ పరిస్థితి యందలి మార్పులను గ్రహించ వచ్చును. యంత్రసాయముతో కనిపెట్టిన అధిక రక్తపోటు విషయము కంటెను స్పర్శజ్ఞానము ద్వారా సంపాదించిన జ్ఞానమే యదార్థముగా నుండగలదు. అధిక రక్తపోటు స్థితికి ఆయుర్వేద వైద్యులు లంఘన, స్వేదన, వమన, విరేచనాది శోధన కర్మల ద్వారాయును, పిమ్మట దోషానుగుణ చికిత్సల ద్వారాయును చికిత్సచేయుచుందురు. షడ్గుణము, సిద్ధమకరధ్వజము వసంతకుసుమాకరము మొదలైన రసాయనౌషధములు రక్తపుపోటును సౌమ్యముగా తగ్గించగలవు. ప్రమాదకర స్థితులలో రక్తమోక్షణక్రియ నాచరించ వచ్చును.

# 9వ అధ్యాయము

## రక్త వ్యాధులు

## (Blood diseases)

1. Anaemias — పాండు, కామిలా రోగములు.

రక్తమందలి తేజోయంశలు తగ్గి, కఫము వృద్ధియైనందున రక్తమునకు సహజమైన ఎరుపురంగు తగ్గి పలుచనగుచున్నదని ఆయుర్వేదజ్ఞులు చెప్పుదురు. రక్తమందలి తేజోయంశ లనగా హిమోగ్లోబిన్ పదార్థమని పాశ్చాత్యుల శారీర శాస్త్రము చెప్పుచున్నది. ఈ పదార్థము భుజించిన యాహార మందలి లోహద్రవ్యము (organic iron) తో యకృత్ లో నిర్మింపబడు చుండును. లోహద్రవ్యమును పచనము గావించి హిమోగ్లోబిన్ గా తయారుచేయుచున్న యగ్నికి రంజితాగ్ని యని ఆయుర్వేద తంత్రకర్తలు వ్యవహరించినారు.

పాండురోగము తొలుతనే రక్తములో పుట్టవచ్చును. కేవల రక్తదోషజనిత వ్యాధికి స్వతంత్ర పాండు (primary anaemia), పారతంత్ర వ్యాధికి (secondary anaemia) అనియు చెప్పుదుము. పారతంత్ర లేక అనుసరణపాండువు మొదటివ్యాధి నయమయిననగాని కుదరదు. స్వతంత్రపాండువు రెండు రకములుగా కన్పించునని మోడరన్ వైద్యశాస్త్రము చెప్పును. 1. Pernicious anaemia పెర్నిషస్ ఎనీమియా 2. Chlorosis క్లోరిసిస్. ఈ రెండును అసాధ్య వ్యాధులు. ఒకదానిలో హిమోగ్లోబిన్ పదార్థము తగ్గుచున్నది. రెండవ వ్యాధిలో రక్తమందలి ఎర్రకణములు విపరీతముగా నాశన

నొందును. ఈ ద్రవ్యనాశనమునకు ప్రధాన హేతువులు ప్రేగులలో పుట్టుచున్న నొకరకము విషపదార్థములని (auto-toxines) అని పేథాలజీశాస్త్రము బోధించుచున్నది.

చికిత్స:- రెండు వైద్యములలోను అనాది కాలము నుండి రక్తవృద్ధి కొరకు లోహద్రవ్యములను తినిపించు నాచారమున్నది, సత్ఫలితము బొందవచ్చును కాని రెండు లేక మూడు మాసములు మందు తినవలెను. తినిపించిన లోహద్రవ్య మెట్లిక్షముగా రక్తవృద్ధికి తోడ్పడుచున్నదను విషయమును డాక్టరు బంజి (Dr. Bunge) గారు పరిశోధనలుచేసి ఈ క్రింది విషయములను కనుగొనినారు. 1) రక్తవృద్ధికి కావలసినది జీవలోహ ద్రవ్యము (organic iron). ఇది జంతు మాంస, వృక్షములలో విశేషముగా లభించుచున్నది. 2) మనము చికిత్సగా వాడుచున్న లోహద్రవ్యము (Metalic iron preparation) పార్థివద్రవ్యము. అయినను రక్తవృద్ధి జరుగుచుండుట చూచుచున్నాము. అదెట్లు సంభవించుచున్నదనగా పార్థివలోహము ప్రేగులలో పుట్టుచున్న విషపదార్థముల నరికట్టి తొలగించుట వలన ఆహారపదార్థము లందలి జీవలోహ ద్రవ్యము నిరాటంకముగా యకృత్, రక్తములోకి చేరుచున్నవి. కొంతభాగము పార్థివలోహముకూడ యకృత్ లోకి పోగా నచ్చటది జీవద్రవ్యముగా మార్పు జెందును. 3) ప్రేగులలో పుట్టుచున్న విషపదార్థములను auto-toxins అరికట్టుటకు చాలభాగము పార్థివలోహ ద్రవ్యము వినియోగమగుచున్నది. ఇట్టి శక్తి యితర లోహములకుగూడ కలదు. పాదరసము మిక్కిలి శక్తివంత మయినది. (intestinal

antiseptic) కనుక రసౌషధముల ప్రయోగము, కాంత వల్లభ రసము, షడ్గుణము, మకరధ్వజము, కాసీసము రక్త వృద్ధి హేతువులుగా నున్నవి. ప్రేగులు నిర్దోషములుకాగా జీవలోహద్రవ్యము నధికముగా గలిగిన యాహార పదార్థములను తినిపించినప్పుడు రక్తవృద్ధి త్వరగా కలుగును. గుంటగలగర, బ్రాహ్మి, పొన్నగంటి, అవిశ, మునగకాయ, గోంగూర మొదలైన ఆకులలో జీవలోహద్రవ్య మెక్కువగా నున్నది. కనుక ఆయుర్వేద వైద్యులు ఈ ఆకులను తినిపించెదరు. వీటితో లోహము, ఉక్కు, కాంతములను భావన మర్దనలు చేసి పుటము బెట్టుదురు. జంతు రక్తములోను, మేక యకృత్ లోను జీవలోహద్రవ్యము సమృద్ధిగాలభించగలదు గనుక మోడరన్ వైద్యులు లివర్ ఎక్స్ట్రాక్టును త్రావించెదరు. ఇంజెక్షనులుచేయుచుందురు. విటమిన్ బి12 రక్తవృద్ధికి సహాయకారి గనుక దీనిని నింజెక్షనులు చేయుచుందురు. ఈ విటమిన్ ద్రవ్యమును మనవారు మందుతయారుచేయుటలోనే సంపుటీకరణముచేయబడుచున్నది. అనుపాన ద్రవ్యరూపములుగా కూడ నిత్తురు.

## రక్తపిత్తవ్యాధి (Hoemophilia)

ప్రకుపితపిత్తము రక్తముతోచేరి రక్తధాతువును చెఱచును. పిత్తోష్మముచే మాంసము ద్రవించి రక్తము నధికపరచి పలుచగా తయారుజేయును. వివిధ స్రోతోమార్గముల ద్వారా రక్తస్రావములు తఱచు సంభవించును. వాతబలముచేతను అధోమార్గములద్వారాయును, కఫోల్బణముచేతను ఊర్ధ్వమార్గములద్వారాయును, రక్తస్రావములు జరుగు

చుండును. స్రావితరక్తము నల్లగానుండి పిత్తసంసర్గముచేత దుర్గంధయుక్తమగును. ఈవ్యాధి పిత్తశామక ఔషధములతో శమించగలదు.

మోడరన్ వైద్యములో నీవ్యాధి వంశపరాపరా లభించుచున్నదని యందురు. ఇట్టి శరీరతత్త్వమునకు (Hoemophelic diathesis) అనిపేరు. సంగ్రహణ్యౌషధ ప్రయోగములతో అనగా కేల్సియం ఇంజెక్షనులిచ్చి రక్తస్రావముల నరికట్టుటకు ప్రయత్నించెదరు. స్కర్వీయని చెప్పిన వ్యాధి రక్తపిత్తస్థితియే యనవచ్చును. విటమిన్ సిద్రవ్యలోపమువల్ల కలిగినదని యందురు. సి. విటమిను యింజెక్షనులు ఇచ్చి నయముచేయుదురు. విటమిన్ కే ద్రవ్యము రక్తస్రావముల నరికట్టును.

పచ్చకామిర్లు (Jaundice) వ్యాధిలో పైత్యరసము (Bile) రక్తముతో కలిసి సర్వశరీరమందును సంచరించును. దీని సంసర్గముచేతను పిత్తరక్తస్థితి ఏర్పడి తరచుగా రక్తస్రావములు సంభవించును.

---

## 10 వ అధ్యాయము

## యకృత్ప్లీహ వృద్ధులు

## Liver and Spleen enlargement.

యకృత్ప్లీహములు రెండును జంట అవయవములు. రక్తాశయములని రెండు వైద్యశాస్త్రము లంగీకరించినవి. ఈ రెండును వృద్ధిజెందిన పరిస్థితిలో నొకేమందుతో నయముకాగ

లవు. యకృత్ సామాన్యముగా వృద్ధిజెందుటకు కారణము అజీర్తిరోగము గనుక దీనిని అజీర్తిబల్ల యనియు, జ్వర హేతువువలన తఱచుగా ప్లీహము వృద్ధిజెందును కనుక ప్లీహ వృద్ధికి జ్వరబల్ల యనియు వ్యవహరించెదరు. డొక్కయంచుల దిగువను యీ అవయవములు వ్రేలికి గట్టిగా తగిలినప్పుడు వృద్ధిజెందినవని చెప్పుదుము. కాని క్రిందికి జారినప్పుడు కూడను వ్రేలికి తగులవచ్చును. జారిపోయినదో లేక నిజ ముగా వృద్ధిజెందినదో దానిమీఁది యంచును పెర్కషన్ పద్ధ తిని (Percussion) తెలిసికొనినగాని స్పష్టముగా చెప్ప లేము.

యకృత్ప్లీహ వృద్ధులకు కారణములు:- టైఫోయిడ్ జ్వరములో రెండు నొకేసారి వృద్ధియగును. మలేరియా, కాలాజార్ జ్వరములలో ప్లీహము ఎక్కువగా వృద్ధిజెంది కన్పించును. స్ప్లీనోమెగాలి (Spleno-megali) అను రక్త వ్యాధిలోకూడ విపరీతవృద్ధి కన్పించును. దీనికంటె యకృత్ వృద్ధి చాల తఱచుగా పిల్లలలో సంభవించును. పెద్దవారికి యరుదుగా కనిపించును.

పిల్లలకు 2-5 సంవత్సరములమధ్యను యకృత్ వృద్ధి అజీర్తిరోగమువల్లనే కలుగుచున్నది. స్టార్చి పదార్థమును శక్తికిమించి అమితముగా నిత్యము భుజింపజేసిన ప్రేగులలో జీర్ణముగాక నిలిచియుండి మురిగినందున విషపదార్థములు (auto-toxines) ఆల్కహాల్ (alcohol) పుట్టి, యవి యకృత్ లోకి పోయి దానిని చెఱచి వృద్ధిపరచును. ప్రేగు లలో తయారైన అన్నరసమును పీల్చుకొనే శక్తి తగ్గిపోవుట (absorption) కూడ ఒకవిధమయిన యజీర్తి కాగలదు.

పసిపిల్లలలో నీవిధముగా ప్రేగుపొరలు చెడుటకు కారణము తఱచుగా నాముదమును ప్రతిరోజు పట్టుట ఒక ముఖ్య కారణము కాగలదు. పసిపిల్లలకు పుట్టుకతోనే యకృత్ వృద్ధిజెంది యుండుటకు కారణము తల్లిదండ్రులకు జీర్ణించి యుండిన సవాయి (Syphilis) రోగమని డాక్టర్లు చెప్పుచున్నారు.

ఇక పెద్దవారికి యకృత్ వృద్ధి మద్యపానాసక్తులలో తఱచుగా సంభవించును.

యకృత్ వృద్ధికి చికిత్స హేతునిర్మూలముపై నాధారపడినది. గనుక కష్టసాధ్యమని చెప్పబడును. పరిశుద్ధమయిన యసదభస్మము (Zinc oxide) యకృత్ వృద్ధిని నయము చేయగలదని యింగ్లీషు డాక్టర్లు నమ్ముచున్నారు ఆయుర్వేద వైద్యులుకూడను జసదభస్మము, శృంగిభస్మములను, రసౌషధముల నిచ్చుచుందురు. టెక్కలిమందులు, జమీన్దారి మందులలో ప్రధానాంశ లివియే. 5 సం॥ముల లోపుపిల్లలకు ప్రతిరోజూ నొకేవేళ జ్వరముతగిలి విడుచుచున్నదని చెప్పినప్పుడు మలేరియా యనుకొని తొందరపడి క్వైనైన్ మందు నియ్యకూడదు. క్వైనైన్ రక్తమును మరింత పాడుజేయును. శరీరశక్తుల నణచివేయును జీర్ణకోశమును బాగుపరచిన జ్వరము పిల్లలకు త్వరలో నుపశమించగలదు. యకృత్ వృద్ధి వలన సంభవించు యుపద్రవములు (Complications). (1) పచ్చకామిర్లు (Jaundice) (2) మలబద్ధకము (Constipation) (3) మూలవ్యాధి (piles) (4) జలోదరము (ascitis) (5) మానసికవికారములు (mental irritation)

ఉపద్రవలక్షణములు కన్పించిన పిమ్మట యక్ర్ ద్రోగము చికిత్స కసాధ్యమగును.

## సుఖవ్యాధులు 11వ అధ్యాయము

## Sexual diseases.

కామతృష్ణపీడితులు తాత్కాలిక సుఖము నపేక్షించి వ్యభిచరించుటవలన నీవ్యాధులు సంభవించును. స్త్రీ పురుషులలో నేయొకరికి యీ వ్యాధులుండినను అవి రెండవవారికి సంక్రమించును. ప్రస్తుతము మనదేశములో నీవ్యాధి పీడితుల సంఖ్య చాల పెరుగుచున్నది. మనుష్యులకు సంభవించు సుఖవ్యాధులలో రెండురకము లతిముఖ్యములు (1) గనేరియా (Gonorrhoea) (2) సవాయి లేక ఫిరంగిరోగము (Syphilis) ప్రాచీనాయుర్వేద గ్రంథములలో సుఖవ్యాధుల ప్రసక్తి కానరాదు. మనవారికి విదేశీయులతో సంపర్కము కలిగిన పిమ్మట అనగా 16వ శతాబ్దమున డచ్చి, పోర్చుగీసులద్వారా యీరోగములు సంక్రమించినవి. ఇటీవల వ్రాయబడిన ఆయుర్వేద గ్రంథములలో నీవ్యాధులకు చికిత్సలు చెప్పబడినవి.

I గనేరియావ్యాధి (Gonorrhea):- ఇది మూత్రనాళములో నారంభమయి క్రమముగా శరీరములోకి ప్రవేశించును. వ్యాధి సంక్రమించిన మొదటి రోజులలో మూత్రమార్గమున పుండు పుట్టి చీము స్రవించుటవలన మనవారు దీనిని పూయమేహరోగమని వ్యవహరించిరి. ఈచీములో గనేరియాక్రిములను (Gonococci) భూతయద్ద సాయమున ప్రదర్శించవచ్చును. క్రమముగా చీము రోగక్రిములు శరీరాంతర్భాగములకు వ్యాపించి వాటిని వ్యాధియుక్తములుగా

నొనర్చును. మూత్రనాళమందలి పుండు చిరకాలము బాధించును. పుండు మానిన పిదప నాళము సన్నగిలి మూత్ర కృచ్ఛ్రము (Stricture of urethra) మూత్రబంధముల (obstruction of urine) కలిగించును. మూత్రాశయము లోకి వ్యాపించి వాపును కలిగించును. శరీరగ్రంధులు వాచును, కీళ్ళు వాచును. హృదయము ఆమాశయములు చెడును.

చికిత్స:- ఆయుర్వేద వైద్యులు గనేరియా వ్యాధికి విదేశములనుండి సంపాదించిన కోపైబా, చందనము, చలువ మిరియాలను వాడుచుందురు. కోపైబా విదేశములలో నీవ్యాధి నయముచేయుటకు చాల ప్రసిద్ధిచెందినది. వీని అర ఖులను కూడ వాడుదురు. నేటి కాలమున పెనిసిల్లిన్ యింజెక్షనులు, సల్ఫాడ్రగ్సు యీవ్యాధిని అమోఘముగా నయము చేయుచున్నవి

II సవాయి లేక ఫిరంగిరోగము (Syphilis).

ఈవ్యాధి మొదట మేహనాంగములపైన పుండుతో నారంభమగును. దీనికి ఉపదంశమని మనవారు పేరు పెట్టిరి. ఇంగ్లీషున షేంకర్ (Schancer) అందురు. చాల రోజులకు గాని మానదు. శరీరమందలి రసగ్రంధులన్నియు వాచును. రోగక్రిములు రక్తగతమై శరీరావయవ భాగములలో స్థిర వాస మొనర్చుకొని క్రమముగా వాటిని జెఱచుటవలన పలువిధ రోగములు సంభవించుచున్నవి. ఒకసారి వ్యాధి సోకిన రోగి ఆజన్మాంతము నేదో రూపముతో బాధ యనుభ వించుచుండును. మరియు తండ్రి చేసిన యపచార నేరమునకు

అతని సంతానముకూడ శిక్ష ననుభవించవలసి యుండును. (Hereditory). ఈరోగక్రిమి కుష్ఠువ్యాధి సూక్ష్మక్రిమి జాతిలో చేరినది. గనుక వ్యాధి జీర్ణించిన పిమ్మట కనుపించు లక్షణములన్నియు కుష్ఠువ్యాధిని పోలును.

## VII భాగము - శల్యతంత్రము

### శస్త్ర చికిత్సలు Ayurvedic Surgery.

ఆయుర్వేదములో శస్త్రచికిత్సలు చెప్పబడెనా? యని ప్రజలు సందేహించవలసినంత దుస్థితి పట్టినది. ఆయుర్వేదములో మందులిచ్చుటేగాని చిన్న గాయమునకు కట్టు కట్టుటకు వెనుకాడుచుందురు. నేటి ఆయుర్వేదవైద్యులు. వైద్య పాఠశాలలలో నీశాస్త్రభాగమును జదివియు నాచరణలో బెట్టకున్నారు.

సుశ్రుతుడు గొప్ప శస్త్రచికిత్సకుడు. ఈతనికి పూర్వము శస్త్రచికిత్స మనదేశములో లేదని చెప్పలేము. మహారాజుల యాస్థానములలో శస్త్రచికిత్సకులుండి, యుద్ధములలోను వేటాడుటలోను గాయముపడినవారికి ఆపరేషనులుచేసి గాయముల మాన్పుచుండెడివారు. అయితే సుశ్రుత సంహితయే శస్త్రచికిత్సా విషయమును వ్రాసిన మొదటి ప్రామాణిక గ్రంథము. అష్టాంగహృదయకర్త శస్త్రచికిత్సా విషయములను సుశ్రుతు ననుసరించియే వ్రాసెను. క్రీస్తు పూర్వము 2500 సం॥రముల నాడాచరింపబడిన శస్త్రచికిత్సా పద్ధతులకును నేడు అమలులోనున్న మోడరన్ శస్త్రవిధానమునకును పరస్పరానుకూల మెంతవఱకు

కుదరగలదు? విభిన్న విశిష్ట విషయములేవి? యని పరిశోధకులు పరిశీలించి విశిష్ట విషయములు మేలుగానున్నప్పు డొకరినుండి యొక్కరు నేర్చుకొనుటవసర మగును. ఈపరిశోధనకు ప్రభుత్వాదరణము కావలెను. వైద్యపాఠశాలలలో మోడరన్ సర్జరీ పాఠములకు స్థానమిచ్చి ఆయుర్వేదీయ శస్త్రచికిత్సల నశ్రద్ధజేయుట అన్యాయమగును. ఇప్పటికే నీ శాస్త్రము ఆయుర్వేద పుస్తకభాండాగారముల నలంకరించినది. ప్రజా సామాన్యమునకు అజ్ఞాతమగుటయేగాక వైద్యుల దృక్పథమునుండి క్రమముగా మాయమయినది. ఆయుర్వేద వైద్య విద్యార్థులు పరీక్షలకొరకు మాత్రమే చదువుచుండుట విచారకరము. లోపభూయిష్ఠ విషయములను, అనగా మేలు సాధనోపాయములను, యన్త్రశస్త్రములను, చికిత్సాపద్ధతులను, చికిత్సాద్రవ్యములను మోడరన్ వైద్యశాస్త్రములోనుండి గ్రహించి, పట్టభద్రులగు ఆయుర్వేదవైద్యు లాచరణలో బెట్టుట వారిధర్మము. నేటి మోడరన్ శస్త్రచికిత్సానిపుణులు (Modern Surgeons) కూడ వ్రణరోపణద్రవ్యములను తాము వాడుచున్న వానికంటె ప్రశస్తములని ఋజువైన వాటిని గ్రహించి తమశాస్త్రమును వృద్ధిచేసికోవచ్చును. ఆయుర్వేదపద్ధతులలో విశిష్టవిషయములను పరిశీలించవచ్చును. రెండు వైద్యశాస్త్రములందలి శస్త్రచికిత్సాపద్ధతులు, యన్త్రశస్త్రసామగ్రి, నిదానోపకరణములు, చికిత్సాపద్ధతులు సామాన్యముగానున్న వాటిని వివరించిన పిమ్మట రెండింటిలోనున్న విశిష్టవిషయములు తెలుపబడును.

---

## ఆయుర్వేదశస్త్ర చికిత్సాపద్ధతులు

ఆయుర్వేదశస్త్రచికిత్సాశాస్త్రము రెండుభాగములుగ నున్నది. (1) శల్యతంత్రము- శరీరములో గ్రుచ్చుకొనిన బాణములు, యినుప ముక్కలు, కొయ్యలు, రాళ్లు మొదలైనవిగాని, శరీరము లోపలభాగమందు వ్యాధి ఫలితముగా పుట్టిన కురుపులు (abscess), కణుతులు (tumours) చీము, రక్తము, దుష్టద్రవములుగాని, బాధను కలిగించుచున్నవన్నియు శల్యములనబడును. ఈ శల్యములను కోసి, ఉపాయముగా వెలికిదీసి గాయములను మాన్పుటను బోధించు శాస్త్రభాగమునకు శల్యతంత్రమని పేరు.

(2) శలాక్యతంత్రము (treatment of ear, eye, nose and throat by surgical means) చెవి, కన్ను, ముక్కు, గొంతుకరోగములను శస్త్రచికిత్సా పద్ధతులతో నయముచేయుటకు శలాక్యతంత్రమని పేరు.

శస్త్రకర్మ ఎనిమిది విధములుగా నుండును.

1. ఛేద్యం=తెగగోయుట=amputation.
2. భేద్యం=చీల్చుట=cut open, split, excise.
3. లేఖ్యం=గీచుట=incision or scarification.
4. వేధ్యం=గ్రుచ్చుట=puncture or tapping.
5. ఏష్యం=గాయములోతును పరిశీలించుట (probing).
6. ఆహార్యం=పెల్లగించుట=Extraction. వెలికిలాగుట.

7. వి|స్రావ్యం=చీము, |ద్రవమును వెడలించుట=drainage or aspiration.

8. సీవ్యం=కుట్లు వేయుట=Suturing.

శ|స్త్రకర్మకు కావలసిన పరికరములు.

యన్త్రములు (blunt instruments to catch' probe and extraet foreign bodies), శ|స్త్రములు= cutting instruments such as knives, saws etc, క్షార |ద్రవ్యములు=herbal alkaline preparations అగ్ని=fire, శలాకలు (probe and director), శృంగ ములు (horns for aspirating flinds), జలగలు= leeches to extract impure blood from the part పిచువు=cotton wool, |ప్లోతము=Gauge cloth, సూ|త్రము=ligatures, ఆకులు, పట్టులు, తేనె, నెయ్యి, వస, పాలు, తైలము, పేలపిండి, కషాయములు, లేపములు, కల్కములు, విసనక|ర, శీతోదక యుష్ణోదకములు, పా|త్రలు, పరిచారకులు.

## 2వ అధ్యాయము

## యన్త్ర శస్త్రములు.

## Surgieal instruanents.

I యన్త్రములనగా శల్యముల నూడదీయుటకు వినియో గించు వివిధరకముల పటుకారులు, శోధింపుటకు పుల్లలు మొదలగునవి.

II శస్త్రములనగా కోయుటకు, గ్రుచ్చుట కుపయో గించు దారుపత్రముగల కత్తులు, సూదులు.

సుశ్రుతుడు 101 యన్త్రములను 20 రకముల శస్త్రములను వివరించెను. వాటి నిర్మాణపద్ధతి, ప్రమాణములు, ఉపయోగ విధానములు విపులముగా చెప్పబడినవి. దుష్టసాధనములవలన కలుగు నష్టములనుకూడ చెప్పెను.

యన్త్రిములు=Blunt instruments.

సుశ్రుతుడు 101 యన్త్రిములను 6 వర్గములుగా విభజించెను.

1. స్వస్తిక యన్త్రిములు - అనగా పటుకారులు ... 24
వీనిలో 9 యన్త్రిములు సింహము, పులి, తోడేలు, మొదలైన వన్యమృగములయొక్క ముఖములవంటి ముఖముగలవి. 15 కాకి, గ్రద్ద మొదలైన పక్షుల ముక్కులను బోలిన ముఖములు గలవి. ఇవన్నియు శల్యముల నూడదీయుటకు పనికివచ్చును. వీనికి యింగ్లీషున Catch forceps లని యందురు.

2. సందంశయన్త్రములు=Spincers, artery forceps 2

3. తాల యన్త్రిములు=Spoonlike for scraping ముక్కు, చెవిలో చిక్కుకొనిన శల్యముల దీయుటకు. 2

4. నాడీయన్త్రిములు=Tnbe like instruments 20
వీని ప్రయోజనములనుబట్టి యనేక రూపములుగా నుండును. ఇవి నాలుగు రకములుగా విభజింపబడినవి.

(a) స్రోతోగత శల్యోద్ధరణ నాడీయన్త్రములు

(b) దర్శన నాడీయన్త్రములు=Specnlums

ear and nose speculums=చెవి, ముక్కు రంధ్రములను దర్శించుటకు

Anal speculum=గుదపరీక్షకు

Vaginal speculum=యోనిని దర్శించుటకు

(c) అచూషణ నాడీయన్త్రములు=Catheters, trochar and canula.

(d) క్రియాసౌకర్య నాడీయన్త్రములు - సుఖముగా శస్త్ర క్షారక్రియ లొనర్చుటకు (cauterization)
ఇంకను నాడీవ్రణ ప్రక్షాళనయన్త్రము=irrigator
కంఠశల్యోద్ధరణ యన్త్రము=probang, స్తనాచూషణయన్త్రము=breast pump మొదలైనవి.

5. శలాకయన్త్రములు - ఇవి 28 రకములుగా నున్నవి.

1. గండూపదముఖ యన్త్రము=Blunt probe
2. సర్పఫణముఖ యన్త్రము=Scoop
3. శరపుంఖ యన్త్రము=చాలన క్రియకు
4 బడిశముఖ యన్త్రము=Hook
5. మూత్రమార్గశోధని యన్త్రము=Urethral sound
6. గర్భశంకు. యన్త్రము=Crochet
7. యన్త్రవర్త్మశలాకా యన్త్రము=truss

6. అను యన్త్రములు - యితర సాధనములు, ౖవేళ్ళు, గోళ్లు మొదలగు యన్త్రములతో చేయు క్రియలు.

1. నిర్ఘాతనము=To clip out=తుంపుట
2. వ్యూహానము=to bind=కూర్చుట
3. అచూషణము=aspiration
4. ఏషణము=Searching
5 దారణము=cut open or excise.
6. ఉన్మథన=చిలుకుట లేక యిటునటు త్రిప్పుట to churn, to turn this and that way
7. పూరణ=నింపుట=to fill up
8. ఆహరణ=గ్రహించు=To extract or pull out
9 బంధన=కట్టుట=to bind
10. పీడన=నొక్కుట=to press
11. ఉన్నమన=పైకెత్తుట=to raise up

శస్త్రములు

Sharp and cutting instruments

ఇవి 20 రకములుగా నున్నవి. కోతపనికి గ్రుచ్చుటకు పనికివచ్చును.

(1) మండలాగ్రశస్త్రము=Sharp curret or blunt knife.
(2) కరపత్ర శస్త్రము=రంపము=saw
(3) వృద్ధిపత్ర శస్త్రము=Razor
(4) నఖశస్త్రము=nail clipper

(5) అర్ధధారశస్త్రము=half edged knife

(6) ముద్రికాశస్త్రము=Tonsill or giullette

(7) ఉత్పలశస్త్రము=long bladed knife

(8) సూచీశస్త్రము=needle

(9) కుశపత్రశస్త్రము=narrow bladed knife

(10) అతిముఖశస్త్రము=Broad bladed knife

(11) శరారిముఖశస్త్రము=scissors

(12) అంతర్ముఖశస్త్రము=Bistuary, a sharp pointed curved knife

(13) త్రికూర్చకశస్త్రము =trochar

(14) కుంఠారిపశస్త్రము=axe like knife (gum lancet.

(15) వ్రీహీముఖశస్త్రము=puncture needle

(16) ఆరాశస్త్రము= awl చెప్పులు కుట్టు పనిముట్టు

(17) వేతసపత్రశస్త్రము=Narrow bladed knife

(18) బడిశశస్త్రము=Hooked Knife

(19) దంతశంకు లేక దంతలేఖన శస్త్రము= Dental scarifier

(20) కటారిశస్త్రము=Scissors

జలగలు; నిప్పు, గోళ్లు, వేళ్లు, కార్చ్వనగడ్డి ఉపశస్త్రములగును.

## రక్తస్రావము నాపుటకుపాయములు

శ్లో॥ చతుర్విధం యదే తద్ధి । రుధిరస్య నివారణమ్।
సంధానం స్కందనం చైవ । పాచనం దహనం తథా।
(సుశ్రుత)

1. సంధానము = అతుకులు

2. స్కందనము = మంచుగడ్డల నుంచుట

3. పాచనము = భస్మముల జల్లుట

4. దాహము = కాల్చుట ఈ ఉపాయములచేతను వ్రణ మందలి సిరలు సంకోచముపొంది రక్తస్రావము నిలుచును.

మోడరన్ శాస్త్రములో తెగిన సిరాముఖములను ఆర్టరీ ఫార్సెప్సుతో కొంతసేపు పట్టియుంచిన రక్తస్రావము నిలిచిపోగలదు. పెద్దసిరలు తెగినప్పుడు వానిముఖములను ఆర్టరీఫార్సెప్సుతో పట్టుకొని సిల్కుత్రెడ్ (పట్టుదారముతో) సిరాముఖములను కట్టి ఫార్సెప్సు తీసివేయవచ్చును.

## 3వ అధ్యాయము

## బంధనములు (Bandages)

స్థలభేదముల ననుసరించి మూడు విధములుగా నుండును.

(1) దృఢబంధనము—తొడలు, పిరుదులు, చంకలు, గజ్జలు, శిరస్సునకు గట్టిగా బిగించి కట్టవలెను.

(2) సమబంధనము — కాళ్లు, చేతులు, ముఖము, చెవులు, బొమ్మ, పృష్ఠము, పార్శ్వములు, కంఠము, ఉదరము మేఢ్రము, వృషణములు.

(3) శిథిల బంధనస్థానములు— నేత్రములు, సంధులు,

బంధనప్రయోజనములు మూడు:—

1. విరిగిన అస్థులను స్వస్థానమందు యథాప్రకార ముంచి కదిలిపోకుండ బిగించి కట్టినచో నవి సరిగా నతుకు కొనును.

2. స్నాయు, సిరా, మాంస, చర్మములను ఛేదించిన పిమ్మట దగ్గఱగా కూర్చికట్టినచో తిరిగి యవి అతుకు కొనును.

3. కట్టిన భాగమునకు చలనము లుండవుకనుక బాధ యుండదు. బంధన రకములు:-

( 1) కోశబంధము=Stump bandage

( 2) స్వస్తికాబంధము=Cross bandage

( 3) ముత్తోలికాబంధము=figure of eight bandage

( 4) చీనబంధము=hanging loose over the eye

( 5) ధామబంధము=circular bandage

( 6) అవేల్లితబంధము=Spiral bandage

( 7) ఖట్వాబంధము=for chin గడ్డమునకు కట్టునది

( 8) విబంధనం=over chest and shoulder

( 9) స్థగికబంధనం=Round bandage over penis

(10) వితానబంధము=turban like bandage

(11) ఉత్సంగబంధము=Sling bandage

(12) గోఫణబంధము=over nose and head

(13) యమకబంధము=double bandage for arm

(14) మండలబంధము=round bandage

(15) ప్రచ్ఛాంగిబంధము=over head and eyes.

అస్థిభగ్నములు=Bone fractures.

1. సంధిచ్యుతము=Dislocation of bony joints.
2. కాండభగ్నము=fracture of the shaft of long bones.

కాండభగ్నములు తొమ్మిదిరకములు

(1) కర్కటకము
అశ్వకర్ణకము } =cracked fracture

(2) విచూర్ణితము=unseparated fracture

(3) పిచ్ఛితము=maliable fracture

(4) అస్థిచల్లికము=depressed fracture

(5) కాండభగ్నము=Shaft fracture into two pieces

(6) మజ్జానుగతభగ్నము=impacted fracture

(7) అతిపాతితభగ్నము=Star shaped or stellate fracture

(8) చిన్నభగ్నము=greenstick fracture

(9) పాటితభగ్నము=Splintered fracture.

వ్రణములు=wounds.

దోషజవ్రణములుగాక ఆగంతువ్రణముల పేర్లు.

(1) ఛిన్నవ్రణము=Cut wounds

(2) భిన్నవ్రణము=Ruptured wounds

(3) విద్ధవ్రణము=penetrative wound

(4) క్షతవ్రణము=Traumatic wound

(5) పిచ్ఛితవ్రణము=Contused wound

(6) ఘృష్ణవ్రణము=wound caused by pressure as bedsore.

(7) అగ్నిదగ్ధవ్రణము = Burns and scalds.

(a) ప్లుష్టము = చర్మము వివర్ణతచెందును 1 st degree burn

(b) దుర్దగ్ధము=బొబ్బలెక్కును purtulation 2° ,,

(c) సర్వదగ్ధము = చర్మమంతయుకాలును... 3° ,,

(d) అతిదగ్ధము = చర్మము, మాంసము సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు కాలును.

---

## 1 విద్రధి శస్త్రక్రియావిధానము.*

## Operative treatment of abscess.

చిన్నగడ్డను (abscess) ఆపరేషను చేయుటకుకూడను మనవారు శుభతిథి, వార, నక్షత్ర, ముహూర్తములను, వర్జ ఘడియలను చూచుకొని చేయుచుండిరి. రోగి ముందుగా బ్రాహ్మణులను, వైద్యునిపూజించి, లఘ్వాహారమును భుజించి తూర్పుముఖముగా రోగియుండి వానికెదురుగా వైద్యుడు. నిలిచి, మర్మస్థానముల తప్పించి, సిరా, స్నాయు, ధమనులు తెగకుండ ఒక్క-చర్మమును మాత్రము లోతుగా నున్న చీము కనిపించువరకును అతిచురుకుగా కత్తితో రెండు

---

1 విద్రధి శస్త్రక్రియావిధానము

*"తత్రప్రశస్తేషు తిథి - కరణ - ముహూర్త - నక్షత్రేషుదధ్య - క్షతాన్నపాన - రత్నైరగ్నిం విప్రాన్ భిషజోర్చ్చయిత్వా కృతబలి మంగళ స్వస్తివాచనం, లఘుభుక్తవన్తం ప్రాఙ్ముఖమాతుర ముపవేశ్యయన్త్రయిత్వా, ప్రత్యఙ్ముఖోవైద్య, మర్మ - సిరా - స్నాయుసన్ధ్యస్థి ధమనీఃపరిహరన్, అను లోమంశస్త్రం నిదద్యాదాపూయ దర్శనాత్, సకృదేవాపహరేచ్ఛస్త్ర మాశుచ; మహత్స్వపిచపాకేషు ద్వ్యంగుళాన్తరం త్ర్యంగుళాన్తరం వాశస్త్ర పదముక్తమ్॥. (సుశ్రుత)

లేక మూడు అంగుళముల పొడవున చీల్చవలెను. గడ్డ పాకముచెందిన పిమ్మటనే ఆపరేషను చేయవలెను అపక్వ విద్రధిని కోసినయెడల చీముచారాదు. బాధఎక్కువగును. కనుక వైద్యుడు ఆమపక్వ విద్రధిలక్షణముల గుర్తెరింగి ఆమావస్థలోనుండిన దానిని త్వరగా పక్వమగునటుల వేడి పిండికట్టు కట్టించవలెను. అది మెత్తబడిన పిమ్మట కోయవలెను.

చిన్నఆపరేషనులకు ముందుగా రోగి లఘ్వాహారము తినవచ్చునని చెప్పినను పెద్దఆపరేషనులు అనగా—మూఢగర్భము, ఉదరరోగము, అర్శస్సు, అశ్మరీ, భగన్దరము, ముఖరోగములకు ఆపరేషను చేయుటకు ముందుగా నెట్టియాహారము నియ్యకూడదు.

విద్రధి కోతవిధానము స్థలభేదముల ననుసరించియుండును. సామాన్యముగా కాళ్లు, మొండెము, చేతులపైన విద్రధికి నిలువుగా కోతనుంచవలెను (Perpendicular incision). నుదురు, గణ్డస్థలములు, శంఖములు, కనురెప్పలు, పెదవులు, చిగుళ్లు, (gums), చంకలు, గజ్జలు, ఉదరముల పైన కోయవలసినప్పుడు కోత అడ్డముగా నుంచుటమేలు. ఇందువలన గాయపుటంచులు దగ్గరగా కలిసికొని త్వరగా మానుట కవకాశముండును.

---

## *శస్త్రకర్మానంతర యుపచారవిధి

కురుపును కోసినపిదప వ్రేళ్లతో చుట్టును నొక్కి చీము నంతను బయల్వెడలించి, కషాయముతో వ్రణమునుకడిగి, దూదితో వ్రణములోపలనీరు, తడిలేకుండ నొత్తవలెను. పిమ్మట నువ్వులు నూరినముద్దలో తేనె, నెయ్యిచేర్చి చాల పలుచగాకలిపి యార్ద్రమములో గుడ్డవర్తిని తడిపి, వ్రణమం దుంచి, మరికొంత నువ్వులకల్కమును వ్రణముపైన కప్పి గుడ్డతో బిగించి కట్టవలెను. బాధను మరపించుటకు వేదనార క్షోఘ్నధూప ద్రవ్యముల పొగను వ్రణమునకువేసి, రక్షోఘ్న మంత్రములను చదువవలెను. గుగ్గిలము, అగరు, సర్జరసము, వస, ఆవాలు, ఉప్పు, వేపాకు, నెయ్యిధూపము వేయదగిన వస్తువులుగా నున్నవి.

1 కట్టువిప్పుకాలము :- ఆపరేషనుచేసిన మూడవ రోజున గుడ్డకట్టును విప్పవలెను. తొందరపడి మరునాడే

---

*తతః శస్త్రమపచార్య శీతాభిరద్భిరాతుర మాశ్వాస్య, సమన్తాత్పరి పీడ్యాఙ్గుల్యా, వ్రణమభి మృద్య ప్రక్షాల్య కషాయేణ, ప్లోతేనోదకమాదాయ, తిలకల్కమధు సర్పిః ప్రగాఢా మౌషధయుక్తాం నాతిస్నిగ్ధాం నాతిరూక్షాం వర్తిం ప్రణిదధ్యాత్, తతః కల్కేనాచ్ఛాద్యఘనాం కవలికాందత్వా, వస్త్రపట్టేన బధ్నీయాత్, వేదనారక్షోఘ్నైర్ధూపై ర్ధూపయేత్, రక్షోఘ్నైశ్చ మన్త్రైరక్షాంకుర్వీత॥ తతో గుగ్గులు - గురు - సర్జరస - వచా - గౌర - సర్షపచూర్ణైర్లవణ నిమ్బపత్ర విమిశ్రైరాజ్యయుక్తై ర్ధూపయేత్॥ ఆజ్యవిశే షేణ చాస్యప్రాణాన్ సమాలభేత్॥

1 సూ॥ తతస్తృతీయేహని విముచ్యైవమేవ బధ్నీయాత్ వస్త్రపట్టేన; నచైనంత్వరమాణోపరే ద్యుర్మోక్షయేత్। ద్వితీయదివస పరిమోక్షణాద్విగ్ర థితో వ్రణశ్చిరాదుప సంరోహతి, తీవ్రరుజశ్చభవతి॥

కట్టువిప్పుటవలన బాధ ఎక్కువై రక్తము స్రవించును. హేమంత, శిశిర వసంతఋతువులలో మూడురోజుల కొక సారిన్ని, గ్రీష్మ, వర్ష, ఋతువులలో రెండురోజులకొకసారిన్ని కట్టువిప్పు చుండవలెను.

2 వ్రణరోపణవిధి :— వ్రణము త్వరగా మానుటకు వ్రణమునకుపైనను, లోపలిభాగము నతిశుచిగా నుంచుట అవసరమగును. అజీర్ణము, అధిక వ్యాయామము విసర్జించవలెను.

శస్త్రములవలన కలిగిన గాయములందలి బాధ శమించుటకు ఆగాయమును నేతితో తడపిన శాంతించును. లేదా యష్టి మధుకము వేసి కాచిన ఘృతముతో శమించును. వ్రణితుడు స్త్రీలతో సాంగత్యము, స్త్రీలను దర్శించుట, వారితో సంభాషణము, వారిని తాకుట మొదలైనవి మానవలెను. దోషభేదములననుసరించి వ్రణములకు యీ దిగువచెప్పిన లేపములను పూయవచ్చును.

---

శ్లో॥ హేమన్తే శిశిరేచైవవసన్తేచాపి మోక్షయేత్।
త్ర్యహాద్ద్వ్యహాచ్ఛరద్గ్రీష్మవర్షాస్వపిచ బుద్ధిమాన్॥

శ్లో॥ అతిపాతిషురోగేషు నేచ్ఛేద్విధిమిమంభిషక్
ప్రదీప్తాగార వచ్ఛీఘ్రంతత్ర కుర్యాత్ప్రతిక్రియాం॥

2 రోపణవిధి :— మూ॥ నచైనంత్వరమాణః సాన్తర్దోషం రోపయేత్ సహ్యల్పేనాప్య పచారేణాభ్యన్తరం ముత్సంజ్య కృత్వా, భూయోపి కరోతి॥.

శ్లో॥ తస్మాదన్తర్బహిశ్చైవ సంశుద్ధం రోపయేద్వ్రణం।
రూక్షేష్వజీర్ణ వ్యాయామవ్యవాయాదీన్ వివర్జయేత్॥

వాతప్రకోప వ్రణమునకు స్నిగ్ధామ్లలవణ ద్రవ్యముల తోను, పిత్తప్రకోప వ్రణమును శీతలోదకముచేతను, కఫ ప్రధాన వ్రణమునకు వేడినిచ్చే క్షారద్రవ్యములతో కూడిన మూత్రముచేతను తడుపుచుండిన శాంతించును.

జనుము, ముల్లంగి, మునగ, నువ్వులు, ఆవాలు, సురాబీజము, అవిసి, చెంగల్వకోష్టు, కృష్ణాగరులు వ్రణ పాచన ద్రవ్యములుగానున్నవి శంఖిని (దంతెన), తొడుగ, జాజి, గన్నేరు, సూర్యకాంతపుచెట్టు, వీనికషాయములు, అరగ్వధాది కషాయము వ్రణశోధన కారులని చెప్పబడినవి. ఈశోధన ద్రవ్యములను ఎనిమిది రూపములుగా ప్రయోగించ వచ్చును. (1) కషాయముతో వ్రణమును కడుగుట (2) వర్తిగా నుపయోగించుట (3) కల్కము వేసికట్టుట. (4) ఘృతము: (5) తైలము (6) చూర్ణములను వ్రణముపైన జల్లుట (7) పూయుట (8) ధూపము వేయుట.

వ్రణరోపణ ద్రవ్యములలో ముఖ్యము లెవ్వియన:- మర్రి, రావి, జువ్వి బెరడులతో తయారయిన శృత కషాయము, శీతకషాయము, ఫాంటవము, స్వరసము, వీనిలో దేని నైన నుపయోగించ వచ్చును.

సుశ్రుతసంహితలో నీదిగువ చెప్పిన రోగము లన్నిటికి ఆపరేషను క్రియలు విపులముగా వర్ణించబడినవి.

(1) మూత్రాశ్మరి=Stone in the urinary blader

(2) అండవృద్ధి=Hydrocele

(3) ఆంత్రవృద్ధి=Hernia

(4) అర్శోరోగము=Piles

(5) కణుతులు=Tumours

(6) బాహ్యాభ్యంతర విద్రధి=External and internal abscess.

(7) భగంధరము=anal fistula

(8) వ్రణములు=ulcers, gastric, duodenal

(9) ఆగంతువ్రణములు=traumatic wounds

(10) అస్థిభగ్నములు=Bone fractures

(11) సంధిచ్యుతములు=Dislocation of joints

(12) శరీరగతశల్యములు=foreign bodies stuckup in the body

(13) శలాక్యతంత్రము=Diseases of ear, eye, nose, and throat.

(14) చెవి, ముక్కు, చర్మముల నతుకులు=plastic surgery.

ఈ ఆపరేషను లన్నిటిని విపులముగా వర్ణించుట యీ గ్రంథముయొక్క యుద్దేశము కాదు. నేటి మోడరన్ సర్జ నులు చేయుచున్న పెద్ద ఆపరేషను లన్నిటిని క్రీ. శ. ముందు 2500 సం॥రముల నాడే చేయబడుచుండెనని వినుట కెంతయో ఆశ్చర్యము కలుగక మానదు. క్రీ. శ. 3వ శతాబ్దములో బింబిసార చక్రవర్తి యాస్థానవైద్యుడు, జీవకుడను నతడు చాల గొప్ప సర్జను అని ప్రసిద్ధి గాంచెను. ఈ పైనచెప్పిన ఆపరేషనులను, మూఢ గర్భచికిత్సలను (Extraction of

child in difficult labours) చేసినట్లు చరిత్రాధారములు కన్పించుచున్నవి. యన్త్రశస్త్ర సాధనోపాయముల లోను చికిత్సాద్రవ్యములలోను యించుక భేదము లుండిన యుండ వచ్చునుగాని చికిత్సా పద్ధతిలో (principles and technic of operation) ప్రాచీన నవీనశాస్త్రము లొకేతీరుగా నుండుట గమనించదగిన విషయము. సాధనోపాయము, చికిత్సా ద్రవ్యముల నుపయోగించుటలో మోడరన్ సర్జరి ఏవిషయ ములలోను ప్రాచీన సర్జరికంటె మిన్నయనిపించును? ఆయుర్వేద సర్జరీయొక్క విశిష్టత లేమి? అని విమర్శించవలసి యున్నది. ప్రాచీన సర్జనులు నేటి డాక్టర్లు చేయుచున్న పెద్ద ఆపరేషను లను కడుసమర్థతతో చేయుచుండుట నిజము. అయితే వారు రోగికి బాధ తెలియకుండ నేమి యుపాయము లాచరించు చుండిరి? నేటివలెనే క్లోరోఫారం మొదలైన మత్తుద్రవ్యముల నుపయోగించినటుల కన్పించదు. మద్యములను త్రాగించు చుండినటుల యున్నది. దీనివలన స్పృహ పూర్తిగా తప్పి పోదు. జ్ఞానవహాశక్తి మిగిలియుండును. కనుక కోయునప్పుడు బాధ యనుభవించవలసి యుండును. (semiconscious state) రోగిని బలవంతముగా నొక్కిపట్టుకొని, త్రాళ్లతో బంధించి కోయుచుండిరి. రోగి యశక్తుడై ఆపరేషనుచేయు చున్నంతసేపు బాధ ననుభవించుచునే యుండును. నేడు మనకు లభించుచున్నకోకైను (cocaine) వంటి సంజ్ఞాహరణ ద్రవ్యములనుకూడ ప్రాచీనసర్జనులు వాడినట్లు తెలుపలేదు. ఆపరేషను యనంతరము బాధోపశమనము నిమిత్తము యష్టి మధుకము వేసి కాచిన వెచ్చని ఘృతమును గాయముపైన పూయుచుండిరి. కనుక రోగికి ఆపరేషను బాధ తెలియకుండా

పూర్తియైన సంజ్ఞానిస్సంహార ద్రవ్యములను (Narcotics and paralytic agents) వాడకుండుట పెద్దలోపమనియే మనము గ్రహించగలము.

ఇక ఆయుర్వేద శస్త్రచికిత్సలలో నాచరింపబడు చుండిన అపూర్వ విశిష్ట విషయములను కొన్నిటిని గుర్తించి, నేటి సర్జనులు వీనినాచరణలోబెట్టి, మిగుల నుపకారులుగా నున్న వాటిని గ్రహించుటమేలు. ఆవిశిష్ట విషయము లెవ్వి యనగా :—

(1) శస్త్రకర్మకు పూర్వోపచారవిధులు — శోధనక్రియలు చేయుట,

(2) శస్త్రకర్మ నాచరించుటకు శుభతిథి వారనక్షత్ర ముహూర్తముల నిర్ణయించుట.

(3) ఆపరేషను చేయబోవు శరీరభాగమును ముందుగా శుద్ధ పరచి, ఆప్రదేశమున కధిష్ఠాన దేవతలనుగురించి స్తోత్ర పాఠములు చదువుట.

(4) శస్త్రకర్మానంతరం ఉపచారక్రియలు, రోపణవిధులు, వేదనారక్షోఘ్నధూపములు, రక్షోఘ్నమంత్రముల జదువుట, స్త్రీలతోదర్శన, స్పర్శన, సంభాషణలు వర్జించుట, పథ్యనియమములు మోడరన్ సర్జరీలోకంటెను భిన్నములుగానున్న వాటిని పరిశీలించవలసి యున్నది.

అన్నిటికంటెను ముఖ్యవిషయము శుచిత్వము (Surgical cleanliness) గదా! ఆపరేషను .శౌచపరిస్థితులలో నాచరించుటయేగాక గాయము మానువరకును దాని నతిశుచిగా

నుంచి కాపాడవలెను. ఈ విషయమున ఆయుర్వేద తంత్ర కారులు చెప్పిన రోపణద్రవ్యములు, ధూపముల సాధనములతో నెంతవరకు కృతకృత్యులైరి? అను విషయము పరిశోధనాంశము కాగలదు.

## 4వ అధ్యాయము

సుశ్రుతునకు సూక్ష్మక్రిముల జ్ఞాన మపారముగా కలదనియే చెప్పవచ్చును. రోగహేతుక సూక్ష్మక్రిములను గురించిన జ్ఞానమునకు భూతవిద్యయని పేరు. అష్టాంగాయుర్వేద శాస్త్రములో నిదియొక ప్రత్యేకభాగముగా వివరించబడినది భూతవిద్యాలక్షణమును చెప్పునప్పుడు "సూ॥ భూతవిద్యానామ - దేవాసుర - గన్ధర్వ - యక్ష - రక్షః - పితృపిశాచ - నాగ - గ్రహోద్యుపసృష్ట చేతసాం శాన్తికర్మ - బలిహరణాది గ్రహోపశమనార్థమ్॥" అని నిర్వచించిరి.

(సు. సూ. 1 అధ్యా.)

ఇంకను—

శ్లో॥ భూతాసీతి కృతా సొంజ్ఞా తేషాం సంజ్ఞాప్రవక్తృభిః। గ్రహ సొంజ్ఞాభి భూతాసి యస్మాదేత్యనయాభిమక్। విద్యయా భూతవిద్యాత్వమత ఏవ నిరుచ్యతే॥

(సు. ఉత్తర. అమానుష ప్రతిషేధనీ యాధ్యాయం)

అని చెప్పుటవల్ల భూతశబ్దము నాయుర్వేదములో సొంజ్ఞా వాచకముగా రోగహేతుక సూక్ష్మక్రిముల నుద్దేశించి వ్యవహారింపబడినదని తెలియుచున్నది. ఈ భూతగణములకు దేవ, అసుర, గంధర్వ, యక్ష, పితృ, నాగ, రక్షస, పిశాచములని పేర్లు ఆయా జాతియొక్క గుణముల ననుసరించి

యుంచబడినవి. ద్యులోకవాసులైన దేవాసుర గంధర్వులు మనుష్యులను పీడించుచున్నారనుట పొరబాటు. ఈ విషయమును సుశ్రుతుడు స్పష్టముగా నాదేశించినాడు. శ్లో॥ నతే మనుష్యైః సహాసం విశంతి నవామనుష్యాన్ క్వచిదా విశంతి। ఏవా విశంతీతి వదంతి మోహాత్ తే భూతవిద్యా విషయా దపోహ్యాః॥

(సు. ఉత్తర. 60 అధ్యా. 19 శ్లో)

దేవసంభవులైన దేవాసుర గంధర్వులు ద్యులోకవాసులు. వారు భూలోకమునకువచ్చి మనుష్యులతో కలిసి ఎన్నడు నివశించరు. వీరే మనుష్యులను పీడించుచున్నారని భ్రమచెందువారు యీ భూతవిద్యాతంత్ర విషయములను తెలిసికొనజాలరు అని స్పష్టముగా చెప్పబడినది. మరి యీ భూతగ్రహాదులెట్టివి యనగా— "శ్లో॥ తేషాం గ్రహాణాం పరిచారకాయే కోటీ సహస్రాయుత పద్మసంఖ్యాః। అసృగ్వసా మాంసభుజః సుభీమ నిశావిహారాశ్చ తమావిశంతి॥"

(సు. ఉత్తర. 60 అధ్యా 20 శ్లో)

కోట్లకొలది యసంఖ్యాకములుగానున్న యీగ్రహములు రక్తము, మాంసములను భుజించి వృద్ధియగుచుండును. మహాపరాక్రమము గలవి. అయినను సూర్యుని వెలుతురునకు జడిసి రాత్రులందు సంచరించును. చీకటి, నీడగల తావులందు పగలంతయునుండును. మరియు శ్లో॥ పృధివ్యామంత రిక్షేచయే చరంతినిశాచరాః। దిక్షువాస్తునివాసాశ్చ పాంతుత్వాంతే నమస్కృతా॥ అనిచెప్పిరి. అనగా ఈ స్తూక్ష్మక్రిములు నేల మీదను అంతరిక్షములోను, అన్నిదిక్కులను, పాడుపడిన చీకటి గృహము లలోను నివాసములుగా నుండును. ఇంకను

సు. శా. 10 అధ్యాయములలో సూ॥ వాతాతపవిద్యుత్ప్రభా పాదపలత శూన్యాగార నిమ్నస్థాన గృహచ్ఛాయావిద్భ్యో దుర్గ్రహోపసర్గతశ్చ బాలంరక్షేత్।, అనియును సూ॥ నిత్యమ వరోధతశ్చస్యాత్ కృతరక్ష ఉపసర్గభయాత్, ప్రయత్న తశ్చ గ్రహోపసర్గే భ్యోరక్ష్యా బాలాభవతి।, అనియును క్రిమి నివాసస్థానములు పేర్కొనబడినవి. ఈసూక్ష్మ రోగక్రిములు ఒక్కొక్క కాలములో విజృంభించి జనులను పీడించుచుండు నని యీక్రింది వాక్యములవల్ల తెలియగలదు. సూ॥కృత్యాభి శాప రక్షఃక్రోధోధర్మైః ఉపధ్వస్యంతే జనపదా। ......... దోషప్రకృతి విశేషేణ కాసశ్వాసవమథు ప్రతిశ్యాయిశిరోరుగ్ జ్వరైః ఉపతప్యంతే॥

ఇంకను సుశ్రుతుడు వ్రణితోపాసనీయాధ్యాయములో ఉపసర్గకృతవ్యాధులను (dangers of wound infection) వివరించుచు "సూ॥. హింసా విహారాణి మహావీర్యాణి రక్షాంసి పశుపతి కుబేరానుచరాణి, మాంసశోణిత ప్రియ త్వాత్ క్షతజనిమిత్తం వ్రణిన ముపసర్పంతి" అని చెప్పి నందున సూక్ష్మక్రిములు మాంస రక్త ప్రియులగుటంజేసి గాయములలోకి తఱచుగా సంక్రమించునని తెలియుచున్నది. ఇవి వేదవిహితమయిన శౌచవిధుల నతిక్రమించు వారలకును, అశుచి, భిన్నమర్యాద, క్షతగాత్రులను పొందుచున్నవి. ఈ రోగహేతుక సూక్ష్మక్రిములను మూడు ప్రధాన గణములుగా గుర్తించినారు.

1. పశుపతి యనుచరులు - మనస్సు యింద్రియము లను వికలమొనర్చి, భ్రమ, ప్రలాప, ఉన్మాదములను కలి

గించును. (Cause mental derangement)

2. కుబేరానుచరులు:- ఇవి యక్షరక్షో గణములకు చెందిన క్రిములు. శారీరిక బాధలను మాత్రమే కలిగించును. (Cause bodily suffering)

3. కుమారానుచరులు:- పసిపిల్లలను వశపరచుకొని బాధించును. ఇవియే బాలగ్రహములు (Cause children diseases).

మరియు బొంబాయిలో సుప్రసిద్ధ ఆయుర్వేదపండితులు పండిత హరిప్రపన్నజీశర్మగారు రచించిన రసయోగ సాగర మను గ్రంథములో క్రిమిజన్యరోగముల గురించి నీవిధముగా వర్ణించినారు.

"రోగాణాం నిదానాని అపరిసంఖ్యేయాని భవంతి। తేష్వాగంతుషు క్రిమయో విశేషేణ కారణాని అదృష్టత్వేన తేషాం దుష్పరిహార యత్వాత్। తేష్వాంచ క్రిమీణాం పరిసర్పణ శీలత్వాత్ సర్పాయితి। తత్తద్వేదన సమూహాస్య కారణాత్ యాతుధానా యితిచ నామ యజుర్వేదే స్థాపితం॥ రోగహేతుక సూక్ష్మక్రిములను ఆయుర్వేదతంత్ర కర్తలు ఆగంతుక హేతువులుగా నెంచిరి. వీనికి యాతుధానులని అథర్వణ వేదములో వ్యవహారముకలదు.

సుశ్రుతుడు నిదానస్థానం 5 అధ్యాయములో:-

శ్లో॥ సర్వాణి కుష్ఠాని సవాతాని సపిత్తాని స కఫాని

సక్రిమీణి చోప దిశన్తి॥ అనియును- ఔపసర్గిక వ్యాధుల వ్యాపన పద్ధతిని చెప్పునప్పుడు- శ్లో॥ ప్రసంగా ద్గాత్ర సంస్పర్శాత్ నిశ్వాసాత్సహ భోజనాత్। సహశయ్యా

సనాచ్చాపి వస్త్రమాల్యాను లేపనాత్। కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యంద ఏవచ। ఔపసర్గిక రోగాశ్చ సంక్రామంతి నరాన్నరమ్॥ అని వివరించినాడు.. మరియు మలేరియా జ్వరమునకు రురుజ్వరమనియు, తక్మజ్వరమనియు అధర్వణ వేదములో వ్యవహరించబడినది. ఈజ్వరమును కలిగించే యాతుధానులు (Malarial parasites) స్థిరనివాసములను చెప్పు సందర్భమున:-

ఉలూకయాతుం సుషులూకయాతుం జహిశ్వయాతుముతకోకయాతుం సుపర్ణయాతు ముతగృధ్రయాతుం దృషదేవ ప్రణ్మృణదక్షఇంద్ర॥

(అథర్వవేదం 8 కాండ 4 సూక్తం 22 మంత్రం)

ఉలూకము=గుడ్లగూడ; సుషులూక=గబ్బిలము; శ్వ=కుక్క; కోక=తోడేలు; సుపర్ణ=డేగ; గృధ్ర=గద్దయీ జంతు పక్షి శరీరములో మలేరియాక్రిము లెల్లప్పుడు స్థావరముగా నుండి, వీని మలముతో కలిసి బయటికివచ్చి జనులు త్రాగేనీళ్ళతో కలిసి మనుష్యులకు సంక్రమించుచున్నవి.

ఇంత స్పష్టమయిన జ్ఞానము సుశ్రుతున కలిగియుండగా ఆపరేషను చేసేటప్పుడు గాయములలోకి క్రిములు సంక్రమించకుండ తగిన శౌచపద్ధతుల (Antiseptic methods such as sterilisation of hands and surgical instruments) నాచరించకుండునా? అంతంత పెద్ద ఆపరేషనులు జయవంతముగా. చేయగలిగెనుగదా! ఆతడుపయోగించిన ఓషధీ కషాయములు, ఓషధీయుక్త ఘృతము, ధూపద్రవ్యములలో నెట్టి క్రిమిహార శక్తులున్నవో కనిపెట్టవలసియున్నది.

క్రిముల ప్రవేశము గనినంత మాత్రమున వేదనాసామర్థ్యము వానికి కలుగదు. "నైనం ఘ్నంతి రక్షాంసి న పిశాచా సహంతే దేవానా మోజః ప్రథమజంహి ఏతత్" అని చెప్పుటవల్ల ఓజస్సు మిక్కిలిగా నభివృద్ధిజెందిన ఊర్జశక్తి అన్నిరకముల క్రిములను జయించుచున్నది. మరియు "......పూర్వం హితసేవనం సాత్మ్యతోల్ప తయావాపి దీప్తాగ్నే స్తరుణస్యచ, స్నిగ్ధవ్యాయామ బలినాం విరుద్ధం వితథం భవతి" (సు. హితాహితీయాధ్యాయః) ఇంకను "వ్యాయామ శీలోబలవాన్ శిశుశ్చ స్నిగ్ధో అగ్నిమాంశ్చాపి మహాశనశ్చ। అప్నోతి రోగాన్న విరుద్ధజాతానీ అభ్యాసతోవాల్ప తయాచ జంతుః" (సు. హితాహితీఅధ్యా) హితాహార విహారపద్ధతుల నతిక్రమించువారలను, అసాత్మ్యముగా వ్యవహరించువారలను క్రిములు బాధించును గాని అగ్నిదీప్తి చక్కగానుండి తరుణవయస్సులోనున్నవారిని, స్నిగ్ధశరీరులను, వ్యాయామము చేయుచుండువారిని, బలిష్ఠమయినవారిని క్రిములేమియు చేయజాలవు. కనుక ఊర్జస్కరమయిన రసాయనాది ఓషధసేవనమువలన రోగులను క్రిముల నుండి రక్షించవచ్చును.

క్రీస్తువెనుక 18 శతాబ్దములో మైక్రోస్కోపుయంత్రము కనిపెట్టబడిన పిమ్మట మనకు సూక్ష్మక్రిమి జ్ఞానముకలుగుచున్నదిగదా. ఇంతకుపూర్వము కొన్నివేల సంవత్సరముల క్రిందట మహర్షులకు సూక్ష్మక్రిములను గురించిన యింతటి విపులమయిన జ్ఞానమెట్లు కలిగినదని చదువరులు సందేహించవచ్చును, మహర్షులు దివ్యజ్ఞాన సంపన్నులనియు, దివ్యచక్షువు (మనస్సు)తో చూడగలిగిరనియు చెప్పిన యారోజు

లలో నమ్మువారెవరు? ఇదంతయు ఊహాగానమని నిరాక రింతురు. కాన అధర్వవేదము 4వ కాండ 20 సూక్తములో పిశాచక్షయ మంత్రములో మైక్రోస్కోపువంటి 'బిబిర్విణి' యను ఒక దివ్యౌషధి వారికి లభించినటుల తెలియుచున్నది.

కశ్యపుడు యీయోషధీసాయమున భూమి అంతరిక్షములో వ్యాపించియున్న సర్వరోగ క్రిములను చూడగలిగెనని యీమంత్రము చెప్పుచున్నది. కశ్యపుని వృత్తాంతము చరిత్ర కతీతవిషయము. కాని క్రీస్తుశకము 3వ శతాబ్దిలో బింబసారుని ఆస్థాన వైద్యుడయిన వృద్ధజీవకునికి యిట్టి మహత్తర ఓషధిలభించెనని చరిత్రలు చెప్పుచున్నవి. దీనిసాయమున నేటి యక్సురే యంత్రమువలె శరీరాభ్యంతర భాగములను సజీవులలోనే దర్శించగలిగి ప్రేగులలో చిక్కుకొన్న రాళ్ళు తీసివేసెనట. ఇదియు నమ్మదగిన విషయముకాదా? ఓషధుల మహాత్మ్యమును పూర్తిగా నెఱిగినవారెవరు? ఈ ఓషధియే మనకిప్పుడు లభించిన నమ్మక చేయవలసినదేమి?

## 5వ అధ్యాయము.

### అల్లోపతి శస్త్రచికిత్సా విధానము

### (The Modern Antiseptic Surgery)

సుమారు నూరుసంవత్సరముల క్రిందటనుంచి డాక్టరు లిస్టరుగారి సిద్ధాంతముల ననుసరించి ఆధునికపద్ధతులపైన శస్త్రచికిత్స శీఘ్రవేగమున దినదినాభివృద్ధి యగుచు, నేటికి యత్యున్నతస్థాయికి వచ్చినది. ఇంతకుపూర్వము శస్త్రచికిత్స చేయబడినవారు తిరిగి స్వస్థతనొందుట యనుమానాస్పద

ముగా నుండెను. ఆపరేషనులు సక్రమముగా జయవంతముగా జరుపబడినను, గాయము చీముపట్టి రోగి చిరకాలముపంచము పట్టుటయో లేక మరణించుటయో జరుగుచుండెను. డాక్టరు పేస్ట్యూర్ గారు సూక్ష్మక్రిమి సిద్ధాంతము లిస్టరుగారి పరిశోధనలకు దారిచూపినది. ఈయన కనిపెట్టిన నూతన శౌచపద్ధతుల (Surgical cleanliness - Sterilisation of wound, surgeon's hands and even materials relating to operation) ననుసరించి చేయబడిన ఆపరేషనులన్నియు జయవంతమగుటయేగాక రోగులు అచిరకాలములో స్వస్థులగుచు వచ్చిరి. దీనికితోడుగా 1842 సం॥రములో సర్ జేమ్సుసింప్సన్ గారు కనిపెట్టిన క్లోరోఫారమ్ రోగులకు ఆపరేషను చేయునప్పు డనుభవించు చుండిన బాధను తెలియకుండా నొనర్చెను. ఈమందు సాయముతో నేడు మెదడును ఆపరేషను చేయుచున్నారు. ఉదరావయవముల నవలీలగా నాపరేషను చేయగలుగుచున్నారు. శ్వాసావయములను, గుండెపైనకూడ నాపరేషనులు జయవంతముగా నేడు జరుగుచున్నవి. ఈరోజులలో ఆపరేషనువలన భీతి ప్రజలలోకూడ మాయమైనది. లిస్టరుగారి శౌచపద్ధతులు (antiseptic methods) రోగుల ననతికాలములో తేర్చుటకు ఎక్కువగా తోడ్పడినవి. కనుక 'డాక్టరు లిస్టరు శస్త్రచికిత్సాశాస్త్రమునకు పితయనియును; సర్ జేమ్సుసింప్సన్ గారి క్లోరోఫారమ్ ఉపమాత (hand maid of Surgery) అనియు ప్రసిద్ధములైనవి.

నూతన పరిశోధనలతో, ఆధునిక యంత్ర పరికరములతో దినదిన ప్రవర్ధమానమగుచు, విరాజిల్లుచున్న ఆధునిక

శస్త్రవైద్యములోనుంచి యుపయుక్తములగు వాటినెల్లను చేర్చుకొని, ఆయుర్వేదవైద్యులు కర్మపథాభ్యాస మొనరించినచో నాయుర్వేద శాస్త్రము (శల్యతంత్రము) సంస్కరింపబడి వృద్ధికాగలదు.

ఆయుర్వేదవైద్యులు పరిగ్రహించవలసిన ఆధునిక విషయము లెవ్వియనగా—

(1) క్లోరోఫారమ్ మందును ఆపరేషను చేయుటకు ముందు ఎట్టిప్రమాదములు వాటిల్లకుండ రోగికి వాసనచూపు కౌశల్యమును అభ్యాస పూర్వకముగా సంపాదించుట. ఇందువలన రోగికి బాధ తెలియకుండును. చికిత్సకునకును సుఖకరముగా పనిచేయుటకు వీలొసంగును.
(use of chloroform)

(2) చిన్నఆపరేషనులు చేయుటకు కొకేను, నోవకేను వంటి తిమ్మిరెక్కించు మందు యింజెక్షనులను ఆపరేషను చేయవలసిన భాగములందుగ్రుచ్చి బాధ తెలియకుండ చేయుట

(3) శల్యావశిష్టములగు శరీరాంతర్భాగములయొక్క యథార్థస్థితులను తెలిసికొనుటకు ఆధునిక యంత్రపరికరణములను, — అనగా వివిధరకముల ఏషణీయంత్రముల (Scopes or visual instruments and x - ray photoes and Screening methods) సాయమపేక్షించుట.

(4) చికిత్సకుడు తనచేతులను, ఆపరేషను చేయవలసిన భాగమును, ఆపరేషను సామానులను శుద్ధిచేయవలసిన క్రమములను, నేర్చుకొనుట. (Slerilisalion of surgical

hands and surgical inslrumenls and dressing materials).

(5) దాహకర్మకు క్షారద్రవ్య ప్రయోగములకుబదులు ఎలెక్ట్రిక్ కాటరై జేషను పనుల నుపయోగించుట (electric cauterisation).

(6) శస్త్రకర్మానంతరం బాధ తెలియకుండ మార్ఫియా యింజెక్షనుల నిచ్చుట లేక బ్రోమైడ్ మిక్చర్ త్రాగించుట.

(7) వ్రణరోపణము సత్వరముగా జరిగించు మేలు రకము మందులను, కషాయములను, పాలాస్త్రుల నుపయోగించుట—

---

# VIII భాగము

## ప్రసవశాస్త్రము, స్త్రీబాలరోగ చికిత్సలు.

## (Midwifery, gynocology and diseases of children)

వంశాభివృద్ధి, సత్సంతానమును బడయుట, సంతానము దీర్ఘాయువును కలిగి స్వస్థగాత్రులై ఆరోగ్యముగా పెరుగుట, మొదలైనవి దాంపత్యజీవిత లక్ష్యములు.

ఈయుద్దేశములు నెరవేర్చుకొనుటకై గాను పురుషునకు బ్రహ్మచర్య నియమములు, గృహస్థాశ్రమ స్వీకారము 25 సంవత్సరముల వయస్సునాటికి నిర్ణయములను శాస్త్రములు బోధించినవి. సత్సంతానము, దీర్ఘాయువుగల పుత్రుల బడయ గోరు దంపతులు స్త్రీయొక్క ఋతుదినములతో శుభతిథివార నక్షత్ర లగ్నములను చూచుకొని మైథున క్రియకు గడంగ వలెనని విధించిరి. కామేచ్ఛ దీర్చుకొనుటకు చేసిన స్త్రీ సంభోగము పశుప్రాయముగా భావింపబడినది.

ఋతుమతియైన స్త్రీ, శాస్త్రములో విధించిన ప్రకారము ఋతుచర్య, సంభోగనియమములు పాటించినచో దీర్ఘాయుష్మంతులగు సుపుత్రులను బడయును. గర్భమును ధరించిన పిమ్మట, దానిని సక్రమముగా పెంపొందించు భారమంతయు స్త్రీపై నయున్నది. కనుక గర్భిణోపచారవిధులు సుశ్రుత శారీరములో గర్భావక్రాంతి సందర్భమున విపులముగా చెప్ప బడినవి. గర్భిణిస్త్రీయొక్క చేష్టలు, మనోప్రవృత్తులు గర్భమునందు ప్రతిఫలించును. కాన గర్భిణోపచార ఫలము లను గుర్తించి, శాస్త్రమువిధించిన ప్రకారము స్త్రీ ఆహార

విహారాదుల నాచరించినచో సుగుణవంతులు, మేధావంతులు, దీర్ఘాయురారోగ్యముగల సంతానముకలుగ గలదు. పాశ్చాత్య శాస్త్రములలోమనస్సునకంటే శరీరమునకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, యందుకనుగుణముగా ఆహారవిహారము లందు శ్రద్ధచూపించిరి. గర్భిణ్యోపచార విధులు (Antinatal care) భావి సంతానముయొక్క ప్రకాశమునకు పునాదిగా నున్నవి.

ప్రసవకార్యము స్వాభావికముగా జరుగును. కష్టప్రసవములు వెయ్యింట పదికేసులలో విధికృతములు (accidental). మిగిలినవి మంత్రసాని తెలివితక్కువవలన సంభవించుచున్నవి. కవలలు పెరుగుచు ప్రసవసమయమునకు ఒకదానితోనొకటి పెనవైచుకొనుట (inter locking of the babies), మావి తప్పుస్థానమున నతుకుకొని యుండుట (placenta previa), లోపలిబిడ్డ వికారముగా పెరుగుట (Hydrocephalus), కణుతులు గర్భాశయము ననుసరించియు బిడ్డవచ్చు మార్గములోను పుట్టుట (Uterine tumours) విధికృతము లనబడును. మనవారు వీనిని కర్మహేతు ఫలములని పరిగణించిరి.

అనారోగ్యముగా వృద్ధియైన గర్భము విషయములో తెలివియైన మంత్రసాని నొప్పులారంభము కాగానే ముందుగా లోపల బిడ్డ సరియైనతీరున శిరస్సు యోని మార్గముగా వచ్చుట కుద్యుక్తమైయున్నదో లేక వక్రమార్గమున నున్నదో తడవి పరీక్షించి చాకచక్యముతో గుర్తించి వక్రమార్గమున నున్నదానిని సరియైన మార్గములోకి త్రిప్పియుంచవలెను. ఇది

కష్టప్రసవమును నివారించు యుపాయము. పిమ్మట ప్రసవ నొప్పులు నిరాటంకముగా సాగుచుండుట కభ్యంతరములుగా నుండిన మలమూత్రావరోధములను ఉపాయము చేతను తొలగించవలెను. (catheterisation and enema) ఇందుకు మూత్రమార్గమున రబ్బరుగొట్టము నెక్కించి తీసివేసి, (తొలుతనేఅముదము త్రాగించుట మేలు) ప్రసవించుచున్న స్త్రీకి పుష్టికరపానీయములనిచ్చి, ధైర్యమును పురిగొల్పవలెను. నొప్పులారంభమయిన పిమ్మట ఉమ్మనీటి సంచిపగులగానే మంత్రసాని పరిశుభ్రమయిన చేతిని యోని మార్గమున దూర్చి అయిదు వ్రేళ్లు సుఖకరముగా గర్భముఖద్వారములోకి పోవుచున్నవో లేవో చూడవలెను. ఇది తగినంతగా వికసించక పోయినను లేక నొప్పులాగిపోయినను లేక రక్తస్రావమధికముగా యుండినను ఉపేక్షించక, వెంటనే వైద్య నిపుణుని కొరకు కబురంపవలెను. అంతయు సక్రమముగా నున్నప్పుడు బిడ్డ శిరస్సు భగద్వారమువరకు వచ్చువరకు కనిపెట్టుకొనియుండవలెను. శిరస్సు భగద్వారముదాటి వెలుపలికి వచ్చేటప్పుడు మంత్రసాని సాహాయ్యము అవసరమగును. నొప్పి వచ్చినప్పుడెల్ల భగ, గుద రంధ్రముల మధ్య చర్మము ఎత్తుగా ఉబ్బుచుండును. అప్పుడు మంత్రసాని అరచేతితో నా భాగమును యొత్తిపట్టుకొనిన చర్మము చినుగుటసంభవించదు. సులువుగా భగవృంగరము బిడ్డసిరస్సు పైనుండి జారి సిరస్సు బయటికి వచ్చును. పిమ్మట కొలదిసేపటికే బిడ్డయంతయు యూడి, బయట పడును.

పిమ్మట మంత్రసాని పుట్టిన బిడ్డకు శ్వాసలాడుచున్నవో లేదో చూచి శ్వాసలారంభమగుట ఆలస్యమయినయెడల

కృత్రిమ శ్వాసము సాయము జేసి, బిడ్డ బ్రతికి యున్నదని తెలిసిన పిమ్మట, బొడ్డు త్రాడుగాని (umbilical cord) నాడీ చలన మాగిపోగానే రెండు పరిశుభ్రమయిన దారములను తీసికొని బిడ్డ శరీరమునుండి రెండు అంగుళముల దూరమున నొకముడి గట్టిగా వేసి, ఒక అంగుళము దూరములో మరియొక ముడి వేసి, యీ రెండు ముడులకు మధ్యను కత్తిరించి బిడ్డకు స్నానము చేయించవలెను. బిడ్డ ప్రసవించిన అరగంటకు మరల నొప్పులు పుట్టి మావి యూడిపడును. అనుభవముగల మంత్రసాని మావిని జాగ్రత్తగా పరిశీలించి మావి శేషము ఏమయిన గర్భకోశములో మిగిలియున్నయెడల జూచిన, కుడి చేయిని పరిశుభ్రముగా కడుగుకొని గర్భకోశములోనికి దూర్చి, లోపల వేళ్ళకు తగిలిన మావి ముక్కలను గోకివేసి గర్భ కోశమును చేతితో పిండవలెను. భగము గుదముల మధ్య ప్రదేశమునందలి చర్మముగాని, యోని మార్గపొరలుగాని చినిగి యుండినట్లు కన్పించిన దానిని శుభ్రపరచి వెంటనే గాయపు టంచులను చేర్చి కుట్లువేసినయెడల జ్వరాధి యుపద్రవములు లేకుండ గాయములు త్వరలో మానును. ఇంతటితో ప్రసవ కార్యము ముగియుచున్నది.

ప్రసవానంతరం పదిరోజులవరకు బాలింతను కడు జాగ్రత్తగా సంరక్షించవలెను. బాలింత రోజులకు (పుర్ పుర్యు రమ్ లేక పుర్ పుర్యురల్ పీరియడ్ (peurpurum or peurpural period) అని యందురు. రెండురోజులవరకు లంఘనము చేయించి మూడవదినమున ఆకలి బాగుగా వేసినప్పుడు పథ్యాహారము నియ్యవలెను. ప్రసవము స్వాభావిక కార్యము

గాని జబ్బుకాదు. సక్రమముగా జరిగించిన కాన్పులలో బాలింతకు ఎట్టిమందు లియ్యనవసర ముండదు. మోడరన్ శాస్త్రము ప్రకారము ఎర్గట్ మందు రెండుపూటల పదిరోజుల వరకు త్రాగించెదరు. మన దేశములు పిప్పల్యాది అవలేహ మును తయారుచేసి యిచ్చుచుందురు.

పుట్టిన బిడ్డకు తల్లిపాలే ప్రశస్తమయిన ఆహారము. ఇది భగవద్దత్తమగుట వలన స్తన్యమునకు నాటి యితరపా లెవ్వియు కాజాలవు కాన స్తన్యవృద్ధికి దోహదకరమైన యాహారవిహారములను తీసుకొనుటలో బాలింత శ్రద్ధవహించ వలెను. ఇతరపాలమీాద పెరిగిన బిడ్డలకంటె తల్లిపాలను త్రాగుచున్న పిల్లలు ఆరోగ్యముగా పెరుగుదురు.

ఆయుర్వేద శాస్త్రములో ప్రసవక్రియాచరణ పద్ధతి ప్రసూతి యుపచారములు పైన వివరించిన విధముగానే బోధించిరిగాని సంగ్రహముగా సూత్రప్రాయముగా నున్నవి. బాలోపచరణవిధులు, బాలరోగ చికిత్సలు అతివిపులముగా నుండుట జూడవచ్చును.

స్త్రీరోగ బాలరోగ చికిత్సలను ఆయుర్వేద శాస్త్ర ములో ప్రత్యేక భాగముగా రచించి, దీనికి కౌమారభృత్య మని పేరుబెట్టిరి బాలగ్రహ చికిత్సలగురించి విపులముగానే యున్నది. ఇంతటి విజ్ఞానము మోడరన్ వైద్యములో నే లేదని చెప్పవచ్చును విశేషమేమనిన ఆయుర్వేదచికిత్సలతో మంత్రశాస్త్రమును కూడ జోడించిరి. ప్రసవసమయములోను, బ్రాహ్మణోయుగ్రవన్నను, స్తన్యపాన ముపక్రమించునప్పుడును కొన్ని రక్షోఘ్న, పిశాచఘ్నయన మంత్రములను చదువు

చుందురు. గర్భిణీ రోగచికిత్సలు, బాలింతరోగ చికిత్సలు, బాలరోగ చికిత్సలు త్రిదోషముల ననుసరించి చేయబడు చున్నవి. బాలగ్రహ విమోచక క్రియలు మంత్ర తంత్రము లతో కూడియున్నవి. స్త్రీలకు ఆయా వయస్సులలో వచ్చే ప్రత్యేక వ్యాధులు – అనగా యోనివ్యాపత్తులు, గర్భాశయ రోగములకు చికిత్స లమోఘముగా పనిజేయును.

ఇక ప్రసవసమయములో సంభవించు వ్యాపత్తులు అనగా మూఢగర్భముల రకములు, వాటి విధానచికిత్సలను, యన్త్ర, శస్త్రసాధన పాయములతో బిడ్డను పట్టి వెడలించు క్రియలను మోడరన్ వైద్యములో నేడాచరించబడినట్లుగానే ఆయుర్వేద తంత్రకర్తలు, (ముఖ్యముగా అష్టాంగహృదయ ములో వ్రాసినారు.) ఈ సాంకేతవిద్యలో చెప్పిన విషయము లును, చికిత్సాక్రియలను అర్థమొనర్చుకొనిన యెడల రెండు శాస్త్రములకు ఏమియు భేదముగాని విరుద్ధములుగాని కన్పిం చవు. ఒక్క ఔషధ ద్రవ్యములు, వాటిప్రయోగములలోనే భిన్నత్వము కన్పడును. మోడరన్ వైద్యములోవలెనే ఆయుర్వేదశాస్త్రములో కూడను మూఢగర్భములు ఎనిమిది రకములని చెప్పబడెను. శిరస్సుతో జననమొందుట Head presentation, ఇది సర్వసామాన్యము. వ్యతిరిక్త పరిస్థితులలో కాన్పుజరుగుట మూఢగర్భ మనబడును (abnormal presentation and difficult labours).

(1) ఒకచెయ్యి ముందుగాజారి నిలుచుట = Hand presentation

(2) ఒక కాలు ,, ,, ,, = leg ,,

(3) రెండుకాళ్లుకలిసి ,, ,, = both legs ,,

(4) రెండుచేతులు ,, ,, = both hands ,,

(5) పృష్ఠము ,, ,, ,, = breach ,,

(6) రెండేసిభాగములుకలిసి ,, ,, = double ,,

(7) గర్భాశయములోపల బిడ్డ అడ్డముగాతిరిగి యుండుట = transeverse presentation

(8) కవలలు చిక్కుకొనుట = twins locked together or interlocked

ఈ వివిధ మూఢగర్భ స్థితుల నెదుర్కొని బిడ్డను బయటికి లాగివేయుట కుపాయములు చక్కగా వివరింపబడినవి. వీని యాచరణకు విశేషానుభవమును సంపాదించవలసి యుండును.

కర్తవ్యము :- ఆయుర్వేదశాస్త్రములో ప్రసూతితంత్ర భాగము చాల సంగ్రహముగాను, అసంపూర్ణముగాను యున్నందున విశేషవిషయములను మోడరన్ వైద్యమునుండి గ్రహించవలసియున్నది. గర్భశాస్త్రము (embryology), గర్భిణోపచారములు (antinatal care), గర్భవ్యాపత్తులు (Diseases of pregnancy), సుఖప్రసవమును జరిగించుట (management of normal labour) ప్రసవానంతర మాతాశిశు సంరక్షణ పద్ధతులు (post natal care of mother and child) సూతికారోగ బాలరోగ చికిత్సలు (Diseases of peurpurum and diseases of childhood), స్త్రీరోగములు - అనగా యోని, గర్భాశయరోగములు (Gynocology) విషయములు ప్రత్యేకనిపుణుల యను

భవములతో నొక్కొక్క విషయమున కొక్కొక్క ప్రత్యేక గ్రంథముగా ప్రచురింపబడినవి. గాన ఆయుర్వేద వైద్యులు వీని నెల్ల చదివి ఆవిజ్ఞానములో శస్త్రపదాభ్యాస మొనరించ దగును. మూఢగర్భ చికిత్సకు ఆధునిక యంత్రశస్త్ర పరికరణముల నుపయోగించుట కెట్టియభ్యంతరములేదు. లైసాల్ మొదలైన antiseptics) ద్రవములను వాడుచుండుట ప్రమాదముకాదు. ఇక గర్భిణ్యావస్థలోను, ప్రసవసమయము నను, సూతికారోగములకు ఆయుర్వేదీయానుసారముగా దేశీయమందులను వాడుచు, వింతకంటె త్వరితముగా మేలొనర్చునని నమ్మకముగల విదేశీయౌషధములను, ఇంజెక్షనులను అవసరములనుబట్టి వాడుకొనుట తప్పుకాదు. ఆపరేషనులకు మోడరన్ వైద్యుల సహాయ మపేక్షించదగును.

---

# IX భాగము

## ఆరోగ్యశాస్త్రము

## Health and Hygiene

మనస్సు శరీరములయొక్క సుఖకర స్థితియే నారోగ్యము. బాధాకరస్థితియే రోగమనబడును. *శరీర ధాతువులు, వాతపిత్తకఫములు, జఠరాగ్ని, శరీరబలము, మనస్సు యింద్రియములయొక్క సౌమ్యస్థితియే ఆరోగ్యమని ఆయుర్వేదం నిర్వచించును. జీవితావసరములైన గాలి, నీరు, ఆహారములు, శుచిగానుండుట, ఆరోగ్యదాయకములుగా నుండును. వ్యాయామము, మానసిక పరిశ్రమ, విశ్రాంతి, నిద్ర, అభ్యాసములు, మలప్రవృత్తులు సరియైనపద్ధతుల ననుసరించిన్ని వయస్సు, బలములననుసరించిన్ని, తగినంతగా నుండినచో ఆరోగ్యవంతులుగా నుండగలరని పాశ్చాత్యుల యారోగ్యశాస్త్రము బోధించును. కనుక ఆహార పానీయము లందు శౌచపద్ధతుల (Hygiene and Sanitation rules) నెక్కువగా వివరించిరి. ఆయుర్వేదము శరీరమునకంటె మనస్సునకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చుచున్నది. గనుక శారీరిక శౌశముతో బాటు మనస్సును శుద్ధిపరుచుకొను టవసరము.

శ్లో॥ *సమదోషస్సమాగ్నిశ్చ, సమధాతుమలక్రియః।
ప్రసన్నాత్మేంద్రియమనాః స్వస్థయిత్యభిధీయతే॥

(అ. హృ)

శ్లో॥ నిత్యంహితాహారవిహారసేవీ. సమీక్ష్యకారీ, విషయేష్వసక్తః,
దాతా సమస్సత్యపరః క్షమావాన్ ఆప్తోపసేవీచభవత్యరోగః।

(చరక)

కనుక వ్యక్తిగతమయిన దినచర్య, ఋతుచర్య, అహార నియమములు, బ్రహ్మచర్యవిధి, శుచిత్వము, సదాచారాభ్యాసములు సద్వర్తనము, మనస్సును నిర్మలముగా నెల్లవేళల ఆనందమయముగా నుంచుకొనుట ఆరోగ్య సాధకములని ఆయుర్వేదము స్వస్థవృత్త ప్రకరణమున విపులముగా చర్చించును. రోగములు సంభవించిన పిమ్మట, వాటి నివారణోపాయముల వెదకుటకంటె నారోగములు రాకుండ చేసికొనుటే యుత్తమ పద్ధతియని (Prevention is better than cure) మన ప్రాచీనులును నేటి మోడరన్ వైద్య పండితులును చెప్పినారు. నిత్యము హితమితాహార విహారముల ద్వారా శరీరమందలి ఊర్జశక్తి మిక్కిలి యభివృద్ధి చెంది (Vitality or disease resisting power) ఆరోగ్యవంతులుగా నుండగలరు, మిథ్యాహార విహారములే సర్వరోగములకు హేతుతులని ఆయుర్వేదము బోధించుచున్నది. మిథ్యాహారవిహారములు శరీరయంత్రమును సౌమ్యముగా పాలించుచున్న వాత పిత్త కఫములను ముందుగా దుష్టమొనర్చి నందున, యివి మిగిలిన శరీరధాతువులను చెఱచుటచే రోగములు సంభవించును గనుక వాతాదులను నెల్లవేళల సౌమ్యస్థితిలో నుంచుకొనుటకు నిత్యము హితమితాహార సేవనము, సద్వర్తనాదుల బోధించియుండిరి. ఈవిధముగా వ్యక్తిగతారోగ్య విధుల నాచరించుచుండిన సాంఘిక రోగము లెట్లు సంభవించకుండును? సంఘశ్రేయస్సు నాలోచించువారి సంఖ్య ఎప్పుడును బహుస్వల్పముగా నుండును కనుక సాంఘిక జీవితములో నొకవ్యక్తి ప్రవర్తించవలసిన విధుల నతిక్రమించకుండ నతి భక్తిశ్రద్ధలతో నాచరించుటకు

గాను మనవారు ఆచారములకు పేరుతో మనువు ధర్మశాస్త్రమును నిర్మించిరి. ఈ శౌచసంబంధమయిన ఆచారము లతిక్రమించు వారలకు పాపము సంభవించునని భయపెట్టిరి. హైందవులు పుణ్యమందాశక్తి, పాపమనిన భీతిని కలిగిన వారు. కనుక సాంఘికాచార విధుల నతిక్రమణము పాప హేతువు అని చెప్పుటచేతను, సర్వులు వీని నతి భయభక్తులతో నాచరింతురు. పాపభీతి తక్కువైన యీరోజులలో సాంఘికాచార విధుల నతిక్రమించు స్వార్థపరులను శిక్షించుటకు ప్రభుత్వము శాసనము లొనర్చి అమలుపరచుట అవసరమగుచున్నది.

మరియు ఉపవాసములు, వ్రతములు వ్యక్తిగతమయిన ఆరోగ్యసూత్రముల నవలంభించుటకు తోడ్పడును. పండుగలు, తీర్థయాత్రలు. జాతరులు, సాంఘిక సహాకార సహజీవన పద్ధతులను బోధించును. అష్టాంగ హృదయ సూత్రస్థానము స్వస్థవృత్తప్రకరణమున వ్యక్తియొక్క దినచర్య, ఋతుచర్య, ఆహార విధులు అతివిపులముగా చెప్పబడినవి. ఈ చెప్పిన ప్రకారము వర్తించు మానవున కారోగ్యము వర్థిల్లుననుటకు సందేహము లేదు. వ్యక్తి యారోగ్యమును కాపాడుకొను టెంత యవసరమో సంఘక్షేమమును కాపాడవలసిన బాధ్యతకూడ నంతకంటెను ఎక్కువ ప్రధానమని చెప్పిరి. సంఘక్షేమమును కాపాడుటలో ప్రతివ్యక్తియు సహాకరించవలసియున్నది. వ్యక్తిగతారోగ్య విధులకు (personal hygeine) అనియును, సాంఘికారోగ్య శౌచ విధులకు (Social hygeine or Sanitation) అనియు

నందురు. పాశ్చాత్యులు సాంఘిక శౌచవిధానములను ఆరు శాఖలుగా విభజించినారు. అవి యవ్వియనగా:- (1) (Domestic hygeine) గృహనిర్వాహక, గృహనిర్మాణ, విషయమున శౌచపద్ధతులు (2) గ్రామపారిశుద్ధ్య విధానము (Village sanitation) (3) పట్టణములో శౌచపద్ధతి నిర్వహణము (Town planning & sanitation) (4) పారిశ్రామిక శౌచపద్ధతి (Industrial hygeine) (5) పాఠశాలలందు శౌచపద్ధతి (School hygeine) (6) మానసిక శుచిత్వము (Mental hygeine) మొదలైనవి.

ఆయుర్వేదములో వ్యక్తిగత శౌచవిధుల కిచ్చినంత శ్రద్ధ మిగిలినవాని కిచ్చినటుల కన్పించదు. సాంఘికారోగ్య రక్షణ విషయమున జనులు, ప్రభువులుతీసికొనవలసిన విధులను చాల తక్కువగా చెప్పిరి. యోగ వ్యాయామపద్ధతులు ఆరోగ్యరక్షణకు ఎక్కువగా తోడ్పడగలవు. సాంఘికారోగ్య రక్షణవిధులు ఆయుర్వేదశాస్త్రములోకంటెను శృతి, స్మృతి పురాణేతి హాసములలో నెక్కువగా వివరింపబడినవి. ఇవన్నియు గాలి, నీరు, ఆహారపదార్థములు దూషితములు కాకుండ శుచిగానుంచు పద్ధతులను బోధించుచున్నవి. కొన్నిటి నిచ్చట చదువరుల యుపయోగార్థ మిచ్చట నెత్తి చూపించుట అనవసరముకాదు.

(1) "నాప్సు మూత్ర పురీషం కుర్యాత్-ష్ఠనిష్ఠీవేత్ వివసనః స్నాయాత్."

(యజుర్వేద-అరణికం)

(2) పక్వం, సఫేనం, కలుషం, సదుర్గంధం, సబుద్బుదం।
ఉష్ణం, సమృత్తికం, క్షారం త్యజే దాచమనే జలం"॥
(ఆపస్తంబస్మృతి)

(3) పానీయదూషకే పాపంతథైవ విషదాయకే।
యత్తదేకస్సలభతాం యస్యార్యోమ మతేగతే॥
(వాల్మీకిరామాయణం - అయోధ్యకాండ)

(4) దృష్టిపూతం న్యసేత్పాదం, వస్త్రపూతం పిబేజ్జలం।
సత్యపూతంవదేద్వాక్యం, మనఃపూతం సమాచరేత్॥
(భాగవతం - ఏకాదశస్కంధం)

(5) నాప్సుమూత్రం పురీషంవాష్ఠీవనంవాస ఉత్సృజేత్।
అమేధ్యలిప్తమన్యద్వా లోహితంవావిషాణివా॥
(మనుధర్మశాస్త్రం - వర్ణాశ్రమధర్మం)

(6) మునిదేవాలయారామ వల్మీకజలభస్మ గోమయదూర్వా
సస్యక్షేత్రసరః పర్వతాశ్మభూగర్తేషు నోత్సృజేన్మల
మూత్రే॥ (గౌతమసూత్రం - 1వఖండం - మొదటిపన్నం)

(7) "శకృన్మూత్రష్ఠీవనరేతాం స్యప్సునినిక్షిపేత్"
తీరదేశస్థః క్షాళయేన్మలం దేహజం
(గౌతమ - 9 ఖండం 1పక్షం)

(8) నబుద్బుదాభి ర్నఫేనాభి ర్నోచ్ఛిష్టాభి ర్నక్షారాభి ర్నవి
వరాభి
ర్నకలుషాభి ర్నోష్ణాభి...స్త్రిరపోహృదంసంగమాఃపిబేత్॥
(బోధాయనసూత్రం)

(9) "అనుష్ణాభి రఫేనాభి...శౌచేప్సుసర్వదాచమేః॥
(మనుస్మృతి - 2 అధ్యాయం 2 శ్లోకం)

(10) నమూత్రం పథికుర్వీత నభస్మని, నగోవ్రజే।
నఫాలకృష్టే నజలేనచిత్యాంనచపర్వతే
(మను - 4 అధ్యాయం - 45-46 శ్లో॥)

(11) ననదీతీర మాసాద్యనచ పర్వతమస్తకే।
విణ్మూత్రస్య విసర్జనం॥
(మను. 4 అధ్యా 47 శ్లో)

(12) ఆపశ్శుద్ధా భూమిగతా వైతృష్ణ్యం యాసుగోర్భవేత్।
అవ్యాప్తాశ్చేద మేధ్యేన గంధవర్ణరసాన్వితా॥
(మను. 5 అధ్యా - 128 శ్లో)।

(13) "నతుమేహేన్నదీ చ్ఛాయా వర్త్మగోష్ఠాంబు భస్మసు"
(యాజ్ఞవల్క్య - ఆచారకాండ 1 ప్రకరణం 124 శ్లో)

(14) "ష్ఠీవనా సృక్శకృన్మూత్ర రేతంస్యప్సు నష్ఠీవేత్"
(యాజ్ఞవల్క్య - 1 ప్రకర 137 శ్లో)

(15) "శుచిగోతృప్తి కృత్తోయం ప్రకృతస్థం మహీగతమ్"
(యాజ్ఞవల్క్యం - 1 ప్రకర. 163 శ్లో)

(16) "జలేదేవాలయే గోష్ఠే యజ్ఞభూమౌ శవక్షయే।
గర్తేపథి నదీతీరే యజ్ఞవృక్షస్య సన్నిధే। స్త్రీసన్నిధౌ
మహాకూపే దేవోద్యానసమీపతః। ఏతేషుయది
మేహేన మలమూత్రేస్సృజేన్నరః। సపాపాత్మా
మహాఘోరే చిరంతిష్ఠతి దారుతే
~ (అపస్తంబ - 2వ పటలంకాకాండ)

(17) "యన్మయా దూషితంతోయం శారీరమల సంయుతం।
తస్యపాప విశుద్ధర్థ్యం యక్ష్మాణం తర్పయ్యామ్యహం।"
(అపస్తంవాసూత్రం - 3 పటలం - స్నానప్రకరణం)

(18) "స్నాత్వారజక తీర్థేషు పునస్నానే నశుద్ధ్యతే।"
నద్యాంయచ్చ పరిభ్రష్టం నద్యాయచ్చ వివర్జితం।
గతప్రత్యాగతం చైవతత్తోయం పరివర్జయేత్
(వ్యాసస్మృతి।)

(19) "అగ్రాహ్యస్వగ్రిమా అపోనద్యా ప్రథమవేగికాః।
ప్రక్షోభితాశ్చ కేనాపి యాశ్చతీర్థాద్వినిసృతాః॥"
(యోగయాజ్ఞవల్క్య)

(20) మయాకృతం మూత్రపురీషశౌచం। గండూషణక్షేపణ
మేహానేచ। వస్త్రస్యసంక్షాళణ జంచదుష్కృతం,
క్షమస్యగంగే మమసుప్రసన్నా॥"
(విశ్వామిత్రస్మృతి - 2 అధ్యాయం)

(21) "శతహస్తం పరిత్యజ్యమూత్రం కుర్యాత్జలాశయః॥
శతద్వయం పురీషంతుతీర్థే చైవచతుర్గుణం॥

(22) అపఃపూతా భవంత్యేతా వస్త్రపూతా సముద్ధృతాః।
అఫేనా (మునిశార్దూలా) నాదేయాశ్చ విశేషతః।
జంతుభిర్మిశ్రితాహ్యేష సూక్ష్మైభిస్తాన్నిహత్యతు।
యత్పాపం సకలంచార్థిత పూతాభిశ్చిరం లభేత్।
తస్మాత్సర్వ ప్రయత్నేన వస్త్రపూతం సమాచరేత్॥
(లింగపురాణా 18 అధ్యాయం 2, 7 శ్లో)

ఈ పైనచెప్పిన ప్రమాణ వాక్యములన్నియు నీటి యొక్క పారిశుద్ధ్యమును కాపాడుటకు చెప్పబడినవి. ఆయు ర్వేదములో పానయోగ్యమైన నీటిలక్షణములను వివరించు నప్పుడు దేశభేదమునుబట్టి ఎచ్చటలభించిననీరు ఏదోషముల

వృద్ధిచేయునో చెప్పబడినది. కూపోదకము లోతుబావులలో లభించునీరు ప్రశస్థమయినది. ఇంకను వివిధరకములుగా లభించు నీటిగుణములు వివరింపబడినవి.

మరియు నాహారము విషయమున మనవారు తీసికొన్నంతగా శ్రద్ధ పాశ్చాత్యులకు తెలియదు. తేలికగా జీర్ణమగునట్టిదియు, పుష్టినిచ్చునదియు, చాలినంతగా తినుటయే పాశ్చాత్యుల సిద్ధాంతము మనవారు శరీరమును, మనస్సును వృద్ధిచేయునట్టి యాహారము కావలెనందురు. పదార్థములందలి త్రిగుణాంశ భేదములనుబట్టి, సాత్వీక, రాజస, తామసాహారములని త్రివిధములుగా ఆహారములు విభజింపబడినవి. ఇవి ఆయాగుణములను వృద్ధిచేయును కనుక వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి వారు వారుకోరిన గుణాంశవృద్ధి చేయగల పదార్థములను భుజించవలెనని ధర్మశాస్త్రకారులు విధించినారు. ఈ విజ్ఞానము పాశ్చాత్యులకు తెలియదు. మరియు ఆయుర్వేదశాస్త్రము భోక్తవ్య పదార్థములను త్రిదోషములను దృష్టిలోనుంచుకొని ఒక్కొక్క ఋతువులో నొక్కొక్క రసప్రధానమైన పదార్థములను భుజించవలసినదని విధించును. ఎట్లనగా—

1 వసంతఋతువులో తఱచుగా కఫమునకువృద్ధి ప్రకోపములుకలిగి యుండునుగనుక దీనిని శమింపజేయుటకు చేరు కారము, వగరు పదార్థములను తినవలెను.

2 గ్రీష్మఋతువులో వాతము వృద్ధిపొంది, వర్షకాలములో ప్రకోపించి; వాతరోగముల కలిగించుచున్నందున వాత శమన హేతువులుగానున్న మధుర పదార్థములను తినవలెను.

3 శ్రావణ మాసములో నందఱు మొలకలెత్తుచున్న గింజలను తినుటకొఱకు మొక్క పెసలు, మొక్క శనగలు వాయనము పంచిపెట్టుచుందురు. మధురామ్ల లవణరసములు వాతమును శమించును

4 శరదృతువులో పిత్తము ప్రకోపించును గనుక తీపి, చేదు వగరు పదార్థములను తినవలెను. కార్తీకసోమవారము లందు ఉపవాసముండి లఘ్వాశనము చేయవలెను.

5 హేమంతఋతువులో కఫమునకు సంకోచము వృద్ధి సంభవించును. ఈస్థితిలో వాతమునకు బలములేకుండ క్షయింపజేయుటకు మధుర, తిక్త, కషాయద్రవ్యములను సేవించవలెను. ఉదయపువేళను 10 గంటలలోపుగా భుజించుట శ్రేష్ఠము.

6 శిశిరఋతువులో కఫము ప్రకోపోన్ముఖమై యున్నందునను, దీనికి పిత్తము అనుసరణముగా నుండుటవలనను, పిత్తశామకములైన మధురామ్ల లవణరస ప్రధానద్రవ్యములను తినుచుండవలెను. ఉగాదినాడు వేపపువ్వు, పంచదార, లేత మామిడిపిందెలను తిను యాచారము యీసూత్రము ననుసరించి ఏర్పడినది.

ఇంతటి సునిశిత విమర్శనాజ్ఞానముతో కూడిన పథ్యాహారశాస్త్రము dietology) పాశ్చాత్యులకు లేదు. ఇంకను మనవారు "నిత్యం హితాహారసేవీ" అనియును, మితముగాను వేళ తప్పకుండాను భుజించవలెనని చెప్పిరి మాంసాహార విషయములో యీక్రింది లక్షణములుగల మాంసాదులను వర్జించవలెనిరి— సూ. మృతం కృశాతిమేధ్యంచ, వృద్ధం బాలం

విమ్రైర్త్యాతం। ఆగోచర భృతం వ్యాళసూదితం, మాంసం ఉత్సృజేత్॥ ఫలభక్ష్యములలో విసర్జించవలసినవి— సూ. పురాణమామం సంక్లిష్టం, క్రిమివ్యాడ హిమాతపైః అదేశ కాలజం క్లిన్నం, యత్ స్యాత్ఫలమసాధుతత్॥ షడ్రసయుక్త మయిన నిత్యభోజన మెట్లుండవలెననగా—"ఊర్జస్కరం బల కరం సోమం అన్నం ఆద్యం సోమాయిస్వాహా॥ అని అన్న ప్రాశన మంత్రము చెప్పుచున్నది. మరియు—

ఆహారముయొక్క హితాహితములకు ఎనిమిది విధము లైన ఆహారవిధి విశేషములను (అష్టవిధ సంస్కారములను) ఆయుర్వేదము బోధించుచున్నది. అవి యేమనగా—

1 ప్రకృతి - అనగా పదార్థములకు స్వభావముచేతనే గురుత్వ లఘుత్వము లున్నవి. వీనిని అవసరములనుబట్టి సంయోగాది క్రియలచేతను సంస్కరించుకోవచ్చును.

2 కరణము - అనగా పదార్థములయొక్క గురు లఘు గుణములను యిచ్చవచ్చినట్లు నానబెట్టుట, ఉడికించుట మొదలైన క్రియలద్వారా సంస్కరించుట.

3 సంయోగము - ద్రవ్యములకు సంయోగక్రియ ద్వారా విశేష గుణసామర్థ్యములు కలిగించుట. విరుద్ధ సంయోగములవలన చెడు ఫలితములుకూడ కలుగును.

4 రాశి - అనగా భోజనపరిమితి, ఇది జఠరాగ్ని యొక్క బలము ననుసరించి యుండవలెను.

5 దేశము - ద్రవ్యములయొక్క పుట్టుక ప్రదేశ స్వభా వము ననుసరించి వానికి గురు లఘుత్వాది గుణములు సంక్ర

మించును. జాంగల, అనూప, సమ ప్రదేశములందు లభించిన ఆహారపదార్థముల గుణములు వేర్వేరుగా నుండును.

6 కాలము:- అవస్థిక కాలము (రోగములననుసరించి నవి) నిత్యగ కాలము (ఋతువులననుసరించి) లలోదోషానుగుణముగా పథ్యమును నిర్ణయించవలసియున్నది.

7 ఉపయోగ సంస్థ:- భుజించుటకు ముందుగా తానిదివరలో భుజించినయాహారము పూర్తిగా జీర్ణమైనదో లేదో తెలిసికొనుట.

8 ఉపయుక్తసంస్థ:- అనగా దేశసాత్మ్యము ననుసరించి సాత్మ్యాహారమునే భుజించుట.

ఆహార విహారాదులద్వారా స్వాస్థ్యరక్షణము కొంతవఱకు సాధ్యమయినను, సద్వర్తన, సదాచార, సదభ్యాసములు, భక్తిజ్ఞాన వైరాగ్యాదులు ఊర్జశక్తిని వృద్ధిచేయుచున్నవి.

1 తే-గీ॥ తపమునను బ్రహ్మచర్య వ్రతమున। హితమితాశనమున
రసాయనాభ్యాసముననుః పెరుగు నాయువా క్రియలపై
నరుడు ప్రీతిగలుగుటయు పూర్వభవకృత కర్మఫలము॥

2 కం॥ తనలావు కధికమైనపని చేయుట అయుక్తమును
నపథ్యమునగు భోజనములు హరించునాయువు
వనితయవియు పూర్వకర్మ వశతను గలుగున్॥

(భారత-అనుశా.)

ఇక సాంక్రామిక వ్యాధులు ప్రబలినప్పుడు జనులు తీసికోవలసిన జాగ్రతలను చరకుడు వివరించినాడు. ఎలుకలు

ఎక్కువగాపడి చచ్చుచుండిన ప్రదేశమునుండి జనులు ఖాళీ చేసి వెళ్లిపోమ్మని సలహాచెప్పెను. ఇది మహామారి (ప్లేగు plague) గురించి చెప్పినసలహా. కలరా, మసూచిక వ్యాధులు జనులు పాపాత్ములై వేదవిహిత కర్మల నతిక్రమించుటవల్లను, పరిసర ప్రాంతమందలి గాలి, నీరు, ఆహారము దుష్టమగుటవల్లను మారకరోగములు విజృంభించుచున్నవని నుడివెను. వీని నరికట్టు యుపాయములు తోచనప్పుడు చేయు గలపనియేమి? కర్మసిద్ధాంతమును గ్రహించి యనుభవించుటయే. మానవప్రయత్నములలో భక్తిని పురస్కరించుకొని యీ మారకముల కధిపతులుగానున్న దేవతల యనుగ్రహము కొఱకు పూజలు ప్రార్థనలు, జాతరలు సలుపుటయే.

నేడు మోడరన్ వైద్యములో క్రిమి సాంక్రామిక వ్యాధుల నరికట్టుట కనేక యుపాయములు కనుగొనబడినవి—

1 రోగిని వెలిబెట్టుట =(Segregation of patient

2 రోగము ప్రబలియుండిన ప్రాంతమునుండి తరలి వచ్చు జనులను గ్రామము వెలుపల కొంతకాలము నివసింప జేయుట (quarantine)

3 ప్లేగు, కలరా, మసూచిక రోగములకు ఆయాక్రిములతో తయారైన వేక్సిన్ మందులను రోగము రాకముందే ప్రజలకందఱకు ఇంజెక్షనులు చేయుట inoculation for plague and cholera and vaccination for small pox)

4 రోగులను గ్రామమునకు వెలుపల నాసుపత్రులలో నుంచి నిపుణులచేతను చికిత్సలు, ఉపచారములు చేయించుట,

రోగుల శరీరమాలాదులు ఈగలు, జలాశయములద్వారా, ఆహారపదార్థముల ద్వారా ప్రజలకు వ్యాపించకుండ వెంట వెంటనే ఆ ద్రవ్యములను మంటలో వేసి కాల్చివేయుట.

5 పిచ్చికుక్క కఱచినవ్యాధికి, గాయములు తగిలిన వారికి టిటెమునస్ (ధనుర్వాతరోగము) రాకుండ వెంటనే ఆయా రోగసంబంధమయిన సీరమ్ మందుల నింజెక్షనుల చేయుట

6 ఈగోజులలో క్షయవ్యాధి (tuberculour disease) రాకుండ ముందు జాగ్రత తీసికొనుటకుగాను బి. సి. జి వేక్సినుమందు యింజెక్షనులిచ్చుచున్నారు. ఒక దశదాటిన పిమ్మటగాని దీనిమేలును గుర్తించజాలము.

7 చల్లగా జనులలో వ్యాపించి, ప్రజలను పీల్చి పిప్పి జేసి 'దీర్ఘకాలము నిస్సారవంతులుగా తయారుచేయుచున్న సాంక్రామిక క్రిమి వ్యాధులతో ముఖ్యముగా పేర్కొనదగి నవి మలేరియా, కలాజార్ అను జ్వరములు, శ్లీపదరోగము. మలేరియా, శ్లీపదరోగక్రిములు దోమలు కుట్టుటద్వారా మనుష్యులకు సంక్రమించుచున్నవని స్పష్టముగా తెలిసినది గాన దోమలకు స్థావరములు లేకుండా చేయుటయున్ను, దోమగ్రుడ్లను నాశనమొనర్చుటకు ప్రయత్నములు సాగు చున్నవి. కాలాజార్ (kalazar) జ్వరము నల్లులద్వారా సంక్రమించును. ప్లేగువ్యాధి యీవ్యాధి తగిలి చచ్చిపడిన ఎలుకల ఒంటిమీఁద నుండిన యొక రకము చిన్న యీగలు కఱచుటద్వారా మనుష్యులకు వచ్చుచున్నదని కనిపెట్టిరి. హేతుసంక్రమణపద్ధతి తెలిసిన రోగములన్నిటిని మానవ

ప్రయత్నములద్వారా నిరోధించుకొనవచ్చును. రోగములను నయముచేసికోవచ్చును.

మనుష్య శరీరములలో ప్రవేశించి బాధించుచున్న చాల రకముల రోగక్రిములను సంహరించుటకు నేడు చాల శక్తివంతములయిన మందులు (Antibiotics) లభించుచున్నవి. సల్ఫాడ్రగ్సు, పెన్సిలిన్ చాల క్రిములను నాశనము చేయగలవు. క్లోరోమైసిన్ మందువల్ల టైఫోయిడ్ జ్వరమనిన భయములేకుండ పోయినది. స్ట్రెప్టోమైసిన్ ఆరియోమైసిన్, టెర్రామైసిన్ మందులు (చాలరకములు) రోగక్రిములను చంపుటకు ప్రసిద్ధిగాంచినవి. ప్రమాదవశమున మనకు తెలియకుండా సంక్రమించుచున్న రోగక్రిములన్నిటిని జయించగలుగుచున్నామని చెప్పకొనుట గర్వించదగిన విషయమే యగును. కాని బుద్ధిపూర్వకముగా స్త్రీ పురుషులుకోరి సంపాదించుకొనిన శగవ్యాధి (గనేరియా), సవాయి (ఫిరంగిరోగము Syhilis) రోగులసంఖ్య మనదేశములో దినదినము పెచ్చుపెరుగుచున్నది. తగ్గుసూచనలు కన్పించుటలేదు. దీని సంక్రమణ విధానము ప్రజలకుకూడ దెలియును. క్రిమినాశనోపాయములను చాలకాలము, క్రిందటనే వైద్యశాస్త్ర నిపుణులు కనిపెట్టినారు. అయినను యీవ్యాధులను నిర్మూలించు టసాధ్యముగానున్నది.

తీవ్రరూపముగా విజృంభించి ఒక్కసారిగా వేలాది ప్రజలను మృత్యువుపాలు చేయగల ప్లేగు, మశూచికము, కలరా, టైఫోయిడ్, మలేరియా జ్వరములే మేలనిపించును. ఇప్పుడు వీనివలన భయములేదుగాని పైన చెప్పిన రెండు

సుఖవ్యాధులు (Sexual diseases) క్షయ, కేన్సర్ వ్యాధు లనివార్యముగా నున్నవి. కేన్సర్‌వుండు సామాన్యముగా నందఱికి సంభవించే వ్యాధికాదు. క్షయరోగము ప్రమాద హేతువులవల్ల పుట్టును. ఇందువల్ల వేలకొలదిజనులు బాధ పడుచుండుట నిజము. ఈరోగవిషయమున అజ్ఞానము ప్రజ లకుతొలగి, తెలివిగా చికిత్సకునితో సహాకరించినప్పుడు దీనిని పూర్తిగా జయించవీలగును. కాని సుఖవ్యాధుల నిర్మూలించు టెట్లు? రోగవిషయికమయిన యజ్ఞానము దీని వ్యాపకమునకు ప్రబలహేతువుకాదు. మరి చికిత్సకులతో రోగులు సహాక రించకుండుటయే కారణమని చెప్పవచ్చును. ఇట్టిసహాకారము కుదిరిననాడు యిప్పుడు క్రొత్తగా లభించుచున్న క్రిమిసంహా రక మందులతో నిర్మూలించవచ్చునని యాశ కలుగుచుం డును. వ్యభిచారవృత్తి పూర్తిగా దేశములో నిర్మూలింప బడినగాని యీ వ్యాధులు జయింపబడ జాలవు.

---

# X వ భాగము

## 1వ అధ్యాయం

### ఆయుర్వేదమునకు సంబంధించిన అన్యశాస్త్రములు.

ఆయుర్వేదశాస్త్ర నిర్మాణమునకు బీజరూపక విషయములు వేదములనుండి గ్రహింపబడినవి. అధర్వణవేదములో ననేక ఓషధుల గుణములు వర్ణించబడినవి. సూక్ష్మక్రిమి విజ్ఞానము (భూతవిద్య) అధర్వణవేదములో రక్షోఘ్నపిశాచ క్షయ, యక్ష్మనాశన, యాతుధాన, గ్రహమోచన మంత్రములలో కన్పించును. ఆయుర్వేద తంత్రకర్తలు తమకు కావలసిన భాగమునుమాత్రమే గ్రహించి బాలగ్రహ చికిత్సల నిర్మించుకొనిరి. ఆయుర్వేదశాస్త్ర నిర్మాణమునకు షద్దర్శన జ్ఞానమెక్కువగా తోడ్పడినది. దేహ, మానసికతత్త్వము, ఔషధద్రవ్యగుణ నిరూపణము, చికిత్సాపద్ధతులు దర్శనములను పురస్కరించుకొనియే నిర్మింపబడినవి. దేహ మానసిక తత్త్వము సాంఖ్యశాస్త్రము ననుసరించి వివరింపబడినది. ఆత్మతత్త్వము నిరూపించునప్పుడు న్యాయ, వైశేషిక, వేదాంతవిషయములను తడవుచునే ఆయుర్వేద తంత్రకర్తలు స్వతంత్రించి జీవాత్మలు బహుసంఖ్యలుగానున్నవని, వానిగతి పరిమిత మొనర్చి, ప్రకృతిసంబంధమువలన కర్మపురుషుడని వ్యవహరించిరి. కర్తృత్వ భోక్తృత్వముల కధికారియగుట వలన చికిత్స కర్హుడనికూడ ప్రతిపాదించిరి. సృష్టి హేతువులను వివరించినప్పుడు అందఱి మతములను పరిగ్రహించి స్వభావము, ఈశ్వరుడు, కాలము, యిచ్ఛ, నియతి, ప్రసవ ధర్మముఅని ఆరుహేతువుల నంగీకరించిరి. జన్మపరంపరలు,

కర్మసిద్ధాంతములను ఆయుర్వేద మంగీకరించి రోగములు ప్రారబ్ధకర్మ ఫలితములుగా సంభవించునని పేర్కొనెను. ప్రారబ్ధకర్మ విమోచనకొరకు భక్తి, జ్ఞాన, వైరాగ్యములు సాధనములని బోధించెను. జీవ పరమాత్మైక్యము నంగీకరించియు, (అద్వైత సిద్ధాంతము) సృష్టిలోని ఇంద్రాగ్ని, యమ, వరుణ, కుబేరాది దేవతలను మన శరీరములోని వివిధభాగముల కధిష్ఠానపతులుగా నిర్మించిరి. ఈదేవతల యనుగ్రహము సంపాదించుటకొఱకు జప, తప, దాన, హోమాదుల చేయవలెనని వైదికమతమునుకూడ ఆయుర్వేదకర్తలు బోధించిరి. ప్రేత, భూత, పిశాచ, గ్రహ, పీడనకొఱకు మంత్రశాస్త్ర పఠనము, తంత్రయంత్ర శాంతిక్రియలను చెప్పిరి, పాము తేలు కాటులకు, సర్పి, బెణుకులు, వాపులు తగ్గించుటకు మంత్రశాస్త్ర మవశ్యమని ఋజువుచేసిరి.

పాతంజలియోగ శాస్త్రాభ్యాసములనుకూడ కొన్నిరోగముల నయముచేయుటకు సాధనముగా నుపయోగించుకొనిరి. సామాన్యరోగములకు యుక్తి వ్యపాశ్రయ చికిత్సలను పార్థివ, జంగమ, ఓషధీద్రవ్యములతో చేయుటను బోధించిరి. భవిష్యత్తులో రానున్నరోగములను ముందుగా గుర్తించుటకును, జననకాల గ్రహస్థితులనుబట్టి రోగము నారంభించిన తిథి, వార, నక్షత్రములనుబట్టినిన్ని రోగములయొక్క సాధ్యాసాధ్యములను, ఆయుర్దాయమును తెలిసికొనుటకు, గండములను గ్రహించుటకును జ్యోతిర్విజ్ఞానము పతివైద్యుని కవసరమని బోధించిరి. ఈవిధమయిన జ్ఞానము గలిగిన వారు రోగము రాకుండా చేసికొనుటకు ప్రయత్నించవచ్చును. వక్రగతి

బట్టిన సూర్యాది నవగ్రహములకు శాంతులొనర్చుకొన వచ్చును. ఇంకను రోగసాధ్యా సాధ్యములు, రోగి యనుభవించిన స్వప్నములబట్టిన్ని, కొన్ని అరిష్టలక్షణముల బట్టిన్ని, సాముద్రిక లక్షణముల బట్టిన్ని చెప్పబడినవి. శకున ఫలితములుకూడ వివరింపబడినవి. ఇన్ని శాస్త్ర విజ్ఞానముల తోడ్పాటుతో నాయుర్వేదశాస్త్రము నిర్మింపబడినది.

మరియు భౌతికపదార్థ విజ్ఞానశాస్త్రము (physics) రసాయన శాస్త్రము (chemistry) వృక్షశాస్త్రము (Botony) జీవజంతుశాస్త్రము (Biology) ల సాయము తోనే ఆయుర్వేదము నిర్మింపబడుట సత్యము. ఈ వివిధ శాస్త్ర పరిచయములున్నవారు ఆయుర్వేదశాస్త్ర విషయము లను చక్కగా నవగాహము చేసికొనగలరు.

ఆయుర్వేదమున రోగహేతువులను వివరించునప్పుడు ఆగంతుహేతువులలో సూక్ష్మక్రిములను, అభిఘాతములను, అభిచార, అభిశాపములును చేర్చబడినవి. ఇవి మానసిక వికారములను పుట్టించి శరీరమునుకూడ బాధించును, ఈ మనోరోగములను వైద్యుడు తన మానసిక శక్తిచే తనే నయముచేయవలెను. మనశ్శక్తి మంచికార్యములకు చెడు కార్యములకుకూడ నుపయోగించవచ్చును. అభిచారకులు కొందఱు తమ ఉపాసనాదేవతలను (క్షుద్రదేవతలను) ఉపా సించి తమ శత్రువులయొక్క మనస్సులను వికలమొనర్చు చుందురు. దీనినిబదిచేత ప్రయోగమందురు. ఇట్టివ్యాధులను మంత్రోచ్చారణ, మానసికశక్తుల ద్వారానే నయముచేయ దగునని వాగ్భట (అష్టాంగ, హృదయ) నిదానస్థానములో

చెప్పబడినది.* మానసిక ధ్యానముద్వారా నితరుల నావే శింపజేయుట ఆధునిక మానసికశాస్త్ర విజ్ఞానమునకు తెలిసిన విషయము. (Telepathy). ఇదేప్రకారము తపఃప్రభావంతుల శాపములుకూడ రోగహేతువులుగ నంగీకరించబడినవి. గ్రహావేశమువలన సౌమ్యముగా వ్యవహరించుచున్న వాతాది దోషములు వికారముజెంది రోగములను కలిగించును.

పై విధముగానే జననకాల, నక్షత్ర, గ్రహాదులును రోగహేతువులుగ నున్నవని జ్యోతిశ్శాస్త్రము నుడువు చున్నది. ఆయుర్వేదముకూడ నీవిషయము నంగీకరించినది. శ్లో॥......గ్రహావేశ ద్విషగరదుష్టామ పార్వతశ్లేష గ్రహ జన్మర్ష పీడనాత్॥

(అష్టాంగహృదయ)

ఈశ్లోకములోచెప్పిన గ్రహాశబ్దమునకు మూడువిధము లైన యర్థముల చెప్పవచ్చును (1) నక్షత్రములు, సూర్యాది నవగ్రహములు (2) ప్రేత, భూత, పిశాచములు (3) సూక్ష్మ క్రిములు. ఈ త్రివిధరోగ హేతువులను ఆయుర్వేదమంగీకరించినది. హేతువుల ననుసరించి చికిత్సలు వేర్వేరుగా నుండును. నక్షత్రగ్రహ దోషములకు జపములు, హోమములు దానములు చేయించవలెను. ప్రేత భూత పిశాచముల పీడను విదల్చుటకు భూతవైద్యులు మంత్రోచ్చారణల ద్వారాను, కొన్ని తంత్రక్రియలును చేయుదురు.

---

శ్లో॥ *తత్రఅభిచారకైర్మంత్రై రాహూయమానస్యతస్యతే
పూర్వంచేతస్తతో దేహస్తతో విస్ఫోటతృటస్తోమైః
సదాహమూర్ఛైర్గ్రస్తస్య ప్రత్యహంవర్థంతేజ్వరాః॥

(అష్టాంగహృదయం)

సూక్ష్మక్రిమి జన్యరోగములను ఆయుర్వేదములో గ్రహావేశ రోగములనియు, భూతాభిషంగ వ్యాధులనియు వ్యవహరించిరి. ఇట్టిరోగములకు కూడను జప, తప, హోమ దానములను, బలిహరణాది క్రియల నాచరించమని ఆయుర్వేదము బోధించుచున్నది. మంత్రములను జపించుటద్వారా రోగక్రిములనునాశనము చేయవచ్చునని చెప్పిన, నవనాగరికతా మోహితులైన విద్యాధికులు "మంత్రములకు చింతకాయలు రాలునా?" యని హేళనచేయుదురు. మంత్రసత్తా దెలిసిన వారికే యీవిషయము బోధపడగలదు. మంత్రోచ్చారణ వలన గాలిలో వింతయలలుపుట్టి క్రిముల నాశనముచేయుచున్నవి. ధ్వనిప్రభావము జీవకోటుల మానసిక శరీరములపైన కలదని శాస్త్రజ్ఞు లంగీకరించిన విషయము. శ్రావ్యమయిన సంగీతము రోగులకు బాధలను మరపింపజేయును. బాంబుప్రేలుడికి హృదయచలనము లాగిపోయి మరణించినవారున్నారు. చరకుడు సాంక్రామిక రోగములు ప్రబలినప్పుడు జాతరలనుచేయు సమయమున డప్పునకు లేక ఢక్కపైన కొన్ని రకముల ఓషధీ పసరులనుపూసి మ్రోగించమని సలహానిచ్చినాడు. ఈధ్వని విశేషమేమో మనకు దురూహ్యములుగానున్నవి. జపము, ధ్యానములకు సాధించరానిదేమున్నది? దీని ప్రభావము మానసికతత్త్వ పరులకే తెలియును. హోమముల వల్ల రోగహేతుక సూక్ష్మక్రిములు చచ్చును. హోమద్రవ్యములనుండి వెడలిన ధూమములు క్రిమి నాశనకరములు. దానము అనగా రోగిని పీడించుచున్న రక్షస్సులు రసరక్త మాంసప్రియులుగనుక వానికికావలసిన బలిహరణము, వసంతమును దిగతుడిచి పారబోయుట, కోడినికోయుట మొదలైన

భూతతృప్తి కార్యములు రోగక్రిములను విదలించుకొనుట కేర్పడిన యుపాయములు. బలవంతమయిన శత్రువునకు లంచమిచ్చి అనుగ్రహపాత్రులగుట, ఆశత్రువు బలవంతుడై అమాయికుడుగానుండిన మోసపుచ్చి యాపదనుంచి తప్పించుకొనుట యుపాయములేకదా.

## జ్యోతిశాస్త్రము — ఆయుర్వేదము.

హిందువులకు జ్యోతిశ్శాస్త్రమనిన ఎక్కువప్రీతి, భక్తి కలవు. ఏపని చేయదలచినను ముందుగా సుమూహూర్తము నాలోచించెదరు. మంచివేళలం దాచరించినపనులు నిర్విఘ్నముగా కొనసాగును. అనుకొన్న ఫలములనిచ్చును. విషఘడియలలో నారంభించిన ప్రయత్నములు సఫలములగుచుండును. జననకాల గ్రహసంపత్తి మానవులయొక్క జీవితములమీద ఆజన్మ మరణాంతము ప్రభావమును కలిగియున్నది. లగ్నమందలి గ్రహముల కూటమియొక్క పరివర్తనములబట్టి మానవజీవిత చర్యలు, జరుగుచుండునని జ్యోతిశ్శాస్త్రము బోధించుచున్నది. గ్రహసంచార ప్రభావము జీవకోటులపైని ప్రసరించుచున్నదని ఆధునిక పాశ్చాత్యపండితులుకూడ నంగీకరించిన విషయము. జ్యోతిశ్శాస్త్ర సహాయమున జీవితసంఘటనలలో భూత, వర్తమాన, భవిష్యద్విషయములను తెలిసికొన వీలగును. భూతకాలములో జరిగిన విషయములకును, వర్తమానములో జరుగుచున్న వాటికిని పరస్పర సంబంధముండును. వర్తమాన విషయములయొక్క ఫలములను భవిష్యత్తులో ననుభవించవలసి యుండును. త్రికాలములందలి సంఘటనలకు పరస్పర సంబంధమున్నందున

వీనిని తెలియుటవలన విశేషజ్ఞానము కలుగుచున్నది. ఈజ్ఞానముద్వారా ప్రస్తుతము జరుగుచున్న చెడ్డవిషయములను, భవిష్యత్తులో జరుగబోయేవాటిని నిరోధించుటకు ప్రయత్నములుచేయ వీలగుచున్నది. వైద్యవిషయములో నిట్టిజ్ఞానమెక్కువగా తోడ్పడగలదు. ఎట్లనగా వర్తమానమున అనుభవించుచున్న వ్యాధి వెనుకటివ్యాధియొక్క ఫలమేయని గుర్తించినప్పుడు మొదటి హేతువుల నివారించుకోవచ్చును. వర్తమానస్థితినిబట్టి భావిస్థితి నూహించవచ్చును. జ్యోతిశ్శాస్త్రము వెనుక ననుభవించిన వ్యాధి స్వరూపమును, వర్తమానములోనుండిన దుష్టగ్రహచార సంపత్తిముందు కాలములో రాబోవుజబ్బుల స్వభావమును తెలిసికొనుటకు సాయపడుచున్నది. ఈవ్యాధులు దుష్టగ్రహచార కూటమియొక్క ఫలితములని తెలిసికొన్నప్పుడు ఆదుష్టశక్తులు శాంతించుటకొఱకు జపములు, దానములు మొదలైనవి చేసికొని కొంతవరకు నివర్తించుకో వచ్చును. జ్యోతిశ్శాస్త్ర సహాయముతో రోగనిదానము చేయవీలగును. ఇందుకు సాధనములు రాసులు, గ్రహములు, నక్షత్రములు. ఈ మూడింటికి నెప్పుడును అవినాభావ సంబంధముకలదు. రాసులకు వ్యాధులకు శారీరసంబంధమెట్టిదనిన :-

| | ఆధిపత్యం | వ్యాధి |
|---|---|---|
| 1 మేషం - | తల | తలనొప్పి |
| 2 వృషభం - | ముఖం | గొంతునొప్పి |
| 3 మిథునం - | రొమ్ము | క్షయవ్యాధి |
| 4 కర్కాటకం - | హృదయం | హృద్రోగములు |

| | | |
|---|---|---|
| 5 సింహం – | నడుము | మహారోగములు |
| 6 కన్య – | మీదిపొట్ట | అజీర్తిరోగము |
| 7 తుల – | పొత్తికడుపు | |
| 8 వృశ్చికం – | మూత్రావయవములు | |
| 9 ధనస్సు – | తొడలు | |
| 10 మకరం – | మోకాళ్లు | |
| 11 కుంభం – | పిక్కలు | |
| 12 మీనం – | పాదములు. | |

ఇదేవిధముగా 7 ముఖ్యగ్రహములు మనశరీరభాగములపై నాధిపత్యమును వహించుచున్నవి :-

(1) రవి – కన్నులు (2) చంద్రుడు – రొమ్ము

(3) కుజుడు – ముక్కు (4) బుధుడు – ఊపిరితిత్తులు

(5) బృహస్పతి – రక్తము, మాంసము.

(6) శుక్రుడు – మూత్రావయవములు, శుక్రాశయము.

(7) శని – పాదములు, అపానవాయు వ్యాపారములు.

సామాన్యముగా చాలరోగముల కజీర్తియే ప్రధాన హేతువుగానున్నది. మిధ్యాహార విహారములే వాతాదుల దూషింపజేసి శరీరధాతువులను చెఱచి అన్నివ్యాధులకు ప్రధానకారణముగ నున్నదని ఆయుర్వేదము చెప్పును. ఆమాశయ భాగమునకు కన్యారాశి అధిపతిగా నుండుటవల్ల అన్ని రోగములను కల్గించునది కన్యయని జ్యోతిర్వేదము చెప్పుచున్నది. స్థూలముగా రోగనిర్ణమును చేయుటకు లగ్నము లగాయతు ఆరవయింటి కధిపతిగా నుండినరాశి ఏదియున్నదో,

దానికి సంబంధించిన అవయవము రోగయుక్తమగును. రోగముయొక్క తీవ్రత, శమనములు యీరాశితో సంబంధించిన శుభపాప గ్రహములనుబట్టి యుండును.

## 2 అధ్యాయం

### - నేటి ఆయుర్వేదభిషక్కు లాచరించుచున్న పద్ధతులు -

బ్రిటిష్‌పాలనములో విదేశీయమగు అల్లోపతి వైద్యమున కెక్కువ ప్రాముఖ్యమును, సహాయమును పాలకులిచ్చుచుండుటవలన ఆవైద్య మందాదరణము ప్రజలలో నానాటికి వృద్ధియై మనదేశీయమైన ఆయుర్వేదమునకు ప్రభుత్వాదరము లేమిచే సన్నగిలుచు వచ్చినది. ఒకశతాబ్దముక్రిందట వంశపరంపరగా వచ్చుచున్నవిద్యను కొన్నికుటుంబములవారు మాత్రమే ఆచరించుచుండిరి. శాస్త్రాభ్యాస మరుదయ్యెను. అనుశ్రుతజ్ఞానము, అనుభవములపై నాధారపడి వైద్యవృత్తి సాగుచుండెను శాస్త్రమునభ్యశించుటకు సరియైన గురువులుగాని, వైద్యపాఠశాలలుగాని లేవు. అందువలన శస్త్రశలాక్య విద్యలు, మూఢగర్భచికిత్సలు అంతరించినవి. రోగములకు మందులిచ్చుట మాత్రమే మిగిలినది. దేశములో నచ్చటచ్చట ఎముకల సంధానపరచువారును, నేత్రవైద్యము జేయువారును, భూతవైద్యులును, మంత్రగాళ్లును, మిగిలియుండిరి. బ్రిటిషు ప్రభుత్వము జిల్లా, తాలూకాపట్టణములలో అల్లోపతీయ ఆసుపత్రుల నెలకొల్పి ప్రజలకుచిత చికిత్సలొనర్చుచుండిరి. వీనికితోడు క్రైస్థవమిషనరీలు అమెరికా, కెనడా, ఇంగ్లాండు ప్రజలయొక్క ధనసహాయముతో దేశమం

దంతట ఆసుపత్రుల నెలకొల్పి, యుచితవైద్యము చేయుచు ప్రజల నాకర్షించుచుండిరి. ఈవిదేశీ చికిత్సాలయములలో శస్త్రచికిత్సలు, ప్రసూతిచికిత్స లద్భుతముగా చేయబడు చుండెను. క్రమక్రమముగా ప్రజలు ఆపరవైద్యమునకు మోహితులై, విద్యాధికులుకూడ ఆయుర్వేదమును నిర్లక్ష్య, నిరసభావములతో జూడ నారంభించిరి. నాటువైద్యము వీరికి మోటువైద్యమాయెను. ప్రభుత్వము సుశిక్షితులగు డాక్టర్లను తయారుచేయుటకు ప్రతి రాష్ట్రకేంద్ర పట్టణముల లోను ఆంగ్లవైద్యకళాశాలలను నిర్మించిరి.

ఈపరిస్థితులలో భారతీయులలో స్వాతంత్ర్యోద్యమము బయలుదేరెను. ఇండియన్ నేషనల్ కాంగ్రెసు సభ్యులలో నాయుర్వేదాభిమానులు, వైద్యులు ఆయుర్వేదోద్ధరణకు పూనుకొని, అఖిలభారతాయుర్వేద వైద్యమండలి, విద్యా పీఠముల నెలకొల్పి, ఆయుర్వేద ప్రచారమునకు బూనుకొనిరి. వైద్యరత్న డి. గోపాలాచార్యులుగారు ఆయుర్వేదసంస్థలలో చేరి మదరాసులో నొక ఆయుర్వేద కళాశాలను స్థాపించి, సుమారు 20 సంIరములు నడిపి, చాలమంది వైద్యులను తయారుచేసిరి. ప్రతిసంవత్సరము వేలకొలది వైద్యులు శాస్త్రాభ్యాసము, కర్మపదాభ్యాసముల నొవర్చి, అఖిలభారత విద్యాపీఠమువారు జరిగించుచున్న పరీక్షలలో నుత్తీర్ణులగుచు వచ్చిరి. కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, బెనారసు పట్టణము లలో నాయుర్వేద కళాశాలలు వెలసినవి. సుమారు డెబ్బది సంవత్సరములలో దేశమందంతటను సుశిక్షితులగు వైద్య పండితులు శాస్త్రీయపద్ధతి నీ విద్యను వ్యాపింప జేసిరి 1923

సం॥రంలో మదరాసు విశ్వవిద్యాలయమువారు ఆయుర్వేద శిరోమణి పరీక్షల నడుపుటకు నిశ్చయించి, మైలాపురములో నెలకొల్పిన శ్రీ వెంకటరమణాయుర్వేద కళాశాలలో విద్యార్థులను తరిఫీదుచేయుట కంగీకరించిరి. కాశీలో శ్రీ పండిత మదనమోహన మాలవ్యాగారు విశ్వవిద్యాలయము నెలకొల్పి, యందులో నాయుర్వేద బోధనకు స్థానమిచ్చిరి. కలకత్తాలో అష్టాంగాయుర్వేద కళాశాలయును, బెజవాడలో శ్రీ వెంకటేశ్వరాయుర్వేద కళాశాలయు, శ్రీరామమోహనాయుర్వేద కళాశాలయు 1923 సం॥రమునాటికి నెలకొల్పబడినవి. శ్రీరామమోహన కళాశాల 1936 లో గుంటూరునకు తరలింపబడి నేటికి దివ్యముగా సాగుచున్నది. ఈ వివిధ వైద్యకళాశాలలో వేలకొలది సుశిక్షితులగు వైద్యులు తయారగుచున్నారు. హిందూదేశ మంతటిలోను మొదటిసారిగా మదరాసు గవర్నమెంటువారు శ్రీ పానగల్లు రాజాగారికృషి వలన 1923 సం॥లోనే దేశీయ వైద్యపాఠశాల నొకదాని నెలకొల్పి L. I. M పట్టభద్రులను, ఉభయ వైద్యశాస్త్రములలోను త్రీర్ణుల గావించుచున్నారు. 1933 సం॥లో మదరాసురాష్ట్రములోనే ఆయుర్వేదవైద్యుల రిజిష్ట్రేషను ఆరంభమాయెను. 1955 నాటికి మదరాసు, ఆంధ్రజిల్లాలలో సుమారు 16 వేలకు మించిన రిజిష్టర్డు ఆయుర్వేదవైద్యు లున్నారు. మిగిలినవారు ఆనువంశికాయుర్వేద వైద్యులు. ఈస్థితిలో ప్రప్రథమున బొంబాయి. రాష్ట్రప్రభుత్వము సుశిక్షితులకు, ప్రభుత్వాంగీకారమును బడసిన వైద్యులుతప్ప మిగిలినవారెవ్వరు నీవైద్యవృత్తి నవలంభించరాదని శాసనము గావించినది. 1956 సం॥ ఆగస్టు నెలలో ఆంధ్రప్రభుత్వము ఆయుర్వేద యూనానీ

హోమియోపతీ యాక్టు నామోదించినది. ప్రైవేటు విద్యా సంస్థలను ప్రోత్సహించి, ప్రభుత్వకళాశాలల నెలకొల్పుటకు నిశ్చయించినది. ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ లో సుమారు వెయ్యి మాత్రమే ఆయుర్వేదరూరల్ డిస్పెన్సరీ లున్నవి. ఇంకను ఎక్కువగా స్థాపించవలసి యున్నది. ప్రైవేటుగావృత్తి సాగించుచున్న వైద్యులసంఖ్యకూడా నేడు చాలినంతగాలేదు.

ప్రభుత్వము ప్రజాభిప్రాయాను సారము గా ఆయుర్వేదాభివృద్ధికి తోడ్పడవలసియున్నది. నేటి ప్రజలు పాశ్చాత్య వైద్యమందు మోహితులయ్యెను, దేశీయమైన ఆయుర్వేద మందు భక్తి విశ్వాసములతోనే యున్నారు. వారికి కావలసినది సుశిక్షితులును, సార్వవిధోపయోగమైన వైద్యులు మాత్రమే. ఈవిషయమును గ్రహించి భారత ప్రభుత్వము ఊస్మాన్ కమిటీ, చోప్రాకమిటీల నియమించి పండితాభిప్రాయములను సేకరించి, వీరు సూచించిన ప్రకారము ఉభయ వైద్య విషయములతోకూడిన నూతన వైద్యపద్ధతిని (ఇంటిగ్రేషన్ ఆఫ్ మెడిసిన్సు (integration of Medicines) సృష్టించుటకు సంకల్పించినది.

ఇక వృత్తియందున్న ఆయుర్వేదవైద్యుల స్థితి, విధానము లెట్లున్నవనగా-ప్రజాభిమతము ననుసరించి వృత్తి నాచరించినగాని ప్రతిభావంతు లనిపించుకొనలేకపోవుచున్నారు. కనుక సద్యోఫలితము లిచ్చుచున్న పాశ్చాత్య యింజెక్షను మందులను, పేటెంటు మందులను విరివిగా వాడుటకు మొదలిడిరి. ఇందువల్ల నార్థికముగా వారికి లాభదాయకముగా నుండవచ్చును గాని, శిక్షణము, ప్రభుత్వాంగీకారము

లేకుండ పాశ్చాత్య మందులను వాడుట మంచిపని కాదు. క్వేక్ వైద్యులని యప్రతిష్ఠ వచ్చును. వైద్యసాంకర్యము పనికిరాదు. వైద్యసాంకర్య మనగా ఒక కార్యము నపేక్షించి యిచ్చిన మందుయింకను శరీరములో పనిజేయుచుండగా దాని ప్రభావము ముగియకుండగానే, యీలోపుననే ఇంకొక మందు నిచ్చుటయని యర్థము. కనుక యిచ్చిన మందు శరీర ములో నెంతకాలము పనిచేయగలదో తెలిసికొనుట వైద్యుని కర్తవ్యము.

నేటి వైద్యపాఠశాలలలో ఆయుర్వేద పాఠ్య క్రమ ముతో మోడరన్ వైద్య విషయములను కలిపి బోధించవలసి యున్నదని ఆయుర్వేద విద్యార్థులును, వైద్యులును, ప్రజ లును, ప్రభుత్వమును కోరుచున్నారు. ఆయుర్వేద విద్యా ర్థికి మోడరన్ వైద్య విషయము లెంతవరకు సమ్మిళిత మొనర్చుట యవసరమో, తెలిసిన పండితులు పాఠ్య గ్రంథ ముల వ్రాయుటవసరమగును. పాశ్చాత్య వైద్యవిషయముల నవలంభించుటకు, కర్మ పదాభ్యాసమందు ఆయుర్వేద విద్యా ర్థులకు తరిఫీదు నిప్పించవలెను. మోడరన్ డాక్టర్లతో ఆయు ర్వేద వైద్యులు కలిసి పనిచేయుటకు ప్రభుత్వము అవకాశ ములు కల్పించవలెను.

ఇదే విధముగా ఎం. బి. బి. యస్. డిగ్రీ పొందిన డాక్టర్లకు రెండుసంవత్సరముల కాలము ఆయుర్వేదశాస్త్ర మును పోస్టుగ్రేడ్యుయేట్ కోర్సుగా బోధించినచో వీరివలన ఆయుర్వేద పరిశోధనలు జరిగించుట కవకాశము కలుగును. ఒకప్పుడు ఆయుర్వేదము అశాస్త్రీయము (unscientific

and incomplete) అను వాదము పాశ్చాత్య విద్యా మోహితులవల్లను, యీాగ్లావంతులగు మోడరన్ వైద్యుల వల్లను బ్రహ్మాండమయిన ప్రచారముగా సాగినది. నేడు యీాఆందోళనము తగ్గినది. ఇప్పుడు పాశ్చాత్య వైద్య ప్రముఖులు ఆయుర్వేదశాస్త్రము ఆధునిక వైద్యశాస్త్రమునకు ఏవిషయములోను తీసిపోదనియు, శాస్త్రీయమనియు, సర్వసంపూర్ణ వంతమనియు అభిప్రాయములకు వచ్చిరి. చికిత్సా ద్రవ్యములలో మేలురకము మందులున్నవనియు, వానినెల్ల గ్రహించవలెననియు, మోడరన్ వైద్యావలంబకు లాశించుచున్నారు. వీని విషయములో పరిశోధనలు కావలెనని కోరుచున్నారు.

ఆయుర్వేద వైద్యులు, ఆయుర్వేద మెంతటి సంపూర్ణ వంతమయిన విజ్ఞానశాస్త్రమయినను, దినదిన పరిశోధనలతో ప్రవర్థమానమగుచున్న మోడరన్ వైద్యమందలి యుపయుక్త విషయములను చేర్చుకొనుటకు సంసిద్ధముగానున్నారు. నిదాన, యంత్ర, పరికరములు, చికిత్సాద్రవ్యముల నుపయోగించుటకు ఉత్సాహమును జూపుచున్నారు. రెండు వైద్యశాస్త్రములును మానవశ్రేయస్సుకొఱకు నిర్మింపబడినవే గనుక విజ్ఞాన విషయమున స్వదేశ విదేశ భేదము లనవసరము. కనుక ప్రజలయొక్క శ్రేయస్సును దృష్టియందుంచుకొని ఉభయ వైద్య సాంప్రదాయపరులు కలిసిమెలసి పరస్పర సహాయ్య మొనర్చుకొనుచు, వైద్య విజ్ఞాన విషయములను తిలతండుల న్యాయమున లేక క్షీర నీర న్యాయమున కలుపుటకు సర్వ విధముల ప్రయత్నించెదరుగాక. అప్పుడు ప్రభుత్వ సహాయము తప్పక లభించగలదు.

## అనుబంధము

ఈ గ్రంథమును వ్రాయుటలో నాకు తోడ్పడిన గ్రంథములు


1. చరకసంహిత
2. సుశ్రుతసంహిత
3. అష్టాంగ హృదయం
4. శార్ఙ్గధరసంహిత.
5. అధర్వణవేదము .
6. Indian Medicine by Dr. Julius Jolly - translated by C. G. Kashkar M. A. (Tilak) from German, Vaidika Samsodhana Mandali, Poona 1951.
7. Defence of Philosophical doubt by Lord Belford.
8. Dr. S. R. Gore - presidential address delivered at all Karnatic Ayurvedic Conference 1943.
9. The New Back-ground of Science 1943
10. Grammer of Science, 3rd edition Vol. I
11. Sir James Jean.
12. Pulse in Ayurvdea by Dr. Ashtosh Roy.
13. Thridosh theory by Dr. D. N. Ray, Calcutta.
14. Ayurveda Sereeram by Dr. D. N. Benergy Calcutta.
15. Vedic gods as figures of Biology by Dr. V. G. Rele, Bombay.

శ్రీధన్వంతరి

# వందనగీతము

వందే వందే శ్రీ ధన్వంతరి వందే.

౧. బ్రహ్మ మొదలుగాఁ జీమలదాఁక
వ్యాధులుం బాధలుం నలజడిఁగూర్పన్
రోగుల మూల్గులు ఒకటే శ్రుతిలో
రాగము దీయఁగ బాగుగ వినవో .... ||వందే||

౨ గర్భదరిద్రుల లక్ష్మీపుత్రుల
కామ్యము సుఖమై కన్పించెనుగా
సమస్తజీవులు నీకడ సములే
సౌఖ్యదాతవై సాకుము దేవా! .... ||వందే||

3. మేడలఁ బండిన గుడిసెల గుమిలిన
మృత్యువిహారము భయమే భయమే
భయపడు జీవుల శరణ్యా మీవే
భారతసూనుల ప్రార్థన వినవో! .... ||వందే||

౪. అహో! అహో! మాధన్వంతరి అహో! అహో
ఆయుర్వేదం బని యీ అష్టాంగంబుల నిడెగా
ధీయుతులారా! దీనతయేలా । సమస్తజగతికి సౌఖ్యము నిడమో!||వం||
వందే వందే శ్రీ ధన్వంతరి వందే.

శ్రీ ధన్వంతరి

# మేలుకొలుపు గీతము

మేలుకొను ధన్వంతరీ! మ । మ్మేలుకొను ధన్వంతరీ! జగ
మేలుకొను ధన్వంతరీ! । మేలుకొను మయ్యా!

౧. క్షీరసాగర మథన జన్య ప్రసిద్ధ పురుషోత్తంసదేవ!
చారుహస్తాంచిత సుధాకలశ ప్రభావిభవాబ్ధిరామా!.... ||మే||

౨. ఆయురారోగ్యప్రదమంబగు । నాయురామ్నాయమ్ముఁ బల్కుచు
నవతరించి జగత్త్రయంబు మహాప్రశంసల నీయ వెల్గితి .... ॥మే॥

3. నాఁడు చిందిన యమృతబిందులె । నేఁడు మహౌషధులు పురుష!
ప్రకృతిమాత ధరించి పెంచెను । భారతాంబకు సారె బెట్టెను.... ॥మే॥

౪. భారతాంబిక యమృతవేదము । పాటఁ బాడుచు సారె బంచెను
అఖిలదేశాంగనలు నంజలు । లట్టెచాపుచుఁ దమ్ము మఱచిరి.... ॥మే॥

౫. అన్యరాజుల చెవినిఁ బడి మా । యమృతవేదము శిథిలమయ్యెను
ఆంగ్లరాజులు స్వరముదిద్దిరి । యది శుభప్రదమగునో కాదో.... ॥మే॥

౬. ఆయురామ్నాయమ్ముఁ దెలిసిన । యంద రెందఱు ద్విజన్మ లేకద
వర్ణభేధపిశాచబాధను । వైద్యులకుఁ గల్పింపబోకుము .... ॥మే॥

౭. క్రొత్తవైద్యం బిదె యటన్నను
ఎత్తిచూపెద మమృతవేదము
మూఁడు ముక్కల యాటసాగును
మూఁడుకాలము లేకమైనను .... ॥మే॥

౮. మంగళము హేలాపురీస్థిత । మంగళాలయ పూర్వవైద్యా!
మంగళము సౌఖ్యాధిదేవా! । మంగళాత్మక వేదవేద్యా!... ॥మే॥

## ఆరోగ్య ప్రబోధ గీతము

౧. ఏలాటి పనులున్న ఎన్ని తొందరలున్న
మీ దేహపాలనము మీదియే యనియెంచి
ఆరోగ్యమార్గంబు జనులారా । అరసి వర్తింపుఁడీ జనులార!

౨. ఆ దేహమే లేక యాటలాడెడి దేమి
సర్వకార్యములందు సహాయ్య మా దేహ
మదినిల్పు కార్యమే జనులార! అరసి కావింపుఁడీ! జనులార!

3. గోచిపాతలతోడఁ గూర్చున్న మామతే
యోగమని దేహముల బాగుసేయుచునుండ
సర్వంబుఁ గోరేటి జనులారా! సౌఖ్యమార్గముఁ గనరె జనులార!

౪. దేవుఁడే జీవుఁడో దేహమే యాలయము
దేహమ్ము నిలుపఁగా దివ్యమౌబల మొకఁటె
ఆధారమైయుండు జనులారా! అది నిల్పుకొనుడయ్య జనులార!

౫. అరయ నిద్దుర యొండు ఆహారఫల మొండు
బ్రహ్మచర్యంబొండు వ్యాయామకళ యొండు
స్తంభంబు లైయుండు జనులారా! సౌఖ్యసౌధము నిల్పు జనులార!

౬. కప్పిపెట్టిన యినుమె త్రుప్పుదుల్లుచునుండు
పెట్టి దాచినగుడ్డ పిగిలి తీరునుగదా
కష్టపెట్టని తనువు జనులారా! యిష్టమౌ బలమిడునె జనులార!

౭. జాతిలోపలి యగ్గి రాపాడిననె పుట్టు
నూతిలోపలి నీరు ఏతమెత్తిన నూరు
వ్యాయామ మొనరింప జనులారా! బలము మనలోనె నుబుకు జనులార!

౮. బలము బల మనుకొనుచు పలవరించుటతోడ
బలము మలమూత్రముల చలనమందుండునని
తెలిసి వర్తింపుఁడీ జనులారా! నిలిపి మాటాడకుఁడు జనులార!

౯. తల్లక్రిందుల చెట్టు తనువునిర్మాణంబు
మొదలు చేవలుదేరి మోదమ్ముఁ గూర్పఁగా
తైలమర్దన మొకఁటె జనులారా! తగిన దోహదమౌను జనులార!

౧౦. ప్రొద్దుపొడుపున లేచి ప్రొద్దుతోఁ దిరుఁగాడి
ప్రొద్దుగ్రుంకిన యంత నిద్దురఁ గొనవలెను
పెద్దజాగరణంబు జనులారా! పెద్దనిద్దురఁ దెచ్చు జనులార!

౧౧. నడినెత్తిపై ప్రొద్దు నాట్యమాడేవేళ
కడుపార భోజనంబు గుడిచియుండిన వేళ
చదువు స్నానములు తగవు జనులారా! శ్రమఁదీర్చుకొనఁగూడ జనులార!

౧౨. శైవశాసనమంచుఁ దలపోసి పెండ్లాడి
ప్రజల సృష్టింపఁగాఁ బాల్వృద్ధ తేజమే
అపారసారమా జనులారా ! అది దాచుకొనుఁడయ్య జనులార!

౧౩. మీ బిడ్డ మిముఁబోలి మేటిరై మించఁగా
మీ పాలె ద్రావించి మీ వానిగాఁజేసి
దేహసౌఖ్యం బిడుఁడు జనులారా! దేశభాగ్యము పండు జనులార!

౧౪. ధనబలము బలమానె? తయిసాతి బలమానె?
ఆత్మబలమే బలము అంగబలమే బలము
అదికోరి యిదికోరి జనులారా! అవుపాలే కొనుఁడు జనులార!

౧౫. ధనముండెనని పేదతనముండెనని యెంచి
తెగదిన్న రోగమే తినకున్న రోగమే
కడుపులోపలియగ్గి జనులారా ! కడతేర్చు జాగ్రత్త జనులార!

౧౬. సాత్వికాహారంబు సంఘసేవయుఁ బూని
తలయూడినను పట్టుదల మానరాదంచు
చిట్టిచీమయుఁ జెప్పు జనులారా ! చీమకుట్టదెమీకు జనులార!

౧౭. బక్కచిక్కిన తెగులె బలిసిపోయిన తెగులె
బాధకై యల్లాడి పరుల వేడఁగనేల?,
పాడిపంటలభూమి జనులారా! వైద్యంబు నేయుదే జనులార!

౧౮. ఎచటఁ బుట్టినవారి కచటఁ బుట్టినచెట్టె
ఎచటఁబెరిగినవారి కచటియాచారంబె
ఆరోగ్య మొనఁగూర్చు జనులారా! ఆయురభివృద్ధి నిడు జనులారా!

౧౯. నీరు మారిన శిరోభాగమని మూర్ఖవరు
పొరుగింటి తిండియే సర్పదష్టదు మాకంద్రు
[illegible] జనులారా ! కోరి [illegible] జనులారా!

౨౦. నిత్యయౌవనముతో నిలిపి చేయేండ్లుగా
దేవదేవునిఁ దెలియు దృష్టినీయుంజాలు
[illegible] జనులారా ! [illegible] జనులారా!

ఆ వైద్య మీ వైద్య మని పేరు(పొ)గేటి
అఖిలవైద్యముల గన్నయమ్మ యాయుర్వేద
మా సేవయే సుఖము జనులారా ! ఆత్మవిశ్వాసులౌ జనులారా!
ఆరోగ్యసూత్రమ్ము లాటఁగా బాటఁగా
ఉగ్గుబోసిన నాఁడె ఊకొట్టఁగాఁజేసె
ఆ వైద్యమే సుఖము జనులారా ! అన్యవైద్యంబేల? జనులారా!
నిజచందనపుఁబూత నేయి చిలికిన తిండి
నియమతాంబూలంబు నిత్యంబుమీ కుండ
ఆ క్రీములుం ఈ క్రీములుం జనులారా! అల్లకల్లడ మిడునె జనులారా!
రాజు మారినఁ బెద్దరాజ్యాలు మారినను
క్షితిని ఆయుర్వేద సిద్ధాంతమే నిలుచు
ఆత్మతత్త్వమునుండి జనులారా! అవతరించిన దిదియె జనులారా!
ఋషికుమారులమంచు ఋషిగోత్రములు జెప్పి
ఋషిమూర్తులనుగొల్చి ఋషిసూత్రములు పలి[illegible]
ఋషులు కాఁదలపోయు జనులారా!
ఋషుల వాక్య మెశుభము జనులార !

## సుఖగీతము

సఖా! సఖా! ఇహలోకసుఖం బఖిలం బిదియే యనవలెఁ గాదా?
యెల్లలు సమ్మత మిదియే కాదా? యుల్లాసంబన నిదియే కాదా?
చనువున నీప్రియ జననియె నిన్నున్ దనపాలిచ్చుచు మనిచెడి దైవన్
నినుబుట్టించిన యాగ్రామంబే నినుఁ బ్రేమించుచుఁ బెంచెడి దైవన్.
సఖా॥
నీతో మొలిచిన యీమూలికయే నీయారోగ్యము నిలిపెడిదైవన్
నీతాతల యాయుర్వేదంబే నీబాధలఁ దొలగించెడి దైవన్. సఖా॥
తొలిపలుకులు మప్పిన యాంధ్రంబే కళలను బండితుఁ జేసెడి దైవన్
తొలిపలుకుల హిందూదేశంబే మలిజన్మమునందును నిన్ గన్నన్.
సఖా॥

కం॥ వెం॥ సుబ్బారావు, ఏలూరు